శ్రీమద్రామాయణ

# కల్పవృక్షము

## అరణ్యకాండము



విశ్వనాథ
సత్యనారాయణ




ఆఱవ ముద్రణ : 1992
ప్రతులు : 1000




ధర : రూ. 55/-.
లైబ్రరీ ప్రతి : రూ. 80/-.

**D.T.P., Printing**
**INDIA BLOCK MAKERS**
VIJAYAWADA - 520 003.

ప్రతులకు:

విశ్వనాథ పబ్లికేషన్స్
విశ్వనాథపురము,
మారుతీనగర్, విజయవాడ - 520 004.

# ఒక్క మాట

విశ్వనాథ సత్యనారాయణగారు 1895 సెప్టెంబరు 10న (అనగా మన్మథ నామ సంవత్సర భాద్రపద బహుళ షష్ఠి) కృష్ణాజిల్లా నందమూరు గ్రామంలో జన్మించారు.

1976 అక్టోబరు 18న (అనగా నలనామ సంవత్సర ఆశ్వయుజ బహుళ దశమి) పరమపదించారు. హరిత సగోత్రికుడైన వీరి తండ్రి శోభనాద్రిగారు, తల్లి పార్వతమ్మగారు.

ఈ కల్పవృక్ష రచన 1932 ప్రాంతాలలో ప్రారంభింపబడింది. 1944లో నాటి ముక్త్యాల జమీందారుగారి ద్రవ్య సహాయంతో బాలకాండ ప్రథమ ముద్రణ అయింది. 1944 ప్రాంతాలలోనే అయోధ్యకాండ కూడా పూర్తయింది. దానిని కూడా ముక్త్యాల వారే ముద్రింపించారని వినికిడి. 1950 ప్రాంతాలలో అరణ్య, కిష్కింధకాండలు పూర్తి అయినాయి. వాటిని ఎలాగో అలాగ విశ్వనాథవారే ముద్రింపించుకో గలిగారు.

1950 నుంచి 1962 వరకు సుందర, యుద్ధకాండల రచన సాగింది. సుందరకాండ తొలిముద్రణ 1956. యుద్ధకాండ తొలిముద్రణ 1962 నవంబరు. ఇవికూడా విశ్వనాథవారు స్వయంగా ముద్రించినవే. 1970లో ఈ మహాకావ్యానికి భారతీయ జ్ఞానపీఠం వారి లక్షరూపాయల బహుమతి లభించింది.

1976లో అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు, విద్యామంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావుగార్ల కృషి వలన ఐదవ ముద్రణకు ప్రభుత్వ సహాయం కొంత లభించింది. అప్పుడు విశ్వనాథవారు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థాన కవి.

ఐదవ ముద్రణ ప్రతులు అయిపోయి చాలాకాలం అయింది. ఎంతో మంది సహృదయులు రామాయణ కల్పవృక్షం ప్రతులు కావాలి, కావాలి అని అడుగుతున్న ప్పటికీ- పెరుగుతున్న ధరలకి తట్టుకోలేక ఇంత పెద్ద కావ్యాన్ని ముద్రించటానికి పూనుకోలేక పోయాము.

మా నాయనగారైన విశ్వనాథ సత్యనారాయణగారిచే "తొలుతటి జనుస్సు అందరి చెలిమికాడు"గా వర్ణింపబడిన (భ్రష్టయోగి-ఖండకావ్య సంపుటి- అంకిత పద్యాలు) శ్రీ జువ్వాడి గౌతమరావుగారు ఇంతలో మాకు అండగా నిలిచారు. మరి కొంతమంది సహృదయ వదాన్యులు ద్రవ్యసంపత్తి నందించారు. వారి సహాయ సంపత్తులతో ఈ ఆరవ ముద్రణను ఆంధ్రపాఠకలోకం ముందుంచగలు గుతున్నాము. వారి పేర్లు గ్రంథముచివర ముద్రింపబడి ఉన్నవి. వారికి మేము సర్వదా కృతజ్ఞులము. వీరంతా కలిసి మాకు కల్పవృక్ష ముద్రణకు కావలసినదాని కంటే కొంత ఎక్కువే అందించారు. ఆ మిగిలినదానితో ఒక పద్యకావ్యసంపు టము, ఒక నవల కూడా అందించే ప్రయత్నం చేస్తున్నాము.

ఇది కంప్యూటర్ సాయంతో చేయబడిన ఆఫ్‌సెట్ ముద్రణ. దీనిలో సాధ్య మైనంత వరకు ముద్రాస్ఖాలిత్యాలు లేకుండానే జాగ్రత్తపడ్డాము. ఏవైనా కొన్ని ఉంటే వాటిని వచ్చే ముద్రణలో తప్పక సవరిస్తాము. పూర్వపు ముద్రణలలో లేని, ఈ ముద్రణలోఉన్న విశేషం విషయసూచిక.

రామాయణ కల్పవృక్షంపై ఇంతవరకు దాదాపు ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని విశ్వ విద్యాలయాలలోను M.Phileu Ph.D.లు ఎన్నో జరిగాయి. ఇంకా అనేకం జరు గుతున్నాయి. వాటిలో కొన్ని ముద్రణ కూడా అయినాయి.

విశ్వనాథ పావనిశాస్త్రి

# ఈ గ్రంథము ఆరవ ముద్రణకు ద్రవ్యసహాయము చేసిన దాతలు

| | | |
|---|---|---|
| శ్రీ కందుకూరి శివానందమూర్తిగారు, (భీమునిపట్నము) వారిశిష్యులు | | 15,000-00 |
| * శ్రీ బి.వి.ఎస్.ఎస్. మణిగారు | మద్రాసు | 18,000-00 |

*కీ.శే. జువ్వాడి చొక్కారావుగారి జ్ఞాపకార్థము*

| | | |
|---|---|---|
| శ్రీ జువ్వాడి గౌతమరావుగారు | కరీంనగరము | 12,000-00 |
| శ్రీ జువ్వాడి రామేశ్వరరావుగారు | కరీంనగరము | 8,000-00 |
| శ్రీ జువ్వాడి రఘునాథరావుగారు M.D. | నిజామాబాదు | 20,000-00 |

*కీ.శే. జువ్వాడి వరదరావుగారి జ్ఞాపకార్థము*

| | | |
|---|---|---|
| శ్రీ జువ్వాడి హనుమంతరావుగారు | కరీంనగరము | 5,000-00 |
| శ్రీ జువ్వాడి రామచంద్రరావుగారు | కరీంనగరము | 5,000-00 |
| శ్రీ జువ్వాడి మదనమోహనరావుగారు | వరంగల్లు | 5,000-00 |

*కీ.శే. జువ్వాడి తిరుమలరావుగారి జ్ఞాపకార్థము*

| | | |
|---|---|---|
| శ్రీ జువ్వాడి మధుసూదనరావుగారు | కరీంనగరము | 4,000-00 |
| శ్రీ వెలచాల కొండలరావుగారు | కరీంనగరము | 4,000-00 |
| శ్రీ చీటి అయోధ్యరామరావుగారు | కరీంనగరము | 4,000-00 |
| శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు | కరీంనగరము | 2,500-00 |
| శ్రీ నేదునూరి బాబూరావుగారు | కరీంనగరము | 2,400-00 |
| శ్రీ నేదునూరి మనోహరరావుగారు | కరీంనగరము | 1,000-00 |
| శ్రీ నిమ్మగడ్డ రామమోహనరావుగారు | కరీంనగరము | 1,116-00 |
| శ్రీ జి. రంగాచారిగారు | కరీంనగరము | 1,000-00 |
| శ్రీ చీటి ముత్యంరావుగారు | కరీంనగరము | 1,000-00 |
| శ్రీ ఎస్. జగన్మోహనరావుగారు | కరీంనగరము | 1,000-00 |
| శ్రీమతి మంగాదేవిగారు | కరీంనగరము | 1,000-00 |
| శ్రీ సిరికొండ ప్రభాకరరావుగారు | కరీంనగరము | 1,000-00 |
| శ్రీ నూకలమట్టి గంగయాచారిగారు | కరీంనగరము | 2,000-00 |
| శ్రీ గంద్ర నారాయణరావుగారు | హైదరాబాదు | 1,000-00 |
| శ్రీ ఆర్. మాధవరావుగారు | హైదరాబాదు | 1,000-00 |
| శ్రీ తులా ప్రభాకరరావుగారు | హైదరాబాదు | 1,000-00 |
| శ్రీ సిరికొండ వేంకటరావుగారు | సిద్దిపేట | 1,000-00 |
| శ్రీ ఎ. రామరాజుగారు | సిద్దిపేట | 1,000-00 |
| శ్రీ అవటపల్లి రాధాకృష్ణమూర్తిగారు | సిద్దిపేట | 1,000-00 |
| శ్రీ సి. హెచ్. రామచంద్రరావుగారు | సిద్దిపేట | 1,000-00 |
| శ్రీ డి. చంద్రారెడ్డిగారు | సిద్దిపేట | 1,000-00 |
| శ్రీ ఉప్పల వేంకటేశముగారు | సిద్దిపేట | 1,000-00 |

| | | |
|---|---|---|
| శ్రీ బి. రవీందర్‌గారు | సిద్ధిపేట | 1,000-00 |
| శ్రీ టి. పద్మనాభంగారు | సిద్ధిపేట | 1,000-00 |
| శ్రీ పొన్నాల తిరుమలరెడ్డిగారు | సిద్ధిపేట | 1,000-00 |
| శ్రీ కె. చంద్రశేఖరరావుగారు | సిద్ధిపేట | 1,000-00 |
| శ్రీ బి. రాజారెడ్డిగారు | సిద్ధిపేట | 1,000-00 |
| శ్రీ కోవెల సంపత్కుమారాచార్యగారు | వరంగల్లు | 4,000-00 |
| శ్రీ అనుమాండ్ల భూమయ్యగారు | వరంగల్లు | 1,000-00 |
| శ్రీ జి. అప్పయ్యశాస్త్రిగారు | ఖమ్మం | 1,000-00 |
| శ్రీ జనమంచి కామేశ్వరరావుగారు | రాజమండ్రి | 4,000-00 |
| శ్రీ సత్తి చంద్రారెడ్డిగారు | రాజమండ్రి | 4,000-00 |
| శ్రీ సిరిపురం పరదేశిగారు | రాజమండ్రి | 1,000-00 |
| శ్రీ ఎఱ్ఱాప్రగడ రామకృష్ణగారు | రాజమండ్రి | 1,000-00 |
| శ్రీ కుతపా వేంకటేశ్వరరావుగారు | రాజమండ్రి | 1,000-00 |
| శ్రీ పెదపాటి సత్యనారాయణగారు | రాజమండ్రి | 1,000-00 |
| శ్రీ బేతవోలు రామబ్రహ్మంగారు | రాజమండ్రి | 1,000-00 |
| శ్రీ కత్తి నాగార్జునశ్రీ గారు | చిల్లంగి | 1,000-00 |
| శ్రీమతి జి. పుల్లమాంబగారు | గుంటూరు | 558-00 |
| * శ్రీమతి భద్రమ్మ శ్రీ మల్లినరామచంద్రరావు దంపతులు | తణుకు | 4,000-00 |
| * శ్రీమతి విజయ శ్రీ చిట్టూరిబాపినీడు దంపతులు | తణుకు | 4,000-00 |
| * శ్రీమతి యశోదాదేవి శ్రీ కరటూరు సూర్యారావుదంపతులు | బెంగుళూరు | 4,000-00 |
| * శ్రీమతి రంగనాయకమ్మ సకలానరసింహులుచెట్టిచారిటీస్ | బెంగుళూరు | 4,000-00 |
| * శ్రీ ఎం. రుక్మాంగదనాయుడుగారు | బెంగుళూరు | 1,000-00 |
| * శ్రీ ఎన్. రాజారెడ్డిగారు | బెంగుళూరు | 1,000-00 |

*కీ.శే. సీతామహాలక్ష్మి, తంగిరాల వెంకటసుబ్బావధానులుగార్ల (తణుకు) జ్ఞాపకార్థము*

| | | |
|---|---|---|
| * శ్రీ తంగిరాల సోదరులు : సోమయాజులు, వేంకటసుబ్బారావు, భాస్కరరావు, కృష్ణమూర్తిగార్లు | | 2,000-00 |
| శ్రీ తుమ్మపూడి కోటేశ్వరరావుగారు | అనంతపురం | 1,500-00 |
| శ్రీ శలాక రఘునాథశర్మగారు | అనంతపురం | 516-00 |
| శ్రీ ముక్తినూతల గురునాథరావుగారు | విజయవాడ | 4,000-00 |

** వీరు సుందరకాండ (2000 కాపీలు) ముద్రణకై ప్రత్యేకముగా సమర్పించిరి.*

# విషయ సూచిక

(అంకెలు పద్య సంఖ్యను సూచించును) .

# అరణ్యకాండము

## దశవర్ష ఖండము

క. శ్రీ విశ్వనాథకుల పారావారశశాంక శోభనాద్రికృత ప్రతి
ష్ఠా విభవ! నందమూరు పురీ విలసచ్ఛ్వేతలింగ శ్రీ విశ్వేశా!

మ. అదియేమే రఘురామచంద్రునకు బాలా! తుమ్మిపూ ల్మాలగా
గుదిగ్రుచ్చన్ మదినెంతు రాముఁ డటవీగుంజా గళాంకుండు దా
రదకంఠుండు కిరాతరాజ టె? గృహారామంబు కోరళ్ళు మొ
గ్గదలల్ నిండఁగఁ గమ్మతావిముసరౌ గోరంటపూలుండగన్. 2

శా. ఓయీ! నాయన! తోడు లేడిఁ గొనిపోవోయీ! యెవేదర్భమో
ళ్ళాయాచోటులఁ బడ్డచోఁ గొఱికివేయంజాలు శ్రీరామచం
ద్రాయానంబగు, స్వామి వచ్చునెడ మార్గంబందు గోపాదరే
ఖాయత్తంబగు నధ్వమెల్లఁ జెడరాదయ్యా భవత్పద్ధతిన్. 3

మ. ఇది యీబాలిక కప్పఁజెప్పదురటే యీచిట్టి మైత్రేయి కం
దదు పై కొమ్మ, శితాతపంబులు తరుధ్వాంతరాళంబుగాఁ
జెదరున్ వల్కలమొందుచాల దదియుం జెట్టెక్కి కట్టన్ వలెన్
మదదంతావళ మందయానునకు రామస్వామికిన్ బాధయౌ. 4

వ. శ్రీరామచంద్రుండు దండకారణ్యంబు ప్రవేశించె ననివిని యిట్లు తదాగమన
వ్యగ్రమైన తాపసాశ్రమ మండలంబును. 5

ఆ. పడగ దీర్ఘముగను బరఁగించి పుచ్ఛంబు జార్చు భుజగరాజ సహిత శైవ
మూర్తి యట్లు రామమూర్తి ప్రవేశించె నల్లెత్రాడు జార్చినట్టి వింట. 6

ఉ. వచ్చిన రామచంద్రునకుఁ బ్రాణము చల్లబడెన్ దపశ్ఛటల్
విచ్చిన కాంతిపుంజములు వెక్కసమై కనుఁదమ్ములాఁగె నే
పచ్చని చెట్టుచూచినను స్వాగత వాక్యవిశారదాననో
ద్యచ్ఛలదక్షిగోళకములై చనుఁ జిక్కని శారికావళుల్. 7

సీ. వీపులపై ప్రాలు పిట్టలు పడకుండ లీలగా నడచెడి లేటికాన
లనిలాగ్రనీయమా నాప్సరో గానస్వనం బాలకించెడి నాగకన్య
లూహప్రయుక్త సత్స్వాహావచస్సమ వహ్ని కుండోద్గారి ఫలరసంబు
లాను పూర్వీ పరివ్యాప్త వర్ణిసహస్ర శీఘ్ర నిర్వర్తి తాశీస్సహస్ర

గీ. మాత్మకుల మరుదెంచె నంచాశ్రమస్థ సరసిఁ దలలెత్తి చూచెదు జలరుహాళి
చూడఁజూడఁగ రఘురాజచూడమునకు శాంతభోగమ్ముస్వర్గమ్ము సరణిఁదోఁచె. 8

మ. మునులున్ వర్ణులు రామచంద్రుని ముఖాంభోజాతముం గాంచఁగన్
మునిపత్నుల్ జనకాత్మజాత కనుదమ్ముల్ చెక్కిళుల్ ముంగురుల్
కని తద్భూషలు చీనివస్త్రములునుం గన్గొంచు మున్వ్రాడఁగా
వినినామంచు భ్రమింత్రు దేవియని వెన్వెంటన్ భ్రమల్ వాయఁగన్. 9

క. తరణికులుఁడు మౌనీంద్రులు పరస్పరార్చావిధాన పరమోదారా
దరరేఖాకరణానంతర సమయమున ఋషిసమితి తత్పరమతులై. 10

గీ. అర్ఘ్య పాద్యమ్ము లిచ్చి ఫలాశనములు కందమూలమ్ము లిచ్చి రాఘవులు సీత
యారగించిన తరువాత వారి యుటజ మహికి నేగి తత్రత్యసంయమిజనంబు

చ. ధరణిని వేయిమంది వసుధావరు లుందురు గాక భర్మసం
భరణముచేయు భూపతికిఁ బాల్యుల మే మటుగాన నీవు మా
నరపతి వౌదు వేల్పులయినం బలుకోట్లుగదా! తపస్సులన్
హరిహయుఁడొండె ధర్మభృతి నందును నాఱవపాలు రాఘవా! 12

గీ. శమదమాధ్యయనాగ్నిహోత్రములు తపముదానమునుసత్యమనునవి ధర్మమగును
నీవు ధర్మము పాలింతు నీరజాక్ష! పాదివికొని ధర్మ మాచరించెదము మేము.

శా. కోపంబెక్కిన నెత్రునాడు లవి మాకున్ లేవ యిమ్మేనులం
దీ పాణిద్వయ మర్చనావిషయమై యెట్లో రిపుధ్వంసన
వ్యాపారంబున నట్లు సాగవు తపస్యన్ ధర్మపాలుండ వీ
వై పాలింపక యున్నచో శరణులేదయ్యా! రఘూత్తంసమా! 14

వ. అనిన శ్రీరామచంద్రుండు వారికి శరణాగతి నొసంగె. 15

సీ. ఉద్భవచ్ఛృంగమౌ యువకురంగము దడిఁ బొడిచి లోనికిఁ జూచిపోవుచుండ
నిస్తబ్ధమౌ గాలి నిల్చి నిల్చి తరంగ భృతిఁ జెట్లపై ముర్మురించుచుండ
నవుడప్డు రోమంథ మాపి పరున్న యాశ్రమగవి నిట్టూర్పు జార్చుచుండ
నడికిరే ఘూకస్వనము సింహగర్జయు వదలి వేర్పవ్వడి మెదలకుండ
గీ. ధరణిసంతానమునకు నిద్రామనస్సు స్వామి జాగ్రత్తపడి సతి పైని జేయి
చాఁచి మాటికి మాటికిఁ జూచుచుండఁ బ్రభుసుఖాపాదిని గతించె రాత్రియెల్ల.

గీ. అంతట నుషస్సు విరళమై ప్రాంతపత్ర హరిణ వర్ణప్రభా మనోహరదుదార
బాలమార్తాండహృదయమైపరిణమింప మునిసమూహాము సెలవుగైకొని ప్రభుండు.

మ. అటవీమార్గముఁ బట్టి మువ్వురునుబో నంతంత నా త్రోవ దు
ర్ఘటమై ఘోరతమశ్ఛటాజటిలమై క్రవ్యాదసంచార వి
స్ఫుటమై క్రూరమృగావళీరవ ప్రతిస్ఫూర్జద్దిశాగోళమై
విటతాటంబుగఁ బడ్డ ప్రాంతలతికా విధ్వస్తవైశాల్యమై. 18

మ. తఱుచై లక్ష్మణహస్త ఖడ్గ వినికృత్త క్ష్మాజశాఖాలతా
భరమై కానన ఘోరజంతు ఖుర సంబంధైకదృశ్యాధ్వమై
యరుగన్ దవ్వగుఁ బంకమై పథము సామీప్యస్థ కాసారవి
స్ఫురణన్ జానకి యోర్చికొంచు నడచెన్ ఫుల్లాత్మ విశ్రాంతికై. 19

గీ. చెఱువునొద్దున విశ్రమించెదమకాదె యనిన జానకి, శ్రీరాముఁ డనె నయోధ్య
వదలి విశ్రాంతి కొఱకయి వచ్చినావె, యనిన జానకి యటఁగలదా యటంచు.

చ. అవున యయోధ్యలోఁ దెఱఫి యంతని యింతని చెప్పనా! ధరా
ధవుఁడు స్నుషైకజీవి చనె దైవతలోకము, బిడ్డయైన రా
ఘవుని వనంబుపోక కథ కట్టి నిరంతము ప్రుక్కుతల్లి, య
న్న వదలినట్టి చెప్పలయినన్ బినతమ్ముఁడు కొల్వఁ డప్పరిన్. 21

వ. అనిన తరువాత ముప్పురును మాటాడకుండఁ గొంత దవ్వుపోయిన స్వామికిఁ
కోపము వచ్చెనేమో యేదో తానే మాటాడవలయు నని జానకి. 22

క. మనము మరులుంటిఁగను ద్రొక్కినజాడగఁ గానిపించుఁ గేవల మిది త్రో
వన వీలులేదు చెఱు వనుకొనునది కన్పించ దడవికోనయె కాకన్. 23

శా. నా రాముం డనె నెంతయున్ మరులుగొన్నంగాదటే ఘోరకాం
తారంబున్ బతితోడ వచ్చు టనినన్ ధాత్రీజ ధర్మంపు బు
ద్ధ్యా రానైనది భర్తపై మరులు లేదన్నన్ రఘూత్తంసకుం
డారంభించు శిరఃప్రకంపముగ ముందై యేగె మార్గంబునన్. 24

క. బొమముడి విస్ఫుటకోపాభిమానహృదయుఁడు రఘుప్రవీరుఁడు నడచెన్
శ్రమమునఁ గించిద్దుఃఖాభిమానహృదయాబ్జ యేగెఁ బృథ్వీసుతయున్. 25

చ. అలికిడి తాఁకి యొత్తిగిలు నల్పపుజంతు లొసంగు దారిగా
వెలలిన వారి కల్లఁగనిపించె దటాకము దూరతీరసం
చలదురుఘోరదీప్త వనసత్త్వము దీర్ఘగళోగ్రచంచు వి
హ్వాలముఖసంచర ద్బహువిహంగమ మూర్జితవారిపూరమై. 26

శా. ఒడ్డెల్లన్ బహుకంటకావృతముగా నున్నన్ సుమిత్రాసుతుం
డడ్డం బాఁచినకత్తితోఁ దుడిచి యోగ్యాసీనతాస్థాన మే
ర్పడ్డన్ రాముఁడు గొంతదవ్వు చని నిల్వన్ సీత యట్లే నిలం
బడ్డన్ లక్ష్మణుఁ డేమియుం దెలియ కవ్వారిం బ్రవేశించుచున్. 27

ఆ. వెనుకనుండి వచ్చి భీషణోగ్రధ్వాన మదియు నమ్రుగకృత మటంచుఁ దెలిసి
యుర్విజాతతోడనుండె నన్న యటన్న తెలివితోడ వెన్కతిరిగి చూచె. 28

మ. విముఖుండై చను స్వామి జానకిదెసన్ వీక్షించె గంభీర వ
క్త్రము ఘోరాకృతి కన్నులంజొఱని రక్షస్స్వామి యొక్కండు వ
న్య మదేభాభశరీరుఁ డుర్వీసుత పొంతన్ నిల్చి యా దేవి హ
స్తమునం గైకొని పోవనీక కనిపించం జూచి రొక్కుమ్మడిన్. 29

సీ. వ్యాఘ్రచర్మాంబరుం డసృగుక్షితుండు వసామలినదేహుండు మహామాంసకుక్షి
విషమోదరుండు వాని వెన్నున దీప్తదీర్ఘాయస శూల లంబాకృతులయి
వ్యాఘ్రముల్ నాల్గు సింహమ్ములుమూండు తోడేళ్ళు రెండును బదిలేళ్ళు గ్రుచ్చఁ
బడి వ్రేలుచున్నవి, వానిహస్తమున వసాదిగ్ధ మేన్గుమస్తకము కలదు

ఆ. వాఁడు వార్షుకోగ్ర వారివాహము వోలె నుఱుముచుండెనట్లె తరణికులులు
నిలిచి చూచుచుండి నివ్వెఱపొందిరి సీత పొందుచున్న చేటు నరసి. 30

వ. అంత నారాక్షసుండు సగర్వముగా 'నా పేరు విరాధుండు' అని యఱచి
వికటాట్టహాసంబు చేసి యిట్లనియె. 31

క. నా పేరే వినలేదా! యీ ప్రాంతము లేల రాక యెవ్వరు మీరల్?
కాపురుష లుభయవర్ణ వ్యాపృతచిహ్నాకృతుల్ దురాత్ములు మీరల్. 32

మ. జటలున్ వల్కముల్ వృషత్కములునుం జాపంబు లీ సంధిదు
ర్ఘటవేషంబుల నేరి మోసపఱుపంగాఁ గూర్చు టష్టాపద
చ్ఛట దేహామలకాంతి రత్నమయభూషాహేమచీరాదు లో
ప్పట నంతఃపురయోగ్య నాగరకురా ల్బ్వాబోఁడి తానీమెయున్. 33

శా. ఏయంతఃపుర మీరు కొల్లయిడి ఇష్టేచ్ఛామహాభోగలీ
లాయత్తం బువుఁబోఁడి దొంగిలితి రేలా వచ్చుటో రాక రా
కీ యుర్వీస్థలి యొక్కడే దొరకెనా? యెచ్చో విరాధుండు మా
న్యాయుర్దక్షిణదిఙ్మహేశ్వరుఁడు సంహారాద్భుతుం డుండెనో. 34

శా. నామూఁపుంబడి యిన్వయీూలె యిదికన్నారే మిముంగ్రుచ్చఁగా
నేమూలా మఱీ యేదో త్రోవఁ జనకిట్లే రాకయున్ మేలె, తా
నీ మందాక్షదృశాంత కావలయు నా కిల్లాలుగా, మీరనన్
మీ మాంసంబు భుజిక్రియాంత రసనా మృష్టంబగున్ నంజుకో. 35

ఉ. ఈనడుమన్ దపస్విజన మెవ్వరురారిట పూఁటపూఁట బ్రా
చీనము నేన్గుపచ్చియెఱచిన్ దినఁజాలక మొత్తిపోయె నో
హో నరమాంసఖాది పులియున్ రుచి, యచ్ఛమనుష్యమాంస మెం
తైన రుచో వచింపనగునా! మఱిస్నానము చేసి రండిఁకన్. 36

వ. అని పెనుగులాడుచున్న సీత నదలించి యిట్లనియె. 37

శా. మీ దే దేశము మీరలున్ ద్విజులెకా మీనామధేయంబు వె
ట్లై దీపించును శూద్రమాంసమును వాడన్ నేను, మీరిట్టి రం
చాదిం జెప్పఁ డెఱుంగరానిదగు నే యన్నంబు నే ముట్ట, క్షు
ద్బాధల్ క్షుద్రజనుల్ భుజింతు రటవీపర్యంత మేదైననున్. 38

వ. అంత జానకీదేవి శ్రీరామచంద్రునితో నిట్లనియె. 39

శా. నాకున్ దూరము పోతి దగ్గరయియున్నన్ వీఁడు నమ్మట్టునా?
నీ కత్తిం జెయి రెండుముక్కలగుఁ గానీ! నవ్వుటాల్మాటలన్
డీకల్ చేసెదు మాటమాటకును బట్టింపైన నీ కానలో
నేకోనంబడి యేమి యేమగుదునో యిప్డిట్టులైతిన్ గదా! 40

ఆ. ప్రభువ! నీదు నెడఁద భార్య యంచుండునా తల్లిలేదు నీకుఁ దండ్రి లేదు
పరమదైవమంచుఁ బ్రార్థించుచుంటిని నను క్షమింపుమయ్య! నాథ నాథ! 41

శా. అంతన్ రాముఁడు జానకీ పరమదీనాలాపముల్ వించు ధీ
చింతామగ్నుఁడు సీతచేటు కనుటం జిత్తం బధైర్యంబుగా
వంతన్ లక్ష్మణుఁగాంచి. యిట్లనియె, నావైదేహి గన్గొంటివే
యింతా నంచు నెఱుంగ నైతిని గదోయీ కానకున్ వచ్చుచో. 42

శా. లీలాకల్పముగాఁగనై చను వనీక్లేశంబు భూమీసుతా
హేలాతర్పిత బుద్ధినై చనిన నం, చేఁ దెచ్చితిన్ దైత్యవ
క్రీడన్ జనకాత్మజాతఁ గని యేమైతిన్ మఱి ప్డేను న
న్నా! లోభంబును గామమెప్పటికి నిట్లౌసుమ్ము ముమ్మాటికిన్. 43

మ. వలదన్నన్ వినెనా! ధరాతనయ నావంకం బరిభ్రాంతయై
బలవంతమ్ముగ వచ్చె నివ్విధముగాఁ బండెన్ గటా! యెల్ల మై
థిలు లేమందురు, పుచ్చువి ల్విఱిచి వైదేహీ సమారక్షణ
స్ఖలితుం డారఘురాముఁడే తగును నాఁగాఁ బ్రయ్యిగాఁ బల్కరే. 44

ఉ. ఆ పినతల్లి కైకయి సమాదృతిఁ బంచె వనాంతరంబు తా
నీ పనికోసమై యనుచు నెంచెద, జానకి యామెయందు శ్ర
ద్ధాపరిచర్యలన్ మనియె దానికినైనను జాలిలేద, యీ
పాపము నాది కావలయుఁ బైదలి సౌఖ్యము లేదు నాకెటన్. 45

గీ. పితృవియోగాదులవి దుఃఖపెట్టు బిట్టుగాని జానకి దుఃఖము కరణిఁగావు
తల్లివరములు జానకిఁ దగులవలెనె నిన్నుఁ దగిలినయది చాలదన్న, యట్లు. 46

వ. అని బాష్పవర్షాకులేక్షణుఁ డయిన యన్నఁ గని సౌమిత్రి యిట్లనియె. 47

శా. అన్నా! నీ వనినట్టి మాటలవి నాకర్థంబు కాలేదు వీఁ
డన్నన్ నీకన నేకబాణ రుధిరవ్యాసక్త మృత్పిండమౌ
నెన్నన్ దల్లికి నంత చేడ్వడెదు నీవేలా ధరాజాత యం
దున్నన్ నిల్వక దూరమేగితివి నీవున్నావటం చెంచితిన్. 48

గీ. సర్వజీవలోక సంత్రాణశీలుండవంతలోన నిట్లె యటమటింతు
ధరణి సర్వవలయధానుష్క రత్నంబ వసి మొగంబె తెలియనట్టు లుందు. 49

మ. ఎవడా మైథిలుఁ డెవ్వడో శివధనుస్సే వుచ్చెనాయేమి? యా
యెవఁడో దోర్బలశాలి యా విఱుగుముక్కే యెత్తలేడేమి? యి
ట్టి విలాపంబుల కేమిగాని కనుగొంటే వీని నొక్కుమ్ముచే
నవనీశాయిగఁ జేతుఁ జూడుమని దైత్యశ్రేష్ఠుతో నిట్లనెన్. 50

క. ఎఱుఁగకయు నీవు మముఁదిన పెఱుఁగకయు వధింప మేము నెవ్వఁడ, వటవిన్
మరగి తిరిపంపుదిండికి, చెఱిచెద వీ యటవిత్రోవ శిక్షావిరహీ! 51

చ. అనిన విరాధుఁడంత వికటాట్టముగా నగి మీర లెవ్వ రెం
దునకును బోవుచుంటిరని తొల్తను నే నడుగంగ, మీరు చె
ప్పిన యదిలేదు నన్నడుగఁ బేర్చితి, మామకముష్టిక్లప్త జీ
వనులకు నింతగాఁ దగదు, బాణచయంబు మదప్రయుక్తమౌ. 52

మ. అనినన్ స్వామి విరాధుతో ననియె నీవన్నట్లు మేమే వచిం
పనునౌ మున్నుగ రామలక్ష్మణులమున్ వైదేహి యీ దేవి యా
మెను నే దొంగిలలేదు మైథిలసభామేధ్యోర్విఁ గంకాలభృ
ద్ధనువున్ వంచి గ్రహించితిన్ బితృవచస్తాత్పర్య మీరాకకున్. 53

క. తన కోప మభినయం బని తన యాదర మవనిదేవితనయ యెఱుంగం
గను స్వామిపలుక లక్ష్మణుఁడనుకొనె మర్యాద యేలయంచు దితిజుతోన్. 54

వ. అంత దైత్యుండిట్లనియె. నాతండ్రి జయుఁడు. నాతల్లి శతహ్రద. నన్ను సర్వరాక్షసులుఁ విరాధుఁడందురు. నేను బ్రహ్మనుగూర్చి తపస్సుచేసి సర్వశస్త్రములచేత నవధ్యతయు నచ్ఛేద్యత్వాభేద్యత్వములును వరములుగాఁ బడసితి. ఆమెను వదలి మీదారిని మీరు పొందు. తండ్రిమాటఁబడి యడవికి వచ్చితి మని చెప్పుచున్నావు. మిమ్ము చంపి తినుట యెందుల కనిన శ్రీరాముండు కోపఘూర్ణితాక్షుఁడై యిట్లనియె. 55

గీ. ఓరి దైత్యుడ! యుర్విపై నుండి నీవు నాల్గుకాలాలపాటు వన్యగజసింహ
ముఖమృగాదన సుఖివగు బుద్ధియున్న వదలురా సీత, వదలి నీవలను పొమ్ము.

వ. అనిన విరాధుఁడు నవ్వి మీరు నన్నుఁ జంపెద మంటిరిగదా! సీత వదలిన నేటికిఁ జంపెద రన్న రాముండు కుపితుఁడై యిట్లనియె. 57

శా. సృష్ట్యాదిన్ దితిసంతునన్ మొదటివాఁడే నీవు, మౌర్ఖ్యంబు మీ
సృష్ట్యుద్భూతగుణంబు, కోరి వరియింత్రేలో భవజ్ఞాతి మ్రు
త్వ్యుష్ట్యావేశము పూని వచ్చెదరు మే మేమన్న లాభంబు మీ
ఘృష్ట్యుత్పన్నగుణంబు పండెడిని పోనీ యంచుఁ జాపంబునన్. 58

చ. పిడికిట నేఁడు బాణములు పేర్చి విరాధునిమేను దూసినన్
దడిసెను ధాత్రి జిమ్మనిన దానవు నెత్తురుచేత వాఁడు నె
క్కుడు రభసాన శూలమునఁ గ్రుచ్చిన క్రూరమ్మృగాళి దూసి తా
విడిచెను ద్రిప్పి దాని రఘువీరులపై యమదండవైఖరిన్. 59

చ. ఒక పెను ఝుంఝుకున్ బెగిలి యుర్విని లేచిన పెద్దతాడి చె
ట్టుకరణి వచ్చు శూలము కడున్ భయదాకృతి సర్వకానన
ప్రకటిత వృక్షసంతతిని బాయఁగఁద్రోచెడు వేగవల్గనా
ధికపటుశక్తి తోడఁ బఱతెంచిన రాముఁడు నాలుగమ్ములన్. 60

ఉ. నాలుగుముక్కలై నఱకినన్ జెడి ముక్కలు నాల్గు వేగధా
రా లవనోగ్రముల్ వనధరాబహువృక్ష విమర్దనంబుగా
నాలుగుదిక్కులం జనె ఘనాఘన వాయు విఘూర్ణనోగ్ర గ
ర్జా లవనంబుతో దితిజరాజు వికారపు నవ్వునవ్వుచున్. 61

క. నెట్టన ప్రాణములన్ బిగబట్టి విరాధుండు వరముబలమున పేర్మిన్
బిట్టావులింపఁగా సెలకట్టియ లవి రోమకూపగతి వెలువడియెన్. 62

గీ. అంతదైత్యుండు రాఘవునరసి యోయిరామ! చూచితివా నాదు ప్రాణములకు
నీదు శరములకును సుంత లేదు సుమ్మె యల్పసంబంధమైన నం చావులించి.

క. అద్దా! అద్దా! రాఘవ! విద్దెమ్మె యీాటె నాల్గు విఱుగులు విఱిగెన్
దృద్ధనుసును బనిచేయని పద్ధతి చేసెద నటంచుఁ బైనుఱికి వెసన్. 64

చ. లలిఁ బరగించు నమ్ములను లక్ష్యముచేయక పట్టి రెండు బా
హులఁ జెఱియొక్కరిన్ వనమహోర్విని బర్వులు వెట్టఁజొచ్చి వి
హ్వలముగ నవ్వుచున్ శిశువు లక్కట మీరలు, మద్భుజాగ్రసు
స్థలమునఁ గూరుచుండుఁడు విచారముదక్కి యటంచుఁ బోవఁగా. 65

మ. చనగా మైథిలి తాన యొక్కరిత కాసారంబు తీరంబునం
దున నేకాకిత భీతయై యఱచుచున్ దోనేగుచున్ బిగ్గ గొం
తున వాపోవుచు దైత్యుతో ననియె నోదుష్టాత్మ! నీవెందుఁబో
వను వాంఛించెదు, వారి డించి కొనిపోవంజూడు నన్నేనియున్. 66

గీ. ఆత్మగుణముల పుట్టినిల్లైనవాఁడు దాశరథి రామచంద్రుండు దైత్యలోక
సార్వభౌమ! నీకును నమస్కారమయ్య యాయనను డించిపోవఁగదయ్య నీవు.

క. బెరసి విరాధుఁ డగమ్యపుఁ దెరువునఁ గొనిపోవుచుండె ధీశరథుల దా
శరథులను మోసికొం చోగిర మైతిని గ్రూరనవమృగీవక్త్రములన్. 68

శా. నన్నన్నన్ బరిరక్ష చేసెడు ప్రతిజ్ఞాబుద్ధి సౌమిత్రి వ
చ్చె న్నేడాతనికైన నిష్క్రియత వచ్చెన్ ఘోరశైలాభు దై
త్యు న్నిల్పోపఁగ లేకపోయెదరు, నేనో! క్రూరజంత్వాస్యమం
దన్నంబైతిని నీ వరంబుల ఫలం బైనాము శ్వశ్రూ! యిదే. 69

చ. అటునిటు రెండుకాళ్ళు దితిజాధిపుమూఁపున వైచి దీప్తదోః
పటుతరమూర్తి లక్ష్మణుఁడు బంధురమార్గము గుర్తు పెట్టు కొం
చటునిటు జానకీపథము నంతయు సజ్యధనుర్విలగ్నవి
స్ఫుటతర బాణలక్ష్యకృతభూమిగ నిల్చెఁ బ్రచండమూర్తియై. 70

మ. తనలక్ష్యం బటు లిట్టులుం జెడక సంధానించి సౌమిత్రి రా
మునితో నిట్లనెఁ దల్లి యింక నిముసంబున్ దాటినన్ గానిపిం
చనురా దధ్వ మెఱింగితిన్ దనుజు హస్తంబద్ది నీ విద్ది నే
నును ఛేదింత మిదే యటన్న నుడిలో నూల్కొన్న కోపంబునన్. 1

ఉ. ఇద్దఱు దైత్యబాహువుల నిట్టటు రెండును గత్తివాదరన్
బ్రద్దలుచేసినన్ దనుజరాజు హఠాదశనిప్రపాతమై
పెద్దయు బాధచే నఱచి పృథ్విపయింబడె, లాఘవంబుతో
నిద్దఱుదూఁకి యట్టిటు వహించిరి దైత్యుని లేవకుండగన్. 72

చ. ఇది గని సీతయుం బరువులెత్తుచు వచ్చెను రామలక్ష్మణుల్
సొదఁబడియున్న యట్టి దనుజున్ గరవాలపృషత్కధారలన్
గుదులగు గాట్లుగాఁ బొడిచి కోరి ధరాస్థలి నెత్తి వైచుచుం
బదిపది నెత్రుముద్ద యగుపాటిగఁ జేసినవైనఁ జావడున్. 73

క. మెడ నఱికిన నఱుకుపడదు వడిబాహువు లెట్లు నఱుకుపడియెనొ దైత్యున్
మడియించుఁ ద్రోవ గానక తడయక రాముండు చెప్పెఁ దమ్మునితోడన్. 74

శా. చావం డీ దనుజుండు మిక్కిలి తపశ్శక్తిన్! మఱిన్ వీని కం
ఠావిద్ధంబుగఁ గాలితో గదలకుండన్ నొక్కెదన్ నేనునున్
నీ వీ ప్రక్కన గోయి త్రవ్వు మపు డందే వీని దొర్లింత మా
పై వే ఱాలను అప్పలన్ బయిని గప్పన్వచ్చు బర్వొప్పఁగన్. 75

క. వేఱొకరీతిగ వీనిని మారణముంజేయు త్రోవ మసలదు నాఁగన్
దా రాక్షసుండు నిట్లనె శ్రీరామా! మంచియూహ చేసితివయ్యా! 76

శా. మున్నే యెందఱొ రాక్షసుల్ మడిసి రంభోజాక్ష! నీచేతిలో
నెన్నన్ భావిని జత్తు రేమయినఁ గానీ! స్వామి! నిన్గాఁగిలిం
ప న్నేనైతిని దుంబురుండనఁగ నే వర్తింతు గంధర్వుడన్
నన్నున్ వైశ్రవణుండు తిట్టినదిగా నర్తించితిన్ దైత్యుఁడై. 77

క. తనకొడుకు నదుపులోనిది గనుకను రంభకును నేస్తగాఁడై యున్నన్
ననుశపియించెఁ గుబేరుఁడు ననుఁ దుదిఁ గైకొనియెఁ బ్రార్థనా మృదువగుచున్.

శా. అంపంగాఁ బినతల్లి స్వామియు వనీయాత్రాగతిన్ వచ్చి నిన్
జంపున్ నీ సహజంపురూపము గడించంజాలు దంచుం బ్రసా
దింపన్ నీకయి వేచియుంటిఁ బ్రభువా! దీవ్యద్భుజా శ్రీధను
శ్శంపానీరదమూర్తి! నిన్ను గుఱుతింపంజాల కెట్లయ్యెడున్. 79

క. నీ మార్గణం బపూతపు నామేనునఁ బడకమున్న నాథా! వైదే
హీ మహిత తనూస్పర్శ వ్యామిశ్రముగాఁగఁ బూతపఱచితిఁ దండ్రీ! 80

క. అవునో కాదో యనియెడి లవ మనుమానంబు రామలక్ష్మణులము నాన్
ధవ! చెప్పినంతఁ దీఱిన దవలఁబ్రభూ! యెంత తగ్గియాడితిఁ గంటే! 81

మ. ఘను లీత్రోవనుబట్టి మీరు చనగాఁ గన్పించు నధ్వర్ధయో
జనమందున్ శరభంగు నాశ్రమము నా సన్మౌని మీ కెల్ల శో
భనముల్ గూర్చెదు స్వామి! నాసుకృతముల్ పండెంజుమీ! నీవుచే
యని దాతండ్రికి నాకుఁ జేతు పరకర్మారంభముల్ బిడ్డవై. 82

శా. శ్వభ్రంబందున నన్నుఁ బూడ్చవె రఘుస్వామీ! సదా దైత్యలో
కభ్రాజిష్ణుపథంబు నియ్యదియె యో కంజాక్ష! నీపాదయు
క్త్యభ్రేషంబుగ నాగళంబుపయి నీవారోపణంజేయు! ధ
ర్మభ్రంశంబున కడ్డువెట్టు పద మస్మత్కంఠముం జేర్చుచున్. 83

వ. అనిన శ్రీరామచంద్రుండు దైత్యుని కంఠమునఁ గాలూది యిట్లనియె. 84

ఉ. దారికి దారిచూపితివి తల్లిగ నెంచితి భూమిజాత నిన్
మారణ మాచరించెదను మామకమై చను క్షత్రియత్వ మే
దారిదియో కటా! సహజతం గనె దంచునుగాక నీ గళాం
భోరుహ మిట్లు త్రొక్కుటయుఁ బుట్టునె నాకు దయాదిలోకముల్. 85

క. అని యన్నదమ్ము లిద్దఱు దనుజుని గత్తులను గ్రుమ్మి తత్కంఠంబున్
వినికృత్తముగా నవటంబున నిక్షేపంబు చేసి పూడ్చిరి రాలన్. 86

వ. తరువాతఁ దద్దర్శితాధ్వమున శరభంగాశ్రమాభిముఖముగా ముప్పురు నేగుచు స్వామి విషణ్ణుఁడై నడచి కొంత కిట్లనియె. 87

శా. ఓయీ! సీతఁదృజింపఁడా యసుర, యేదో దివ్యబాణంబుచే
మాయంజేసి ధరా త్మజాతఁ గొనలేమా! వాని క్రందించు టే
లా! యీచంపుటయీ కసాయిపని మేలన్నట్లుగా నున్న ద
య్యో! యాకత్తులఁగ్రుమ్ము పేషణము ప్రాణోత్క్రాంతి దుర్వ్యాప్యమౌ. 88

ఉ. ఊహకు నందదే, బ్రదికియుండినవానిని బూడ్చి పెట్టినా
మే! హరి! వానినేమొ వధియించినయట్లగునా యిఁకొక్క స
న్నాహముచేతఁ దద్వధమనన్ ఘటియిల్లదు, చంపవద్దునా
నోహరిసాహరిన్ దినుచునుండె ఋషీంద్రుల దైత్యుఁడాతఁడై. 88

మ. తనపూర్వంబగు జన్మలో గలుగు వృత్తాంతంబు తానే యెఱుం
గును, దుష్టాచరణంబు నేపగిదిఁ గైకొన్నాఁడు నన్గాంచినం
తన పూర్వస్మృతి కల్గెనా! వెదకుచుం దా వచ్చెనన్నాఁడుగా
ననుఁ బైశాచిక దేహమే బలమొ గంధర్వత్వ భావానకున్. 89

మ. అగు దేహంబు బలంబు పెద్దయది సింహంబేమొ ముద్దాడెడిన్
జిగురుంగోఱలు గోళ్ళుతాఁకి వ్రణముల్ చేయున్, బురాపుణ్యక
ర్మగమై సాధుకృతుల్ భరింపనగు జన్మంబైన గాకేది చే
యగ నే దేహబలంబు లాగునౌ కదయ్యా! జీవకర్మోద్ధతిన్. 90

వ. అనుచు శరభంగాశ్రమ సమీపదేశం బధిగమించి. 91

చ. ఒక తెలిమబ్బులోఁ గదలుచుండిన వైఖరి శ్వేతవర్ణ భే
దకమును రేఖలన్ నయనతాకృతతత్పరతా మనోజ్ఞమూ
ర్తికమును పైఁడిడాలు వివరించిన రమ్యతతోడి సాధుచి
త్రకమునునై విలోచనపథంబును దర్పణ మాచరించుచున్. 92

సీ. చక్రా లిరమ్మదచకచకద్యుతితోడ మధురమంథరగర్జ మక్కళింప
గుఱ్ఱాలు రాయంచకొదమల హరువుతో మౌళిమాణిక్యసంపత్తి చూప
నరదంబుగూఁడు దీవ్యత్స్నిగ్ధలవలీలతా కుడుంగమ్ము చందమ్ము నెఱప
సారథిచేతి కశారీతి యింద్రచాపము పేడుతీసిన పగిదితోప
గీ. నొకమనోజ్ఞ నేపథ్యమై యుర్విదాఁక వ్రాలి తెలిమబ్బువలె నంత రథమునుండి
యొక్కమహితానుభావపయోధి కవచి కటకి కుండలి మకుటి డిగ్గంగనయ్యె. 93

గీ. మస్తకసహస్రమాణిక్యమహిత సితఫణా భుజంగమ స్వామి యనంగ శుక్తి
గుచ్ఛకల్పమ్ము ముత్యాలగొడుగుకాఁగ నా మహామహోవారాశి ననుగమించె.

ఉ. పాలసముద్రపుం దరగపైఁ జిగిదేరిన పచ్చిమీఁగడల్
శ్రీలలితాంచితాంగక విశేషములై చనినట్లు కంకణ
శ్రీలుదయించు క్రొవ్వెలుఁగు చిందులుగా వ్యజనానిలాక్తచూ
ర్ణాలక లమ్మహాపురుష వల్లలఁగొల్తురు వల్లకీతనుల్. 95

ఉ. ఆ మహనీయమూర్తిని మహర్షులు స్తోత్రముచేయుచుండి రు
ద్దామ విపంచికానుగత ధైవత సుస్వర కంఠగీతిరే
ఖామధురస్తుతుల్ వినయగౌరవవంతులు వెంబడింతు రా
స్వామి రథంబు డిగ్గియును క్ష్మాస్థలి నంటక యేగుచుండెడిన్. 96

చ. వికసితచారులోచనులు విస్తృతవక్షులు పుండరీకకో
రకనిభదేహు లంగకసరన్మృదు విద్యుదుదారకాంతులున్
మకుటులు పంచవింశతిసమా సముపేతవయస్కులా మహః
ప్రకటితమూర్తిఁ గొల్చుచును వత్తురు నాయతఖడ్గపాణులై. 97

గీ. ప్రాచికుడ్యంపు టిడుపుల వ్రాసినట్టి యొక మనోజ్ఞ ధారాచిత్రమొ యనంగ
నీ మహాదృశ్య మేపారి రామచంద్రమూర్తి సౌమిత్రిఁ గౌతుకస్ఫూర్తి ననియె. 98

శా. చిన్న ప్దీదృశ లక్షణోపహితులం జెప్పంగ స్వర్వ్యాసులన్
విన్నా మూపయి గ్రంథముల్ సదివినన్ వేల్పుల్ మఱీలాటివా
సన్నల్ గల్గినవారుగాఁ దెలియు నా స్వామిత్వమర్యాదతో
నున్నాఁ డాయన వేల్పుఱేఁడ యని నేనూహించెదన్ దమ్ముఁడా! 99

చ. అది శరభంగమౌనిమణి యాశ్రమదేశము, మౌనితోడ నా
త్రిదశజగత్ప్రభుండు వినతిన్ వచియించెదుఁ జూడు మిద్దఱున్
మదిమదిలోపలం గలియు మైత్రి కలట్టిరు వోలె మాటలా
డెదరు, మహాత్ముఁ డింద్రుఁడని డెందముచెప్పెడు నిశ్చయించెదన్. 100

ఉ. మర్శితమైన యెట్టి శుభమంజులవేళను లేచినార మో
కర్శితమైన యీ వనవిగాహిత కాలమునందు దేవతా
దర్శనమయ్యె సర్వఋషి దర్శనభాగ్యము తోడిపాటుగా
దర్శము ద్వాదశిం గలసి దాపునఁ జేరినయట్లు లయ్యెడిన్. 101

ఉ. ఏఁజని చూచివచ్చెదన యిచ్చటనుండుఁడు మీరలిద్దఱున్
భ్రాజిత సత్కృపాంబునిధి స్వఃపతి యొప్పదలన్ ఘటింప భూ
మీజయు నీవు నేను జని మేదిని మ్రొక్కుదమంచు దంతి లీ
లాజయయాన మంథరవిలాసమునన్ జనె స్వామి నమ్రుఁడై. 102

మ. పతి యచ్చోటికిఁ బోవులోన నసితాభ్రం బొక్కఁడా సర్వదై
వత సంఘంబున కడ్డవచ్చి యనిలవ్యాధూతమై దూరసం

గతిఁ గొంచుంజనె మౌని నిల్చెనట నొక్కండంత శ్రీరాముఁ డం
చిత పద్మాంజలి మౌనిపాదములనుంచెన్ గోత్రనామంబులన్. 103

వ. విస్ఫారిత లోచన వారిజాతుండై ముని యిట్లనియె. 104

క. నీ వతిథివిగా వచ్చెదు దేవాలయ మిప్పు డరుగఁదిఅదు నాకం
చే వెలిచినాఁడను దండ్రీ! విబుధేశ్వరుని నిప్పుడే కను మదిగో. 105

క. పొనపొన నల్లనిమేఘము తునుకవలెం బోవు దూరదూరము నన్నుం
గొనిపోవ వచ్చె నర్చిర్ఘనలోకంబులు తపస్సుఖ సమార్జితముల్. 106

క. సురపతితో నంటెని నీ దరిసెనముం జేయుమంచుఁ దండ్రీ! యనినన్
సురపతి చేయుటయా? నా దరిసెనమా? యంచు స్వామి తల్లడ పడియెన్.

వ. అంత నమ్మహర్షి సంబాళించుకొని యిట్లనియె. 108

శా. అయ్యో! రాఘవ! నీవుచేసినవి ధర్మారంభముల్ పున్నెపుం
దయ్యంబుల్ తలఁదాల్పదగ్గయవి! సుత్రాముండు నిన్ గాంచఁగా
నయ్యారే! యది యెప్పుడో నట భవిష్యద్దివ్యకర్మాంతమం
దయ్యాగామి శుభంబువేళ నని తా నాకాశవీధిం జనెన్. 109

క. అని మౌని దూరమం దుండిన లక్ష్మణు సీతఁగాంచి నీవును నీవుం
జనుదెం డటంచు నత తర్జనిగా నరమూఁత కనుల సన్నగఁ బిలిచెన్. 110

ఉ. వచ్చినవారు తచ్చరణ పద్మములంటి మునీంద్రుతోడుతన్
మచ్చికగా లసద్ఘనమంజుల నేత్రులు కూడియుండ సం
పచ్చయమూర్తి మౌని రఘుమండనుఁ గాంచి తపస్సమార్జితం
బచ్చపు బ్రహ్మలోకము మహాప్రభు! సిద్ధమునాకుఁ గల్గనే. 111

గీ. బ్రాహ్మ్యములు నాకపృష్ఠ్యముల్ బహుళశుభజగత్తు లస్మత్తపఃకృష్టిఁ గలవునాకు
మరలవత్తువె నీవు నామహితలోకములను నిత్తుఁ గైకొనవే యముత్రఫలగ !

మ. అనినన్ రాముఁడుస్వామి!స్వామి! బహుళాయాసంబుచే గృధ్రతా
యనమై నీకగు బ్రాహ్మ్య సంపద సునాయాసంబుగా నేను గై
కొనుచోఁ దండ్రివచఃప్రమాణముగ నాకున్ ఘోరకాంతార వ
ల్గు నిరీహాగమనం బిదేల? దయచాలున్ నీదు నాశీస్సుతో. 113

శా. నే నార్జింతును సర్వలోకములు తండ్రీ! యంతకుం జాలుదున్
నేనీ కాననవీథిఁ బాక యొకఁడెందే వేసి యావాసముం
గా నేర్పాటుగ నుండ నెంతు నది యోగ్యంబో నెటం జెప్పవే
యీ నీ సత్కృతి యొండె నాకుఁ బదివే లిజ్యాఫలాకారకా! 114

చ. అనిన గ్రహించి మౌని యవునౌ గ్రహియింతువౌకో, గ్రహించినన్
మునినొకరుండ నేనటవె, వుత్తురు స్వీయతపఃఫలంబు నీ
కును సకలర్షిసంఘ మది కొన్నను రాజస మౌనె? యన్నఁ, దా
మునికిఁ బ్రదక్షిణించి రఘుమూర్తి క్షమింపవె యంచునాడినన్. 115

మ. శరభంగుండు ప్రసన్నదృష్టుల రఘుస్వామిన్ విలోకించి భా
సుర మీదైవతవారి యొద్దునఁ బ్రతిస్రోతస్సుగాఁ బొందు స
త్వరతన్ వాహినినైనఁ బూఁబడవలన్ దాటంగనౌ నిందు నం
దరుగన్ మీకు సుతీక్ష్ణునాశ్రమము నేత్రాధ్వంబు ప్రాపించెడున్. 116

మ. రామా! మిక్కిలి సంతసించును వనీరమ్యైకదేశంబునం
దా మౌనీంద్రుఁడు మిమ్ము నిల్పును సుఖంబొఁ గాననావాసముల్
స్వామీ! యించుక నిల్చిపోఁగదె త్యజించం గోరెదన్ మేను నీ
సామీప్యంబున, నీవునై యరుగుదెంచం గోరి యే నుండితిన్. 117

వ. అని యమ్మౌని యగ్నిసంధానంబు చేసి వేల్చి యందుఁ బ్రవేశించిన. 118

మ. అది యత్యద్భుత మన్నయట్లు మునిదేహోస్థుల్ సమాంసంబు కుం
డ దళజ్జిహ్వల నింతయున్ మిగులకుండంగా గ్రసింపంబడెన్
హృదయం బద్భుతభావమగ్నముగ వర్షీయాంసుఁ డమ్మౌని స
మ్మద కౌమారదశన్ వహించి విలసన్మార్గీన సస్యాకృతిన్. 119

క. ఏ లోకము లగ్న్యాహితులే లోకము లఖిలఋషులు నేగెదరో తా
నాలోకములం జనియెను సాలోచనుఁడౌచు రామచంద్రుఁడు చూడన్. 120

వ. అంత శరభంగ బ్రహ్మలోకగమన దిదృక్షువులై శ్రీరామచంద్ర దర్శనాభిలాష
నరుగుదెంచిన తద్వనస్థ సర్వమునిసంఘములు వైఖానసులు వాలఖిల్యులు సంప్ర
క్షాళులు మరీచిపులు నశ్మకుట్టులు పత్రాహారులు దంతోలూఖలు లున్మజ్జకులు
గాత్రశయ్యు లశయ్యులు నభ్రావకాశకులు సలిలాహారులు వాయుభక్షులు నాకాశనిల
యులు స్థండిలశాయులు వ్రతోపవాసు లార్ద్రపటువాసనులు సజపులు తపోనిత్యులు
పంచతపోన్వితులు రామచంద్రుని దర్శించి యిట్లనిరి. 121

శా. నీ విక్ష్వాకుల యింటిబిడ్డ వగుటన్ నీరేజపత్రాక్ష! మా
యీ వైశ్వానర నిత్యయాజులకు నీవే రాజ వెవ్వాఁడు ధ
ర్మావిష్టుండగు నాతఁడొక్కరుఁడె బ్రాహ్మ్యంబున్ సమర్థించు లే
దో విశ్వాసము క్రౌర్యముం గలసి దైత్యుల్ వారెకా రాఘవా! 122

మ. అది వాక్యంబున నొక్కకప్పుడు ప్రధానార్థంబు లేశార్థమౌఁ
బదిమార్గంబుల నద్ది కాదనుచుఁ జెప్పన్ వచ్చు లోకంబు త

ప్పిదముం జెప్పదు కాదటన్న నెవఁడో వీరుండు లేశంబు న
య్యది పాలించును ధర్మి వాఁడొకడు సత్యాధారమై నిల్చెడున్. 123

శా. నీ వేతాదృశుఁడౌట నిన్నుఁబడి నిండెం గోర్కు లీ మాకుఁ దం
డ్రీ! విశ్వంభర సత్యసంస్థ యిదియున్ నీపైని నిల్చున్ దయా
వ్యావల్గ న్మృదుదృష్టి మా తపములం బాలింపు కోదండ వ
ల్లీ వేల్లద్భుజ! నీవు సత్కృతిమతల్లిశ్రేణికం గూర్చుచున్. 124

మ. సకలార్థప్రవిభాగ ధీపరిణత స్వచ్ఛాత్మకా! యాధిదై
విక మాధ్యాత్మిక మాధిభౌతికమునా వీనం బ్రయత్నంబు త
త్ప్రకటీభూతఫలంబు దేవ, నది సంధానించు సౌలభ్య, మిం
కొకటన్ వేఱొకదానిఁ గూర్పఁగఁ బ్రయత్నోగ్రత్వ మేపారెడిన్. 126

శా. ఆ యా ధర్మము లట్టులట్లుగను మన్వాదిష్టమార్గంబునం
దే యుర్వీపురుహూతుఁ డాచరణ చేయింపించు వాఁడాత్మ భూ
సాయుజ్యంబు గడించు రాఘవ! తపశ్చర్యా తపోరక్ష లా
యాయీ చోట్ల ఫలంబునందు సమమర్యాదం బ్రవర్తించెడున్. 127

శా. తాతా! మావ్రతనిష్ఠ లెట్లరుగునో! దైతేయరాడ్దుష్క్రియా
కేతుస్ఫీతము లస్థిపంజర సమాకీర్ణంబులై పొల్చుఁ బం
పాతీరంబులు చిత్రకూటతటముల్ మందాకినీతీరముల్
ఖ్యాతిం జెప్పెడు నా తపస్వుల గమిష్యల్లోక మేపాటిదో. 128

గీ. ఒక్కదవడకురాని మాబక్కయొడలులకును మొగమువాచెదరు పాలసులసురులు
వెలుగుకోరళ్ళ బరిసెలుపెట్టి యాఁచికొనఁగ నడవిమృగాలో రఘుప్రవీర! 129

ఆ. విశ్వపతి! సమాధి వెలలిన జాగ్రత్త హారి విమాన మరయుటందుఁ గాదు
వివృతదైత్యవక్త్ర విస్ఫారదంష్ట్రా భయంకరాట్టహాస మరయుటందు. 130

క. నీకెఱుఁగకయ విరాధుని పోకార్చుట మాకు శరణుపొంటెను నీ వం
గీకారమ్మును నెఱపుట మా కాశ్రయ మగుము నీవు మహిజాస్వామీ! 131

క. మమ్ముం బరాక్రమరేఖను నిమ్మగు ధర్మాభిరతిని నిప్పటిదాఁకన్
నమ్మించి తసురదంష్ట్రలఁ గ్రుమ్మింపకు మిపుడు నమ్మికొనఁ జెఱుపకువే. 132

మ. అనినన్ స్వామిదయార్ద్రమూర్తి దరహాసాంకూర మేపార ని
ట్లనె నమ్మించితినా! మిమున్ దొసఁగు నాయందయ్యె మన్నింపుఁ డే
మన నమ్మించినదానికిన్ ఫలము దైత్యశ్రేణి మీకోసమై
ధనురంతమ్మున ముగ్గఁజేసెదను మీ తాత్పర్యమిట్లే గదా! 133

చ. కలిగిన తం(డ్రియూహఁ బడి కానకు వచ్చితి మీరు దానిలో
వల బహుళార్థ సం(గహణ బంధుర ధీకులు మీకునంతగాఁ
దెలిసిన నేలకాదనుట? తీర్థము స్వార్థము కూడివచ్చినన్
వలదననేల? మీకు వశవర్తినిగా నడతున్ (బియంబునన్. 134

వ. అన్నంతసేపు స్వామి చిఱునవ్వునవ్వుచు నంతలో నదృష్యతా రేఖయొక్కండు మొగంబున వ్యాపింప నిట్లనియె. 135

శా. చీచీ! యేమి యసహ్యమైనవని దాక్షిణ్యంబు గన్పింపదే
యేచెట్లో యిలు, ముక్కుమూసికొని వారే జోలియున్ సొంటిలే
కాచారస్థితినుండఁ బొంచికొని తద్వ్యాపాదన (ప్రక్రియా
నీచత్వంబు వహింప నూహకును గన్పించున్ మఱిట్లానెనాన్. 136

క. తానొక్కఁడు ధర్మం బనుకోనగు, నదికానివారిఁ (గ్రొచ్చుదురే, (ప్రా
ణానకు నసహ్యపడెడు విధానం గనిపించు వృత్తి దైత్యత యనినన్. 137

మ. పులియుం బామును దైత్యుఁ డీమొదలుగాఁబుట్టున్, మహోఘ(క్రియా
వలి హేతుత్వముచేతఁ బుట్టి మఱియుం బాపంబులే చేయు వి
హ్వలుఁడై జీవి, మఱింక నీదృశ జనుష్వారమ్య మేనాఁటికో
తెలియంజెప్పదు మన్న నెక్కుడుగదా ధీసం(స్క్రియాసంపుటిన్. 138

వ. అని (శ్రీరాముం డా ఋషిసంఘములతో విట్లనె. 139

ఉ. ఉన్నకొలందిఁ బాపముల నూరకచేయుదు రీ శరీరముల్
చన్నయనంతరంబయిన సంగతి యెట్టిదొ యట్లు చేసినన్
బున్నెముకొంత, మీకుఁ దపముల్ కొనసాగుట చేసినట్లగున్
నన్నఘమందునన్ దనుజనాథ విమర్దనఁ జేసి యందెడున్. 140

మ. ఇది వాగ్దానము మీ తపఃపరమ సాహిత్యంబు నిత్యత్వ సం
పద వర్ధిల్లఁగ దైత్యయూథముల వ్యాపాదింతు నే గాఢ వ
న్యదరీ గూఢులనైనఁ గూడికొని యిట్లైవచ్చి యర్థించు నా
పదలోఁ దీ(వ్రత యెంతయో తెలియ సర్వర్షుల్ నమస్కారముల్. 141

వ. అంత సర్వర్షిసంఘ వదనజనిత జయారావముతోఁ గొందఱు ఋషు లిట్లనిరి. ఆహోహో! ఏమి రామచం(ద్రుఁడయ్యా! యేమి రామచం(ద్రుఁడు. 142

గీ. తూఁచినట్లుమాటాడుట తూఁచినట్లు(బదుకుటయు నేమియీరామభ(ద్రమూర్తి
యున్ని వేలేండ్లకైన మహేశ్వరుండు మా తపోరక్ష చేయంగ మాకు దొరకె.

ఉ. అంతట రామచం(ద్రుఁడు మహర్షుల నందఱఁజూచి నేను మీ
(ప్రాంతము లెల్ల వచ్చెదను వచ్చినయప్పుడు తావకా(శమ

ప్రాంత చరన్నిశాచర దురాచరణంబు తలంగువాఁడ నం
చెంతయుఁ జెప్పివంపె వినయేందిర మోమునఁ జెంగలింపఁగన్. 144

ఉ. ఆ ఋషులందఱేగిన యనంతరమందు సుతీక్ష్ణనాశ్రమో
దారవనీస్థలంబు నరుదారఁగఁ బోద మటంచు రాముఁడున్
ధారణిజాతతోఁ బలికి తమ్మునితోడఁ బ్రయాణమయ్యె సం
ధ్యా రమణీయవల్కల జటాభరణుండయి దీక్షితుంబలెన్. 145

చ. అలఘులు రాత్రు లేమునుల యాశ్రమపాళినొ నిద్రవోయి రే
వుల మునికాంతలం గలసిపోయిన భూతనుజాత యన్నద
మ్ముల విడివల్కలాలుదికి పాల్పుగఁ దెచ్చిన యెఱ్ఱవాఁగు నీ
ళ్ళుల నవి కావి యెక్కి పొదలున్ లలితారుణకాంతిమంతముల్. 146

శా. కానన్ మున్నుగ లక్ష్మణుండు చన వెన్కన్ దంపతుల్ పోవుచున్
వానస్పత్యము నైన కోనఁబడిపోవన్ సీత సంతుష్టిమై
నానావర్ణలతాంతముల్ చిదిమి వింతల్మాలలన్ చీరదా
రానంగ్రుచ్చి యలంకరించుచుఁ జనున్ రామున్ బ్రియ, రామయై. 147

గీ. మఱంది విను నేమిమాటలు మానుఁడంచు బ్రహ్మచర్యవ్రతంబు నీపాటిదంచు
హేలగా నైన విదలువు లెసక మెసఁగ వెనుక నడచెడుఁబతితోడఁ బృథ్విజాత.

సీ. స్వాగతి నెఱవు నచ్చరలు చేతులుచాఁచిన విధానఁ బ్రవహించు నదులు దాఁటి
కనుచూపుమేర దాటినను గమ్యప్రాప్తి యన సన్నపడు నట్టి యధ్వమేగు
చావర్ణసామరస్యము నైగనిగ్యమ్మ చింత్యమౌ పక్షులచిత్ర మరసి
కన్నులలోపలఁ గన్నులుంచుచు ధరాజాతఁ గాంచు హరిణీసంతతిఁగను

గీ. చేగియేగి గర్తస్థితుఁడీ విరాధుఁ డెల్లెదురు వచ్చెనన్నట్లు నెదురు గాగ
నడవి తంగేడుపూవుల నవఘళించు ఘనశిలోచ్చయ మొక్కండు గాంచినారు.

ఉ. మిన్ను ససూర్యచంద్రముగ మేదిని డిగ్గి చరింపవచ్చినన్
గన్నులు విచ్చి చూచుననఁ గానన మెల్ల వికాసిసూనసం
పన్నిధియైన జానకి సభాజన భాజన యౌచు స్వామితో
డన్నడచెన్ మఱంది నికటస్థలి మున్నుగ దారిదీయఁగన్. 150

ఉ. క్రుమ్మిన రేఁగుపండ్ల పెనుగుజ్జను నింగుదిమానె పోపిడం
గమ్మని తావి గుమ్ముమని ఘ్రాణము సోఁకిన నారచీరలున్
గొమ్మల నాఱవేయఁ గనుగోఁ దెరచాపలనెత్తినట్టు యం
దమ్మగు యానపాత్రము విధమ్మున నాశ్రమమొండు తోఁచినన్. 151

ఉ. భాసుర మీ ధరిత్రి నిరుపద్రవ మాశ్రమ మృద్ధి యుక్తివి
న్యాస మిదే సుతీక్ష్ణముని యాశ్రమ మౌనని చేరనేగి చూ

డ్గా సముదక్త పింగలజటాచ్ఛవినిర్గత కాంతిపుంజు ని
్ప్రాసకు నాసుతీక్ష్ణు సవిధంబును జేరి నమస్కరించుచున్. 152

చ. పరముఁడు గౌతముండు శరభంగుని పంపునవచ్చినాఁడ దా
శరథిని రాముఁడన్ సకల సంయమి సేవన బుద్ధి నెల్లెడన్
దిరిగెద నీవు నన్నునుమతింపవె ప్రాతరుదారప్రాగ్దిశా
సురుచిర వారివాహ రుచిసుందర భాస్కరమూర్తి! మస్కరీ! 153

వ. అనిన నమ్ముని యిట్లనియె. 154

గీ. పరమమిత్రమ్ము తా శరభంగమౌని నాకు, నడిగితిఁ బంపించినాఁడు నిన్ను
నౌర! ఋషికులయాత్రికుఁడౌట కాదు మేమువిన్నాము నీ ధర్మమృదుచరణము.

మ. ఇటకున్ వత్తురు చిత్రకూటమునులా యెల్లన్ సమాచారముల్
స్ఫుటముల్ మాకును, నీవువత్తువని యోసూర్యాన్వవాయోత్తమా!
అట రమ్మన్నను వేల్పుఱేడు చనలే, దస్మత్తపఃకృష్టి దు
ర్ఘటముల్ లోకములున్న వా యనుభవారంభార్ధ మే తెమ్మనెన్. 156

శా. ఏమో! యల్లతపశ్చిరానుభవమం దింతైనలేదిచ్ఛ నా
శ్రీమల్లోకము లీవు చేకొనవె దాక్షిణ్యైకవారాన్నిధీ!
యామాద్రిం దపమాచరించుటయె నాయాకోర్కి నీవంటి రా
జే మృగ్యం బది యీ వయస్సున నిరాకృన్మానిసంపత్తికా! 157

వ. అనిన శ్రీరామచంద్రుం డిట్లనియె. 158

ఉ. ఆ శరభంగులైన ఋటులాడిరి మీరును నట్లెయాడుటే
దాశరథిన్ భవచ్చరణ దర్శన సంగతు మీతపఃఫల
ప్రాశనదోషి చేయు నకృపామతి యేటికిఁ బట్టిచూచుటా!
మీ శిక్షమైన యీ కరుణ మేలగు నాకు సమస్త వీధుల్వన్. 159

మ. అనినన్ మౌనియు నిట్లుపల్కె నదికాదయ్యా! పరీక్షాపదం
బునకున్ దాఁటిన నీవ యిట్లనుట మా పుణ్యాత్తలోకంబు కై
కొన వాంఛించవు గాక మాతపము పైకొన్నట్టి యీకోర్కె వెం
టనపోనీ బలవంతపెట్టి యిది యంటంగట్టగా నౌనొకో. 160

మ. ఇచటన్ గ్రూరమృగంబులున్ దితిజులం చే భీతియున్ లేదు రో
ష్ఫచుఁ దోలంగను బ్రహ్మచార్లడవిదున్నల్ పందులున్ వచ్చి స
స్యచయం బల్పము పాడుసేసి చను నప్పా! యంతె యిజ్యామలి
మ్లుచముల్ వేఱుగ లేవు దోసములు నీ పుణ్యంబుచే రాఘవా. 161

చ. ఇట నిలుకట్టియుండుటకు నెంతయువీలగునేల నీవు ని
చ్చొట వసియించినన్ హుతము సుష్ఠుఫలప్రదమౌ నటన్న ము
న్నటి కటులే తలంచితి ననంతర మంతయు మారిపోయె ని
ప్పటికిని బోకతప్పదు కృపానిధి! నాకు ఋషీంద్రవాటికల్. 162

మ. సులభంబౌ పని స్వామి! సస్యచయసంక్షోదంబు కావించు దు
ష్టులనున్ బందులఁ జంపియే చనెద నీ పుణ్యాశ్రమాస్థానిఁగ
న్నులతోఁగాంచుటయయ్యెఁ బూర్వ సుకృతానుప్రాప్తయాత్రామహో
ఫల మీ యించుక చేసి పెట్టగలిమిన్ బైపెచ్చు ప్రాప్తించెదున్. 163

వ. అంత నయ్యాశ్రమవీధిఁ బ్రవర్తించిన సంధ్యావేళయందు. 164

క. తనుఁజూచుచుండు మని ప్రొద్దునమేఁతకు జన్న పులుగుతో నివె నీ గ్రు
డ్లని యప్పజెప్పె భుజగాంగన యొక్క తె యురుగుపొరుగు కైదో డెసఁగన్. 165

ఉ. ప్రాలిన ప్రొద్దులోఁ దిరిగివచ్చిన యెల్లదనాలపేరిమిన్
దేలిన సంజవేళ గుఱుతింపగ నాశ్రమవారిజేక్షణా
జ్వాలయితోరుబూక రససంగత దీపశిఖాభిరామముల్
క్రాలె మునీశ్వరాశ్రమసరస్సుల మోడ్పుల పుండరీకముల్. 166

మ. మునిలోకార్చితుఁడై తపోవనకళాపుణ్యుండు సంధ్యాహుతా
శన సమ్యక్చరణంబు చేసి రఘువంశస్వామి ధాత్రీసతీ
తనయాసంయుతుఁడై సుతీక్ష్ణమునిదత్త ప్రాంశుపర్ణాంగణం
బున సౌఖ్యంబగు నిద్రలోపల నిశంబుచ్చెన్ దమఃకర్కశన్. 167

గీ. సస్యములపైకి రా వెల్ల జంతువులును యట్టె యలవాటుపడినవే యరుగుదెంచుఁ
దిమిర సంచాలనముగ గుర్తించి చంపె లక్ష్మణుం డంధకారదీలక్ష్యశుద్ధి. 168

వ. మరునాడు స్వామిప్రయాణమై మునివద్ద సెలవుగై కొనఁబోయి. 169

ఉ. ఈ పదునాల్గు వత్సరము లీ భవదాశ్రమవీధి సౌఖ్య రే
ఖా పరమానుభూతిఁ గనుఁ గైవడి మున్నది నీదునాదర
శ్రీ ప్రభు! యింతశాంతి ప్రసరించదు నాయెద వేఱుచోట నో
దీప్రమహోనిధీ! యనుమతించిన నేనును బోయివచ్చెదన్. 170

ఆ. ఇన్ని యాశ్రమమ్ము లేగితి నెచ్చోట నిచటఁ బోలె సీత యిందయుంద
మనదు కాద యుందమన్నను గుదురదు భాసురాత్మకృతదయా!సుతీక్ష్ణ!

గీ. అనిన ముని పోయివత్తువా యనుచు నంత నేదొ పనిచూచుకొంచు సరేయటంచు
మరల నెప్పుడు వత్తువం చరయ జ్ఞప్తి నుందునా యంచుఁ దాత్సార మొనరఁజేయ.

వ. అంతలోఁ దమసస్యంబులు పాడుచేయునవి యేదుప్పి యేపంది గుర్తు తెలిసిన ఋషులు ఋషిబాలకు లరుదెంచి యిట్లనిరి. 173

క. సరి సర్వజంతు లుదరంభరణంబును జేసికోనువలయును మేమో
ధరణిం గ్రొచ్చిన సస్యప్రరూఢి చెడుచున్న వింతపాటుపడితిమే. 174

చ. వనులను వానియంత నవి పండి ధరిత్రిని రాలుగింజలం
దిని తమపొట్టపోసికొను దివ్యుల మౌనులఁ గూరుచున్న వా
రిని మఱి కూరుచున్నటుల మ్రింగెడు దైత్యులచేత నెంతపా
టును బడుచుందురో జనికటుత్వము వారికి నెట్టులున్నదో. 175

వ. తొందర పెట్టినట్లయిన యామాటలు విని. సుతీక్ష్ణుండిట్లనియె. 176

ఉ. అఱచిన ధర్మసంగ్రహణ మందున నోరఘురామ! భిన్నవ
ర్ణాచరణంబు భిన్నముగదయ్య! యొకే స్థలమందునుండి మే
మేచనినట్టి మార్గమున నేనియు మీరలు నిందులో వయ
స్సై చనుఁగొంతమట్టుకు భుజార్జితవృత్తియు గొంతమట్టుకున్. 177

శా. నీవుం గోడలు చిన్నయౌ వయసు తండ్రీ! కందమూలంబులే
యాహై దేశికభోజనం బెచటఁ గానీ! మార్గమందేగుచోఁ
బూవుల్ కాయలు చిత్రచిత్రమృగముల్ పుణ్యస్థలంబుల్ గిరుల్
శైవాలిన్యురువీచికాలులు దిదృక్షాపూర్తి కావించుచున్. 178

శా. సామాన్యంబుగ నేరికే నుపకృతిన్ సల్పన్ గడుంబుణ్యమౌ
సౌమిత్రీ! యది యన్నగారయినఁ బెల్చన్ వాఁడు ధర్మాఖిల
శ్రీమన్మోహన మూర్తియైన మఱి యాసేవాఫలంబెట్టిదో
రామున్ రామును గొల్చుచుం జనుమురా! రామానుజా! లక్ష్మణా!. 179

చ. మునినిఁ బ్రదక్షిణించి రఘుమూర్తియు జానకి లక్ష్మణుండు భ
క్తిని బ్రణమిల్లుచుం బయలుదేఱిన జానకి పర్ణశాలలోఁ
జని ధనువుల్ కరాసులు పృషత్కధులుంగొని తెచ్చి యిచ్చెఁ ద
మ్మునకును నన్న కయ్యెడనిఁ బోయిరి వార లుదారధీకులై. 180

గీ. నిజముపట్టించుకొనలేదు నిభృతమతిని సీత రాముఁడు ఋషులతోఁ జెప్పినట్టి
దద్ది యిపుడక్షరాల యాథార్థ్యమైన నామె రాముని వెనువెంట నరుగుచుండె.

ఉ పోవుచు రాముఁడీ మునులపోడుము లెల్లను జిత్రమయ్యెఁ ద
ద్భావము లింతమెత్తనగు పాటికి నేమి మనోజ్ఞ సృష్టియో
యావిధ మల్లగ్రామముల నెచ్చటఁ దోఁపదు వారలైన ధ
ర్మావృత చిత్తవృత్తులయి యక్కట నేరరు కేవలత్వమున్. 182

క. తమరాజుకొడుకు కాంతారము లేగునటన్న ప్రేమరాజిఁ వారు
త్తము లౌదు రిట్టియచ్చపు విమలపు సౌహార్దమచట వెలయదు చూడన్. 183

శా. క్షిప్రంబౌగతిఁ దండ్రిమాటపయి నిల్చెన్ నా నవిశ్వాస్య మ
య్యో ప్రత్యేకముగాఁగ నేనొకఁడనే యుర్విన్ బితం గొల్చు టౌ
నా? ప్రత్యక్షము సర్వజీవులను బిత్రాద్యర్చనం బీ మునుల్
దీప్రంబౌగతి నన్నుఁ జెప్పుట సమర్థింపన్ స్వసౌహార్దమున్. 184

చ. అనుకొనుచుండ జానకి హృదంతరమందు సుతీక్ష్ణుచోట రా
మునియిలుకట్టి నిల్చుటయుఁ బొల్చు నటన్నతలంపు దూరమై
చనఁ దుది స్వామియల్ల ఋషిసంచయమాడిన మాట చేయ నెం
చెన యని నిశ్చయంబయినఁ జేరికగాఁ బతితోడ నేగుచున్. 185

శా. అయామాటల నాడి తుట్టతుదకి ట్లారంభముం జేసె స్వా
మీ! యెల్లప్పుడు నీవు ధర్మపథమే మేకొందు వన్యాయ్యమౌ
నేయధ్వంబునఁ బోదు నీమనసు నీయాధర్మసంపత్తి నే
నేయేవేళల నాయదృష్టమని యూహింతున్ రఘూత్తంసకా! 186

చ. చనఁ బరదారసంగమ మసత్యముతోడిది దానఁ నొందు నీ
మనసున కెంత రాదొ రఘుమండన! నాలుక కంతరాద యొం
డనితరదృష్ట మీప్రకృతి యార్యజనావళి వానితోడిదై
కనఁజను నంచుఁ జెప్పెద రకారణవైరముకూడ నా ప్రభూ! 187

చ. మొదలిటిరెంట స్పర్శయును బుట్టదు నీయెద దాని నే నెఱుం
గుదు నదినాదు భాగ్యమనుకొంచును నుంటి నటంచుఁ జెప్పితిం
గద నినుఁగూర్చి నేనెదియుఁగా నొక చెప్పెదుదానఁగాను గా
ని దితిజపాళికై తుదిది నీకది యేటికిఁ జెప్పవే ప్రభూ! 188

చ. నికరముగాఁగఁ జూచినను నిన్నటిసాయమువేళ మీరు మీ
రొకటిగనుంటి రీ యుదయ మొప్పెను నిన్నును బంచెదర్లి కా
నకు మనభాగ్య మీవిధమునంజన నియ్యదిచాలనట్లు నె
త్తికిఁగొని తెచ్చుకోనయిన తీరున మున్నవి యీ విరోధముల్. 189

చ. అడిగినయత్త కావరములర్థము, నీకయినట్లు కాదు చౌ
ప్పడు ననుకొన్న మీయనినపద్ధతియే ధరణీమహేశ్వరుం
డడవికిఁ బొమ్మటన్న విలునమ్ములు తాలిచి పోయి క్రూరముల్
కడుకొని చేయుమంచనెనొ కార్యము లచ్చపుశాంతి నెంచెనో. 190

మ. అవుఁబో తండ్రి మనోర్థమిందెఱుఁగ రాదౌనాయె వ్యాఖ్యానల
బ్ధ విశేష ప్రతిపత్తి యన్న యెడ నా వ్యాఖ్యాన మీలేని పో



నివి శీర్షమ్మునకెత్తికో నవుట యౌనే యింతకున్ సాయుధు
డవు కాంతారము వచ్చుటైనయది దుష్టంబైన సంసర్గమై. 191

గీ. అట భరద్వాజులున్నార లత్రికలరు నీ సుతీక్ష్ణులుకల రతు నెచట్టైన
శమదమాధ్యయనాది భాస్వరతపంబు సలుపవగుఁ జతుర్దశసమల్ చాలినంత.

శా. లీలన్‌గానకు నచ్చమౌ మునుల పోర్కిన్ వచ్చినామేని దై
త్యాలిన్ మాకును జంపి పెట్టుమని యేరైనం బ్రసంగింతురా
క్రాలన్ గత్తులు విండ్లు నమ్ములు కనంగానైనవా రడ్గగా
నోలిన్ మీకును జేసిపెట్టు తలపై యొప్పంగ నిట్లయ్యెడిన్. 193

క. ఆయుధసంపర్క నిమిత్తాయత కుఫలాభిధాన మర్థము కలదొం
డేయెడ శుచియును ఋతువాక్కై యెసఁగెడు నొక తపస్వి యడవి వసింపన్.

మ. సిలుగై యెప్పటికప్డె సురజగచ్ఛ్రీలోభి యింద్రుండు కా
వలెనం చాముని యున్నచో విడిచిపోవన్ ఖడ్గమొక్కండు కా
నల రక్షించుచు న్యాసబుద్ధి ముని యంతన్ దాని నా పైని దుం
పలు ఛేదింపఁగఁ బైఁ మృగంబుల వధింపన్ బై నిఁకేమున్నదో. 195

క. తొలిశుచితయు ఋతవాక్యము తలఁగిచన నిషాదబుద్ధి దైవతలోకం
బులకుం జెడియె నటందురు సలలిత శమ దమ విధాన సంచరణజ్ఞుల్. 196

శా. ఈ నామాత్రపు టూహ నేరవనికానీ నేఁ బరిజ్ఞాత్రి నం
చైనంగాదు వచించెదం జనవుచే నాదైత్యసంతాన మే
మైన న్నీకపరాధమున్ సలిపెనా యౌఁగాని నిర్హేతుక
ప్రాణాపాయము వారికేటికి ఘటింపంజాతువో చెల్లరే. 197

క. పిత్రీయమైన రాజ్యము శత్రువశంబైన బాహుశౌర్యము కలిమిన్
ధాత్రి పెఱచోటు గెలుచు ధరిత్రీపాలనమతియుఁ జరింపదు దీనన్. 198

శా. చెందున్ చెందదు క్ష్మా చతుర్దశ సమల్ చెల్లంగ నన్నర్థపున్
సందిగ్ధత్వము లేదు కోసలములన్ స్వామిత్వమున్ భద్రమై
యొందెన్ దమ్ములలోన నొక్కనికి లే దుర్వ్యాశ యింకేన్ప్రహో
సందోహమ్ములచేఁ జలించి 'యిది యా జ్వావల్లి సంధించుటల్. 199

ఉ. క్రూరమృగంబులున్ దితిజకోటియుఁ గానన హింస్రజంతువుల్
క్రూరత సింహముల్ పులులు ఘోణులు గుంపులుకట్టి యుండవా
క్రూరమృగంబులందున నొకొండు వధించినఁ దక్కనన్నియున్
వారక కోపమూని పగపట్టి చరింపవు మూఁకలెత్తుచున్. 200

క. అటు మనుజులనఁ జరింతురు నిటు హింస్రమృగంబులట్టు లెసఁగుదురును దు
ర్ఘటు లా దితిజులు వార న్నిటను దలకునూనె త్రావనేయియు గాకన్. 201

క. ఆస్థమెయి వేలయేండ్లులు క్ష్మాస్థలి పాలింప ధర్మసంగ్రహణరసా
గ్రస్థాయి తపముచేయక ప్రస్థానము వైరకలుష భావమ్మునకా. 202

వ. అనిన శ్రీరామచంద్రుం డిట్లనియె. 203

చ. అగుదునొ కానొ యంచు భయమందఁగ నీవచియించుమాటలన్
దగనిదియేది? సర్వము యథార్థము సెప్పితి వంతెకాద యెం
చగ హితమింతకంటెను నెసంగద నాదగు మంచి నిన్ను మిం
చి గణనసేయగా నెవరు ! చేద్వ్యదుటిద్దఱకున్ సమంబుగా. 204

మ. ఒకయేరేన్ హితమున్ వచించుటకునై యూహించిరేయన్మ యూ
హకు నీకందినయట్టు లందవలదా యాయామనోభావముల్
సకియా! ధాత్రివహించు శక్తికిఁ దపస్సంయుక్తి మున్నున్న దా
నికి వైదేహలయింటఁ బుట్టవలెనే నిర్వ్యాజ రమ్యాకృతీ. 205

క. జనకుడు కాంతారమ్ములు చనుమనఁగా మొదలిక్షత్త్రిజాతిత వదలం
గను నెంచెనుట మేలే మునినై రక్కసుల కన్నముంబలె నగుదున్. 206

మ. క్రమ మొప్పంగను నాల్గుధర్మములలోఁ గైవ్రానగా క్షత్ర ధ
ర్మము కోదండము, వ్రాని యార్తజన సంరక్షావిధానంబు ధ
ర్మము వాగ్దానము తీర్చుటో పరమధర్మం, బీ త్రయీధర్మ ము
త్తమ మస్మత్ప్రియ మీ తపస్విజన మద్దా! యేమికానౌనాకో. 207

చ. కులపతి యాశ్రమాళిఁగనుగొ నపుడేగితి నీవు మౌనిప
త్నులు నిను గొంచుఁబోయిరి మనోహర మా మలుసంజ నీవు వా
ర లడవిలోని యా తెఱపి ప్రన్నని మిన్నున పొన్నువన్నెజా
బిలి పొడుపుంగనుం గనుచుఁ బెద్దయుఁ బ్రొద్దయి వచ్చి తాయెడన్. 208

క. శరభంగు బ్రహ్మలోక స్ఫురణంబును జూడవచ్చి మునులెల్లరునున్
దరిసెన మొసంగి నా కాదర మొప్పగఁ జెప్పికొంచుఁ దమబాధలొగిన్. 209

శా. ఓయీ! రాఘవవంశబాలకుఁడ! నీవో బుద్ధిమంతుండవీ
మా యాపత్తి యనన్యసాధ్యము, నిలింపద్రోహి సంతాన దం
ష్ట్రాయత్తంబగు మాదుజీవనము నీవై యాదుకోవేని, న
ల్పాయర్దాయము మేము మా తపము లేమన్నావు కోదండివై. 210

శా. వైనిన్ మీ సకలాస్త్రవైభవము విశ్వామిత్ర దత్తంబు, తా
నైనన్ గాధిజుఁ డన్న మాబుషియ, నీ కస్మద్వ్యథద్రోహిసం

తానంబూడ్చుట తప్పదన్న బలవంతంబైన నేమందు, వా
గ్దానంబిచ్చితి నట్లెచేతునని సత్యం బేమిచేయన్ వలెన్. 211

క. వలసిన నిను వదలెదనో వలసిన సౌమిత్రిఁగూడ వదలెదనో మై
థిలి! తనచేయుఁ బ్రతిజ్ఞా స్ఖలనము ప్రాణంబుతోడఁ గానీకుండన్. 212

గీ. రాఘవులు మౌనులను దపోరక్ష తత్ర కలితవాగ్దాన మిద్ది యుగాలుగాఁగ
యౌగపద్యసంగత సమాహారధర్మశుద్ధి నే నటవే పరిచ్యుతుఁడ నిచట. 213

వ. అంత జానకి పతిచేతిలోనిఖడ్గము తానుతీసికొని నడచుచుం బోఁగా. 214

క. మును లక్ష్మణుండు జానకి వెనుకను మరియామె వెనుక వీరుఁడు రాముం
డును గాఁగఁ బోవుచున్ రామునికను లామెకచభారముననే యుండెన్. 215

సీ. దీప్ర మోహన చంద్రకి ప్రభా ద్యోతిత వనసీమము మయూరవైభవంబుఁ
నబ్ధినీలానీల యామ్యదిశా లంబమానాంబుదాభోగ మధుర రేఖఁ
జందనాచల వనీ సంవాసి చమరీ మృగాలి వాలాంచల వ్యజనరేఖ
లలిత తమాల పల్లవ గుళుచ్ఛ కదంబ కల్పిత చ్ఛాయా ప్రకామ రేఖ

గీ. జరఠవర్షర్తు సమయ ఘాసచ్ఛవి ప్రతను నవోరభ్ర లోమ కంథాసుషమయుఁ
గాంచుచును దారినడువరాఘవకులుండు జనకసుత భర్తమున్నంటె చనుచునుండు.

వ. జలపిపాసార్దినియై జానకి యొకసరస్తీరంబున రేవుఁజేరి రాఘవులను బిలిచి
చూపింపఁగా. 217

సీ. సప్తస్వరంబుల స్థానముల్ మంద్రముల్ తీవ్రస్వరంబులు తెలుపు చోట్ల
నలి రేఁగి యొక ప్రమాణము గల్గు బుడగలు, నుద్ధతంబుగ లేచుచున్నయట్టి
బుడగలు, నల్పాల్పముగ లేచు బుడగలు గాఁగనై, గమకముల్ గ్రామ తాన
ములును యథాయోగ్యకలితవేగావేగ సంభూతములుగ, నచ్చరలుపాడి

గీ. నట్లువినిపించు నద్భుతమరయుచుండ, జలముత్రావంగ సీతసంశయపడంగ
నింతలోఁ గోకిలవుగాఁగ నెగసిపో చటంచుఁ దోనిర్చి యుల్లసమాడె స్వామి.

క. అటులని యిటులని బహుధా ఘటనంబుల నాడుకొన్న కారణమది వి
స్ఫుటపరచి ధర్మభృతుఁడను జటి వారికిఁ జెప్పెఁ గొలని సంగీతంబుల్. 219

గీ. అగ్నివృక్షమ్ము చివురాకు లార్చినట్లు వీతిహోత్ర జిహ్వాపరివేషచటుల
మైన యమరావతిం జూచి యమర వితతి మాందకర్ణి తపశ్ఛటామగ్నవీథి. 220

చ. ఇతఁడిది కోరు నంచెఱుఁగ నియ్యదియేమి యెద్దైన నిత్తురే
యితఁడిది కోరునం చెఱుఁగ నేమియు నేరక కోర్కిచే నసం

ధితమగుఁ దత్తపశ్చటల నెట్టుకొనంగ శరీరతాగుణం
బతికినచోట నమ్మునివి తపోగ్నికిఁ జల్లన తెచ్చిరూహతో. 221

సీ. కనులుపుట్టినచోటి కాను పొక్కతె విద్యుదేకసరఃపుండరీకలక్ష్మి
సామవిభక్తికా సంధిస్థలంబు తోఁబుట్టువొక్కతె వియన్మోహనాంగి
ఘ్రాణేంద్రియ సమస్త కల్పసువాసనా గంధి యొక్కతె ధరాకాంతజఘన
మలయాచల సమీర మధుర మర్యాదా సమాసన్నశిశిరదేహ యొక చాన
గీ. యిక్షురసపయోరాశి సమృద్ధిరూప యొకతె యైదుగు రచ్చర లకృతపూర్వ
పరపరీభోగలకుఁ బరవశుఁడు చూచి మౌళి మున్కలుగా నయ్యె మాండకర్ణి.

గీ. తనతపశ్శక్తిచే సరోధస్థలాన మేల్మిసౌధ మ్మొకందు నిర్మించి వారి
తోనఁ బంచాగ్నిమధ్య నిర్మగ్న తపసు చేయుచుండుసంగీత విశేషకముల. 223

మ. ప్రకటీభూతము మాండకర్ణిమహిమన్ బంచాప్సరస్తీర్థనా
మకమై యీకొలనొప్పెఁ గానన నిలింపస్త్రీ సమూహోగ్రశై
క్షకమై పేర్మి నమూహితప్రభవ సంస్థానాకులీభూత శ్రౌ
తి కదంబాశ్రితనైకభావ కలితోత్ప్రేక్షా సనాథంబుగన్. 224

వ. ఇట్టియద్భుతంబులు గంచువించుఁ జరించు సీతారామలక్ష్మణ చరణయోగ్యం
బైన యయ్యాశ్రమ మండలంబు. 225

శా. ఈఁగంజొచ్చిన యట్టినాళ్కల హూతాహూతుల్ సురాళుల్ జరీ
పాగల్ తాలిచి వచ్చినట్లు కనిపింపన్ వచ్చు లానీతసం
ధ్యాగృధ్నుచ్ఛవిఁ బొల్చి పాలుబుకు నూధస్సుల్ పయస్సేతువుల్
గా గోవ్రాతము లేలు సస్యపరిపాక శ్రీక కేదారముల్. 226

మ. వినిపించున్ నడిరాత్రివేళల ధనుర్విస్ఫారమౌర్వీమధు
స్వనముల్ టంగున మ్రోఁతసాగి యనిలప్రస్తారముంబొంది య
ల్లన నిద్రాంతరమందునన్ సగముమేల్కన్నట్టి చొక్కా రిరం
సను సర్వర్షికులంబునన్ సురవధూసంగీతక భ్రాంతిగాన్. 227

మ. అదియే చిత్రము, మున్నుమౌనులకు వేదాంతార్థచర్చాసమా
త్త దమాద్యచ్ఛతపఃక్రియాకలన, సీతారామలీలావిశే
ష దరాకూతసుధాప్రసంగములచే సంపన్నమై పొల్చె శాం
తిదమై నేడు, నివృత్తికంటెను బ్రవృత్తిన్ స్వాదుతాధిక్యమై. 228

సీ. వంటచేయుచునుండి వైదేహి పతిఁగాంచి యదియెదోయందియుండనుచునడిగెఁ
గోరగించిన కొండగోగుపూ జడలోనముడిచి యెట్లున్నదం చడిగె స్వామి

పతి నిద్రవోవుచోఁ బ్రభుచేతియుంగరం బూడ్చి తాఁదనవ్రేలి కుంచికొనియెఁ
తనశిరోమణి ప్రభూత్తము కొంగునందున్నఁ దెలియకుండఁగ నూడఁదీసికొనియెఁ
గీ. దనర సంసారజీవనాంతఃప్రపాతి తాల్పవిషయంబు లివి చూచి యబ్రమునను
సాధుశృంగారలీలా ప్రసన్నకథలు గాఁగఁ జెప్పికొందురు మునికాంతలెల్ల. 229

మ. తపులం గోర్కులు జీవితంబులును సీతారామ లీలావిశే
ష విభూతిస్మృతియుక్త యజ్ఞకృతిభాస్వ త్సర్వలిప్తుల్ మునుల్
నవలా లూరక యట్టిటుం దిరుగు చానందైకఖండాకృతుల్
సువిశాలాక్షులు మందహాస వదనుల్ శుద్ధాత్మ లేపారఁగన్. 230

వ. అయ్యాశ్రమమండలం బేదిక్కున కాదిక్కు వైకుంఠైకదేశంబై సత్యలోకఖండంబై
యొప్పగా సీతారామలక్ష్మణులు. 231

సీ. ఒకచోటనెలయుందు రొకచోట నెలకుఁబై చిలుకుందు రొకచోట నెలలు మూఁడు
నాల్గుందు రెచట జానకియాడుజోడైన ఋషికాంతలంగూడి యెలమిఁబొందు
నచ్చోటఁ బదినెలలైన నట్లేయుందు రుందు రింకొకచోట నురక నెచటి
కేనిఁబోవలెనంచు నెంచి తారెటనుండి యెట కేగి మూఁడగ్ను లేగినట్లు
గీ. లద్ది దశవర్ష సత్రయాగాకృతిగను జరిగె శ్రీరామచంద్రుని స్వాంతమందు
మును సుతీక్ష్ణుని తను విడిపోవలేని జాగుచేనైన మెత్తన సందడించి. 232

చ. మరల సుతీక్ష్ణుపల్లె కభిమానమె యీడ్చుకపోయెఁ బ్రాఁతచు
ట్టెఱికము వెల్లగిల్లిన కడంకఁ దదాశ్రమ సర్వవార్తలున్
గఱదలు గాఁగఁజెప్పికొనఁగా వినఁగా నడుగంగఁ జెప్పఁచోఁ
దఱుగని వింతగా వినువిధంబులుగాఁ జనె వారికూడికల్. 233

చ. అల పదియేండ్ల నాఁటి కథలన్నియుఁ జర్విత చర్వణంబులై
చిలుకును నీరసంపడవు చిత్తములం దెడమింతలేక మౌ
నులకును రామచంద్రునకు నూల్కొను బ్రేమబలంబుచేత వా
గ్విలసనముల్ హృదంతర నివిష్ట నవార్ద్రిత లేమి చెప్పనౌ. 234

శా. ఈరాముండు పురాజనుస్సులను మౌనీంద్రుండో యేమో సుహో
ప్రారబ్ధం బొకడేదియోకలిగి తా రాజన్యవంశంబునం
దారూఢిన్ జనియించె నన్న కలితోహం దానువైదేహి వి
స్ఫారాక్షుల్ జలజాతముగ్ధములుగా భర్తన్ విలోకించెడున్. 235
క. తనయింటికి నొక ముని లక్ష్మణుఁ గొనిచని హవ్యవాహ మండపమున మే
కునఁదగిలించిన పులితో ల్చనవుమెయి నొసంగె నీవు చంపిన దంచున్ 236

క. ఆఋషికథ యీ ఋషికథ యేఋషికథ చెప్పఁచున్న నేమి యగస్త్యో
దార చరిత్రస్పర్శ వినా రాదది రామునకు మనంబున నాడున్. 237

వ. అంత నొక్కనాఁడు శ్రీరామచంద్రుండు సుతీక్ష్ణునితో నిట్లనియె. 238

శా. స్వామీ! యా ప్రభువౌ నగస్త్యముని భాస్వల్లోక రక్షాకథా
గ్రామంబే వినిపించునెల్లెడ శ్రవః కల్హార మాలాభమై
నా మున్నేగిన యాశ్రమంబులకు నెన్నం జాలదవ్వంచు వా
రేమో చెప్పచువచ్చి రిచ్చటికినౌ నేదవ్వు చెప్పంగదే. 239

క. ఊహా సమార్ధ్రికు మాపై దేహికి నెఱుఁగుదురుకాదె ధీగతి మీరల్
సాహస కృత త్రిజగద్రక్షా హిండనక్ర ద్దిదృక్షఁ జనుట ప్రియంబౌ. 240

చ. కనులను మూసి యోగపరికల్పిత గాఢ సమాధి లగ్నులా
త్మను దనియింత్రు లోకపరితర్పణ సంగత వీరకర్ములౌ
మునులు కనుల్ చెవుల్ మనసు బుద్ధి యుచెల్లను సంతసింపఁజే
యనగుదు రింద్రియంబులకు నంటే చరించునుగాదె జీవులున్. 241

వ. అనిన సుతీక్ష్ణుం డిట్లనియె. 242

చ. ఎవని మనస్సుగాని మఱియేమని కష్టముపొందునో యటం
చు విమలదృష్టి చూచి మధుసూదన! యాడెద వింతచక్కగా
నెవఁడును నీకుఁగాని గదయుత్సుశిరోమణీ! యేది యేని జె
ప్పవలసివచ్చెనేనిఁ బరిపాటిగ యోజనచేసి చెప్పనౌ. 243

ఉ. నాలుకదాఁక వచ్చినది నాయన! మౌని నగస్త్యుఁజూడఁబో
వేలని యెన్నొసార్లు మరి యిప్పుడు నీవుగఁ దెచ్చినావు వ
న్యాలిని నీదునున్కి గడువయ్యె సగానికిఁ బైనదాఁటి ధీ
పాలన మౌని దర్శనశుభం బొనగూడఁగఁ జేసికోవలెన్. 244

క. ఈ మా యందఱు ఋషులను నీ మిముఁబోల్ తైర్థికులును నేతెంచిన య
ట్లే మముఁ జూడఁగవచ్చున యా మునిదర్శనము కాద యాగతి వత్సా! 245

ఆ. మున్ను భక్తితోడ నున్న శిష్యునిమున్న యభ్యనుజ్ఞకొఱకు నంపవలయు
నభ్యనుజ్ఞ నరిగి యాయన మనసున కనుగుణంబుగాఁగ నాడవలయు. 246

ఉ. సంతత మట్టులే సుమి నిజానకునాయన దక్షిణాపథం
బంతయు సర్వమౌని నిచయంబున కింత నివాసయోగ్యతా
వంతము చేసె నట్టితలవంచిన వింజము కొప్పమీఁదుగా
బంతముతోడఁ దా నడచివచ్చెను మేమును వచ్చినామయా. 247

చ. ఇచటికి నాల్గుయోజనము లేగిన దక్షిణమైన దిక్కుగా
నచట నగస్త్యసోదరుని యాశ్రమమున్నది పిప్పలీ తరు

ప్రచుర వనంబు లేఁచు మృదు వల్గు సమీరణ మంద శీత వీ
చి చయ కషాయగంధ పరిశీలితదేహ రుజమ్ములంతటన్. 248

గీ. అట నగస్త్యుని సోదరు నాశ్రమంబు పార్శ్వమున నేగ నామడ పైనిగలదు
కుంభసంభవు నాశ్రమకూట మధ్యసీమ యెవ్వరి నడిగినఁ జెప్పఁగలరు. 249

క. ఈ పూట కగ్నిపరిచర్యాప్రాశనలయ్యె మీకు నమ్ములువిండ్లన్
జోపి బుజమ్మునఁ బోదగు నీపాటున మంచిలగ్నమిది రఘురామా! 250

వ. కొంచెము వెనుకాడి శ్రీరామచంద్రునకు వినిపించకుండ జానకి సుతీక్ష్ణుతో
నిట్లనియె. 251

గీ. తండ్రి! యెందరు జెప్పిన దక్షిణంబు పయనము కొలంది రాక్షసబాధ యంద్రు
కుంభసంభవముని దైత్యకూటమునకుఁ గ్రోలరానట్టిదగుఁ గాలకూట మంద్రు.

క. అని తుదిమాటలు రాముని వినుకలిలో నంచు సీత వెడలెను గడకం
టను మందహాసరేఖాననుఁడై పతి సీతఁగంచు నడచెఁ గడంకన్. 253

సీ. పావతేని గళంబుపైఁ బాదమున నొక్క పడగపై ముక్కునఁ బొడుచునెమ్మిఁ
జూడుమంచును భూమిసుతకుఁ జూపించె రాముఁడు భావగంభీరముగ్ధమూర్తి
సీతయన్నది యెంత సేగివచ్చిననైనఁ బ్రతిఘటింపగలట్టి ప్రతిభ కలద
యని సేగియెందైనఁ గొనితెచ్చుకొందురా యైన లోకోపకారార్థమైన
గీ. సాహసము కుంభసంభవ సదృశులైన ప్రభువు లెట్లును మాన రాప్రభుల దివ్య
కరుణచేతనె కాదె లోకములు సేగి వాసి సుఖపడుచున్నవి పద్మనేత్ర! 254

గీ. మన సుతీక్ష్ణుల కులమున మావిగున్న మొన్న పూచినదే యట నున్న పర్ణ
శాల వృద్ధగార్గేయి దీక్షా కపర్ది నామె చెప్పెను చెప్పదునా యటన్న. 255

ఉ. చెప్పదునా యటన్న మఱి చెప్పెడు నద్ది యెదో యెఱుంగఁగా
నొప్పదటన్న స్వామి, సతి ఊ! యటులౌనె ప్రసంగసాధువై
యొప్పు నగస్త్యమౌని కథ యొక్కడటంచును నామెయెట్లుగాఁ
జెప్పెనొ యట్లె చెప్పెదను చిక్కని యాకథ యంచునాఁడగన్. 256

గీ. స్వామి యదియిప్డు నేవినఁజాలనన్న జానకి కథాభిమానకృష్టాత్మ యగుచు
మీరు వినకున్న వినును సౌమిత్రి యంచు కథ సమారంభముంజేసెఁ గాతరాక్షి.

ఉ. పూనికలేక యల్ల మఱుపూఁటకు నైనను గూడఁబెట్టుకో
రాని వ్రతస్థులౌ క్షితిసురప్రకరం బెవఁడోకుటుంబి య
న్నానకు రమ్మనంగఁ దినినన్ క్షుధతీఱుట గాఁగనై యర
ణ్యానిఁ జరించు సద్వ్రతి గణమ్మునఁ జూచిన దొంగతిండియై. 258

గీ. ముదురు తొండ యొకఁడు ముంగాళ్ళపై నిక్కి నిశ్చలంబుగాఁగ నిలిచియుండి
కాళ్ళనడుమనుండి కదలుచీమలబారు చెదరుచీమలను గ్రసించునట్లు. 259

సీ. వాతాపితమ్ముఁ డిల్వలుఁడన్న యిద్దఱుఁ గామరూపులు క్రూరకర్ములగుచు
నరమాంసపున్ రుచి మరగి నృమాంస నిత్యాహారమార్గమ్ము నరసి యొకఁడు
తమ్ముఁ డురభ్రమై తా వచ్చునతిథికిఁ గనుపింప వాకిటఁ గట్టియుండు
నన్న యెవ్వనినొ బ్రాహ్మణుని బిల్చుకవచ్చు 'మే' యను వాతాపిమేష కంఠ
గీ. కర్తనముచేసి వండి యాగంతుకునకు నారగింపించు వాతాపి! యరుగుదెమ్మ
టంచు నప్పుడుపిలుచుఁ దానరుగుదెంచుఁ బొట్టచీలిచి కామరూపుండు వాఁడు.

చ. తెరువులు కాచి తాదృశు వ్రతింగని స్వామి! భవాదృశుండు మా
యిరవున కేగుదెంచి యొక యిన్ని జలంబులు పుచ్చుకొనిచో
బరువయి నట్టి కుక్షికిని బాపపుఁదిండి భుజింపలేమ ని
ష్ఠురము గృహస్థధర్మము కడున్ మిముఁబోలినవారు లేనిచో. 261

చ. నలిఁ బ్రతినిత్యమున్ వ్రతము నాకిది గుండిగయందు మిక్కిలిం
బలిసిన గొఱ్ఱెపోతు రుచివంటకమున్ బొనరించి త్వాదృశుం
బిలిచెద మంచి భోజనము పెట్టెద మీకును మాకుఁ దృప్తి యా
వలను గృహస్థధర్మపరిపాలన మీకిది స్వర్గహేతువౌ. 262

క. వాఁకిట బలిసిన గొఱ్ఱియ మీకే కనిపించు నంచు మేదకుని ద్విజున్
గైకొని పోవు నెవండేన్ రాక యెదేఁజెప్ప, వాఁడు రాకాసి మఱిన్. 263

వ. నేను రమ్మనుటయు రాకపోవుటయులేదు. నా వ్రతభంగము నేను చేయను. నీవు రానిచో నిన్ను మూఁపునమోసికొని పోదు నన్నధూర్తత నెఱపఁగా. 264

మ. అనిదంపూర్వ నిమంత్రణోగ్రపదమై యానోట నానోటఁ బో
క్కిన యీ పుణ్యగృహస్థు సద్వ్రతముచె క్షిత్యాదితేయుల్ గృహ
స్థుని యాయింటికిఁ బోవువారె మఱి యచ్చోనుండి విచ్చేయువా
రని కన్పింపరె యోరఘూత్తముని భార్యారత్నమా! యెచ్చటన్. 265

మ. కలగుండయ్యె ఋషీంద్రవాటికలనంగా నాల్గుకాంతారసీ
మలు తోడెవ్వరులేక పోవరెచటన్ మౌనీంద్రు లాగేస్తు ద్రో
వల నెచ్చోటను గాచునోయను భయభ్రాంతిన్ సరే! జీవయా
త్రలు పోనీ వ్రతభంగమై చెడిన స్వర్గప్రాప్తి నూహించుచున్. 266

మ. ధృత నానావ్రత సంచయంబులు యదుద్దిష్టంబు లా యెల్ల దే
వతలున్ దూలిన ఖండశఃకృతమహత్త్వంబైన ఫాలస్థపా

ణితలుల్ పోయి హిరణ్యగర్భుని నరత్నిప్రాప్యమౌ నీఫలా
గతిస్వామీ! విగృహీతులైతిమని మ్రొక్కన్ దిక్కుదుంగంబులన్. 267

గీ. అల త్రిశూలసుదర్శనంబులు పినాక శార్ఙ్గములు లేని యానీరజాతభవుఁడు
స్వాభిమతకర్మ శాపాయుధాయుధుండు తన మహాయుధరాజంబు దరిసియనియె.

గీ. పరమమాహేశ్వరుండవు పరమవైష్ణవుండవు నగస్త్య! నీ కనుబొమలు రెండు
శార్ఙ్గము పినాకమును దపస్సంభృతాత్మ చటుల మామక శాసనశక్తి వీవు. 269

చ. బలి తలమీఁదఁ జిన్ని హరిపాదవు గుర్తులు వింధ్యపర్వతో
పల శిఖరాన నీదుముని పాదవుగుర్తులు రెండుమన్ జగ
త్త్రిశయ నివారకాభయ నిదాన నికేతన మోహనాంశులై
వెలిగెడు సాధు సౌరపదవీ నదవీయసమైన సత్కృపన్. 270

క. నిను మనసులోన నుంచుక నను నభ్యర్థించెదరు వినాకృత సౌఖ్యుల్
మునులును దేవతలును నిన్నును జూడఁగ వత్తు నేనునున్ ఋషితిలకా. 271

మ. అనగా నమ్మఱునాఁడు దారి జనుచో నాపీన బాహూరు కాం
చన కుంభచ్ఛవి రమ్యపింగళజటా సంభారు రుద్రాక్షహా
రునిఁ గుంభాభమహోదరోన్నతశరీరున్ క్షుత్త్రికోపాకృతిన్
గనినాఁడిల్వలుఁ డంచతేనినడకల్‌గా వచ్చుకుంభోద్భవున్. 272

క. ఈనకట్టుపుల్ల లేమునీంద్రునిఁ గన్నఁ బెట్టియేమిఫలము పిట్టతిండ్లు
ఘటశరీరు నిన్ను జటిధూర్జటీ! కొంచుఁబోనువలయుఁ దృప్తి పొందవలయు.

ఉ. భక్షిత సర్వమైన తరువాతను సైతము మాంసరూపమై
కుక్షిగతంబు కొమ్ములను గ్రుమ్మనొ నాఁజను గొఱ్ఱెపోతు మీ
భక్షణమౌత యేమి వ్రతపారణచేసెదు మౌనిరాజ! నా
యక్షియుగంబు తృప్తిగను నద్దిర! నీవయియారగించుచో. 274

ఉ. పేరిమిఁబిల్చి భోజనము పెట్టెద నన్నను బాఱిపోదు రే
లో! రుచిలేని బక్కద్విజు లూరక యాకడచన్న నాళ్ళ భీ
షూరుల భోజనప్రియులఁ జూచినఁ ద్వాదృశులం బ్రియంబు నా
కా రమణీయగేహ మది యద్దియె మాగృహమో వ్రతీశ్వరా! 275

వ. ఇవిదొడ్లు ఇవి పాడిబఱ్ఱెలు ఇవి పాడియావులు, మాకుందగినంత సస్య సంప
దయుఁ గలదు. మీదయవలనఁ గొంత నిలువయున్నది. ఇదే యురభ్రము.
దినదినము సరిగానిట్లే బలిసినదానినే యతిథి బ్రాహ్మణులకుఁ బెట్టుదునని. 276

గీ. తన యనుష్ఠానమైనంత మునికి నరఁటి యాకు వెన్నీనె తీసి కొసాకు పెద్ద
చెఱువునంతటియాకు వేసి జలమింత చఱచి వండినవాతాపి యెఱచిఁ బెట్టె.

క. ముని ముద్దముద్దకును త్రేఁచును జేతం గుక్షి రాచుచున్ జీర్ణ మ్మం
చను నమలి నమలి మ్రింగును కనుచుండిన యిల్వలునకుఁ గడువెఱఁగొదవన్.

వ. ఓయీవాతాపి! బ్రాహ్మణుకుక్షి వెల్వడిరమ్మన యిల్వలునకు మౌనియిట్లనియె.

గీ. ఎంత కామరూపు లేని వింధ్యాచల మంత పెరుఁగలేరురా! దురాత్మ!
కడు నగస్త్యదండి గర్భంబునన్ జీర్ణమైన తమ్ముఁడెట్టు లరుగుదెంచు. 280

ఉ. నా విని కుంభసంభవుని నామముచే హృది దిగ్గురంచు దుః
ఖావిలచేతుఁ డిల్వలుఁడు నాగ్రహవృత్తి నగస్త్యమౌనిపైఁ
బోవ ఘటోద్భవుండు కనుమూసి సమాధిని బొందినంత 'దే
వావలివైరి కీకసచయంబులతో మసిబొగ్గుగాఁగనై. 281

క. అట్లే మాడైన మునరి పోట్లా విల్వలునిది మునిపుంగవుఁ డసురం
జిట్లించి తద్ధన మొకటొకట్లు మునుల కిచ్చె జనకుగన్నకుమారీ! 282

వ. అని జానకి ఇది గార్గేయి చెప్పినకథ బాగుగాలేదాయన స్వామి నాకాబాగేమో తెలియదుగాని తెలిసినవి రెండుసంగతులు మొదటిది నీవు రాముని భార్యవని రెండవది జనకుగన్నకుమారి వనియన సీత కాదు కాదు రఘూత్తముని భార్యారత్నమ వనియనఁగా రాముడు సౌమిత్రితో నిట్లనియె. 283

శా. నాసాగోళము పిప్పలీవిరళ గంధస్వాదుమందానిలా
భ్యాసోపేతముగా శరీరము లఘుత్వావాప్తిగాఁబొల్చు ల
చ్చీ! సాయంతనవేళ యైనయది సుమ్మీ! చూడు మౌనీంద్రవా
టీ సంపన్నగృహోత్థ ధూమపరిపాటీరేఖ లేపారెడిన్. 284

చ. అడవితనంబు పోయి తరులన్నియుఁ బల్లియచెట్లు వోలెఁ గ
న్పడు, విరళావనీస్థలఘనంబుగ మార్గము కాలిగుర్తులే
ర్పడినది, యల్ల యాశ్రమ సరస్సున యొడ్డున వర్ణిలోక మొ
క్కఁడొకడుఁ సంధ్యవార్చెదరు కాంచుమనే మనమేగుదెంచుచో. 285

తడిగుడ్డలతోఁ దబిసుల పడఁతుకలు జలంబు గొంచుఁ బయనంబై క
న్పడిన మనవంకఁ గంచున్ జడతం గనినట్లు నిలిచి సాగరు కంటే. 286

చ. మొగదల చెర్వు, చెర్వుదరి మోదుగుచెట్టును, జెట్టుయొక్క తూ
ర్పుగ సికతాస్థలీ విరళ రూఢము దర్భలగుంపు, శ్రీసుతీ
క్ష్ణగదితమైన గుర్తులు కనంబడు, నిద్దె యగస్త్యసోదరుం
డుగ వసియించు పల్లియ, వినూతన మిచ్చటి సస్యరాజియున్. 287

వ. అంత వర్ణిలోక నీయమానులై యగస్త్యసోదరునింటికిఁ బోయి యాయనతో మేము రామలక్ష్మణుల మీమె వైదేహి యనుచుండఁగా నతడు. 288

క. శ్రీయుతు వింధ్యాచల శిక్షాయుతు దర్శనము చేయఁగా నేగెదరా
యాయన మీరెప్పుడు విచ్చేయుదు రని యెదురుచూచు శ్రీయుతులారా! 289

క. ఏపూఁట పడిన మీరలు నా పూఁటనె వత్తురంచు ననుకొనుచుంటిన్
మీ పయనపుబడలిక పో నోపిక స్నానములు చేయుఁడున్నవి జలముల్. 290

ఆ. నేను బ్రహ్మచారి నెట్టులా! తల్లివచ్చెడు నటంచు నేను సేగిపొందఁ
బొరుగు గాలవుఁడను మునిభార్య నాకంటె తొందరించి తాను తోడువచ్చె.

వ. అన్నియు సిద్ధముగా నున్నవని స్నానభోజనాదులు నెఱవుచుండ నగస్త్యసోదరుఁ
డరుదెంచి. 292

ఉ. ఆకఁడ బ్రాఁతవిద్దియల నారుణకేతుకరూపుఁడైన కూ
ర్మాకృతి యన్నిదిక్కులను స్వాంజలియందు సృజించె నంద్రు కా
నీ, కమనీయవార్షుక వినీలపయోదశరీర! అన్నగా
రే కద దక్షిణాశ సృజియించెఁ, బ్రజాపతిసృష్టి తొమ్మిదె. 293

ఉ. మంజుల తేజమౌ ఋషిసమాజము వచ్చిన దక్షిణాశకున్
వింజముచల్వ అయ్య! అరవిందదళేక్షణ! నిక్కమింతయున్
వింజముచల్వ యమ్మ! యరవిందదళేక్షణ! పర్వతంబు కు
చ్చుం జదలంటఁగా నెదురు చువ్వయునా శివమౌళి దూసినన్. 294

మ. ఋతమార్గంబట మేరువుందిరుగుఁబో యేనంతగాఁ గాకపో
యితినా! నేనన నేమియో తెలియుఁ గానిమ్మంచు వింజమ్ము ను
న్నతమై కాళ్ళులు దువ్వి కొమ్మద్రుచు దున్నంబోలె మార్తాండ దే
వతపైఁ బోటికి నిల్చె మిన్నవియఁగా బట్టెన్ విచిత్రంబునాన్. 295

మ. పరమానేహము లిప్తలిప్త సవరింపన్ ముందుచూపే నిరం
తర మాకాశపుఁ ద్రోవయేమయిన వెన్కంజాచికొంచేగు నా
హరి తానిన్నని చూచినన్ దెలియ వింధ్యంబూఁటికొంచున్ శిలా
ఖుర మొక్కమ్మడి నుబ్బినట్టుల దిశాసంక్రాంతిగా నేగుటల్. 296

గీ. కఋమని గీసినొనియొడికంబు చెడగ నిరుసు గుజ్జాలు పెడగాఁగ దిరిగి చనియె
నంత కుదిలింపు సూర్యున కల్లవీర భద్రుని చపేటమైనను బట్టలేదు. 297

గీ. పోలు వేడిచ్చె నిరుసున సీల చెదరె నడ్డకట్టూడ బీటిచ్చె నాకు ఉరలె
టంగుతెగి గుజ్జములు వికటంబులయ్యె నవనిఁ బిచ్చుకకుంటు కే లానుకొనియె.

వ. సపుష్పితవృక్షమై యడ్డమ్ము పొడుగెదిగిన వింజమ్ము గగనమ్మానుకొనియె. 299

ఉ. బంగరుకొండతోడ నొకపాటిగ సాటువవచ్చె నచ్చటన్
ముంగలనున్న వింధ్యగిరిమూర్తికి సూర్య హిరణ్మయోరు దీ

ప్తాంగ విచిత్రకాంతినివహమ్ముల క్రమ్మిక, స్వామిక్రుద్ధ నే
త్రాంగణమందు రాతిబురదై స్రవియింపమి యొక్కఁ దబ్రమై. 300

క. అప్పుడు బుజువైనది మా యప్పా యోజానికమ్మ! యసలవు కాలం
బెప్పుడు కదలదు కదలిక చొప్పడు సూర్యగతిచేతఁ జూవ్వే యనుచున్. 301

మ. రథసంఘట్టన జాత సంభ్రమ గిరిస్రంసత్ ప్రసూనావళీ
పృథులంబౌ నభిషేకభావ పరమప్రీతాత్ముఁడై లోకసా
రథి మన్నించుటయున్ దదంగజని ధారాసంగ గాంగేయ సే
వధియై పొల్చుటయున్ బసిండిగిరి గొప్పా! యంచు సాగింపఁగా. 302

గీ. అపుడు బ్రధ్నాంశుమాలికా వ్యాప్తి చెడిన నంధతమస లోకంబులయందు జీవుఁ
డిడియుచున్నట్టులుండిన హేమభూమిధరముకన్నుమిణుఁగుఱుఁబురుగునయుము.

మ. సరగన్ మున్ బవిధార తెక్కలువెగల్చన్ నాఁటికిన్ న్యాయమై
పరచెన్, నేడవియున్న వింధ్యగిరి యీబండార మెల్లన్ మహో
ద్ధుర మష్టాపదశైలమున్ నిముసమందుం దేల్చియుండున్ గరా
గరి యాతానౌ యదో కటా! యిపుడనంగాఁ బైడిముద్దై చనున్. 304

మ. అల మున్ వింటివికాదె యిల్వల కథాహంకార నిర్వాపణో
జ్జ్వలు నాతమ్మని, బ్రహ్మయున్ సుర లహో సంప్రార్థనావావదూ
కులు కుంభోద్భవ! మేరు నాశ్రితునిఁ గైకొమ్మన్నఁ గొమ్మన్నలా!
వెలుచన్ మింట లగించియున్న ధరణీభృత్స్వామి వీక్షించుచున్. 305

మధ్యాక్కఱ.

ఓయోయి! మింటిలోనఁ దల యూఁటిన యో భూమిభృత్త!
నా యాడుచున్న మాటలు వినంబడునా! తలయేమొ
యా యెక్కడో పెట్టినావు వస్మదీయాలాపసరణి
నీయశ్మసరణిఁ బై కెక్కి నీ చెవిన్ నిండించుగాక. 306

వ. అనిన పలుకుసవ్వడి త్రాఁచేగఁ బ్రాఁకినట్లై. 307

గీ. చని పరావహ మను మరుత్స్కంధవీథిఁ జొన్పిన శిరస్సుతో వంగి క్షోణిమీఁదఁ
జాపచట్టుగాఁబడి వమస్కార మాచరించె మనవాని కంతయద్రియును నిట్లె.

వ. అంతఁ బతికి శయ్యనమర్చు జానకీదేవి స్వామీ! యానవ్వాపి పైకథ చెప్పఁడన్న
నమ్మని యాయాస హాసాంతరిత వచస్కుఁడిట్లనియె. 309

క. అబ్బో! యగస్త్యుఁ డాతఁడు సెబ్బరమానిసి ధరిత్రి శిరసాన్చిన యా
గబ్బిగిరితోడ నిట్లనె నబ్బీ! మునిలోకభక్తుఁడై వర్ధిలుమీ. 310

వ. మాకు దక్షిణాదిఁ బనిపట్టినది. యజ్ఞాకృతియైన సౌపర్ణివలె రెండు కడళ్ళు మోసి పఱచుకొన్న నీవు మముఁబోనిచ్చి పోనిచ్చుటయే కాదు. మరలమేము వచ్చుట యచ్చట మాపనినిబట్టి. అప్పటికెంత పెరుఁగుదువో. పిలుపందునో, యందదో, మాతిరిగివచ్చువఱ కిట్లే యుండుదువు. మమ్మెఱుఁగు దెఱిఁగిన పనియని యిట్లుచెప్పుటయని. 311

గీ. పర్వతాగ్రమ్ములను హోన్నుపావకోళ్ళు గుర్తులవి మీరు దారిగాఁ గొండదాఁటి
వచ్చితిరికద కనియుండవచ్చు మీరు అదియె మిగిలినబంగార ముద్రివతికి. 312

వ. అని హఠాత్తుగా నమ్ముని వెడలిపోయిన శ్రీరామచంద్రుం డయ్యగస్త్య భ్రాత యందలి యాత్మమనోధర్మముల విస్పష్టవైవిధ్యంబున కచ్చెరు వడుచుండ. 313

సీ. విడిలు నచ్చరల గుప్పిళ్ళట్లు పొలిచిన నందివర్ధనిపూల యంద మురలి
రేకంచున మఱుంగు రేకంచు బిగువైన తెల్లగన్నేరుపూల మొల్లమెసఁగి
చిఱు హరిద్రావర్ణ పరివేషరమ్యమున్ తమ్మిపూదిమ్మల తనరు చూపి
పొలసులతోడి చేఁపలవోలె నెగిరెడు పైఁడిపిచ్చుకలట్లు పరిఢవిల్లి
గీ. యంత నుచ్చైశ్శ్రవము స్వారియనఁగవచ్చి మరలియిట్లె యెఱ్ఱావులమందతోలి
ప్రాగ్దిశోషస్సు సంధ్యగాఁ బరిణమించి బ్రాహ్మణార్ఘ్యంబువులు తరవారులయ్యె.

సీ. మారేడు చెట్టిది మౌళిపైఁ బుష్పిత కుందలతం దాల్చికొనియె శివుఁడు
మహతితో దేవర్షి మాదిరి వ్రేలు లతాళితోఁ జివురెత్తు రేలచెట్టు
ఇది వేరువనస భూవిదళనాత్త సువాసనా రమ్య మహదహంకారసరణి
మొకరి తేంట్లులపిండు మూఁగిన దిది మధూలకము బ్రహ్మణిహేలా మనోజ్ఞ
గీ. మిద్దిశ్లేష్మాతకము యజ్ఞమెల్లఁ దానెయన్నటుల యూపదీర్ఘ శాఖాళిఁబొలుచు
ననుచుఁ దత్తత్తరుస్వభావాభిభాషణముల శ్రీరామచంద్రుండు నడచుచుండె.

సీ. ఈ సామజమ్ము బృంహితము చేసెడు తీరు స్తోభలఁబచరించు సొంపుతీర్చె
నెఱుఁగవు మనుజుల నెప్పుడే నీ ప్లవంగాళి మనుష్యుల నభినయించు
ఈ లేళ్ళు చూడఁబో వివి మనుష్యుల మన కిట్లె నిచ్చెఱఁ గనులప్పగించు
నల పక్షులవి యేమొ యల్పాల్పదేహముల్ ముక్కువదింతలు మోయుటెట్లొ
గీ. లక్ష్మణా! దారితప్పినలాగు తోచు కాదు కాదోయి యల్లదే గొరచెట్టు
దీనికిని దక్షిణంబుగాఁ దిరిగి చనిన వచ్చునన్నట్టి పల్లపు వాగు నదియె.

సీ. కుందేళ్ళతో వియ్య మందెనో గోమాయువులు పెండ్లినడకలుపోవు చూడు
మెలివెట్టి త్రుంచిన తలగొగ్గి దర్భమోళ్ళులు చూడు పిడికిలి కొలఁది గావు
ఈ సాధువానరం బిది కృత్తశాఖాంచ లోపరి కృత కక్షయోగదండి
గోఘృతంబునను రేఁగుంబండ్ల గుంజును బొదిపి వేల్చిన తావి పొదలుఁగనుమ

గీ. పాలదుత్తలవోలె నింపారుపొదుగు లొలయ నీపుంతఁ బడిపోవుచుండె నాలు
వానివెంబడి బడిఁ జనవలయు మనము గోఖురక్షుణ్ణధూళి తళ్కొప్పమేన. 317

ఉ. ఈఋషి సాగరాళి క్షితిభృత్తతి మ్రింగెడునంత లోకర
క్షారమణీయభావ పరికల్పిత తీవ్రదయానిధాన మా
ధారము బ్రహ్మసృష్టి కరుదారఁగ నిన్నిదినాలకీ తప
శ్చారుని దర్శనంబగుట చొప్పడెఁ గాలముపండనౌఁగదా. 318

వ. అనిన జానకి యిట్లనియె. 319

క. మీరెపుడు చక్కఁగాఁగ విచారించి వచింతు రితరజనములు మీతో
మారాడఁ జెప్ప నంత విచారింపఁగవలయు జువ్వె చక్కఁగ ననుచున్. 320

గీ. అదియెదో దాఁచిమాటాడెనమ్ముని యిటమేలుగానాడె మఱి వింధ్యశైలదమనుఁ
డీ మహాముని మనకోస మెదురుచూచు ననుచు నీయన సోదరుం డదియుఁజూడ.

చ. అన రఘురామమూర్తి పరిహాసముచేయుచు నింతభక్తులై
చను మనమేగుదెంతుమని సంబర మేటికిఁ బొందరాదె యి
మ్మునిజన మంచు నిమ్ముని యమోఘ మహస్కుఁడు తాను నాధను
స్సునఁ దనకైన యల్పములు చూడడు లోకకృతుల్ రచించెడిన్. 322

శా. అయ్యో యిచ్చటఁ గుంభసంభవుఁడు తానై యిల్లుకట్టెన్ ఋషుల్
ధాయ్యాదీపితవహ్ని యాగ సముదాత్తప్రౌఢులై, రాశరుల్
వ్రయ్యన్ గోర్కులు దూరదూరము చనన్ బ్రత్యుత్క్రమప్రౌఢునీ
యయ్యుం గొల్తల చేయఁగాని చనుదేరాముఁక నక్తంచరుల్. 323

మ. సురలున్ సిద్ధులు సాధ్యులిచ్చటఁ దపస్సుల్ సేతు రాత్మీయభా
స్వరరేఖాపదవీ సుఖంబులు త్యజింపం దగ్గదిచోటు ని
ష్ఠురు లైనట్టి మృషాభిభాషులు శఠుల్ చూపట్ట రచ్చోట ని
ద్ధరణింజేయు తపస్సులుత్తమ మహస్థానంబులం దార్చెడిన్. 32

వ. అంత నయ్యూరిమొగదల యొకయమృతవాపిఁ బాదప్రక్షాళనము చేసి వార్చి యగస్త్యుని మహాగ్నిగృహంబులకు మున్న వర్షీయాంసుఁ బొదరువోని తెలికను బొమల్‌గలాని యజ్ఞోపవీతములు తాల్చువాని దరిసి లక్ష్మణుం డిట్లనియె.

ఉ. ఈయన ప్రొద్దువంగడము హీరము పంక్తిరథాత్మజుండు తా
నీ యటవుల్ చరించెడుఁ బితృప్రియ కార్యచణుండు వింజవున్
మాయుకసింహమైన మునిమండను పాద నమస్క్రియాసప
ర్యాయుతమైన యూహ వెనువైచనుదెంచెను బ్రాహ్మణోత్తమా! 326

గీ. అవసరంబైన దర్శన మాచరింతు మనిన వృద్ధుండు తలయెత్తి హస్తమడ్డ
మిడి సితాంభోద విద్యుత్ప్రమీల దృష్టి వఱపి రఘుమూర్తిపై లోనికరిగె లేచి.

సీ. ఆకాశముననుండి యవతరించిన నవాషాఢ నీలాంభోద సదృశమూర్తి
దశరథరాజుపుత్రకుఁడఁట, సంజకెంజాయ క్రమ్మిన సితజలదమూర్తి
యొక్కఁడు, నిలుచున్న యుర్విలోనుండి బంగరుబొమ్మ లేచినకరణి నొప్పు
నొక పసిచాన, మదుజ్జ్వలభ్రూదీప్తి వీచి, యవసరంబు వేచియుండి

గీ. రవినఁగుంభోద్భవుండు పేర్కొనరయేమి యాత్మనామంబులనిన వృద్ధావనిసురుఁ
డిపుడు వారినామంబుల నేను చెప్పితిని గదా యన నవ్వి రమ్మనియె మౌని.

వ. అంత నావృద్ధుఁడు వెలికివచ్చి యిట్లనె. 329

క. ఎవరయ్యా యిట రాముఁడు రవివంశ్యుం డఁట దశరథరాజు కొడుకఁటే
తవిలి కనన్ రమ్మనె మౌని వింధ్యకార్తస్వరాగ్ర విహితాంఘ్రి వెసన్. 330

వ. అంత నమ్మువ్వురు సర్వత్ర హరిణసంచారంబైన యయ్యగ్ని గృహంబు ప్రవేశించి నానాగ్నిస్థానంబుల బలులు సమర్పించు నగస్త్యకృతతూష్ణీంసంజ్ఞానుయాతులై ముని బ్రహ్మస్థానంబున బలివేయుచుండ నొక బాలహరిణంబు పూజాద్రవ్యంబులు తాఁక కుండ నొడ్డిగిలిపోవఁగా, నగ్ని విష్ణు మహేంద్ర వివస్వత్సోమ భగస్థానంబు లనుసరించి కౌబేరస్థానంబున ఋషివేల్చిన తరువాత నొకలేడి వచ్చి పరిత్యక్త దర్భాంకురంబులు కొఱుకఁగా, ధాతృ విధాతృవాయ్వనంత గాయత్రీ వసు వరుణ కార్తికేయ ధర్మస్థానంబులనుసరించి, యంతఁ గుంభభవుండింతసేపు తన్నుఁగన్నులతో జూచుచు నొకమూలఁ గదలక పరుండియున్న దుప్పికి, ఝంఝానిలంబునకు నేలవ్రాలి యటనుండి యాకాశంబునకుఁ గొమ్మలు వేయు వటవృక్షంబువలె నున్న దానికి గృసరంబు తిననిచ్చి, సుఖాసీనుండై శ్రీరామచంద్రునిఁ గాంచిన నమ్మువ్వురు ఋషికి సాష్టాంగదండప్రణామంబులు గావించిన నమ్మని యిట్లనియె. 331

గీ. అగ్ని వేల్చి యనంతరం బర్ఘ్యమిచ్చి యతిథిపూజ నొనర్పగా నగును రామ
కాదయేనియు దుస్సాక్షికరణేఁదపసి మూఢకరణుండయి శ్వమాసంభోక్త యగును.

చ. కృసరమొసంగినట్టి రురు వియ్యది వెంటని బాసి మిక్కిలిన్
వ్యసనమునంది నాదెసకు నైనది, దీనినిగూడ నగ్నితో
డ సరిగఁ జూచెదన్, మృదుకడారము వన్నె నెసంగుదాని దృ
క్ప్రసరము జాలిగొల్పు, ప్రియభార్య వియోగము పుక్కిలింతలై. 333

చ. పృథు పితృవాక్ప్రియాచరణ విశ్రుతధర్ముఁడ వీవునున్ మహా
రథుఁడవు మాననీయుఁడవు రాజవు సర్వధరిత్రికిన్ బ్రియా

తిథి వరుదెంచినా వనుమతింపుము మత్కృత మర్ఘ్యపాదముల్
పృథుల వనాంతవాసమున నెప్పుడు వచ్చెదవంచు జూచెదన్. 334

చ. అని ఫలమూలముల్ నవలతాంతము లంబు లొసంగి రామచం
ద్రునకు దినాంతసంధ్యయు మనోజ్ఞముకన్న మనోజ్ఞమయ్యె నే
డని యవి యారగించిన యనంతరమందున వారు ముప్వురున్
ముని నునుమెత్తవెన్నెలల మొత్తమువోలిన పిన్నవవ్వులన్. 335

చ. ఇటులనె గోసలావనిమహేశ్వర! దానవ సంప్రహార దు
ర్ఘటమగు మున్నొకప్పుడు సురప్రకరావనదీక్షఁ గేశవుం
డఁట నొకవిల్లునుం దఱుఁగనట్టివి యమ్ములు గల్గుగూండ్లునుం
జటులతరాసి యొక్కఁడును సంగత పింగలహేమకోశమున్. 336

చ. వరమతపోభిలబ్ధములఁ బట్టి సురారుల మూఁక గొట్టి ని
ర్భరమగు దైత్యలక్ష్మిని బరాజితముం బొనరించె, దద్దను
శ్శరకరవాలముల్ మఘవు సంగతపెట్టిన విందు మద్గృహాం
తరముననున్న, వీవు సముదారత వానిఁ బరిగ్రహింపుమీ. 337

శా. అచ్ఛేద్యంబు నదాహ్య మర్దనువు దీవ్యత్సంగరాంతఃఫణా
సచ్ఛాయావిషమంబు, కోటి శరధుల్ సప్తోగ్రపాథోనిధా
నచ్ఛద్మాకృతు, లమ్మహాసి యమదంష్ట్రాక్రూర, మీ నీదు బా
హోచ్ఛందఃవరిణామ వల్గన సమీకాశ్చర్యముల్ పొల్చెడున్. 338

క. నీకోస మట్టెపెట్టితి నైకొమ్మా! యంచుఁ బొదులు కార్ముక మసియున్
వే కొనిరమ్మన శిష్యులు వే కొనివచ్చిరి ధనుస్సు విశిఖము లసియున్. 339

గీ. అంతముచ్చటపడి ముని యవిధరింపుమనియెరాముని నవి రాముఁడునుధరించె
నా ధరించిన రాముని యక్షియుగము నంబుజాప్తోగ్ర బింబద్వయంబుఁబోలె.

ఉ. నూతనమైన ఖడ్గము ధనుశ్శరధుల్ ధరియించి రాఘవుం
డాతతభక్తి యమ్ముని పదాంబుజమందు నమస్కరించినం
బ్రీతమనస్కుఁడై మునియుఁ బెద్దవిచేసిన కన్నులన్ ధరి
త్రీ తనయామనోహర! తృతీయగజత్వరిపాలనాచణా! 341

శా. యౌష్మాకీన ధనుర్విముక్త శరజాలాభీల దుర్దర్శన
గ్రీష్మాదిత్య కృశానురశ్మినివహో క్రీడా దురంతాతపా
ర్చిష్మత్తన్ దితిజాతకంఠములు శుష్కించున్ సుదీవ్యద్ధను
ష్మష్మా! వేల్మికి నౌదు వేల్పులకు రక్షోజాతి మండించుచున్. 342

వ. అని యాశీర్వదించి యింత సముదాచార ప్రవర్తకుఁడవు పదివేలేండ్లు వర్ధిల్లు
మని. 343

చ. వెలయఁగఁ దండ్రిమాట యని వేనికిఁగావలె, భర్తయంచు నే
పొలఁతికి వెంటఁ గానఁబడిఁ బోవుట కావలె, మీరు లేక యా
లలితవిలాసవాంఛలు వెలందులు పాదరసంబుకన్నఁ జం
చలలు తలంపులన్ నిలుపఁజాలుదురే స్థితధర్మవీథులన్. 344

చ. తవిలి నృపాలకన్యకల దారియుఁ జిత్రము వారికేమి త
క్కువ, పదియూళ్ళులిత్తు రనుకొమ్ము పితల్, తనుయాత్రదాఁటి వె
క్కువయుగ లౌకికంబు సుఖకోటి భజింపను వచ్చు భర్తయన్
నవపవనబుద్ధి నిల్చిన సనాతనభావశిఖల్ జ్వలించుటల్. 345

క. నేనంతరాజు కూఁతుర గానకు నేనేగునంత గరుజేమి యనున్
దానది విద్యాధర్మ స్థానంబుల గర్వమెంత ధార్ష్ట్యముచేయున్. 346

ఉ. తోరముగా మనస్సువ కధోదిశ దేహము, నూర్ధ్వదిక్కునన్
దూరపుభూమి నాత్మయును, ద్రోవయు ధర్మసమూహ ·గమ్య, మా
తీఱనిదేహవాంఛలను ద్రిమ్మరి క్రిందికిలాగు, నీమన
స్స్ఫూరక నిత్యయత్నమున నూర్ధ్వపథంబున జేర్పఁగావలెన్. 347

చ. ఎలమి మనస్సుత్రిప్పి యెవఁడేనియు ధర్మపుఁ ద్రోవఁ బోవగాఁ
బలుకుదు రాతనిన్ జనులు వాఁడొక సజ్జనుఁడంచుఁ, ద్రిప్పకే
నిలుచును ధర్మవీధి నొకనిర్గతకల్మషు మానసంబు, లో
కులు మఱి వాని నేమియనుకొందురు దేవతలన్నఁ జాలదే. 348

చ. అనవరతంబు ధర్మమునయందు జలింపని మానసంబు క
ల్గినయది సీత, పోల్కి కదలించి యరుంధతిఁ దేజుప్రోవుఁ జె
ప్పనువలెఁ, గాన కీపగిది వచ్చుట గొప్పయెకాదు నిన్నుఁబొం
దిన జనకాత్మజా మనసు నీపతిభావ త్రికాలనిష్ఠమై. 349

గీ. లిప్త కాల భాగ లేశలేశంబున యందు నామె హృదయ మంటియుండు
ధర్మమార్గమందుఁ దప్పదొక్కింతయు నింతకంటెఁ జెప్పనేమివలయు. 350

వ. ఇట్లమ్ముని జానకీ ప్రశంసావదనుండయిన నాత్మస్తుతి విముఖయైన జానకి పృథు
లపశ్చాద్భాగ లీలాగమనల హరిణీ సమూహంబు గాంచుచుండ శ్రీరామచంద్రుఁడు
ప్రియావిరహి రురువుఁగాంచుచుండె నంత నమ్ముని మరల నిట్లనియె. 351

మ. ప్రమదారత్నము కానఁ దోడరిగినన్ భర్తృవ్రతాలోకమౌ
ళి మహారత్నము సీత యేమడిగినన్ లేదంచనన్ రాదు, ని
త్యముఁ గాంతార విహారఖిన్నమతి యేదైనన్ సరే కోరు, ను
త్తమురా లయ్యది తీర్చుటే మిగుల యుక్తంబౌను శ్రీరాఘవా! 352

శా. అన్యుల్ భార్య నగౌరవింత్రు, రఘురామా! దంపతిశ్రేణి య
న్యోన్యారాధనఁ జేసి యుత్తమ జగత్ప్రాప్తిన్ విడంబింత్రు, స
మ్మాన్యుల్ భార్యనుబట్టి వత్తురు నిలింపశ్రేణి క్రీడింప రా
జన్య శ్రేష్ఠ! భవద్గృహావళి, వషట్ స్వాహాప్రియాహూతులై. 353

గీ. రమణి రమణీత్వమునసె యారాధనీయ రమణి భార్యాత్వమునను నారాధనీయ
రమణి సీత పతివ్రతోత్తమ జగచ్ఛిరస్థమణి దాన మిగుల నారాధనీయ. 354

ఉ. నీరజనేత్ర ముగ్ధహరిణీప్రియ నీ సుకుమారి నిట్లు కాం
తారము తెచ్చినావు, విదితంబగు శైవధనుర్వికర్షణ
క్రూరభుజాభిరాముఁడవు, కోమలికోరిక దీర్ప నీకు నీ
శూరత చాలదో మరి యసుప్రియ జానకి ప్రేమచాలదో. 355

వ. రాత్రి సుఖంబుగాఁ బుచ్చుడని పంపించిన. 356

మ. తొలినాళ్ళన్ గొడుకున్ స్నుషన్ బ్రియమునం దోకొంచురాగా సుమం
త్రులఁ బంపించి స్వభర్మహర్మ్యముల నెంతో బ్రేమతో గొడ్కుకో
డలు క్రీడింపగఁ జేయుఁ బంక్తిరథుజాడన్ నేఁడగస్త్యాశ్రమ
స్థలి సీతారఘురామచంద్రులకుఁ దోచన్ జిత్రమైయెంచుచున్. 357

వ. **అంత నుషోవేళ సీత యిట్లనియె.** 358

గీ. నాకు నిజముగ నెపుడు స్వప్నములు రావు
రాత్రి యొక్కటే స్వప్నముల్ రామచంద్ర
కడుఁ బసిఁడి మేను పొడలు మాఘవతమణులు
కనులు పచ్చలు మిన్నేగఁగలుగు లేళ్ళు. 359

మ. అనినన్ శ్రీరఘుమూర్తి యిట్లనియెఁ గాంతా! నాకునట్లే యగ
స్త్యుని యా పెంపుడుదుప్పి వెంటివిరహస్యూతాక్షికోణాగ్ని యెం
దున నేనుందునొ యల్లఁ దా మగిడి యందున్ వచ్చి తోచున్ సుధా
నన! యేమున్నది భావలగ్నములు స్వప్నంబుల్ విడంబించెడున్. 360

వ. అంత వారితో నగస్త్యుం డిట్లనియె. 361

గీ. నా యనుఁగులార! యీ దక్షిణాపథమున శీతవేళాతపము పరిసేవ్యమ్మృదువు
సన్నప్రావారమును గప్పికొన్న జాలు నగ్నిహోత్ర స్థలంబు సుఖావహంబు. 362

ఉ. కాననవీథులం దిరుగఁగా నది యెప్పటికప్డె యగ్నిసం
ధానము క్రొత్త, హవ్యవహనస్థితి నగ్నులు సుష్ఠుపాల్చెనా!
యానతవైరి! మీకు గతయామిని సౌఖ్యముగాఁగ నున్నదా!
జానకి కీ యగస్త్యముని సద్మము క్రొత్తనిపించలేదుగా! 363

గీ. అనిన జానకి స్వామి మీ యాశ్రమంబు జనకుని గృహంబు దశరథుసద్మ మనిన
మునియనియె నీవువారియిండ్లనువదలితివట్లె నాయాశ్రమముకూడనాయటంచు.

వ. అనిన రాముడు. 365

శా. ఇచ్ఛో నిష్టములేక కాదు ప్రభు! మీ కిబ్బంది, పైనిన్ ధరా
భృచ్చంద్రోదితవాక్యపాలనము నే నే యూరనో యిల్లుగా
బుచ్చంగాలము చేసినట్లగునె నీ పుణ్యాశ్రమంబెట్టులో
యచ్ఛోఁ బంక్తిరథేశు గేహములు నట్లె యున్కి నింకేమనన్. 366

చ. దశరథరాజు నీదగు సుతత్వముచేతఁ దరించెనోయి యో
యి శమితకామ! ధర్మపథహిండన సూక్ష్మరహస్యవేది! ధీ
విశద సమస్త ధర్మపదవీ! యన నమ్ముని రాముఁడిట్లనెన్
దశరథరాజు నాదగుసుతత్వముచేతఁ దరింపనేటికిన్. 367

మ. తనకున్ బ్రాణములోనిప్రాణమగుఁ బుత్రస్పష్టయై పూర్వమి
చ్చినమాటన్ నువుగింజయంత బెసగన్ జేకోని చిత్తంబె చా
లును దానొచుఁ దరింప నానృపుని పల్కున్ నేను పాలించుచుం
డిన నాధర్మము నేనుచేయుట యగున్ నిర్వ్యాజప్రేమాకృతీ! 368

ఆ. అంత మౌని రాము నాననంబును జూచుచుండె నిశ్చలముగ నుల్లమందు
నిట్లుతోఁచె మునికి నింత యజ్ఞల్వ్యక్తి లేని యచ్చమనసులోని యూహ. 369

శా. "అవ్యాజంబుగ నాడు దేవతలతోనైనన్ సరే యిట్లె ధ
ర్మవ్యాఖానముపట్ల సుంతయెదకున్ రానీడు మోమాట మూ
ర్మివ్యాలోలముకాని యట్టి యెద సైరించున్; భరించున్ సమూ
హవ్యృష్టిన్ దతధర్మభావకలనా వ్యాపార పారీణతల్." 370

క. మునియూహ రామునకుఁ దెలియు, నతని తెలివి మునికిఁదెలియు, నవాగ్వ్యకృతిం
జనుతెలివి సర్వగ సనాతని వ్యోమస్థితయు స్వగత తానదియగుటన్. 371

వ. అంత శ్రీరామచంద్రుం డగస్త్యునితో నిట్లనియె. 372

శా. నీవా వీరకథా భగీరథ నృపానీతాంబుధారాప్రవా
హావిష్కారము వేయినోళ్ళ విని నీయందైన శ్రద్ధన్ నినున్
సేవింపం జనుదెంచినాము ప్రభు! నీచేఁగూడ నేదోజగ
త్సేవాపర్యవసాయి నీకథ వినన్ జేతంబు వాంఛించెదున్. 373

వ. మఱియు జానకీదేవి యట్లనియె. 374

గీ. స్వామి! మీరు చెప్ప జనములు వినుచుంట తపసుశక్తి కొంత తార్చుకొంట
మీదు మాటవెంట మీదౌ దపశ్శక్తి జాలువారి మాకు సంక్రమించు. 375

వ. ఈ దేశం బింత సర్వసస్యసంపద్భరితంబై యున్కి యాశ్చర్యమ్ము గొల్పుచు
న్నదని శ్రీరామచంద్రుం డనిన ముని యిట్లనియె. 376

శా. మున్నిక్ష్వాకుసుతుండు దండుఁడని యాభూపాలుఁ డాపుత్రునా
సన్నక్లిష్టమతిన్ దురూహ కలుష స్కన్నాత్ము దుష్కార్యసం
ఛన్నక్రీడుని దేశమున్ వెలలిచెన్ సద్భావ సంపాదనో
ద్యన్నవ్యాత్ముఁడువోలె భార్గవునిఁజెందన్ వాఁడుశిష్యాకృతిన్. 377

ఉ. చేతము నొవ్వఁజేసె మునిశేఖరునందునఁ జాలదవ్వు వాఁ
డాతని రాజ్యమీయడవి, యమ్ముని యందు సహస్రయోజనో
పేత ధరిత్రి మన్ను కురియించె దివానిశ లిద్ది మట్టిది
బ్బై తెగ గడ్డగట్టి గిరులై వెనువింజము తాఁ గిరీటమై. 378

క. గిరులెత్తు నంతకంటెన్ దరులెత్తుగ నడవి పెరిఁగె దైత్యసమూహం
బిరులొత్తుకొన్న మనసుల నిరువుగఁ జేసికొని యుండి రిచ్చట రామా! 379

వ. విధాతృని మాటయందలి పరువునిలబెట్టవలయుట నేనిందు వదలి పోరామి
నాకుఁ దెలియును. అందుచే నావెంట హిమవద్భూధరశృంగ కూటగృహస్థుల
మేఘకుటుంబములఁ దెచ్చితి. 380

ఉ. సాగరవారిపాన గుణసంగత సోదర భావ గౌరవ
శ్రీ గగురెత్తు మేనుల భరించిన సస్యసమృద్ధి మూర్తులై
యాగత పుష్కలాది జలదావళి నాయెదఁ బేర్మి నీ ధరి
త్రీగిరి కాననావళి భరించెను సస్యసమృద్ధి కల్గగా. 381

క. అదియేమోనయ్యా! వారిదమూర్తివి నీవుకూడఁ గృపమెయి నాయా
సదనమునకుఁ జనుదెంచితి పదవీస్థిత మత్పయోద బంధుత నెఱపన్. 382

వ. అంత శ్రీరామచంద్రుండు చిఱునవ్వున నమ్మునితో నిట్లనియె. 383

ఉ. గుమ్మలుకట్టి భూరుహనికుంజము లల్లనఁ జల్లనీడలన్
గ్రమ్మెడిచో నదీజలభరంబు ముదాకర శీకరావళుల్
చిమ్మెడిచోఁ బ్రసూనభర శీతలవాయు తరంగమాలికల్
పమ్మెడిచోట నీయడవి పట్టున నేనిలుగట్టు నెంచెదన్. 384

సీ. నిదుర మేల్కనువేళ నికటస్థలీసుధాగీతిసాధువు జలపాత మొకటి
స్నానంబునకుఁ బర్ణశాలాంగణస్థలీ స్రవణశీలము వారిఝుర మొకండు
క్రీడార్థ మాసక్తకిన్నరీ గాన ఘూర్ణన గుహాశ్రేణిక నగ మొకండు
మా మఱందికి విహారామంద సంతోషదాయి మంజులము కాంతార మొకఁడు
గీ. నున్కి కెత్తైన సమదేశ మొక్కచోటు చోటు నవపర్ణ చిక్కణ సుందరతరు
శాఖికా సమచ్ఛాయా ప్రశాంతభూమి మాకుఁగావలెఁ జెప్పవే! మౌనివర్య! 385

గీ. సుదతి జానకి చుఱచుఱ చూచెఁ బతిని మఱంది సౌమిత్రి మదిలో నమస్కరించె
వదినె గారికి, శ్రీరఘువల్లభుండు నవత తోఁపని ముఖలక్షణంబు నెఱపె. 386

వ. అనిన నమ్ముని నిమీలిత నేత్రుఁడై కించిద్ధ్యానలగ్నుఁడై యిట్లనియె. 387

శా. ఓయీ! శ్రీరఘురామ! యీయడవి నీయున్కిం బ్రమాణంబులో
భూయిష్ఠంబుగఁ జెల్లిపోయె మఱియే మూఁడేండ్లొ మీ కైక తా
నేయూహన్ నినుఁబంచెనో వనికి నీకే యూహ లోనుండెనో
యా యూహోఖిల సర్వసిద్ధియగుఁ జో టాలోచనం జేసితిన్. 388

శా. నీ సత్యవ్రతపాలనా నియమ పాండిత్యంబుచే రాఘవా!
యాసూర్యంబుగ మీకులంబు పరిపూతాకారముం దాల్చెనో
యీ! సత్యవ్రతబుద్ధి నీజనకుఁ డూహింపంగరానట్టి వా
చాసత్యత్వము రూపమేర్పడఁ గ్రియాసంధానముం చేయుటన్. 389

ఉ. తా వరయుగ్మమిచ్చుటయె ధారణినాథుని యిష్ట మట్లు కా
దో వరమీయ నేది యగునో యది యౌనని చెప్పియుండు, నీ
తో వనమేగుమంచు ననఁడో యది నీ సుగుణంబుచేత నీ
వే వెనఁజేయఁగావలయు నిద్దఱ ధర్మము లిట్టి సూక్ష్మముల్. 390

క. ఆతండ్రికి నాతండ్రియు నీతనయున కీవు నీవు నిద్దఱు ధర్మ
ద్యోతితమూర్తుల యోత ప్రోతముల క్రియోహ లేకరూపము రామా. 391

మ. తగనిచ్చోటనె యుండుఁడంచు బలవంతంబేను గావింప నీ
కగు పృథ్వీధి మదాశ్రమంబున నయోధ్యన్ భేదమే లేని య
ట్లుగ నద్దాన వనంబున న్నిలిచినట్లుంగాదు నా పైని స్వే
చ్ఛగ మీకుండదు నిత్యమద్గత మనీషా భక్తి శుశ్రూషలన్. 392

సీ. అడుగున గులకరాలై వారి సీలమండలలోతుగా జలజలస్రవించు
నొకచోట, నొకచోట నుజ్జ్వలాగాధవారి తరంగ భీకర శ్రీ వహించు
వైడూర్యకాంతి ప్రవాహ శోభారమ్య సికతాస్థలంబులు చెన్నుమిగులు
నొకచోట, నొకచోట నొగిఁ దెల్ల చమరిలేళ్ళుల తోఁకలట్టి తెల్లుపువు లొప్ప
గీ. నెచ్చటెచట మీయిష్టము వచ్చినన్ని గిరికిటట భూములును సదాభరితశోభ
లద్ది గోదావరీతీర మచటఁ బంచవటి యనంగను నొక్క శుభస్థలంబు. 393

మ. అది మీయున్కికిఁ జాలభద్రమగుచో టాచోటి నానా రమా
స్పద శోభావ్రజముం గనుంగొనుచు నీభావంబు నా రామచం
ద్ర! దయావార్ధి! యుగాలుగా నచట భద్రంబై రమించున్, భవ
త్పద సీతాపద చిహ్న మాయడవి తాల్చున్ మౌళి పద్మాకృతిన్. 394

చ. అనిల భరోద్వహత్పరిమళాంచిత నిత్యలతాంత, రెండుయో
జనముల దవ్వు పంచవటి సన్ననిరేఖగనౌ మధూకకా
ననమున యుత్తరంబు చనఁగా బెనుమఱ్ఱికి నాభిముఖ్యమై
తనరిన త్రోవ త్రోవ యది దాటిన నంతయు మెట్టదేశమే. 395

శా. ఆపై నెల్లను జిన్న పెద్ద గిరులయ్యా! రామ! కాంతారల
క్ష్మీపర్యంక మనోజ్ఞ ఘాసచయ నిశ్రేణిం జనన్ బాలసం
ధ్యా పాటచ్చర కాంతిమత్తల సమూహా ప్రౌఢశాఖోపరి
శ్రీపాథోనిధి తోఁచుఁ బంచవటి రాజీవాక్ష! మిన్నంటుచున్. 396

క. హరిణ మనోహర రేఖా పరవశు లిద్దఱును మీరు భార్యాభర్తల్
ధరణి యది, మృగతనుచ్ఛవి భరితాష్టాపద గిరి ప్రభా భాసురమౌ. 397

ఆ. ఏను దశరథావనీశుఁడ ననిపించు జనకభూమి నాథుఁడ ననిపించు
సీతఁజూచినంత పిరి యిట్లువచ్చిన సీతకోర్కి రిత్తసేయ కెపుడు. 398

శా. నీ దోరగ్రచలద్ధనుస్సు దనుజానీకంబు క్రమందించు శి
క్షాదర్వోజ్జ్వల మేమిచేయవు ధరాజాతా మనోలగ్న వాం
ఛా దీప్తోరుఫలాభిసంధికయి వాచామాత్రమౌ ప్రేమకా
నీ దివ్యద్భుజ! మాది, ధాత్రిసుతకై నీవేమి కావో శిశూ! 399

వ. ఆ రాత్రి రామచంద్రుం డగస్త్యముని సాక్షాత్పరమేశ్వరుఁ డన్నట్లు ప్రవర్తిం
చిన సీత యిట్లనియె. 400

గీ. ఎవ్వరును సమర్థింపని దిట్లుమౌని తా సమర్థించె దశరథ ధరణినేత
సత్యసంధత్వ మందుకీ సంతసంబు నాకుఁ దెలిసినదయ్య యోనాథనాథ! 401

ఆ. అన సుమిత్రబిడ్డ యమ్మ! తానక్షయ శరధులిచ్చె మౌని చాలుననినఁ
దోయజాక్షుఁడల్లఁ దూణీరముల నమ్ముతీసి మరల నమ్ము తెలిసి సాలయు.

వ. మఱునాఁడు వారు పంచవటీప్రయాణంబు సాగించుటయు. 403

ఖం డాం త ము

గీ. ప్రభు! వనీకాండమున దశవర్ష ఖండ మిద్ది శ్రీ చంద్రమౌళి ముఖ్యేశ్వరులకు
దశశత సహస్ర వర్ష సంధాయుకముగ నీకృపావృష్టిచేఁ గీర్తి నిలుచుఁగాక. 404

ఉ. లింగము రూపమూనిన శిలీభవదాకృతి వట్టిమాయ ని
ర్లింగముగా సమార్ద్రి విమలీకృత సంతత భావవాహినీ
సంగత చిత్తవృత్తి గిరిశా! యుపలక్షకమయ్యనీకు భ
స్మాంగ ముఖాభిధేయములు నట్టివె నన్ దయఁజూడవే శివా! 405

మాలిని

క్షయ నిచయ విహీనా! శాశ్వతత్వప్రమాణా!
అయ వివధ నిదానా! యాత్మనీనా! పురాణా!
నియతి విలసితాధ్యానీకృతాంతః ప్రవేశో
దయ వికసిత వేళా ప్రస్నువత్సంచరిష్ణూ! 406



# పంచవటీఖండము

క. శ్రీరజతాచల శేఖర హారి గుహావాసి లేలిహాన! శ్రితజనో
దార స్పృహాదుహానా! హారీకృతదివ్యలేలిహాన! ప్రధానా! 1

మహాక్క-అలు.

నాయనా! రఘుపతి! పూర్వకాలంబునన్ బ్రజాపతు లెంద రగుదురొక్కొ
యా యుదారచరిత్రంబు చెప్పెద నాలకింపుము జానకీరమణ!
మాయురే ప్రథముండు కర్దముఁ డగు మఱియు విక్రీతుఁడు శేషుఁడును
శ్రీయుతులు సంశ్రయుఁడు బహుపుత్రుఁడు శ్రీవీర్యవంతుఁడు స్థాణుఁడును. 2

అల మరీచ్యత్రిక్రతు మహాబల పులస్త్యాంగిరుల్ మఱియుఁ బ్రచేతసుఁడు
పులహ దక్ష వివస్వ దరిష్టనేములు మహాతేజుఁడౌ కశ్యపుడు
వెలయ నేకోనవింశసంఖ్యాకులు వీరియందఱిలోన దక్షునకుఁ
గలరు కూఁతు లర్వదిమంది గ్రహించెఁగశ్యపుఁ డెన్మిదిమంది సుతల. 3

విన్ము మా దశరథుబిడ్డ! తక్కిన వెలఁదులం గైకొనె నాంగిరుఁడు
సన్మహాదీప్తి కాశ్యపు డంగనాష్టకమును గన్గొని యిట్లనియె
మన్మనస్కలు కండోసి మీరలు మగువలట్లైనచో మాదృశులు
జన్మలం గాంచుదురు పుత్త్రికు లటన్నజోన లతన్మనస్కలుగ నైరి. 4

అదితి దితియును గాళిక ముప్వురే యైరయ్యు తన్మనస్కలుగ రామ!
అదితిగర్భమునందున దేవత లశ్వినుల్ వసువులు రుద్రులును
నదితులైరి; దైత్యులు దితికడుపున నుదయించి; రక్కాళిగర్భమునఁ
గదిసి నరకుఁడు కాళికుఁ డిర్వురు కలిగిరి సుతు లిందిరారమణ! 5

దనువునకును నశ్వగ్రీవుఁ డన్నట్టి తనయుండు కలిగె రాఘవకులేశ!
మనువునకు నాల్గువర్ణాల వారలు మనుజులు కలిగి రంభోజదృశ!
అనల యన్నట్టి యామెకుఁ బుణ్యఫలాభిమంజులవృక్షముల్ కలిగె
ననితర గ్రహణాభియోగ్య ధనుస్స్వహాయ! తేజో భర ధృత విహాయ! 6

వ. అంతఁ గ్రోధవశ యన్న యామెకు మృగముల తల్లియైన మృగియును, ఋక్ష
సృమర చమరముల జననియైన మృగమదయును హరివానరముల మాతయైన
హరియును భద్రమదయును జన్మించిరి. ఈ భద్రమద కిరావతి కలిగెను.
ఇరావతి గర్భం బైరావతము. మఱియుఁ గ్రోధవశకు మాతంగమాతయైన
మాతంగియు గోలాంగూలవ్యాఘ్రజనని యైన శార్దూలియు దిగ్గజగర్భయైన
శ్వేతయు సురభియు నుద్భవించిరి. ఈసురభికి రోహిణియు గంధర్వియు
దుహితలు. రోహిణి గోమ్మాత. గంధర్వి యశ్వమాత. నాగమాతయైన సుర
సయుఁబన్నగజననియగు కద్రువయు గ్రోధవశకు మరి యిద్దఱు కొమార్తెలు.

వీరు పదిమంది. మఱియు నష్టమభార్య తామ్ర కైదుగురుకూతుఁలు క్రౌంచి, భాసి, శ్యేని, ధృతరాష్ట్రి శుకి. క్రౌంచి యులూకమాత. భాసి భాసమాత. ధృతరాష్ట్రి కలహంసచక్రవాక జనని. శుకికి నతయను కూఁతురుదయించె. నత వినతామాత. వినత మా నాయనమ్మగారు. అరుణుఁడు మాతండ్రి. గరుడి మా పినతండ్రి. మాయమ్మ శ్యేని. సంపాతి మాయన్నగారు. నాపేరు జటాయువు. 7

చ. అల తొలినాళ్ళలందున సురాలయపుం బొలిమేర లెట్ల మూ
కలుగ దితి ప్రసూవితతి కట్టిన మొగ్గరముల్ పృషత్క స
మ్మిళిత మహోగ్నులన్ విద్రువ మీ జనకుండట నేనుమింట గో
ళ్లల ముకుఁగోలలన్ దితిజలోకము నెత్తుల మొత్తుచుండగన్. 8

క. భ్రమపొంది వారు గరుడాస్త్రమటంచు నమోవచస్కృతన్ ప్రమందెదరా
సమయంబు చెలిమి నాకును నమరేశ్వరసఖుఁడు దశరథావనిపతికిన్. 9

శా. ఈ కాంతార మనంత మాయలకుఁ బుట్టిండైన దుర్ధీకదై
త్యాకం బేపొద నెన్కఁబొంచినను వారై పొంతు రీగుల్మశా
ఖాకీర్ణంబయి దవ్వుకన్పడదు రక్షాదృష్టి మీరుందురే
యే కోనం బదియోజనంబుల వియత్తేఁ జూచుచుం గాచెదన్. 10

శా. ఆ మన్వంతర దివ్యజీవి ఖగరా జారీతి మాటాడుచో
భూమీజాత తదీయచంచు నయన భ్రూక్లప్త షక్షాంత గ్రీ
వా మందానత చాలనంబులను భావావిష్కృతింజూచు నే
దో మోహంపడి కోటి వత్సర పురాణోదార వాఙ్మాధురిన్. 11

ఉ. రాముఁడు ప్రాంజలించి ఖగరాజునకున్ మును తాత! నిన్ను వి
న్నాము సుమయ్య! చిన్నపుడు నాయనగారును మమ్ము నంకపున్
సీమను జేర్చి యేకథలొ చెప్పుచు నీకథలెన్నొ చెప్పెఁ గ
న్నాము సుమయ్య! నిన్నిపుడు నాయనగారు దివంగతుండుగాన్. 12

క. అస్మద్బాల్యకథా మృదు విస్మేరాకృతిని నిన్ను వీక్షించి ద్విష
ద్ఘస్మర! మాకష్టంబులపస్మారములై చెడంగఁ బ్రమదము గందున్. 13

మ. పితృకల్పుండవు నీకు నర్ఘ్యమిదిగో ప్రీతాత్ముఁడై కొమ్ము స
మ్మతి పాద్యంబిదిగో గ్రహింపు మనుచున్ మన్నించి రాముండు ప
క్షతి సచ్ఛాయముగా జటాయువు దివిన్ సాగన్ సమాహ్లాద స
న్నత సాకేత కుటుంబ మధ్య చరణానందంబు లందంబుగన్. 14

ఉ. దీప్తశిఖా సహస్రవటి దెప్పరమైనది కంటికిన్ బుర
స్పృష్ట విచిత్రధాత్రి రిపుసూదన! మేల్కనినట్లు తోఁచెడిన్

క్లప్తబహూర్వీజాతమును క్లప్తమహామృగరాజి, పక్షిలో
కాప్తము కాననం బిట మహర్షివచించిన జాడలన్నియున్. 15

గీ. మఱి విమర్శించి చూచిన మబ్బులైదు కానిపించెడుఁ బసిడిలేళ్ళయిన వెండి
కుందెలులునైన యీ కానకోన సొగసు మీ వదినె చూచు నభిలాషయే వచించు.

వ. అని శ్రీరామచంద్రుం డిట్లనియె. 17

మ. మనదేశంబు నదుల్ నిరంతరిత వార్మర్యాదముల్ చీర వి
ప్పని యట్లిచ్చటి యీనదీవితతి శుభ్రత్వంబు ప్రాఁజీరవి
ప్పను గ్రొంజీరధరించు నా జలము పోవున్ వచ్చు నీ వాఁగు వి
ప్పెను చీరన్న పతిం గువాళముగఁ గప్పెన్ సీత కన్నాజరన్. 18

మ. కలితాయామత దక్షిణాపథ మహాకాంతార మధ్యంబునన్
జెలువౌ వాఁగు లివెల్ల నేలపఱుపై చెన్నారి పొన్నారి వ
న్నెలుగా నట్టిటు దవ్వుగా నిసుకతిన్నెల్ గాఁగ నేపారు నీ
వల నీవాఁగిది యొడ్డుకోసెను నదీ వాస్సంగమంబై చనున్. 19

క. మరి యీ కలియుట గోదావరిగావలెఁ బోద మొద్దుపట్టి మహా సా
గరధర్మపత్ని యంభస్తరంగమజ్జనము పిన్నతల్లి వరంబౌ. 20

వ. అని పెద్ద పెద్ద యంగలతోఁ బోవుస్వామి ప్రావారాంచల కోణము తన చీర
చెఱఁగున ముడివేసిన సీతఁ గాంచి ప్రభువు నవ్వుచు నెమ్మదిగ నడచె. 21

సీ. నిర్భయంబుగ లేళ్ళు నీర్త్రావు చోటికిఁజని స్నానమాడి భాస్కరునివార్చి
ప్రాగ్దిశాగత సాగరస్వామి గౌరవ ప్రణయాధిసామ్రాజ్య పట్టమహిషి
గోదావరీదేవి కొఱకు నానావర్ణ లలిత లతాంతాంజలుల నొసంగి
యొక చెట్టు చుట్టు నల్లికొను వల్లీజాల మిలుకట్టినట్టిచోఁ దొలచి ముండ్లు
ఆ. శుభ్రపఱచి యొక్కచో నగ్నిహోత్రము చేసి వేఱ వంటచేసికొని భు
జించి సుంత విశ్రమించి శ్రీరాఘవుం డనుజుతోడ నిట్టు లనియెఁ బ్రీతి. 23

చ. ఇట నెటనేని చూచి యొక యిల్లుగ నుండవలెన్ సమస్తమౌ
నటవి విమర్శనానిపుణమైనది నీమతియున్ సమోన్నత
స్ఫుటము సమీపవారియు విశుద్ధ సమాగత వాయువీచి యి
చ్చట నొక చోట నీమనకు సద్మ మొకండుఁగ జేసికోవలెన్. 24

ఉ. కంటికి నీకు నీ వదినెగారికి నింపగుచోటు చూడు, మా
వెంటనె యిల్లుకట్టుదము పేర్మినటన్నను లక్ష్మణుండు నీ
వెంటను వచ్చినాఁడ నరవిందదళేక్షణ! యింపు నింపు కా
కుంటయు లేదు నాకుఁ గయికొందు సమాజ్ఞ నను్రగహింపవే! 25

మ. శతవర్షంబులు నీవుచేసిన సమ్రాజ్ఞాబద్ధుఁడై పోయెదన్
మతి సర్వంబు రమించు నీదెస, సమున్మత్త స్వతంత్రంబు ధీ
గతి నాయందున లేదటన్న, రఘుసంఘస్వామి బాహాసమా
నత శీర్షాగ్ర జటాభిరాముఁ గవుఁగింటం బట్టుచుం దమ్మునిన్. 26

చ. తనదయినట్టి స్వార్థరహితత్వము నేను పదేండ్లుగా నెఱిం
గినది గదయ్య నీదెస, నకించనతా రహితంబు నీ హృద
బ్జ నిబిడ ధర్మభావము శుభప్రవణం బని భూమిజాత వెం
టన చన నన్నదమ్ములు వనస్థలి దర్శన లాలసాత్ములై. 27

వ. చనియొకచో రామచంద్రుం డిట్లనియె. 28

సీ. ఎడమెడమ్ముగ నుండె నిచ్చోట వృక్షముల్ హింస్రజంతువుల తా విద్ది కాదు
పచ్చికబయలులై పఱపైన దిచ్చోటు హారిణ సంచార యోగ్యస్థలంబు
ఝరిణీ మహానదీ సంగమ నికట దేశంబిది వాఁగు గ్రీష్మము స్రవించు
గుట్టలకంటెఁ బెక్కువయైన దాగిరి సమహీరుహంబు సంచారయోగ్య
గీ. మిచటు పల్లమై వాగునీరెక్కరాని దల్లపంచవటీశాఖికాంతభూమి
మధురవాచాల పక్షిసంపన్మహీరుహంబు సద్మనిర్మాణయోగ్యంబు కాదె! 29

గీ. అన్న యిట్లనుచుండఁ దానరిగి యొక్క తరువునకు లక్ష్మణుండు ప్రదక్షిణించి
మూరెండైన సన్ననియొక్కపుల్ల విఱిచికొంచు రామోక్త ధారుణిఁ గొలువఁ జొచ్చె.

ఉ. లెక్కగఁ జిత్రకూటమున లేపిన చొక్కపుఁ బర్ణశాలకున్
మిక్కిలి లెస్సగాఁగ నుపమించినఁ దోఁచఁగ నన్నివీళ్ళులన్
జక్క నమర్చి వాస్తు గుణ సంగతి భద్రము నొంటియిల్లుగా
మిక్కిలియిండ్లు చుట్టికొని మేకొని వచ్చెడునట్లు చేయుచున్. 31

చ. అమరఁగఁ బర్వముల్ తెలియనట్టివి సాధు సహస్రవర్ష వృ
ద్ధములు వెదుళ్ళు పైడి జిగితావులు కప్పున వేసి వేణువ
ర్ణములగు జెట్టుపట్టలు గుణంబులు ముళ్లు బిగించి పైన దీ
ర్ఘములగు సన్న తెల్లులగు కళ్లులు వ్రేలని యాకు లొప్పగన్. 32

చ. బయటికిఁ బూరిపాక, మురిపంబుగ లోనికిఁబోయి చూడ వి
స్మయకరమైన సౌధసుకుమార మనోహర రమ్యభూమి, యా
లయములు వేఱు వేఱ పదిలంబుగ నగ్నికి స్వామి శ్రాంతి తీ
రి యునికికిన్ భుజిక్రియకు రెంటెపునేఁతగ స్వామి నిద్రకున్. 33

క. మలుదెస మూయని చావడి మలయాచల విలయ మందమందానిల సం
చలన పరిసేవనా విచికిల కాంతారాభిముఖ్య కృతిసాధువుగాన్. 34

క. లోనేలఁ బచ్చి తేనియ లూనఁగఁ బ్రవహింపఁ జేసెనో యన వన్నెన్
దానేమి యలికి తెచ్చెనొ యా నును పే దారిఁదెచ్చె నద్భుతమయ్యెన్. 35

గీ. పర్ణ శాలాంగణ ద్వార భాగమందు నిటునటు వితర్దికల రెంటి నేర్పఱించె
వామభాగవితర్దిక ప్రక్క వింటి కొప్పనానింప గోడలో గూడుచేసి. 36

వ. గోదావరీవారి సమిత్కుశ కుసుమాదులు తెచ్చి శాంతి పౌష్టిక కర్మలుచేసి సీతా
రాముల గృహప్రవేశంబు చేయించిన. 37

మ. ఇది జన్మాంతరమైన ప్రేమ యగుఁగానీ యొక్కగర్భంబునం
దుదయంబందుట మాత్ర యిట్టులగునొక్కో ప్రేమఁ గౌగింటఁ బ
ట్టుదుఁ గౌగింటనుబట్టి దీనికి ఫలాటోపంబు సంధించుటో
యదయం బావిధి నాకునేల వనవాసాయాసముం గూర్చెనో. 38

ఉ. తమ్ముని మెచ్చెదన్ బ్రభుపదమ్ముగ, లేని ప్రభుత్వమేమి యం
దమ్మగు నట్లు కాదని కృతజ్ఞత చెప్పెద, దానవేమి లా
భమ్మగు సేవకై యెసఁగు భావము సేవ కడిందియౌచుఁ జి
త్తమ్మును విద్యయున్ దెలివి తానవి యాతని సృష్టియౌటచే. 39

చ. ఇరువురి ఱొమ్ములత్తుకొన నిర్వురి చెక్కిళు లానుకోన్ హృదం
తర మధుభార మార్చికొనఁ దమ్ముని కౌఁగిట బూననెంతునా!
యొఱఁగి పదాల వ్రాలఁ జను నూఁపున వానిజటాలి ఱొమ్ముపై
విరియును నాసుఖంబునకు వీఁడొక దైవముగాఁగఁ బుట్టెనో. 40

వ. ఇట్లనుకొనుచున్న శ్రీరాము మేఘంబును సీత లోచనవర్షాసరస్సులం జూచిన,
నిద్దఱు సౌమిత్రిని బర్ణశాలాసౌందర్యమును బర్యాయంబుగఁ జూచుచుండిరి. 41

చ. మురువుగ శేషభోగి తలఁ బూంచిన ధారుణి బంతివోలికన్
దిరిగె సుదర్శనాయుధపుఁ దీవ్రతరాంచల సంచితచ్ఛవుల్
గురుసులు వారి దిగ్వలభికోణములందున లోకబాంధవ
స్ఫురితములయ్యె లక్ష్మణుని మోమున మాత్రము లజ్జతోఁచఁగన్. 42

మ. అలవాటైనది భూమిజాతకు సమాయాతాటవీ కుంద పు
ష్ప లసద్వాయు చలద్దిశాభిముఖ భాస్వత్పర్ణశాలా స్థలిన్
నిలుచున్ నిచ్చలు సంచర ద్ధరిణరా ణ్ణిర్వ్యాజ సౌందర్య ని
ర్మల రేఖాభిసమీక్షణోజ్జ్వల దృశామగ్నాభిరామాకృతిన్. 43

ఉ. పచ్చిక మేయు ఛొక్క చెవిపట్టి యెదేనియుఁ బుట్టు సవ్వడిన్
నిచ్చలువిన్కి, మేయుచు వనింజను మెత్తని మేనిచాలనం

బచ్చుగ మూసలోఁ బసిఁడి యాఱిన యట్లుగ నున్కి, శాంతమౌ
నచ్చపునున్కి, భూసుత దృగంచల చంచల మోహనాబ్జులై. 44

శా. సాయంప్రాతిక రామచంద్ర విలస త్సంస్తుత్య గోదావరీ
ప్రేయః పూర్ణ నిషేవణార్థ గమన శ్రీమంజులాకాశ వీ
థీ యుక్తాంశు విచిత్ర చంక్రమణ సాధిష్ఠంబుగా దండకం
బాయెన్ సాధు వికుంఠ పుణ్యనగరీ ప్లోద్రైక సంపూర్ణతన్. 45

చ. స్నానముచేసినట్టి వసనంబుల పిండినముద్దలన్ బుజం
బూనిన సీత వెంటఁజన, నొక్కొక కొండొకవెన్క లక్ష్మణుం
డానత చాపమూర్తి చన నాప్రభువుం దడి యంగవస్త్రమున్
దాను శిరస్సుచేర్చి చలితాధరుఁడై చనుఁ బర్ణశాలకున్. 46

ఉ. రాముఁడు లక్ష్మణుండు వనరాజిఁ జరించుచునుండ నప్పుడ
ప్డా మహనీయసుందర తరాద్భుత మూర్తుల దైత్యకామినుల్
ప్రేమనుగాంచి కామపరిపీడిత లాఁకలి చంపుకొందు రా
రాముని లక్ష్మణున్ జెనకరామి యెఱుంగని యట్టి బేలలై. 47

గీ. ఊరఁగుక్కలు మేయుచునున్నయట్టి మేఁకలంగొర్కితోఁజూచి మీఁదకుఱుకఁ
జాలనట్టులఁ బెదరు రక్షస్సులప్పు డపుడు వారిని గని తూల్తు రాశలెల్ల. 48

గీ. లక్ష్మణస్వామి పర్ణశాలా వితర్దికా నిషణ్ణుఁడై యొక్క నిశా నితాంత
నిత్యజాగ్రత్స్థితిన్ బొల్చు నిముసములునుబలిసి యాకాశమునఁదెల్లపటముక్రమ్మె.

చ. క్రమమున నాకసంబు కనరాదు వనాంతరసీమ దూరదూ
రములు కనంగరావు పయి భ్రాంత ధరిత్రియుఁ గానరాదు నే
త్రములను మాటికిన్ జలము క్రమ్మఁదొడంగె వణంకుపుట్టె దే
హమునఁ బ్రభుండు యోగనియతాత్మతఁ దాల్చెడు నంతలోపలన్. 50

ఉ. ఆ హిమపాత భీతి నియతాత్మత తాల్చిన యంతలోన లో
నూహ సుమిత్రబిడ్డ కెద నూర్మిళ తోఁచెను, తోఁచి యోగ వి
ద్యాప్రాతమూర్తులిద్దఱు దృగంచల మేళన మాచరించి గా
ఢాప్రాతదృష్టిఁ బొల్చు నిమిషాంతరమందున మంచుచీల్చుచున్. 51

క. అచ్చరయో రక్కసియో వచ్చినయెడ దక్కినంబొ స్వర్గంబో తా
నచ్చపలాయతలోచన పచ్చనిదో యంధకార ప్రభ చిమ్మెడిదో. 52

చ. మగువకు మున్నుగా నడచు మన్మథ కోకిల కీర శారికల్
మగువకు వెన్నుగా నడచు మంథర సంగరసైన్యయూథముల్
మగువయు లోకమోహన సుమస్ఫుటమూర్తి మరింతలో నప్ర
గ్విగళితదేహ యౌచుఁ గనిపించె నెదేఁ బగఁబూనినట్లుగా. 53

శా. ఆ సౌమిత్రి మనోజ్ఞమూపయి నయోధ్యా బాంధవ శ్రేణిపై
భాసించెన్ బెనుమంచు మంచుగనె పూర్వాశా సితాంశు చ్ఛటా
భ్యాసంబై యొకతెల్ల వెల్గు విరిసెన్ బ్రధ్నాంశుధారల్ హిమా
నీ సంపాతము చెన్కఁ గూయురవమో నాఁ బక్షులుం గూయగన్. 54

వ. అంత రాత్రియుదికిన మదుగుదోవతులు మడిగాఁ జుట్టిపెట్టిన కృష్ణ మృగచ
ర్మంబు సీత కక్షభాగంబున నిడికొని రాఁ గమండలుపాణి శ్రీరామచంద్రుండు
గౌతమీస్నానార్థంబు బయలుదేఱిన. 55

క. మును తెలిసినదగు దారియ కనుక చనుట కాని సుంత కనిపింపద యా
జనకజ పాపటలో రాముని జటపై మంచు ముత్తెములుగాఁ బోసెన్. 56

వ. తో నడచుచు లక్ష్మణుం డిట్లనియె. 57

గీ. సకలధాత్రీశునకు సితచ్ఛత్రమిద్ది నీకుఁబట్టినయట్లు పండినది హిమము
సకలజగదీశునకు సితచామరంబు నీకువీచెడునట్లు పూనినది హిమము. 58

సీ. క్షితిసామె మహేశ్వరవ్రతమూని భస్మాంగులిప్తాంగియైన పోలిక తనర్చి
ధారణియైన రథంబున కీశ్వరుండమరించు గవుసెన యన నెలర్చి
దిక్కామినీ తపోదీప్తాగ్నిధూమముల్ క్రమ్మిన వనునట్లుగా నమర్చి
కాఁగిన నేయి యౌ కాలంబు పూసకట్లుగఁ బేరుకొన్నయట్లుగఁ దలిర్చి
గీ. భరిత సర్వతేజోమహాభార నిత్యధృతి మహాకాశమిది చెమరించినట్లు
నాల్గుదిక్కులఁ గ్రమ్మికొన్నయది ధాత్రి నాత్తహేమంత వేళాదిరియైన హిమము.

గీ. రే హిమాసార వర్షణార్ద్రీకృతాపఘనము తద్భూమిరుహ శాఖికాశ్రితంబు
సామజం బొప్పుచున్న దచ్చముగ నూనెరాచిన పురాతనాశ్మవిగ్రహము వోలె.

ఉ. అ రవిమండలంబును హిమావృతి, రత్నముఁదెచ్చి కాకి బం
గారపుఁ బంజరాన నిడుకైవడి నున్నది, విష్ణునాభి పం
కేరుహ బాలపత్ర పరికీలితుఁడైన విధాతృసామ్య మిం
పారెడునట్టులున్నది ధరాధిప సత్యవచస్సమావృతా!

ఉ. ఏయెడ లేవొ కాననము లెన్నియొ పాపము నాకెవచ్చె నం
చీయటవీస్థలాధ్యసన మేచు వనేందిర, నీ నివాస రే
ఖాయతి నిందు బాష్పకలితాక్షిత తాల్చెననంగ, రే, నవ
శ్యాయ నితాంత పాత నిబిడాకుల పత్రలతాంతయై చనున్. 62

శా. అంభోధిప్రభుబిందువుల్ మొగిలుగానై మున్ను వర్షించె, శే
షాంభోబిందులు మేఘరూపముగఁ దా మాశక్తికిం జాలకా
రంభించెన్ హిమరూపపాతము, మహారాజొక్క డౌదాత్త్యపుం
గంభీరాత్మత పూన నల్పుఁడు వచఃక్షారాబ్ధియైనట్లుగా. 63




చ. అధికుఁడొ యల్పుడో విపదనంతదశా పరిపీడితాత్ములై
వ్యథ కనుచో సమానులనవచ్చు హిమావృతి పొందిసూర్యుడున్
విధుఁడు సమానులట్లు కనిపింత్రు, సుఖంబున హెచ్చుతగ్గులే
వ్యథపడు దుఃఖవేళ సకలావని సామ్యము సౌమ్యముంగనున్. 64

గీ. పసిఁడివన్నె పిసాళింపఁ బండినట్టి ముదురు నివ్వరికంకెల మోసులందు
సొంపుగాఁగూడియున్న మంచుపెరయొకటి యంచఱెక్కవిధంబున నవఘళించు.

చ. ఉపరి వియత్సమస్త కలితోగ్ర హిమావృతిచే గిరీంద్రశృం
గపుఁ బరిమాణ మింతయని కానమి యొక్కఁ డచింత్యమైన ము
త్తెపుఁబెనుఁద్రోవుగాఁ గనులఁదీర్చుట యొక్కఁడు ప్రాక్సముద్రతీ
రపు గిరిమాలయున్ హిమధరాధరశైఖరిఁ దోఁపఁజేసెడున్. 66

ఉ. కన్నుల నీరుక్రమ్మ హిమకాలమునన్ మునుకాలిడెక్కతో
గన్నులఁ గ్రమ్మ నీరుజడగాఁ బెడఁద్రోచెడు లేటికాన కా
క న్నిలుపోవమిన్ నెమిలి కన్ననఁ గన్నన నీరుక్రమ్మగా
నెన్నని త్రోయగా నెఱుఁగ కిట్లె మనోహరమూర్తి యేగెడున్. 67

వ. అని మఱియు నిట్టనియె. 68

ఉ. నీ వల సాగరాన్వయ వినిర్మల రత్నమ వంచు నెట్లొ గో
దావరిదేవికిం దెలిసెఁ దానినుఁ గాంచుచు మంచుమేల్మనుం
గోవరి గాఁగ వేసికొనియున్నది తమ్మికనుల్ నిమీలనం
బై వెలయున్ మఱందిఁ గనినంతన మెత్తని లజ్జ పెంపునన్. 69

చ. మురిపపుఁ బూసకట్టు జలముల్ పొరి నొడ్డున రేకగాగఁ, బూ
ర్వ్రిఱిచిన యంచు చీర మెయి వెట్టుట యొప్పఁగఁ దమ్మితమ్మికిన్
దిరిగెడు నీటికాకులను దీర్చినకాటుక రేక యొప్పఁగా
నరయ సరిత్తు మంచుపసుపాడి యలంకృతిసేసె నెంతయున్. 70

క. కరి నీరమానఁ దొండము విరిపి జలము తాఁకఁబోవు వేళకు బెదరై
బెరుకునఁ దాఁకీ తాఁకక విరవిరలార్చెడు గరాంతవివర త్వచమున్. 71

మ. జిలుగుం దామరపూవుఁజుట్టపుజిగుల్ చిక్కించుకొన్నన్ సుధా
కలలై పేర్చిన మంచుక్రమ్మిన తలల్ కన్పింప కీ చెట్టుబో
దలు కన్పించుచు వేయికంబముల ముక్తామండపం బన్నయ
ట్టులు కాంతారముతోఁచుఁ బూర్వరఘురాడ్డుష్ప్రాపతేజోసహా! 72

చ. రవికిరణంబు లీ హిమభర ప్రతనూజ్జ్వల బిందు సంతతిం
దవిలి మనోజ్ఞతాధికత దాల్చెడు నట్లు సమావరింప న

చ్చ వయసుచూఱయిచ్చి నదిచాలక యీాయువులోద్చుచుండె బిం
దువితతి, నిండుప్రేమగల తొయ్యలి యిచ్చిన నేమి యీాయదో. 73

గీ. ముట్టెపైనిల్చు మంచుఁదుంపురులు హరిణకన్య తుడిచికో బాలవృక్షంబుబోద
రాచి తద్గుల్మ భూతశిఖా చలద్ధిమాంబువుల జల్లుచే గగుర్పై తొలంగు. 74

ఉ. వేలుపుతేని కోర్కి నను వెచ్చనియూరుపు చెమ్మ పూసలై
తేలినప్రాగ్దిశా మదవతీ లలితార్ద్రకపోల వైఖరిన్
వ్రేలెడు మంచుతోన రవిబింబము తోఁచెడుఁ జిన్నిముత్తెముల్
జాలరులైన సన్న తెర చాటున నచ్చర చూచినట్లుగన్. 75

క. తలపేమొ నిర్మమత్వము పలుకు రసారామవీధి వలె నైన ఋషిం
బలె నాలాపముసేసెడుఁ జిలుక యిది యెడంద మంచుసేగిం బడుచున్. 76

క. కనుకని నాలుక తడియారినగతిఁ గనె వన రసాల వృక్షకిసలయం
బనలశిఖా పరరూపము వినమిత జలజాప్తకిరణ పీత హిమంబై. 77

శా. రాజద్దైమ నితాంత బిందు నవధారాశ్రీ, వధూ ఫాలము
క్తా జాలా కృతి పూనగా మధుపృషత్సంతాన మానందల
జ్జా జీవాతువు గాఁగఁ బ్రేమపరిరంజ త్కాముకాలాపవ
త్కూజ ద్భంభరకోటి పొల్చెడు వనీ కూశ్మాండపుష్పంబులన్. 78

వ. మఱి పర్ణశాలాభిముఖులైన నిట్లనియె. 79

ఉ. ఈసమయంబునన్ భరతుఁ డేగతినుండెనొ యింటియొద్దఁ బా
దూ సుమపూజనా హృదయ తోయజుఁ డీహిమపాతవేళఁ బ్రే
మాసమమూర్తి కేకయధరాధిపు కూఁతురు వానినైతమున్
నీసరిగాఁగఁ జూచునొ తృణీకృత ధారుణిరాజ్యసంపదా! 80

శా. నీవుం గైకయియున్ బరస్పరమనో నిర్వ్యాజ లగ్నోహు లా
దేవిన్ నీకడ దెప్పుమాట లనినన్ ధీ నోర్వలేవీవు మీ
భావస్థానము లేమెఱుంగము వనీవాసంపు దౌర్జన్యమై
యావేశంబును బొంది శాంతమగు మాహాల్ రావుమాకిచ్చుటన్. 81

ఉ. ఆ భరతుండు నీకు సమమై యెదయందునఁ గూరుచుండె నా
కీభరమెట్టులోపవలె నేన యెఱుంగ నిటన్ భవత్స్వవ
ర్యాభృతమైన యాత్మ భవదాపద చూచుచు నున్కిచే క్షమా
లాభముకల్గెఁ జూడమి బలంబయి యాతనివేగి భారమౌ. 82

శా. లేదున్నన్నిదినాలు రాజు పెదతల్లిం జూడలే దంతగా
నీదౌర్భాగ్య మొకందువచ్చినది నే నేమన్నచో నేమి త

ప్పో! దివ్యద్యుజ! పెద్దబిడ్డ యిదిగో భూపాలుఁడై సౌఖ్యము
ర్యాదల్ గాంచుటకైన యేవ్రతము చేయన్ లేద యొక్కింతయున్. 83

గీ. భక్తియో సేవయో ధర్మపథముచనుటొ యొకమహావేశమున్న జీవికి సుకరము
జీవితము భరతుఁడు నేను నీవుగాఁగ లేనిపెదతల్లి బ్రదుకు బర్వానునెట్లు. 84

ఉ. మానుషసృష్టిలోఁ గల యమాయికతా గుణమెల్ల రూపధే
యానకునొగ్గియున్నదనవొ పెదతల్లి ధరిత్రిలో సుఖం
బైనది దుఃఖమైనదియు నాయమఁబోలినవారిపాలు చే
కో నవియచ్చమైన బ్రదుకుల్ పెదతల్లి విచారమేమనన్. 85

వ. నావిని శ్రీరామచంద్రుండు. 86

చ. తెలియఁగ దుఃఖశీలునకు దేశము కాలము రెండు బంధుతా
స్థలమునఁ జొచ్చి యందు వ్యవధానముచేసి వ్యథన్ ఘటించు మ
త్తలపడఁ గాలమైన వ్యవధానము తండ్రికిఁ గల్గె దేశమై
కలిగెను దల్లికిన్ వగవగా నిదియేటికి నల్పమందునన్. 87

మ. అనినన్ జానకియున్ మఱంది గని యేలయ్యా! సుమిత్రాసుతా!
కనినన్ మాటకు మాట యుండదనియా కాదన్నగారేమి నే
ర్వనివారా యన, భూమిజాత దెసకై రాముం డపాంగప్రసా
రణముం జేసి ప్రశాంతహాస మధుధారామూర్తియై తమ్ముతో. 88

గీ. నను నిరాకరించి నాటిన దుఃఖంబు లేదు నీకిదొక్క లేబరంబు
నిప్పుడేమివచ్చె విన్నాళ్లు గడచిన దొక్క కొలఁది దినములోర్వలేవె. 89

వ. అను స్వామి సాధుప్రసన్నతామగతాయోధ్యా పూర్వసుఖకథా ప్రాసంగికులగు
చున్న వారికడ కొకనాఁడు. 90

సీ. విరిసి మన్మథరాజు బిట్టావులించిన యాకాశ మది రూపమందె ననఁగ
విరియమ్ముచాని విల్ ఫెళ్ళున విఱిగిన పెనురావమది మూర్తి తవరె ననఁగ
శివదృగగ్ని నిపీత నవమన్మథ శరీర శిఖ యిట్టియాకృతి చెందెననఁగ
మన్మథ దహన సంభవ రతిబాష్ప సంతాన మీదేహంబు పూనెననఁగ
గీ. నన్నియునుగూడియే యిట్టులాయెనొక్క యనఁగ లోచనసహజదర్శనసమగ్ర
శక్తి యుపసంహృతిచ్చిదా చటుల మగునొ నా నొకానొక కామిని, కానిపించె. 91

గీ. అన్నతో నుండి మాటాడుచున్న లక్ష్మణుండెచటనుండి వచ్చెఁ గనుంగొనందు
లోనికిం గానిపించెను లోలనేత్ర పర్ణశాలాకవాటసంబంధ మూర్తి. 92

చ. ఇది మునికాంతకాదు మునులెవ్వరి కాంతలు వింతవేసపుం
బదను తెలం గెఱుంగ రిది స్వర్గపురీ సరసీజనేత్ర కా

దు దివిషదంగనల్ సిరికిఁ దొడగు మండిగమందు నిల్వ రి
య్యదియు మనుష్యకాంత యగునట్టుల లేదు త్రపావిహీనతన్. 93

చ. అనియెడు స్ఫూర్తి యెవ్వరికి నైనను గల్గున యామె గాంచినం
తన యటు నిల్చియున్నసఖి తానును గుమ్మము రెండుకమ్ములన్
గొని రఘుమూర్తిఁ గన్నులను గ్రోలుచుఁ గ్రోల్చుచునున్న కంఠమం
దున మఱియాఁగు చాఁగుచు మృదుస్వర కల్పనచేయు యత్నమై. 94

ప్రియంవద

తొలకరిన్ మొయిలు తూఁగుచున్నదో యలసతన్ నెమలి యాడుచున్నదో
సొలయకన్ జివురు చూచుచున్నదో యలరువింటిదొర వౌదువా మునీ! 95

వసంత తిలక

నేరేటి పండ్లెఱుపు నీలిపగుళ్ళ రంగై యౌరౌర నీతనువునందము చిందిపోవున్
రారా మనోభవశరప్రమితాకృతీ ప్రావారాంతదేశమునఁ బట్టెదఁజిందకుండన్.

శా. ఏదీ రావణుఁ డన్న రాక్షసధరాభృత్స్వామి విన్నావటో
యా దైత్యేశ్వరు పట్ట పేన్గువలె నీయాకారమేపారు గా
దా దైత్యద్విపరాజు హొంజిలుగు హొదా వోలె నున్నాను నే
నీ దాంపత్యపు హొసు చూడఁగదవోయీ! మౌనిరాణ్మన్మథా. 97

శా. ద్రాఘిష్ఠాశని పాత భీకర మహోద్యద్ఘర్ఘరధ్వాన ఘో
ణీ ఘోరాపఘనాభమున్ మధురమై నీ మూర్తి మౌనీ దళ
న్మేఘశ్రీ నికురుంబ డంబరము బమ్మెన్రూప మీ కానన
శ్రీ ఘస్రంబులు వార్షుకంబులు రతిస్విన్నంబు లాశించెదన్. 98

వ. అని నాలుక కొఱికికొని. 99

మంజుభాషిణి.

నలి నూనెలేనితల నారచీరలున్ దెలియంగ నీయెడ నదేమియందమో
యెలగోలు మూఁక మును లెంతమంది లే రిలలోన వారలకు నీవు రాజవో. 100

క. జలజల నల్లవి తలతల వెలుఁగులు రాలెడిని నల్లవిసెపూచినదో
తెలిసెను నీపై చిక్కని జిలుఁగులు కనులంటఁబొడిచెఁ జిమ్మనక్రొవ్వై. 101

శా. భర్గ శ్రీగళకాంతిభావ పరిదీవ్య దైత్య రాజ్యేందిరా
దుర్గద్వార కవాట మోహనకళా దుర్వార మీవక్ష మా
నర్గళ్యం బుపగూహన క్రియకు సంధానించు నచ్చోట నం
తర్గాఢోజ్జ్వల వల్లభోదిత రసోద్య ద్బ్రహ్మకైవల్యమౌ. 102

శా. ఘోషాకంపిత కేసరోగ్రహరి సంక్షుభ్యద్వ్యాలగ్నేందిరా
దోషారోపణ శీల మీనడుము నీ దోర్దీర్ఘ దండంబు శ్రీ
వేషంబెల్ల వృధా వృధా రతికళావేశాంగజోన్మర్దన
భ్రేష వృష్టి రసాధిపత్య విచరద్విశ్వత్వమే లేనిచో: 103

వ. అని చిడిముడిపాటు పొంది. 104

చ. అలువపు దైత్యకామినులు నాడుచు ఁవాడుచు నుండ వింటి ను
త్పలదళ నీలమోహన శుభాంగుఁడు తామరసాయతాక్షుఁ డ
ల్లలమగవాఁడొకండు వనులం జరియింపఁగఁజూచినా మటం
చొలిచిన కోర్కెవండుతొనయో యన నుంటివ యబ్బురంబుగా. 106

ఉ. కండ్లకు మంచి దవ్వయినకాలము పోయెను నేను రెండుమూఁ
డేండ్లిటరాను మీది యసలెక్కడ? వచ్చితి వెన్నికాలువల్
గండ్లను దాఁటి? యేమి కడగండ్లివి? కాననమెల్లత్రోవలన్
ముండ్లను గంచెలున్ నడచిపోదువొ చెప్పులులేవె వాఁకిటన్. 106

చ. మును శివుకంటిమంటఁబడి బొగ్గయి పోయిన మన్మథుం డెఱుం
గని యతఁ డేమికాఁడిది జగంబునఁ జెప్పెడునంతలేదు కా
ని నిజము యందగాఁడయగు నీవిదియెక్కడ వానియబ్బ వం
దును నిను నక్షరాలఁ దులతూఁగడు నీ కొనగోటి కేనియున్. 107

ఉ. భూతముగూర్చి యద్ది యనుభూతము కాదని దుఃఖమేటికిన్
బ్రీతిగ వర్తమానము భవిష్యము చేతిని జాఱకుండగాఁ
జూతము, మూఁడులోకములఁ జొచ్చిన కాలువ యొడ్డునన్ సమా
నీత మహోగ్నిభూత ధమని ప్రకటాపఘనాభిలాషలన్. 108

శా. నే శ్వాసంబు గ్రహించినన్ వదలినన్ నిన్నేమఱన్ బ్రాణమై
శశ్వద్రక్షణ చేసికొంచుఁ జనెదన్ సాయుజ్యమన్నట్లుగన్
నీశ్వాసంబును నాదుశ్వాస మొకడై నిల్వన్ వలెన్ నిల్చినన్
విశ్వారాట్టును నిన్నుఁ జేసెదనయా విధ్వస్తమోహచ్ఛటా. 109

వ. అని విసువుకొనుచుండ శ్రీరామచంద్రుం డిట్లనియె. 110

క. గుణ మొక్కశబ్దగతమా గుణ మర్థగతంబుకూడఁ గోమలి! వాగ్ధో
రణి మాఱునంచు విసువున సణుగుకొనెద వేల యెందుసహజత కలదే. 111

ఉ. నీ శితశిల్ప దృష్టి రమణీయము మాది యయోధ్య రాముఁడన్
దాశరథిన్ వనాంతర పథమ్మరుదెంచితిఁ బిన్నతల్లి వాం
ఛా శతశో వినిర్వహణ సంగతి, సంగతివీడలేని యా
కాశసుమాభదేహ తనకంటెను మున్నుగవచ్చె నాకిటన్. 112

క. నీవభినయింపఁ జేవిడ నీ వెడలినవాఁడు తమ్ము డితఁడొక సేవా
భావావిష్టుఁడుఁ గాల్వలు నావలులేనివి తరించినా మీవఱకున్. 113

గీ. తల్లి కానకుఁబంపినఁ దమ్ముఁ డాతడొకఁడు కాలికిఁ జెప్పులెకుండఁ జేసె
మావు లింగుది మానియు మర్దనంబు సలుపు మైథిలి యామడమల పగుళ్ళు.

ఆ. శివుని విల్లు విఱువఁ జేడియ యీ యమ మెలఁత యయ్యె నాకు మిథిలయందు
మఱియు నగ్ని యంతమంది వైదేహులు నింతమంది సాక్ష్యమేమనందు. 115

క. తెఱవలకు మోహ మెక్కువ కఱదలు బోధించి లాభగతి లేదైనన్
దఱుసంటి మోహమున్నను మొఱటుగ భార్యల సమక్షమున వలతురఁటే!

వ. అనిన నక్కామిని యట్లనియె. 117

ఆ. ఎంతయల్పబలులో యంత యధికవివేకులు మనుష్యజాతి తెలియ మీరు
తెలివి యింత దేవతలకైన నుండదు రాక్షసులు సరే వరాస్త్ర మతులు. 118

శా. నన్నెట్లున్ మఱి గుర్తుపట్టితివి కానన్ దాఁచి లాభంబు లే
దెన్నన్ శూర్పణఖాభిధానను ధరాభృత్స్వామిదైత్యేశ్వరుం
డన్నానే పెదతల్లి పుత్త్రికుఁడు నా కాతండు తద్విక్రమ
చ్ఛన్నం బేదుజగంబు నేర్వినరు తచ్చౌర్యక్రియాశ్చర్యముల్ 119

వ. రావణ కుంభకర్ణ విభీషణులు వారుముగ్వురు. నాతమ్ములు ఖరదూషణులు.
నేనందఱకుఁ బెద్దదానను. ఒకర్తనయాఁడుపడుచను. 120

ఆ. ఆఁడుపడుచనవుట నధికమౌ ప్రేమంబు పెద్దదాన నగుటఁ బెరిమ హెచ్చు
నా సహోదరులును నాదు గీచిన గీటు దాఁట డొక్కరుఁడును ప్రేటుకాండ్రు.

క. ఆ రావణుండు స్వఃకాంతా రావణుఁ డతనికత్తి నానాదిక్కాం
తా రుచిర వలగ్నవునూగారు యమదిశాచకోర గరుదగ్రంబున్. 122

సీ. ఆదిశేషుఁడు ధాత్రి నవధరించినయట్టు లిరువదిచేతు లట్టిట్టు జరిపి
కూర్చున్న పెండిలికూఁతును దట్టతో మేనమామ గ్రహించు మేల్మిగాఁగఁ
గైలాసగిరి బిట్టు కదలించి పాదుతోఁ బెల్లగించెను రసోత్ఫుల్లమూర్తి
యమ్మవారు విభీతి నందినదని నంది కోపించెనని యూరకొనియెఁ గాని
గీ. రజతగిరి పార్శ్వగత శిలాప్రకరకషణ కిణము లతని బాహుదశయుగీ మహాసి
కంచుకన్యస్తచిహ్నముల్ గాఁగనమరు వాఁడొకఁడ పరాక్రమరమాభద్రమూర్తి.

గీ. పరమ వీరమహేశ్వరవ్రతుఁడతండు చంద్రమఃకళా కోటీర చరణపీఠి
నర్పణముచేసెఁ జంద్రహాసాసిహృత సకుండలకిరీట దశశిరఃకుసుమమాల.

మ. తనరన్ జందన భూరుహోపవన మధ్యాహ్నానిలాయాత వీ
చి నిబద్ధామృత సాధురావ భర యక్షీకిన్నరీశ్రేణి ప్రో

గిన వీణాస్వనముల్ తదుజ్జ్వల యశోగీతి ప్రబంధావళుల్
వినిపించున్ మలయాచలేశ్వరదరీ వీధీ ప్రదేశంబులన్. 125

చ. పది తలలైన రావణుఁడు బాహువు లిర్వదియైన రావణుం
డుదిత సరోజబాంధవ రథోల్బణవైఖరి దిక్కులందునన్
జెదరు శిఫామహావటము చెల్వునఁ గొల్వునుదీర్ప వేలుపుల్
మెదలరు కాననాంతర నమేరు ముఖాల్పతరు ప్రభావులై. 126

ఉ. ఆతని యింటి చావడులయందున గంధము దీయుచున్ బ్రసూ
నాతత మాలికావిరచనాత్మత నుండుచుఁ దత్పరాక్రమ
స్ఫీత యశోనుగీత వివశీకృతలొచును గొల్తురప్సరో
వ్రాతము స్వారమా చ్యవన వైభవసూచి విసీల నేత్రలై. 127

మ. అమరీ కైశిక పారిజాతముల నిద్రాసక్తిఁ గ్రీడించు ను
త్తమ శృంగార రసాధిదైవతము దైత్యస్వామి దిక్పాల ఫా
లములం బెట్టిన చంద్రహాసజని హేలా రక్తబిందూత్కరం
బమరున్ వైష్ణవ చిహ్నసంతతులుగా నాయస్తశైవంబులై. 128

ఉ. చిక్కులు పొంది లుంగలయి చేడ్పడు ప్రాఁజదువెల్ల నోపికన్
జిక్కులుతీసి లెక్కయిడి చేర్చిన పండితమౌళి స్వాదుతా
దిక్కులఁ బచ్చకప్పురపు దీవులు రాజతశృంగరమ్యముల్
చొక్కములన్ సృజించె దితిసూనుని శైవనుతిప్రబంధముల్. 129

గీ. బ్రహ్మతొడమీదఁ గూర్చుండి ప్రాఁజదువులు చదివినట్టిరు తమతపశ్చటుల శక్తి
బ్రహ్మలోక మార్జించినవారు నా సహోదరులు వారికంత మర్యాద కలదు. 130

క. ఈ పాండిత్యము శౌర్యము దీపించిన యట్టి సర్వ దితిసుతరాజ్య
వ్యాపాఠంబుల మీఁదను నీపెత్తనదారుతనము నెగడంజేతున్. 131

చ. ధృతరతివాంఛ స్త్రీపురుష దేహ నిబద్ధము దేహధారులన్
దితిజులకైన సృష్టిగడిదేఁటని మోహ నిమగ్నసృష్టి, యు
ద్ధతమగు కామతృప్తి యొకదారి తపశ్చరణానుకూల్య వ
ద్ధతికి, ననుగ్రహించి పరితర్పణచేయుము కామదేవతన్. 132

శా. బాహాబాహవి సంచరింతము దిశాపర్యంత మాకాశ వీ
థీహర్మ్యంబునఁ గాంతిగోళభయముల్ దీపాళి గాఁగన్ మరు
ద్వ్యూహంబుల్ ధృతచామరంబులుగ దివ్యున్ నవ్య నిన్ గాంచుచే
యూహాపెట్టెడు నెల్లయచ్చరల కీర్త్యాస్థానమై పొల్చెదన్. 133

క. కడచిన కడవని మనుగడ లడుగున గల భోగవస్తు లాఘ్రాణింతున్
విడివడని యూహ వింటున్ గడించెదను వాని నీకుఁగా భోగనిధీ. 134

వ. నన్ను స్వీకరింపు మనిన శ్రీరామచంద్రుం డిట్లనియె. 135

శా. మా ముత్తాతలనాఁటివాఁడట నిలింపద్వేషి మీతమ్ముఁడీ
వేమో యంతకు నెంతపెద్దవొకొ నీయీడేమి నేనేమి! నా
కేమో నల్వది నిండవిప్పటికిఁ గాకీకామమార్గానకున్
బ్రేమవ్యాహృతిచే నలౌకిక రసోత్కృష్ట్యంబు సంధింతువో. 136

మ. కొడుకుల్ కొమ్మలు లేరె? భర్తయునునీకున్ లేఁడె! వాఁడేమియ
య్యెడుఁ బైనన్ గొనితెచ్చికొన్నటుల నాకీ పెద్దశత్రుత్వ మీ
తడపై నన్పడిరాఁగ నట్టనడి కాంతారంబునం దీసతిన్
విడువన్ నాకును గాని పుట్టగతులున్నే! యుండనీ! పోవనీ. 137

ఆ. నీవు నన్ను వలచినావు నిన్నును నేను వలవవలదె! యట్లు వలచుటకును
ముగుద!నీదుసహజమూర్తి చూడకయుండ వలచుటెట్లు ప్రేమకలుగుటెట్లు?

వ. అని సీతవంకఁ జూచి యిదినాకుఁబ్రియురాలు నన్ను వలచివచ్చిన వనిత. నాకు బుద్ధి తెలియనప్పుడు నాతండ్రి నిన్ను నాకుఁగట్టెను. ఈమె యతిలోకసౌంద ర్యంబు నీవుచూతువుగాని యని దైత్యాంగనతో నిట్లనియె. 139

చ. ఎవరును గామరూపులు వహించెదు నిక్కముగాని రూపమె
క్కువయగునే నిజంబలముకొన్నది ప్రేమకుఁ దావలంబుకా
నువలయుఁ గాదునా, నిజమనోభవరూపము సర్వకామరూ
పవిలసనం బొకేయువతిపై వలపుం గలిగింపఁ జాలునే. 140

ఆ. ఒక రసాలవృక్ష మున్నది దానిపై మమత యేల! ఫలము మధురమంచు
నన్ని చెట్ల ఫలము లట్టిదే రుచియైన నీ రసాలవృక్షమేమి గొప్ప. 141

గీ. అంతఁ గామాంధకు వివేక మంతరింప నసలురూపంబు చాలనియట్లు తనకు
నచ్చిన వికృతాలంకరణంబు లొప్పఁ జటులరూపంబుతోడ సాక్షాత్కరించె. 142

వ. దుర్ముఖి, మహోదరి, విరూపాక్షి, తామ్రమూర్ధజ, విరూప, భైరవస్వర, దారుణ, వృద్ధ, యర్కప్రసూనకైశిక, రుండమాలాకాంచి, వసాకజ్జల, యయః కంకణ యయిన యామెం గాంచి జానకి భయవిహ్వల యయిన రామచంద్రుండు సీతపైఁ జెయివైచి దైత్యకాంతతో నిట్లనియె. 143

క. మరిచూచితివా! యింతటి సురూపమును మఱుగుపఱచి చూపున కేదో
విరిగినగతిఁ గనిపించి కికురింప నెంచితివి యెంతకుం జాలుదువే. 144

క. మరియందము కాదన నిదసురులకు నదియేది మీకు సుందరమో మా
నరులకుఁ గాదది మీకోగిర మే మేసుంతయు బెసగినఁ జాలుగదే. 145

ఆ. పిల్లి యెలుకమగనిఁ బెండ్లాడనేటికి పులియు దుప్పిరాజుఁ బొందనేల
అగ్నిశిఖయుదూది నభిగమింపఁగ నేల అయిన మగఁడు, కాదొ యప్పడంబు.

ఆ. ఈవు విప్రకాంత వేను క్షత్రియుఁడను ఈవు దైత్యకాంత వేమనుజుఁడ
నీవు చూడ గొప్పయింటి బిడ్డవు నేను నవునొ కాదొ యడవులందు దిరుగ.

వ. దీని కేమిలే పోనిమ్మనిన శూర్పణఖ వికావిక నగి. 148

ఉ. నామగఁడేమొ వచ్చి నినునాటఁగఁ బల్కునటంచు నెంచితో
ఆ మగఁ డెట్లునేననిన నట్టులవచ్చెడువాఁడు కాదయే
నీ మఱిమాటలోన వధియించెద వానిని నన్నెఱుంగఁడా
యీ మనసంగమంబు విధియేనియుఁ గాదన నడ్డదింతయున్. 149

శా. నాకా కోపమువచ్చుటా యదియు నిన్నా! ఓరెముంజేయుటా
యీ కాంతాళపు మాటలేమిటికి నాకీయూహయే వచ్చినన్
నాకంఠంబును నేనకోసికొనెదన్ నాప్రాణమిత్రంబు ని
న్నా! కాంక్షించెదఁ దిండికేమి మరి కన్నావూహా పారమ్యమున్. 150

క. మగవారికంటెఁ గామము మగువలకొకవందరెట్లు మనుజులకంటెం
దగునన్ని రెట్లు దితిజుల కగడుం జేయక సరేయటంచుఁ బలుకుమీ. 151

చ. అన రఘురామచంద్రు డిటులాడెను నీకును నంతకామముం
డిన మఱికామమంతనెగడెన్ మగవానికి వేనికాతనిన్
గనవలె మాదృశున్ వలచి కామము తీరక రిత్తవోవనే
లనె మగవారి కింతటియిలాతల మంతయు గొడ్డువోయెనే. 152

వ. 'కనుక మరియొండెడఁ జూచికొమ్ము' 'కాదు. నేనునీయంద బద్ధాను రాగను'
'నే నేకపత్నీ వ్రతస్థుఁడను' 'ఆ వ్రత మైహికసుఖదాయి కాదు దానియందుఁ
బారలౌకిక సుఖము చెప్పంబడినట్లు లేదు' 'నేను సుఖమే వాంఛింపను'
'అయినచో నీమెతో సంసార మేల చేయుచుంటివి' 'అదిధర్మమని' 'ధర్మము
చతుర్విధము, అందులోఁగామమెుకటి' 'మనకూటమి విలోమము, లేనిదానికిఁ
బేరుండదు.' ఇత్థంప్రచలితోక్తి ప్రత్యుక్తి కానంతరమున . 153

శా. నా యందమ్మును జూచికాదటవె కాంతా యిద్ది! సౌమిత్రి యి
ట్లే యుండెంగద యెబ్బవాడతఁడు సుంతేభేద మాతండు కాం
తా! యాయీ పదుమూఁడు వత్సరములైనన్ స్త్రీవియోగోగ్రబా
ధా యుక్తిం జనునే, వరింపుమతనిం దా నీకు పుణ్యంబగున్. 154

క. నామాటగాఁగఁ జెప్పుము సౌమిత్రియుఁ గాదు నాఁగఁ జాలఁడు వాఁడున్
నీ మోహచ్ఛేద విధా సామగ్రీ నిపుణ చిత్తసారసుఁడు సుమీ. 155

వ. అనిన నద్దానవి యాశ్రమ దూరదేశంబున నొక వృక్షచ్ఛాయ నిలుచుండి పర్ణ శాలవంకఁ జూచుచు ధనుస్సుపై నాని నిలిచియున్న సౌమిత్రియొద్దకుఁ జని యిట్లనియె. 156

క. అన్నకు రాజ్యము పోయిన దన్నన్ దనకెట్లువచ్చునాయని యూహిం
పన్నేర్చిన లోకంబున నెన్నన్ నీవంటివాఁ డహీనుఁడు సుమ్మీ. 157

శా. కన్నుం గన్నును గానిపించనిది చీఁకట్లైన మోహంబు నా
కన్నుల్ వెల్గులఁ జిమ్మె నీవగు తనూకాంతుల్ పిసాళించినన్
దన్నుం గాదని నిన్నుఁ బొందుమనియెన్ దానన్న నీవన్నమా
ట న్నిల్పంగల యోగ్యశీలుఁడవు వెంటన్ వచ్చితీ కానకున్. 158

చ. వలసిన నీకు దైత్యజన వల్లభరాజ్య మృగేంద్రపీఠిపై
నిలిపెద, నీవు కాదనిన నీవలె నిచ్చటఁ బర్ణశాలలో
వల నదియేదియేనియును భక్షణచేయుచు నిల్చిపోయెదన్,
దెలియని కోర్కిచీఁకటుల దీప్తభవత్తనుకాంతి నార్పుమీ. 159

వ. అనిన లక్ష్మణుండు. 160

చ. ఇది యొకగంత నామెడకునేటికిఁ గట్టికొనంగ నున్నదే
వదలి యయోధ్య నిర్మమత వచ్చితి నిచ్చట నున్నపూట లే
నిదియును బూఁట నీకుమఱి నెత్తికి నేలకు చేయలేను నే
నొదుగుచు గాలియున్ వెలుఁగు లోగిరమై మనుచుంటి నక్కటా. 161

క. నా యొక్కపొట్ట కోసమె యా యన్నపయిన్ వనాన నాధారపడం
గా యుక్తము కాదంచును జేయుదు నుపవాసముల నశేషదినంబుల్. 162

శా. నీడన్నిల్వఁగనైన లేద యిచటన్ నీపొట్ట కైవారమే
చూడన్ యోజనమంతయున్నయది రోజున్ రోజు నీ భోజనం
బేడన్ వట్టి కనీసమైన నగునే యేయేన్గా! మాతల్లి! నీ
తోడం గాననమందుఁ గాఁపురము నాతో నాకుఁగైవల్యమే. 163

మ. అనినన్ దానవి యిట్లుగాననియె నీకాభీతి లేదోయి నా
తినునాహారము నేనుగా వనివి సాధింపన్ సమర్థం జుమీ
నిను బాధింపను నెత్తికోసమయి నూవెంగాని యీ నేలకం
చును వస్త్రంబునుగాని కోరను దయంజూడంగదే భార్యగా. 164

గీ. బహుసహస్ర వర్షంబులు బ్రదికినాను సర్వకామోపభోగ భాస్వరతఁ గంటి
నకట! మీదివ్యదేహ విన్యాస శోభ మదికి వెఱ్ఱులెక్కించిన మరులుగొంటి. 165

ఉ. ఏపులినేని సామజమునేని పదామడమేరలోపలన్
రేపుల మాపులందుఁ బొనరించిన గర్జలు మెల్ల నాచెవిం
జోపి వినంగఁ జాలుదునుసూ! గిరినిర్ఝర వేగధారగా
నూపిరిపీల్చి లాగఁగల నోరెముకోసర మెట్టిజంతులన్. 166

ఉ. వెంపలిచెట్టుఁ బండ్లకయి వేఁడిన యట్టుల మిమ్ము నింతదై
న్యంపడి సుంతకామమునకై బతిమాలుచు వేఁడ మీయెదన్
నింప రహో కృపాగుణము నేను నిమేషముకూడ నింక సై
రింపఁగఁ జాల మీకిఁక భరింపక తప్పదు గట్టిచేసితిన్. 167

క. నేనేమొ వయసు మీఱిన దానను నందంబులేని దానను దనుజన్
నేనే యచ్చరనైనను మానుగ మీయంత మీరు మరులుకొనరటే. 168

గీ. లింగసంబంధికామమ్ము లేదు దితిజ మనుజయన్న భేదమ్ము యౌవనము వార్ధ
కంబన దశాప్రభేదముల్ కామ సహిత భావమే దివ్య మప్రతిబంధకంబు. 169

క. ననుమీరు స్వీకరింపరు తినను నిదురపోవ నిచట దిగవిడుతును నా
తనువు సహస్రాబ్దంబులు గను మీగుండెలదినుసు జగంబునఁదెలియున్. 170

వ. నీవన్నగారి మాటమీఁద నంత నిలిచెదువాఁడవని వచ్చితిఁ గాదన్నచో మరల
నాయనయొద్దకే పోదువనిన లక్ష్మణుండు. 171

క. ఆపనియె చేయఁదగినది నాపయి నీకసలుప్రేమ నాటద యొకనిం
జేపట్టి యతఁడు కాదని చోపిన యెలనాఁగ యిట్టిచొప్పునఁబలుకున్. 172

క. నీమాట యట్టులుంచుము నామాటను వినుము, యన్న వచ్చిన వెలఁదిన్
గామించునంత దైత్యవ్యామోహము లేదు దితిజభామిని! నాకున్. 173

క. ఆయనయును మీయన్నయుఁ జేయియు జేయియును గలపఁ జేవగలరు నే
నాయనకు వెంత? పొమ్మనఁ బోయెదు రమ్మనన్నవచ్చు పూనిన బంటన్. 174

క. ఆయన కాదన్నను గొప్పే యే నిను స్వీకరించియేమగు నది శూ
న్యాయత గగనంబును జేదోయి గ్రహించిన విధంబు దూరఘ్రాణీ. 175

వ. మరలఁ బర్ణశాలదాఁకఁ బంపింతునాయన్నఁ జప్పనాక రుసరుసలుగా రివ్వునఁ
బర్ణశాలాకవాటమువఱకుఁ జని యటనుండి నెమ్మదిగ లోనికిఁజని. 176

క. నీవంపించుటయైనది నే వచ్చుటయైన దెంతనేర్చినవారో
యీవెరవెటఁజనెఁ బిన్న మ్మావనవాసమున కంపు నవసరమందున్. 177

ఉ. తమ్ముఁడు నీదుమాట జవదాటడటంచును నమ్మకంబు చి
త్తమ్మునయందు భద్రముగ దాఁచుము ముందవియేమియాపదల్

క్రమ్మనా యట్టివేళల భరంపడి తమ్మున కప్పఁజెప్పి భా
గ్యమ్మనుగాని జానకినిగాని యెటే విడనాడిపోకుమీ! 178

గీ. మరల వచ్చితినన రఘూత్తముఁడు చాలు నేను వలదన నచ్చటికేగినావు
వాఁడు వలదన నింకొక్కవానికడకు బోవలయు నేమి తెలియనిపొలఁతి వనిన.

శా. కాదీమాటలు కట్టిపెట్టుము ననుంగైకొమ్ము కైకొన్నచోఁ
జేదున్ మేయవు కాదు జానకియె నీ జీవంబుగా నెంతువో
యాదింజాడుము మీకు నిర్దఅకు నన్యోన్యానురాగంబు క
ద్దా! దర్వీకరభూషు కార్ముకము బ్రద్దల్ మిమ్ముసంధించెనా. 180

గీ. తెలిసి యౌను కాదను రతిదీనయైన వనితను దిరస్కరించెడు వాని కెపుడు
స్త్రీసుఖంబుండఁబోదుసూ చేతులారఁబుణ్యమనిచేయ నఘములుపొందునిజము.

శా. నా సౌందర్యము కాదు నీలలన సౌందర్యంబె సౌందర్యమం
దో? సౌందర్యము దేశజాతులవి వేరూహించు, దేహాంగవి
న్యాసం బొక్కొకచోట నొక్కవిధమౌ, ప్రాణివ్రజం బందు నీ
హాసంధిత్స్వవు గాఢమౌ వలపు ముఖ్యంబౌను కామంబునన్. 182

చః బ్రతికితి నే సహస్రములు వర్షము లింతటి యందగాడు క
న్నతికిన మేలులేదు గదరా! మరియింతటి యందమెల్ల నీ
వితమున నీమెయే యనుభవించునె యొక్కతె శేషసృష్టి యీ
వతమును వంచనంబునకుఁ బట్టెదు జీవితసారమందునన్. 183

చ. అనవుడు భూమిజాత కసురాంగన మాటలు సాజమైన పా
యని కృపచే సహేతుకము లట్లనిపించి హృదీశుతోడ ని
ట్లనెఁ బ్రభు! యీమె యెంత నిజమాడును నీదగు నందమే నొక
ర్తన యనుభూతిఁగాంచి యవురా! కికురింతున జీవలోకమున్. 184

ఉ. ఈయమయందు దోసమొకయించుకయైనను గానిపింపదే
పాయక యెల్ల సర్వఋషివాటికలందున మౌనికామినుల్
తీయనిదృష్టి నిన్ననుమతించిన నాకు స్ఫురింపలేదు ని
న్నాయమలెల్ల మోహకలితాక్షులఁ గాంచుట తెల్లమయ్యెడిన్. 185

క. నిను స్వామివంచుఁ ద్రిప్పిరి మనసులు వారెల్ల నీమె మానవికామిన్
నిను నేనుచూచినట్టులఁ గనుచున్నది దోసమిందుఁ గలదే స్వామీ. 186

వ. అనిన శ్రీరామచంద్రుండు ముఖరేఖలు బిగువుతేరఁగా నిట్లనియె. 187

గీ. ఆమెయెఱిఁగినకామంబు నదియెఱుంగ నీమెయెఱిఁగినవేదాంత మిదియెఱుంగ
మనుజుఁడనునేనుమనుజధర్మంబెఱుఁగుదు నిలనధర్మంబుచాయసహించు టెఱుఁగ.

క. ఇదిజారపురుష వాంఛా స్పదవృత్తిని భర్తనట్లె చంపెద ననెడున్
ముదిసినదియుఁ గామము చావదు దీనికి సర్వపాపభాజన మగుచున్. 189

వ. నేను దీనిమొగంబు చూడను. దీని నవతలకుఁ బంపివేయు మని స్వామి
పెడమొగమైయుండ సీత గడగడలాడ నసురస్త్రీ జానకిఁ గాంచుచు నిట్లనియె.

గీ. అతని ముంజేతిచిలుక వీ యభినయంబు లేల యూకదలించిన దీవు కాదె
యేమి బూచక్కిమాటలు నేమివగలు నేమిగుంటయాలోచన లేమిసెగలు. 191

గీ. అనుజునిం జూచిరమ్మన నట్టులరిగితిని మఱింతలోఁ జక్రము త్రిప్పినావు
మధురపరిహాసమూర్తిని మగనిఁ జేత నంచికొని కీలుబొమ్మ నాడించుచుంటి.

క. నాపక్షంబుగ నాడుట చూపి మగని మనసువిఱిచి సుందరముఖ రే
ఖా పాండురిత జ్యోత్స్నా ద్యాపనమును జేసి యాపతముగల్గింపన్. 193

గీ. త్రాడువోలె వచ్చి దబ్బనమును బోలెఁ దేలునట్టియంత తెలివిగలవు
ఇంక నెంతదాన వీవు కాకుండిన విఱిచి మగని వలను వేసికొంటి. 194

మ. పదునాల్గేడు లరణ్యవాసమునకున్ వచ్చుంబతిం గాన నే
మదిరాలోచన యేమిచేయునొ పతిన్ మన్నించినట్లెప్డు కా
పుదలం బెట్టినయట్లు వెంటఁబడి రాపుంబెట్టుచున్నావు నీ
యెద యాలోచన నేఁడు కాదనుము రేపేనిం బరివ్యక్తమౌ. 195

గీ. అంత మధురంబుగానాడు నట్టి స్వామి యింతగా బిఱ్ఱబిగియించితీవుగాని
భర్త వెంబడి కానకు వచ్చుటేల యా మఱంది భార్య తా వచ్చెనా వచింపు.

మ. అవురా! రాచనెలంత లెందయినఁ దా రంతఃపురస్త్రీలు నీ
సవురుంజూచిన గ్రామదేశములలో సంచారముంజేయు చౌ
ప్పవలెం గన్పడు లక్ష్మిదేవివి గుణంబుల్ రాశివైనావు నీ
ధవునిం వట్టియమామకున్ జిలుకచందంబొప్ప నాడించుచున్. 197

మ. ఎటనే నున్నదె రాజులంట! బళిరా! యీ యేకపత్నీవ్రతం
బట! నేవిన్నదికాదు కన్నదియుఁగా దారౌర! యేమాయమం
దిటులంబెట్టితి ప్రాణనాథునకు నోసీ! మీరు వేదాంతు ల
క్కట! ప్రాణాంతకమైనజాతి మిథిలాక్ష్మానాథు లా యెల్లరున్. 198

శా. ఈ వున్నన్ని దినాలు స్వామికి సుఖంబేలేదు నిన్ బండ్లతో
గ్రీవాదేశమునందుఁ బట్టికొని భక్షింతుంజుమీ! యోసి! యో
సీ! వైయాఘ్రపు గావుపట్టెదనటం చేపారి ఘోరాకృతిన్
రా వైదేహియుఁగూక వెట్టి ధర మూర్ఛాగ్రస్తయై వ్రాలినన్. 199

వ. రాముం డడ్డమునొచ్చి లక్ష్మణుని బిలిచి యీామె దురాచరణంబు మాన్ప
మనిన నాతఁడామెను బర్ణ శాలాబహిఃస్థలంబునకు గెంటి కలియఁబడి యుద్ధ
మారంభించిన దాని వల్లెత్రాటఁ గోలుకొక్కరగాఁ బడఁద్రోసి సురియ వెతికి
చెవులు ముక్కులుత్తరించి వదలి యంకఁ బదియామడలలోని జంతువులకు
భద్రము పొమ్మనిన నది ముక్కు వెంటఁ జెవుల వెంట నెత్తురోడికలుగా
మింటి కెగిరిపోవుచు. 200

లాటీవిటము

అవు నిల్లలుకంగనె పండువు కాదంభోదోద్యద్రాక్షసరాజుల్
వివృతానను లుద్యతబాహులు పృథ్వీఘోషాపర్యాప్తభుజోగ్రుల్
దవులం జనుదెంతురు మీదగు నీదర్పావేశాధఃకృతి బద్ధుల్
నవలా చెవులున్ మునినాసికయున్ నర్ధంపెట్టం బండవు ప్రజ్ఞల్. 201

అసంబాధము

కోటుల్ లక్షల్ దానవ బలములు క్షోదింపన్
నీటుల్ గోటుల్ సాగవు పొసఁగదు నిల్వంగన్
ధాటీ ఘోటీ ఘట్టన శకలిత దర్పంబౌ
నాటోపంబున్ జూపఁగ వెలదుఁక యన్నట్లా 202

హాలముఖి

ఎంతలేసి కుటిలులురా
వింతలైన వలపులురా
జంతలింకఁ దెలియునులే
స్వాంతమందు శిఖులెగయన్. 203

క్రీడ

సురారాతి స్ఫురత్సైన్యం
బురో సృగ్ధార రాఁదీయన్. 204

వ. అని దూరదూరంబుగ నామె బెదరింపు మాటలు విననైన. 205

శా. హేమంతం బతిగాఢమై తుహినసాహిత్యంబు దుర్వారమై
సామీప్యంబులు దూరమై స్ఫుటదృశాసంపత్తులున్ దవ్వులై
యామై ధారణిజాతకున్ భయముపెల్లై కాననోద్యత్తరు
స్వాముల్ శీర్షమనోజ్ఞ మాలిక లవశ్యాయ ప్రలీనాకృతుల్. 206

క. అటు లెగిరి చనిన దానవి జొటజొట స్రవియించు నెత్రుచుక్కలు మార్గ
స్ఫుట భావ మేర్పరించుచు రటదంబుద మట్లు ఖరుని రాజ్యము చేరెన్. 207

క. ఖరుఁడు జనస్థాన వసదసుర భీకర శతసహస్ర శూర చమూ దు
ర్భర నాయకత్వరేఖా భరితుఁడు దూషణునియన్న పటువిక్రముఁడున్. 208

క. ఖరదూషణులిద్దఱు సంభరిత తపస్సుసముపాత్త వరగర్వితులు
ద్ధుర విక్రమ రేఖా సంగర వీథీక్షుద్దురా సుఖ వ్యాఘ్రంబుల్. 209

చ. అపుడు ఖరుండు రాక్షస సహస్రము గొల్వఁగఁ గొల్వుతీరి యుం
డి పదియు నల్వురాశరు లనీకినినాథుని తోడఁగూడి రా
జ్యపుఁ బని చూచుచుండి ధరయందున మిన్నున నుండి వ్రాలిన
ట్టి పడఁతి నప్పగారి భ్రుకుటీ వికటంబుగఁ జూచు చిట్లనెన్. 210

క. ఇటులిది యేమమ్మా ముకు పుటముల నెత్తురులుగాఱు? ముక్కుం జెవులుం
గటకట! యిట్లేలయ్యెను బటువెవ్వఁడు నిన్ను నిట్టిపాటుం బఱుపన్. 211

క. ఖర రక్షోరాజ సహోదరి నీకే రక్షలేనిదా! యీ యటవీ
ధరణీస్థలి ఖరు నాజ్ఞా తిరస్కృతిం జెలఁగు నెవఁడు తెలియఁగ జాలన్. 212

వ. అనినఁ జుప్పనాక గొంతెత్తి విలపించిన నతండు. 213

ఉ. నిద్దుర పోవుచున్న యహి నిద్దురలేపి ఫణాగ్రమందునన్
గ్రుద్దె నెవండు దాని వెనుఁగోఱలు క్రక్కువిషోగ్రవహ్నికల్
ముద్దలుచేసి మ్రింగెడు విమూఢత వేనికిఁగల్గె మూర్ఖుఁడా
గద్దరియెవ్వఁడో విలయకాల మహోగ్నులయందు దూఁకెడున్. 214

ఉ. వెంగలి యింతకంటె లయభీకర సాగర వారిమధ్య మీఁ
దంగను బోక పోయెన! శతహ్రదమున్ సహసా శతభ్రమిన్
ముంగల నున్న సింహసటమున్ గని యెఱ్ఱని గడ్డియంచు లా
గంగనులేక పోయెన! నికామము త్రోసుక వచ్చె వానికిన్. 215

చ. ఎవఁడు ఖరుండు శూర్పణఖ యెవ్వతె యెవ్వరటంచు నెంచెనో
యవురవురా! సహస్రసమలైనది యీ మనపేరు చెప్ప గుం
డె విరియు వీఁడెవండగుఁ గడిందిమగంటిమి నా సహోదరిం
జెవులను గత్తిరించి విరచించుకొనెన్ దన దైనమ్మృత్యువున్. 216

చ. మొగి బహుకాలమై యననుభూతము మాకు నెవండు నెగ్గుసేఁ
త గడుసువారి యెవ్వఁడొ విధాతృవరంబులు పొంది క్రొత్తక్రొ
త్తగఁ దొలిపొంగు నోర్చికొనఁజాలక దుష్టుఁడ చేసెఁగాని యి
ట్లుగ మరి తానదేమియగుటో యొకయించుక యెంచఁజాలడే. 217

చ. తెగి తిగకన్ను వేల్పెదురు తీర్చిననైన క్షమింపరాని యీ
బెగడును దెచ్చి జాలికనిపింపగ వేఁడెడు పోఁడిమైనఁగా
మిగఁ దనుదాన చేసికొనె మిక్కిలి దైత్యులమయ్యుఁ గూడఁగ
చ్చెగ ముకుకోయుటల్ మనము చేయమె యీదృశ జంతువెవ్వండో. 218

చ. ఇది దనుజుల్ పొనర్చుపని యెప్పుడు కాదు మనుష్యులే పొన
ర్చఁదగు మనుష్యులన్ దిననివారల క్రౌర్యమ యిట్టులుండు నీ
వు దినవు ప్రాణిఁజంపెదవుపో యిటు క్రౌర్యముచూప విట్టి క్రౌ
ర్యదశకుఁ దానుపాల్పడు నరాధముఁ డన్నముకాని చోటులన్. 219

వ. అని శూర్పణఖను లేవఁదీయుచు. 220

చ. తలఁచినయట్టి రూపమును దాల్ప సమర్థవు బాహువిక్రమో
జ్జ్వల పటు శక్తియుక్తవు నసాధ్యవు శత్రుల కిట్టి నిన్నహో
యులుచును వోని నిన్ గదలకుండఁగ బాహుల బిగ్గఁగట్టి వీ
నలు ముకుఁ గోయనెందఱు మనుష్యులు చేవగలారు కావలెన్. 221

వ. అని కూర్చుండఁ బెట్టి. 222

ఉ. ఏడువకుండఁ జెప్పుమ మహీయసు లెవ్వరొ వారు లిప్తలో
నేఁడ పొనర్తు నెంతయు నణీయసులన్ నినువంటిదానినే
కాఁడగఁ జేసినట్టి బలగర్వితు లీవనమందు నున్కియున్
గూడద యల్పరాక్షసులకున్ బెనుసేగి ఘటించువారలై. 223

వ. అనవుడు శూర్పణఖ. 224

క. వారన్నదమ్ములిద్దఱు వారలలోఁ బెద్దవాని భార్యయు, విద్యు
ద్ధారా శరీరలత, సంసారార్ణవ తరి, కృపారస పయోనిధియున్. 225

క. అల్పవు మనుధర్మ విధాజల్పాకులు నగ్నిహోత్ర సాంయాత్రికులున్
గల్పాంత వహ్ని రేఖా కల్పులు వారలను నన్నగారతఁడన్నన్. 226

సీ. అవుడ విచ్చిన నల్ల యవిసెపూవంచు నిగ్గులు వాని మైజిగి క్రొత్త తీర్పు
వానిపల్వరుస జీవపుఁ దమ్మిమానికంబుల యిరుదెస సన్న పోహళింపు
వలరాచవారి యేల్బడిఁ బెద్దమాడువు పొనుగిండి క్రొంజడ ముడిబిగింపు
వాని కన్పివర మవ్వంపు వెన్నెలతీవ చివురాకు నునుదోఁక చిత్తగింపు
గీ. అతనిఁగన్నులఁ జూచిన యంతసేపు నతనిఁగన్నుల జూచిన యట్లులేద
అతనిఁగన్నుల జూడనియంతసేపు నతనిఁ గన్నులఁ జూచిన యట్లుకలద. 227

క. వారౌత్తరాహులు నయోధ్యారాజులు పిన్నతల్లి యంపంగాఁ గాం
తారావాసము చేయఁగ వారిచటికి రాక వచ్చి పదుమూఁడేండ్లై. 228

గీ. అన్ననలువు తమ్ముం డెఱు వంతెభేద
మతనిఁగని యీతఁడని భ్రమ నందవచ్చు
నడుము ఱొమ్ములఁ గన మృగేంద్రములు దీర్ఘ
బాహువులు చాపములు జటల్ పరమశివులు. 229

వ. వారి నామములు రామలక్ష్మణులు భార్య వైదేహి. 230

శా. నాకత్రంబుగనున్న దే విధమునన్ నన్నేలకుం ద్రోచెనో
నా కైజంటను బిగ్గఁబట్టెనో మరిన్ నా నాసికం గోసెనో
చీకాకై యెఱుగంగ నేరను దటిచ్ఛీఘ్రక్రియావంతుఁడై
యా కోఁతింబలెనున్న లక్ష్మణుని దౌరాత్మ్యం బసహ్యంబుగా. 231

గీ. మఱియు ఱొమ్ములలోని మాంసంబు వారి దోగిరములోన నంజుకోకుండ నాకు
నిదురపట్టదు నేఁ బ్రయత్నించి వారి మనసు నొవ్వక మాటాడితిని గదయ్య.

ఆ. మనము దైత్యులమును మరివారు మనుజులీ భేదబుద్ధి పట్టరాదు వారి
కసురజాతి సర్వమాఱిపోవలె వారి కగ్నిదగ్ధమైన యట్టిజాతి. 233

వ. ఇట్లనుచుండ నా చతుర్దశానీకినీపతులలో వార్తామంత్రియైన దుర్ముఖుఁడను
వాఁడు ఖరునితో నిట్లనియె. 234

ఉ. విన్నపమాచరించితిని వీరినిగూర్చియె రెండుమూఁడు సా
ర్లెన్నగఁ బూర్వమీమనుజులే శరభంగుని యాశ్రమాంత ధా
త్రి న్నరజాతి విప్రులు నుతింప సమర్థులమంచు నెంచుకొం
చు న్నిఖిలాసురాన్వయ నిషూదనమందుఁ బ్రతిజ్ఞ చేసిరే. 235

శా. అందం దాపయి నల్వురాక్షసుల సంహారంబు గావింపఁగా
నెందున్ సర్వసమర్థులంచును దలంత్రివ్వారి నమ్మానులున్
ముందా రాక్షసులెవ్వరున్ మన చమూముఖ్యత్వ మేపారమిన్
సందీపింపదు శ్రద్ధ మీకు రిపులున్ సాధ్యత్వమున్ మీఱగన్. 236

చ. అన ఖరుఁడింత వారలది యంతయు నట్టుల లేదె వారలున్
మునుపట నెందఱో యిపుడు ముప్వురె, వారలలో నొకర్తు కా
మిని పదునల్వురున్ గలసి మీరదిచూడుడు పోయి వేగనం
చని తనయవ్వగారిఁ జనుమంచనె వారికిఁ ద్రోవచూపఁగన్. 237

ఉ. ఆ పదునల్వురున్ ధృతమహాయుధసంతతు లాసురీ సము
ద్దీపిత మార్గులై వనగతిం జని రాముని పర్ణశాలకున్
గోపనయైన శూర్పణఖ కోయని రామునిఁ బిల్చి లక్ష్మణుం
జూపి మరీతఁడే యనుచు సొంపుగ రాముఁడు లోన నుండిరాన్. 238

క. ఇరుగో మా సేనాపతు లరుదెంచిరి నీవుచేసినది చెప్పుమనన్
దరణికులుఁడు చిఱునవ్వున సరి నీ మొగమే వచింపఁజాలున యనినన్. 239

ఉ. దుర్ముఖుఁ డుగ్రకోపపరిదూషితుఁడై యివియేటిమాటలో
వర్మ! వెలంది నిన్ వలచివచ్చినదే యను నీవు కాదనన్

దుర్మదవృత్తి నేదయిన దోసము చేసెన యమ్మ క్రూరతా
కర్మకుఁ గొంచనట్టి మతికాక ప్రసన్నమతుల్ పొనర్తురా! 240

చ. తమి పెనుపైన నూరకొనె దానవి మిమ్ము నువంటి నూర్వురన్
నమలఁగలట్టి దీయతివ న్యాయమె యియ్యది దైత్యరాజు స
త్యము వచియించె దైత్యులమహో! పొనరింపమ యిట్లు మాకు న
న్నముఁ బ్రియమారఁ జంపెద మనాథమనుష్యులె యిట్లు చేయుటల్. 241

వ. అనిన శ్రీ రామచంద్రుండు నిరుత్తరుఁడైన లక్ష్మణుండిట్లనియె. 242

ఉ. ఆయన చేయలేదయిది యంతయుఁ జేసినదేను దుష్టకా
మాయతవృత్తియున్న నొక పద్దును బద్దునుగాని యుండదా
పోయెడిదేమొ దారిఁ బడిపోవక భూసుతఁ జంపఁబోవునా
న్యాయము చెప్పవచ్చితిరయా పదునల్వురు గొప్పవీరులై. 243

క. అదికాదు నిజము చెప్పెదఁ బదియామడ మేర మునులు వనజంతువులున్
గదలిన వినిపీల్చెడు నట్టి దుష్టురాలికిది శిక్ష డెప్పరమవునే. 244

వ. అనిన రామచంద్రుండు నాకిది తెలియదు భోగవస్తువు లాఘ్రాణింతు నన్నది,
మంచిపని చేసితివని. 245

శా. ఓ సేనాపతులార! మీరు చని మీయుర్వీపతిం జెప్ప డా
యాసంబేటికి, సర్వరాక్షసుల సంహారమ్ము గల్గంగ నే
మీ సంతోషమె? దైత్యులున్ మునులసామీప్యంబు పోరాదు త
చ్ఛ్రీసంపాదిత యజ్ఞకర్మలకొగిన్ సేమంబు నిత్యంబుగా. 246

ఉ. వింజము దక్షిణంబునను బృథ్వి విశాలముగాఁగ మన్న దిం
దుంజను మీకు దైత్యులు మునుల్ వసియింపఁగఁ జాలినంత ధా
త్రిం జనియించు దుంపలు ధృతిం దినవచ్చు ఫలాళి దున్నుకో
నుంజను భూమి కాదనినమన్ వనజంతువులున్న వాపయిన్. 247

క. దైత్యులు మునులం దినియెడు మత్యధమత యేలగల్గె మౌనిజన తపః
స్తుత్యక్రియ మీదు నధో గత్యుగ్రత కాకయేల గాపింబెట్టన్. 248

మ. కొనుఁడీ రాజసహోదరిన్ జెవులు ముక్కుం గోఁతమేలయ్యె నం
దున మీరిచ్చటి కేగుదెంచితిరి మంత్రుల్ పోయి మీ రాజుతో
ననుఁడీ మౌనుల జోలికింజనఁగ దైత్య శ్రేణి యంగీకరిం
పను నాకట్టడి యిద్ది యొప్పుకొనిన న్వైరంబు లేదింతయున్. 249

చ. భరతుఁడు భూమిరా జతనిపంపున వచ్చితి నేను రాముఁడన్
దరుణియుఁ దమ్ముఁడున్, దశరథక్షితినాథుని పుత్రులేము, నా

భరతుఁడు సర్వధర్మపరిపాలన తీక్ష్ణుఁడు, దైత్యజాతికిన్
ధరపయి నిల్చుకోర్కి కలదా, మును లగ్నులు సుష్ఠ గావలెన్. 250

క. ఒక యాఁడదాని చెవులున్ ముకుపుటముఁగొఱకు వగవఁ బోకుఁడుఁ దితిజ
ప్రకరంబు సర్వనాశనమకటా! చేసికొననేల యల్పవుఁబనికై. 251

మ. అనినన్ దుర్ముఖుఁ డోరగా నగి బలే యన్నావె? యీనీ ధను
స్సును నిన్నుంగని నాల్గుమూరల మనుష్యున్ మేము నీగీయు గీ
తను నిల్వన్వలె? నిన్వధింపక ఖరున్ దర్శింపఁ బోలేము, యం
చును శూలంబును స్వామిపై విసరెఁ గొంచున్ వజ్రకల్పంబునున్. 252

క. ధనువునఁద్రాటిని గూర్చుటయును బాణంబును దొడుగుటయును రివ్వునన
మ్మున శూలము విఱుగుటయును నసఁగా నిదియెల్ల జరిగెనా యనిపించెన్.

వ. అంత శ్రీరామచంద్రుఁడు రక్కసుల చెవులు దిమ్మెక్క ధనురాస్ఫాలనంబు చేసి
యిట్లనియె. 254

ఉ. ఏ నొకరుండకాను జగమెల్లను నేన దురాత్ములార రం
డీ నిముసంబు వట్టదు సుఁడీ మిముఁ జంపఁగ, నిప్పుడైననుం
బూని వచించెదన్ దిరిగిపొండు, వచింపుడు దైత్యరాజుతో
నా నియమంబునన్ నడచినందగు నన్న మహోగ్రమూర్తులై. 255

క. పదునల్గురు దానవులున్ బది వది శూలముల మఱియుఁ బదివది పరిఘల్
పదిపది పట్టిసములు పది పది చక్రంబులును రాముపైఁ బరఁగింపన్. 256

గీ. అయిదువందల యర్వది యాయుధముల లిప్త శతశోంశ భాగ కాలిక విముక్త
దృఢ పృషత్క విదారణ దీప్తచాపుఁ డా రఘూత్తముఁ డత్యుగ్రుఁడై వెలింగె.

వ. మరియు శ్రీ రామచంద్రుం డిట్లనియె. 258

చ. కడువడి మీరు చచ్చి యొక కార్యము పుట్టదు మీరు పోయి మీ
యొడయనితోడఁ జెప్ప డతఁ డొప్పుకొనన్ సరి, కాదయేని య
ప్పుడ చనుదెండు దానవచమూ బహుగాఢ సహస్రయుక్తులై
చెడుటయొ కాదొ తేల్చుకొనఁ జెల్లునయప్పుడ యన్న దానవుల్. 259

చ. మొగిఁ బదియైన శూలములు ముక్కలు చేసిన యంతఁ దీఱె వో
లిగఁ జని రాజుతో ననవలెన్ జగమెల్లను మమ్మెఁదాఁకె నం
చొగి శతమున్ సహస్రము మహోగ్రములైన మహాయుధంబులన్
దెగి రఘురాముసేసినను దీపిత విద్యుదుదార చాపుఁడై. 260

చ. రఘుపతి తన్మహాయుధపరంపర ముక్కలుచేసి గాఢదీ
ప్త ఘన చతుర్దశంబులగు బాణములెక్కిడి వీరుదీనితో

విఘటితులై రటంచు వడి విడ్చిన గుండెలు వ్రచ్చి హోరుతో
మఘవ విరోధులందఱును మ్రందిరి తాము నిమేషవేళలో. 261

క. అంతట శూర్పణఖా దుర్దాంత మహారోదన స్వరప్రవిలులితా
శాంత ప్రతినిస్వన రేఖాంతముగాఁ జల్లవడియె నాశ్రమవనమున్. 262

మ. మరలంజూచె ఖరుండు శూర్పణఖఁ గుంభధ్వాన ఘుష్యత్పయో
ధరముం బోలినదాని నెండిన యసృగ్ధారల్ ముఖంబందు ని
ర్భరమై మూర్ధజలగ్నమై బెరడులై రాపిల్లుదానిన్ సమ
స్తరుజల్ తన్నునె పొందినట్లుగను సంత్రాసించుదానిన్ వెసన్. 263

సీ. కడచిన యామిని పిడుగువడ్డ సగంబు మాఁడిన తలయైన మద్దిచెట్టుఁ
బోలినదానిని, ముంచెత్తు వానలు సగములోవచ్చినం జల్లనారి
పోయిన కాష్ఠంబుఁ బోలిన దానిని, గహనంబులోఁ గుంటగట్టులోన
మట్టలెండి జలాన మాఁగిన చిట్టీతఁ బోలినదానిని, సోలుదాని
గీ. నెడపెడగవాయువులువీవ నిట్లువచ్చువాయువున వంగుచును నట్లువచ్చువాయు
పూరణమున నాఁగుచు నాఁగి మొరయుచున్న వేణు వల్మీక గుల్మంబుఁబోనిదాని.

చ. కని వనమూలికల్ వెదకి గాయము మాన్పుకొనంగరాదె యిం
కను వగవంగనేల? పగగల్గినచోఁ బ్రతికార మాచరిం
చిన వెనుకన్ వగర్చుటయు జెందదుపో, పదునాల్గుమంది నీ
వెనుకనరార యెచ్చటికి వెళ్ళిరి నా నది యట్లె యేడ్వగన్. 265

ఉ. తో డశనిప్రభావులఁ జతుర్దశ వీరులఁ బంపితిన్ మఱిన్
సూడును దీఱె, నింకవగచుం బనియేటికి? లెమ్ము, దుర్ముఖం
డేడ? సమస్త శత్రుభయహేతువు నీతివిచిత్రబుద్ధి, నీ
తోడుగ వచ్చినట్టిరును దుష్టమహాహవ వహ్నికల్పురున్. 266

శా. క్షుద్బాధా వివృతాస్యమై చను మృగేశున్ గ్రూరదంష్ట్రాగ్రహో
ద్యద్బుద్ధిన్ బయిదూఁకి జూలెడమచేతం బట్టి గల్లప్రధా
వద్బాహోచ్ఛటఁ గోఱలూడిపడు చేవంగల్గు సచ్ఛౌర్య రే
ఖోద్బిబ్బోకులు జైత్రలక్ష్మికి మహాహల్ యుద్ధరంగంబులన్. 267

చ. కనుపడి త్రోవ దేవతలు క్రమ్మఁగ నెంచెదునంతలో భయం
బున నతిచేయుచున్ దొలఁగిపోవుచు నుందురు కాదయేని యీ
దనుజులదైన చచ్చుటయుఁ దానమరత్వము వారిదేమి చె
ప్పవలయు నట్టివారు సుమి పంచిన యీపదునాల్గుమందియున్. 268

గీ. ఈ మనుష్యులదగు మృత్యువే విచిత్ర మిచటమనచేతఁ జచ్చెద రిట్టులేగి
స్వర్గసీమకుఁ బోదురు స్వర్గవాసులకు దితిజబాధ యింతచాలనివిధాన. 269

మ. అనినన్ దానవి నెత్తిమోదుకొనుచాహా యింతసౌభాగ్యమా!
నను మాత్రమ్ముగ మిగిల్చినాఁడు పృతనానాథుల్ తదీయోగ్రబా
ణ నికాయమ్ములఁ జచ్చినారును త్రపానర్ధన్ నినున్ జూడవ
చ్చిన నాకే యది యేమి చెప్పవలయుం జిత్తంబునం దోఁచదే. 270

గీ. మరలమరల నడిగెఁ ఖరుఁడేమియేమి చెప్పుమని మరల మరల ముగుదచెప్పె
నంత దానవునకు నాశ్చర్యమై దుఃఖమై కడిందికోపమయ్యె తుదకు. 271

సీ. ఎవరో మనుష్యజాతి, వనిత యొక్కతె యిద్దరు పురుషులు నేగుదెంచి
పంచవటీ ధరా ప్రాంతమ్మునన్ వసియించుచున్నా, రటకేగి శూర్ప
ణఖ చంపగాఁబోయినది వారి, వారామె ముకు చెవుల్ తరిగిరి, వికటమతుల
దుర్ముఖ ప్రముఖ చతుర్దశానీకినీ పతుల వారిని జంపఁ బంపెఖరుఁడు

గీ. మరియుఁ బటుచాపశిక్షా సమర్థులైన వారిచే సంహరింపఁగాఁ బడిరి దైత్య
సైన్యపతు లన్నుసుడి జనస్థానమందు నంత నానోటనానోట వ్యాప్తిఁగాంచె.

వ. యుద్ధపరిషదర్థసమాహూతులై సర్వమహాసేనాధిపతియైన దూషణుఁడును ఖరుని యంగరక్షకుఁడైన త్రిశిరుఁడును, దూషణునిసేనాపతులు మహాకలాప స్థూలాక్ష ప్రమాథులును మిగిలిన పన్నిద్దఱు సేనానాయకులు శ్యేనగామి, పృథుగ్రీవుఁడు, యజ్ఞశత్రుఁడు, విహంగముఁడు, దుర్జయుఁడు, కరవీరాక్షుఁడు, పరుఁషుడు, కాలకార్ముకుఁడు, మేఘమాలి, మహామాలి, సర్పాస్యుఁడు, రుధిరాశనుఁడు ననువారును ఖరునితో నష్టాదశ సంఖ్యాకమైన పరిషత్తు తీర్చి ఖరుఁడు శూర్పణఖను జరిగిన వృత్తాంతము చెప్పుమన్ననామె యిట్లనియె. 273

ఉ. నా కనిపించు నాకృతి పొనర్చిరి రాముఁడు లక్ష్మణుం డయో
ధ్యాకుభృదాత్మజుల్ విమతు లంతట శ్రీఖరులున్ దదీయశి
క్షాకలితాత్ము లుగ్రరణ చండ చతుర్దశ సైన్యనాథులం
జేకొని పంపఁ బంచవటి చేరితి మచ్చట వారి యున్కికాన్. 274

ఉ. దుర్ముఖుఁ డిద్దిన్యాయమవు త్రోవయె మీకని యాడ, సోదరుల్
దుర్మదవృత్తి న్యాయమవు త్రోవయె పొమ్మని, రంత గాఢకో
పోర్మిసహస్రభీకర మహోదధి యౌచును దుర్ముఖుండు మీ
కర్మ యిదిట్లు త్రోసి చనెఁ గాకయటంచును శూలమేసినన్. 275

క. రాముఁడది యొక్క బాణముతో మలఁగించి పెనుకినుక దోషాచరులా
రా! మీరాజునకుం జెప్పుడు నా మాటగనంచు వెఱ్ఱి నాలుక విప్పెన్. 276

గీ. లోకమెల్ల నాజ్ఞలోనిదియట తన కందుచేత మునుల నశనవాంఛ
దనుజకోటి యింకఁ దాఁక రాదట తాఁకి రేని చచ్చినారె యీ యసురులు.

మ. ఇఁకనేమున్నది మీరు మీఖరుఁడు నిట్లేపోయి మోకాళ్ళపై
వికృతాకారులు దోయిలించి ప్రభువా! విశ్వేశ! మమ్మింకఁ జం
పక మన్నింపుమ మౌనులం దినము నీ పాదంబులానంచు త
ప్పక సేమింతురో యేమొ దుర్ముఖముఖుల్ ప్రాణంబులంబాయగన్. 278

వ. అనిన వారిలో శ్యేనగామి యిట్లనియె. 279

సీ. ప్రాగ్దిశాగజ చతుర్దంతముల్ సందిట నిఱికించి సడలించు గరువతనము
తాటక నామె సంధానించెఁ దొలుదొల్త, గాధేయయజ్ఞ విఘటకులన్ సు
బాహు మారీచుల వధియించెను సుబాహు, మారీచుని సముద్రమధ్యమందు
నెగచెఁ, దుహినభూమిభృత్కన్యకా మనోహరుకార్ముకంబును విఱిచెఁ బరశు
ఆ. రామునంతవాని ప్రతినవీటంబుచ్చె నతఁడు వెఱచి పరవ, నంతజోదు
నితనిమీఁదికల్లె యేపదునల్వురో యేగినంత దానవేమిఫలము. 280

క. శరభంగమౌని యాశ్రమ ధరణీస్థలి పాసి నంత తానెచటెచటో
తిరిగెను గావలె వార్తాహరులకు సీతని వదంతి యందదు పైనిన్. 281

వ. నాఁ డ్రిశిరుండు. 282

మ. వడి మారీచుసముద్రమందున విదుర్వంజాలెనన్మాట యె
క్కుడె యాతక్కినవానికేమి యదికైకోనంత సామాన్యమై
విడువన్ రాదను దండకానతమహోర్విన్ దాదృశుండున్కి క
ట్టడి నిద్దా పొలదిండిగుంపులకు దట్టింపాను ముమ్మాటికిన్. 283

చ. అలువవు దైత్యులం బనుచుటందుమె దుర్ముఖ ముఖ్యు లందులో
వలఁ బదునాల్గుమంది సులభంబుగఁ జంపెన వానిమీఁదఁ బో
వలయును నేనొ దూషణుఁడొ వచ్చిన యీ వరిషత్తునందఱో
యలుచుల మూక తున్కలుగ నంపిన నూరక చంపికొంటయే. 284

వ. మరి దూషణుండిట్లనియె. 285

గీ. పిన్నపామునైనఁ బెద్దకఱ్ఱను గొట్టవలయు నంద్రు దండవాదు లితఁడు
పిన్నపాముకాదు పృథులచమూయుక్తిఁ జననెవలయు వాని సంహరింప. 286

చ. అనిన ఖరుండు దుర్ముఖ ముఖాసుర వీరచమూ మహోధినా
థ నికరమున్ వధించిన విధంబును శూర్పణఖా విరూపణం
బును వచియించు నాతని ప్రభూతభుజాబలసంపదన్ వధిం
వను మరియల్పపుం జమువు పంపక యీ పరిషత్తు పిల్చితిన్. 287

ఉ. మీరలు నల్పవుంబనిగ మేకొన రియ్యది సర్వసైన్యయా
త్రారభసంబునం జనియ దండకకానన ధూమకేతులన్
వారి వధింపఁగావలయు వచ్చిన యాపదకంటె వారు దు
ర్వారులటన్న యల్పముని భావన బాధ ఘటింపఁజేసెడిన్. 288

గీ. సాధువృష్టాన్న భోజనసమయమందుఁ బంటిక్రిందికి గులకఱా వచ్చినట్లు
వీఁడొకఁడు వచ్చినాడయ్య వీరమాని యల్పమునులెల్ల వీఁడొకఁడధికుఁడంచు. 289

క. ఐదుగుర మన్నదమ్ముల మైదుగురికిఁ బెద్ద యొక్క యాడపడుచు ము
క్కోదిన యామెం గాంచుచు నేదీ యేమంచు బ్రతుకు టీదైత్యులలో. 290

వ. అంత శూర్పణఖ పరిషన్ముఖమై. 291

ఉ. అక్కట నా సహోదరుల కందఱ కేననఁ జెప్పరాద యా
ముక్కువ వారు బాహుబల మంథరు లంచును జెప్పినాన వా
రెక్కడ నాదుమాట చెవికెక్కెనె వానరులున్ నరుల్ కదా
యక్కర మొక్కఁడే వెనుకనైనది భేదమదేటినవ్వులో. 292

గీ. ఇంత బలగముండి యున్నాళ్ళు నింతగా బ్రతికి వీరిచేత భంగపడుటొ
వీరిచేతఁ గన్నువిప్పిన నా తమ్ములార! బూదియైనవారిచేత. 293

వ. అంత ఖరుఁడు మహాసేనాధిపతియైన తన తమ్ముని దూషణునిసర్వసైన్యము
బయలుదేరఁదీయించుమని తనరథం బాయత్తపఱుపు మని యాజ్ఞాపించిన బ్రభా
తంబ. 294

సీ. సూర్యాంశు మాలికా క్షుభ్యన్నత మహాంధకారమ్ములొక చోటఁ కరుడుకట్టె
సద్యో మహేంద్రవజ్ర నికృత్తపక్షమ్ము కాలాంజన మహాద్రి కూలఁబడియె
దుష్టవాంఛా మహాద్రుత నిర్ఝరిణ్యార్ద్ర మూలపంకము త్రవ్వ కోలుకొనియె
పటుకృష్ణపక్ష క్షపాతమః పూర్వభాగ నికాయ మొకయెడఁ గ్రమ్ముదెంచె

గీ. ననఁగ దోమరపరిఘశూలాసిసమితి మిణుఁగురుంబుర్వులోషధుల్ మిళితమత్స్య
ములు పతత్తారకా శ్రేణికలుగఁ దనర దానవ చమూ సహస్రసంతాన మొప్పె.

వ. విహంగమాది నవచమూపతులు నవసహస్ర సైన్యాధిపతులై ప్రధాన సైన్యముగా
మహాకపాల స్థూలాక్ష ప్రమాథులు మూఁడు మూఁడు సహస్రదళములతో నిరుపా
ర్శ్వంబులను బశ్చాద్భాగంబునను నిలువ సర్వమహాసేనాధిపతియై దూషణుండు
ద్విసహస్రచమూ నాయకుండై యగ్రభాగంబున మహానేతయై, త్రిశిరుండు శ్యేన
గామి పృథుగ్రీవుఁడుయజ్ఞశత్రుఁడు ఖరునిరథంబునకుఁ జతుర్దిశారక్షకులుగా నిలువ.

సీ. రిపులఁ గర్వింపనేర్చినయట్లుగాఁ బురశ్చలిత పతాకాప్రచండమైన
యల్పాసువులఁ గ్రోలునట్టి నాల్కలువోని పట్టిసాద్యాయుధ ప్రబలమైన

తొడిఁ బరాధూతశత్రు కథావిధంబైన వీరకథా చిత్రవిపులమైన
జైత్రయాత్రారమా శౌర్యపరిష్వంగ మన నధిజ్యశరాసనాత్తమైన
గీ. దైత్యరాజ్యేందిరా రశనాత్యుదార కనకమణి కింకిణీ వినూతనమునైన
రథముపై నధిరోహించె రాజు ఖరుఁడు బహుళ హేషాచలత్ సైంధవంబుపైన.

శా. నానా దైత్య చమూగళోగ్ర విగళ న్నాదంబు లాకాశ వీ
థీ నిర్వ్యూఢ ప్రచండ వాయులహరీ దృప్యత్తరంగావళీ
ధ్వానాభంబు దిశాప్రపూర్ణముగ మార్తాండాంశు దీవ్యచ్ఛిర
స్త్రాణంబుల్ పదునాల్గువేల దివిటీల్తారాడు నట్లొప్పఁగన్. 298

క. జయజయ ఖరదైత్యేశ్వర! జయజయ ఖర శౌర్యరేఖ జయ! శత్రుపరా
జయ! జయ! తేజో భరదుర్జయ! జయ! యని మిను నినాదచటులంబయ్యెన్.

గీ. అన్నయెక్కిన రథమున కన్నఁ గించిదూన వైభవరథమున నొప్పె దూష
ణుండు యజ్ఞశత్రుఁడుత్రిశిరుండు శ్యేనగామియునుబృధుగ్రీవుండు ఖరములెక్క.

మహాస్రగ్ధరలు.

మెరసెన్ దైత్యేంద్రసేనల్ మిళితకటువచో మీయమానాత్మకోపో
ద్ధురతా వాచాట్టహాస ద్రుత ఖగనివహోధూతి సంక్లిశ్యమాన
స్ఫురితాకాశేందిరా నిష్ఠుర భయజనిత స్ఫ్యాతపుల్క ప్రమోహా
త్కరలగ్నాసి ప్రచండగ్రహపతి సుషమాదర్ప సాంకాశ్య మొప్పన్. 301

కదలెన్ దైత్యేంద్రుసేనల్ కలితపటుదిశా గంధనాగేంద్ర కుంభ
ప్రదరాఘాతంబు వోలెన్ బదహత ధరణీబద్ధ భూమీధరాధః
పద వక్రాశ్మాళి కోణాపతిత కషణ ద్రాగ్బాఢ బాధాసహంబై
నదదాశా పక్షిజాలోన్మద గరుదనిలాంత ప్రమీలాక్షిమాలన్. 302

నడచెన్ దైత్యేంద్రసేనల్ నతధరణిమహానాళ నిర్మథ్యమానో
గ్ర డిమాభీలాత్త బాధాగతి చలిత శిరఃకాండ నిష్ఠ్యూత జిహ్వ
జడ నేత్రాకార రేఖాచటుల ఫణధరస్వామి బుస్సాధ్వని భ్రాం
తి డయత్కూజ త్క్రిమిశ్రేణి శలభనివహోద్రిక్త మర్యాదగాగన్ 303

వ. అద్దానవబలం బిట్లు పోవుచుండ. 304

జలదము.

భీకరగర్ధభారుణము పెద్దమొగిల్ ప్రాకట శోణితోదకము వర్షము ద
ర్వీకరపుచ్ఛధారముగ హృద్భయ బాధాకరఘోరమై కురిసె నచ్చెరువై. 305

భాస్కర విలసితము.

నల్లనివెలుగులు నెత్తురు రేఖల్ నాగలి విరిసిన గురుసులచాలుల్
వెల్లుగ రవిపరివేషము కట్టెన్ భీకరవలయిత ఫణధరలీలన్
వేల్లదధిక గరుదంచలరేఖా వృత్తిఁ దిరిగె ధ్వజలగుడము చుట్టున్
భల్లుక నిభ తనుగృధ్రము చంచూపాహితఖర పలలము ప్రళయంబై. 306

ఖచరప్లుతము.

వికృతదుర్ముఖముల్ పలఖాదుల్ విస్వరముల్ మృగముల్ ఖగ
ప్రకరముల్ ద్రుతజంబుకపంక్తుల్ పాటితమంగళరావముల్
వికటదంతము లూర్జితసత్త్వావిర్భవ నిర్భయయానచం
డ కుటిలోగ్రము లంత జనస్థానక్షమలో విహరింపఁగా. 307

మేఘవిస్ఫూర్జితము.

అకస్మాత్తుగ్గత్య చ్ఛైలశిఖరసమంబై మహామేఘ మొక్కం
డు కాలాభీలోద్య చ్ఛిఖినికర గండూష ధూమోగ్ర రేఖల్
నికామం బాకాశప్రకట నినదానీక సంజాత కల్పాం
త కాలంబై క్రమ్మెన్ దిమిరచయముల్ దర్పచండంబు లొప్పన్. 308

భుజంగప్రయాతము.

అపర్వంబునన్ రాహువంభోజబంధున్ కృపాదూరుఁడై గాఢకృష్టిం గ్రసించెన్
క్షపావేళ కాకుండ సంధ్యారుణచ్ఛాయ పొందెన్ వసాహాంసహోర్దారుణంబై. 309

విమానము.

అమేఘమాకాశమందున్ గమించి విద్యుత్తు పొందెన్
సమేతముల్కాప్రపాతంబమేయమై పొల్చె నెల్లన్. 310

వ. అంత తెక్కుతోఁ గొట్టిన గ్రద్ద బాహుదండంబునఁ బెడఁద్రోచి సీదరించి ఖరుఁ డిట్లనియె. 311

క. ఎవడో యల్పిష్టునకు నశివమో శివమో మరేను శీఘ్ర కరతలో
ద్భవ గాఢచపేట గళిత నవగ్రహుఁడ నాకుఁ బుట్టునా యశుభంబుల్. 312

చ. కలిత సహస్రవర్షముల కాలము చేసితిమెన్ని సంగరం
బులు మనకొక్కయింత నొకపొంతఁ బరాజయమన్న దింతయున్
తలఁచి యెఱుంగ నీవనపదంబునకున్ గగనానికిన్ మదం
బలమెను నాప్రయాణసమయంబున నీగతి వెఱ్ఱి లెత్తఁగన్. 313

మ. కనుబొమ్మల్ ముడిపొందినన్ జెదిరి చీకాకైన దిక్పాలురున్
మనసే సుంతయుమాఱినన్ వినతమై మన్నించుభూతాళి, నా

కును నల్పగ్రహపాతముల్ జలదముల్ గోమాయురావంబులున్
కన హాహా! పదమా చమూనివహమా! కాంక్షావధుల్ కల్గఁగన్. 314

చ. కణుపెడొ వ్రేలెఁడో గిడసగడ్డలు రాముఁడు లక్ష్మణుండు దు
ర్వ్రణములు లేచినంత నశుభంబులు చెప్పెడు వెఱ్ఱిభూతముల్
కణకణలాడు నిష్పకలకంటెను దీక్ష్ణములైన కన్నులం
గణికలుగాఁగ మార్చెదను గాక పదండు చమూమహీపతుల్. 315

సీ. మాయప్పగారహో మహనీయ పౌలస్త్య వంశగౌరవనీయ, వట్టిగొడ్లు
కాక క్రిందును మీఁదు కాననేరని జాతి పండునిప్పల వారిగుండెయొఱచి
చీకులుగా, నభిషేకధారాభూత తద్దేహరక్తంబు త్రావవలయు
ననినంత దైత్యసైన్య గళోత్థ జయ జయా రావముల్ నిండె నాశావధిగను
గీ. నడచెసైన్యంబు లంత మంథానగిరియుఁగుదురుతొలఁగిన గతి మహానదియుఁ గట్ట
గండిపడినట్లు దిగ్గజ గండదాన జలములింకెడు పదహతి చండముగను. 316

క. కిక్కురుమన లేదప్పుడు నొక్క మహాభూతమైన, నురిసిన వేల్పుల్
స్రుక్కిరి, మునుల ముఖంబుల నొక్కుమ్మడి శాంతిపాఠముల్లము లురలెన్.

గీ. స్వస్తి గోబ్రాహ్మణులకును స్వస్తిసర్వభూతములకును స్వస్తిప్రభూతశౌర్యు
లకును దశరథ శ్రీరామలక్ష్మణులకు స్వస్తి సర్వధర్మార్థప్రశస్తలతకు. 318

చ. దనుజచమూ సముత్థ నినదంబు వియత్పద మావరించి ముం
దునకు మరుత్తరంగములతోఁ జని యామడ దాఁటి విన్పడన్
వినఁబడినంతదవ్వు కనిపించెను దుశ్శకునావళిన్ భయం
బునుగని కారణంబెఱుగఁ బొందక భీతి వహించిరెల్లరున్. 319

ఉ. ఆతతసర్వశాస్త్ర ధిషణాంచితశీలుఁడు రాముఁడెల్ల యు
త్పాతములం గనుంగొనుచుఁ దమ్మునితోడ వచించెనిట్లు నా
చేతము సంశయంపడెడుఁ జేసిన శూర్పణఖా విరూపణో
ద్భూతఫలంబు వెంబడిన పుట్టెడునట్టుల నూహచేసెదన్. 320

గీ. ప్రకృతిని సహేతుకమ్ము లుత్పాతములు మనుష్యలోకజీవిత ఫలభాష్యకారు
లౌచు నంతర్బహిః ప్రకృత్యనుచలత్పరస్ప రాకృష్యమాణతారంభ మేచు. 321

ఉ. ఆపె వచించెనేకద ఖరాసురసోదరి నంచు నిక్కమే
ఆపదునాల్గుమందిని రయంబునఁ దోకొనివచ్చె వెంబడిన్
గోపన కామెకుం దితిజకోటి వశంవద మంచుఁదోచు నే
నాపతు లంతమంది మరణంబు ఖరాసురుఁ డెట్టులోర్చెడున్. 322

శా. ఆ సైన్యంబది యెన్ని వేలగునొ యూహంజేయఁగారాద
రానీ! సమ్యక్పరివేషణంబొనరుతున్ నిక్కంబుగా సాధు వే

ళా సామీప్యముగల్గె దైత్యబల మేలా వచ్చునొక్క_మ్మడిన్
ద్రాసం బెప్పటికప్డై క్రొత్త ఋషిసంతానంబునం దయ్యేడున్. 323

క. పదిమందిఁ జంపి యిచ్చటఁ బదిమందిని నచటఁజంపి ఫలమేమీ దు
ర్మదదైత్యమూలబల సంపద చితికినగాని వారు వంగరు తుదకున్. 324

క. పదునేనవ సమ వచ్చిన మొదలిదినంబే యయోధ్యపురి నుండక త
ప్పదు మతితీక్ష్ణుఁడు భరతుఁడు కొదయగు మనమాట మౌనికోటుల యందున్.

మ. మన మున్నన్నిదినాల పాటును నిలింపద్వేషులున్ మౌనులం
జెనకంబోవక నీవయోధ్యపురికిం జేరంగఁ బైవడ్డితో
మునిసంతానముపైని కోపమఖిలంబున్ దీర్తు రీదైత్య బా
ధను వారింతునటన్న నాపలుకు మిథ్యారూపమై పోవఁగా. 326

క. అది పదునల్గురు చచ్చినయది చెప్పఁచు నేను నియమమాడినయది చె
ప్పదొ నానియమమెఱిఁగినట్టి దితిజపతి సేన తెచ్చుటే పగ తెలుపున్. 327

మ. విడియుద్ధంబున నెంతమందినయినన్ వింటన్ విదుర్పంగ నొ
క్కఁడు చాలుంగద నేనొ నీవొ మఱి యొక్కండీవుగానేగినన్
వడియై నాకు మనస్సు నిల్వదు మహోబాహాప్రచండుండ వీ
వెడఁదన్ నేరక కాదు పెద్దనగుటే యీ ప్రేమకున్ హేతువై. 328

క. వాఁడెంతవాఁడు నైనను పోఁడిమిఁ దలిదండ్రులకును బొరి నన్నలకున్
వాఁడు పసివాఁడె యనియెడు వాఁడి చెడద యెడఁద ప్రేమ వైభవవశమై.

శా. నీవుం బంటవలంతికూఁతుఁ గొని యానీరంధ్ర కాంతారవుం
గ్రామాధీశ నిగూఢ కందర తటిం గావుండు మీలోఁ జమూ
రావంబయ్యది యెంతదగ్గఱ వినన్ రానైనదో చూడు నీ
సేవాసక్తికిఁ గ్రిందుసేయుము రణోత్సేకంపు టుత్సాహమున్. 330

క. ఈ మాటకుఁ బ్రతివలవదు నామై నొట్టంచుఁ బంపినన్ జానకియున్
సౌమిత్రియు శైలగుహా సామీప్యము చేర రామచంద్రుఁడు వెలుచన్. 331

వ. అగస్త్యోపాయనీభూత కవచకార్ముకంబులు ధరించి వింటికొప్పున నల్లెత్రాడు బిగించి దైత్యసేనారావంబున కెదురుచని యొకయల్పగిరివెన్నుగాఁ గఠినశిలాదేశంబున ధనుష్కోటి కక్షభాగంబునఁజేర్చి వ్యత్యస్తపాదుండై నిల్చి దైత్యసేనరాక కెదురుచూచుచుండిన నంతరిక్షసముపాత్తులయిన మునులు దేవతలు నిట్లనుకొనిరి. 332

క. ఇతఁడొకఁడు దైత్యసేనావితతులు పదునాల్గువేలు వెక్కసమగు వా
రితఁడేమి యౌనొ యకటా నతముగఁ బొసగంగఁ ద్రోసినా మీవఱకున్. 333

ఆ. అన్నదమ్ము లిద్దఱైన బాగుగనుండు నపుడు సీతరక్ష యమరఁబోదు
నద్దదైత్యజాతి నమ్మిన దెవ్వరు నొంటి పర్ణశాలనున్న సీత. 334

మ. మరియున్ దేవతలైన తోడుచనినన్ మన్నించునే రావణుం
డరరే యీతని కేమికీడగునో సిద్ధాన్నంబిదేమౌనొకో
పరమంబై చను శాంతి యీతని ముఖాబ్జంబందు భాసించు ని
ష్ఠురమౌ సంగరమగ్నిహోత్రములు గండూషించు ముమ్మాటికిన్. 335

గీ. స్వస్తిగోబ్రాహ్మణులకును స్వస్తి సర్వభూతములకును స్వస్తి ప్రభూతశౌర్య
సాగరునకును శ్రీరామచంద్రునకును మరియు స్వస్తి వైశ్వానర మార్గమునకు.

చ. అని యనుకొంచునుండఁ బృతనావళి దృష్టిపథంబు చేరినన్
గని రఘురాము సైన్యపు ముఖంబున వచ్చెడిచుప్పనాక యం
తన గళమెత్తి వాఁడెయనినన్ ఖరుఁ డన్నయ తమ్ముఁడా యనం
గను నవవార్షికాంబుధరకాయుఁడు చూడవె యన్నయే యనన్. 337

ఉ. ఉద్ధతుఁడింతసేన కెదురొక్కఁడుగా నిలుచుండె యుద్ధస
న్నద్ధుఁడుకూడఁ దోలుమనినన్ ఖరుఁ డంతట సూతుఁడేచినన్
గ్రుద్ధ చమూపతుల్ చమువు కోయనియార్చుచు నాయుధోగ్రసం
పద్ధుతశౌర్యులై పరుగువాఱుచు రామునిపైకి దూఁకుచో. 338

ఆ. అసుర చమువుఁ జూచినంతన రాఘవు నొడలుమండి కోప ముబికిపోయె
మరల ఖరునితోడ మాటాడవలెనన్నమాటగూడ స్వామి మఱచిపోయె. 339

వ. అంత నారక్తనేత్రుండు విస్ఫారిత వక్షుండు శ్రీరామభద్రుండు ధనువుచేఁబూని
జ్యానిస్వానంబు గావించిన. 340

క. పరువుల వచ్చెడు సైన్యము పరాక్రమము డింది నిల్వఁబడె దైత్యచమూ
ద్ధురరావము మ్రింగిన ఘుర్ఘుర రవమున దిక్ప్రచండకుంభము లుడుకన్. 341

సీ. ఇతఁడు పినాకియో యేమో త్రిపురదాహవేళా సముద్భూత విధురమూర్తి
ఈతండు గరుడియో యేమో యమృతకుంభహరణవేళాగ్నినిర్య న్ముఖుండు
ఈతండు నృహరియో యేమో విదీర్ణాననోద్యత్కరాళ దంష్ట్రోగ్రమూర్తి
ఇతఁడు కృశానుఁడో యేమో లయాంతోగ్ర ధూమాంబుధర సముద్ధుర శిఖుండు
గీ. జ్యావినిస్వాన యుగపత్ప్రచండమూర్తి యంతలో నయ్యెఁ బూర్వపు శాంతమూర్తి
తాదృశునిరాముఁగంచు భూతంబులున్ సురల్ మునుల్ నమస్కార మర్యాదులైరి.

చ. కుశ కబళంబులన్ హరిణకోటిని మేపెడు శాంతమూర్తి క
ర్కశ ముఖ లక్షణుండయి శిఖాజ్వలనాకృతియైనఁ జూచి శాం
తి శబలభావలైన వనదేవత లూడనిఁబాడి రక్కటా
విశదముగా నెఱుంగుటకు వీల్పడదంచును క్షత్రజాతులన్. 343

క. తెప్పిరిన దైత్యసైన్యము గుప్పున కోపాగ్నిమండి కోటిజ్వాలం
బుప్పరమెగిరి రఘూత్తము గప్పెను నానాయుధప్రకాండమ్ములచే. 344

సీ. వృక కిటి వ్యాఘ్ర భల్లుక సంతతులమధ్య దృప్తమై చను పింగదృష్టివోలె
చిట్టీత యడవిలో చెదురుగాఁబుట్టి విజృంభించు బాడిదచెట్టువోలె
దైత్యసేనా సముద్రము మధ్య బడబాగ్నివలె నొప్పె ఖరుఁడు, దృప్తదితిజాత
చమువు ముద్గరశూల చటుల చక్రాద్యాయుధ సహస్రములఁ గప్పె దాశరథిని
గీ. అధిక హిమపాత పిహితమార్తాండువోలె వర్షధారాప్రలీన గ్రావంబువోలె
నంబుధర పరిచ్ఛన్న శీతాంశుఁబోలె స్వామి కనిపింపక సురల్ విషాద మొంద.

క. కనపడని రాము నునికిన్ గనుకను ఖంగని ధ్వనించు కార్ముకవల్లీ
నినదంబె సాక్ష్యమిచ్చుచుఁ దనరె దిశాగోళ సముదిత ప్రతిరవమై. 346

సీ. దితిజచమూసమర్పిత బాణసంతతి యుడిగిన వేళకుఁ గడఁగిమునులు
ప్రకటకాషాయాంబరము లెండవేసిన పొగడచెట్టు విధానఁ బొలిచె స్వామి
యటు రాఘవుండుండె నిటు దైత్యచమువుండె నడుమ నాకాశంబునన్ విచిత్ర
మతనిబాణంబులు దితిజాయుధంబులు నీ రాముబాణంబు లివి సచేత
గీ. నంబులాయేమి కొన్నిటి నడుములందు
విఱుచు గొన్నింటి ముఖముల విద్ధపఱచుఁ
గొన్నిటిని బుచ్ఛములయందుఁ గుంటువఱచు
దైత్య సర్వాయుధములు విధ్వస్తములుగ. 347

ఉ. రాముని దాఁకవచ్చు నసుర ప్రవిక్తములైన యాయుధ
గ్రామము కొంతదవ్వుననె ఖండితమైచను వంద యాయుధాల్
రామునియొక్క బాణమున వ్రయ్యును రాముఁడు దూయ నాశర
స్తోమము లెన్ని యన్నిటి నెదుర్కొనుఁ దూఁచిన యంతదవ్వునన్. 348

సీ. ఏమేరకును దన యేయుబాణంబులు వేగమందికొని త్రెవ్వించు రిపుల
యాయుధవ్రాతంబు నంతమేరను రామ శరపుంఖ వజ్రపంజరము పొలిచె
శరశరపుంఖంబు చపలాతిచపలంబు నత్యంతవేగంబు నమితదృఢము
నరిమార్గణంబుల కత్యంత రోధంబు ననుజమార్గణముల కధ్వదాయి
గీ. రాముదేహంబునకుఁ దనూత్రాణ మొకఁడు ప్రథమప్రాకార మీ శరపంజరంబు
రెండవదిగాగనొప్పె నీరెండవదియె దాటశక్యము కాదయ్యె దైత్యతతికి. 349

శా. రామస్వర్గమునన్ శరత్రిపథగా ప్రస్రావణంబయ్యె స్రో
తో మార్గంబుల నొండు పంజరశరద్రోణంబు పోషించు నొం
డాముంబొందిన రాక్షసవ్రజము సంహారంబు గావించు నొం
డేమో మింటను మింటనే రిపుశరద్వీపంబులన్ ముంచెడున్. 350

సీ. వడగండ్లవానకుఁ బగిలిన పూజల కుండలై చెదరిన కుమ్మరావ
మట్టుల దైత్యసైన్య పురస్థ ధారుణీ భాగంబు సొంగదబాహువులును
మొగి సకుండలశిరమ్ములు సకంకణబాహువులు సహారమ్ములు గళము లుగ్ర
కరవాల సహిత విక్షతమధ్యములు వీర ముద్రికాయుత పాదములును గాఁగఁ
గీ. గడు నికృత్తశుండమ్ములు కరులు, నిహత చరణములు నశ్వములు, భగ్నచక్రకేతు
వులు రథమ్ములు, గాఁగఁ గన్నులకు దుర్భరంబుగా నొప్పె సంగర రంగభూమి.

ఉ. ఈదృశుఁడైన రాఘవుఁ డదేటికి దాఁ దొలుదొల్త దైత్యశూ
లాదులఁచేతఁ గొట్టఁబడె నన్నది యద్భుతమయ్యెఁ దానుగా
నాదిని బాణమేయఁడు దయాపథ మేలును గాదయేని ర
క్షోదయితుండు సామమునకున్ దిగునోయని చూచుభావమున్. 352

వ. అంత శ్రీరామచంద్రుం డేఁబదులేఁబదులు నాల్గుగుప్పిళ్ల బాణములు దూసిన
నవి వివృత ఫణఫణాధరములవలెఁ గుటిలచంచు శ్యేనములవలె వచ్చుచుండఁ
గాంచి బెదరి దైత్యసేన పాఱిపోవుచుండ దూషణుఁడు వారికి నడ్డముసొచ్చి
యిట్లనియె. 353

క. ఓ సేన లీతఁ డొక్కఁడు లే సున్నములోని కెముక లేకుండ సునా
యాసమ్ముగఁ జంపఁగఁ బరిహాసమ్మగుఁ బాఱిపోవు టయ్యయ్యో బలే. 354

ఉ. గుంపుగఁ జేరి పట్టుకొన గుప్పెఁడుకా డితఁ డేమివీరులో
తెంపరు లన్నియన్ని గడిదేఱిన పోటుతనంబు లాడి బ
ద్దింపులుగాఁగఁ గొందఱు గతించిన నెవ్వరికైనఁ బుట్టునే
తెంపు సహోదరుల్ మఱి మృతింగన నూడునునైన దీర్పరా. 355

క. అని మరలించిన దైత్యులు వెనుక తిరిగి లజ్జవదలి పెరిఁగిన కోపం
బున రాము నెదుర్కొని కని ఘనతర రోషోగ్ర వహ్నికలుగా నగుచున్. 356

చ. బరిసెలు భిందివాలములు బల్లెము లీఁటెలు తోమరంబులున్
బరిఘలు ముద్గరంబులును భల్లములుం గొని రాము నేసినన్
దరణికులుండు బాణపు శతంబున వానిని రెండుమూళ్ళుగా
నఱికి ధనుర్విచిత్రకలనా వలనంబున నమ్ము లూటుచున్. 357

సీ. ఉడుకఁబెట్టిన చిలగడపు దుంపలువోలె నుదిరి వర్మములు పొట్టొలిచియొలిచి
ధాన్యంపు నిండుబస్తాల మూతులవోలె దంతుల హౌదాల త్రాళ్ళు నఱికి
పండిన వరిచేలపగిది బాణైకధారాక్షిప్తి బలము తోరాలు త్రొక్కి
తుమ్మకంపలు వీథిఁ దోలినయట్లుగా నిరురథచక్రంబు లిరుసు లూడ్చి
గీ. చుఱుకు గిత్తలు గాళ్ళుల నుడిపినట్లు రథముపై వేరురథ ముద్దురముగఁ దోచి
రామచంద్రుండు చాప శిక్షామహితుఁడు జిలుగుపని చూపె దానవ సేనయందు.

ఉ. వంచితధైర్యులై పరువువాఱిన సైన్యము పోవనీక మ
ళ్ళించిన దూషణుండు కదళీతరుషండమునందు ఝంఝ తో
లించినయట్లు రాముని శిలీముఖ వాయువు వెల్లరేగఁ బా
లించుటకయ్యె సైన్యము కుళీరపుడెక్కల చిక్కునట్లుగా. 359

సీ. శూలమెత్తనొకండు శూలంబుతోఁ జేయి క్షితిఁవ్రాలిపడియెను, సింహనాద
మెత్తిన నొక్కరుం డెత్తిన గళము నికృత్తమై మింటికి నెత్తఁబడియె
పరువెత్తి రామునిపై దూఁకఁబోనొక్కడేది కంఠము పరువెత్తె బొమ్మ
రెండుచేతులఁబూని రెండాయుధములురాఁ గడగిఁ యొక్కనియూర్ధ్వకాయమంతఁ
గీ. దోరణమువలె మిన్నునందోఁచె, నొకఁడు తరువుపెకలించుకొని పైకినుఱుకనగ్ని
సంధితంబైనయట్టిదౌ శరముచేతఁ దరువుతోఁ గూడ నాతఁడు దగ్ధమయ్యె. 360

చ. వెనుకకుఁ బోయి లంఘనపువేగము పెంపఁగ నొక్క యాశ్వికుం
డనితర కార్యసాహసము నద్భుతముం బొనరింప నెంచి ముం
దునకు హయంబు ద్రోచి రఘుధూర్వహు మూపునయందు దూఁక లే
చిన హయ మాకసంబునన చిట్టెముకట్టె మహాగ్నిదగ్ధమై. 361

గీ. అంత నసురసైన్య మత్యుద్ధతక్రోధ వహ్నిశిఖలుగాఁగఁ బ్రజ్వలించి
యార్చి రామచంద్రు నఖిలశాతాయుధప్రతతి క్రమ్ముకొనఁగ బరగఁచేసె. 362

శా. కాలాభీల తటిత్పయోధర మహాగర్జా వినిస్వాన వా
చాలోగ్రంబగు దైత్యసైన్యము ధృతోత్సాహోగ్రకోపంబులన్
జా లుర్వీజములున్ మహాపరిఘలున్ బ్రాసంబులున్ ఖడ్గముల్
శూలంబుల్ పటుభిందివాలములు కొంచున్ వేయఁగా జొచ్చినన్. 363

ఆ. అంతవఱకు స్వామి యాడుచునుండెను దైత్యసేనతోడఁ, దనకు నపుడు
పట్టరానికోప మట్టెపొంగెను గని దైత్యసేన మూర్ఖతాభరంబు. 364

మ. తన చూపించిన చాపవిద్యకు సముద్యద్బుద్ధిమజ్జాతియై
నను బోరాటము మాని యీవఱకె చింతన్ గాళ్ళ బేరానకుం
జను, మూర్ఖత్వమటంచు ఫెళ్ళున మహాజ్యాధ్వాన సంఘూర్ణితా
శని పాతోద్గత భీకరంబుగ మహాచాపంబు సారించుచున్. 365

క. విల్లున్నది కనపడలే దల్ల శరంబులను దివియు టగపడలేదు
త్పల్లము శబలితమును నావేల్లితమగు తెల్లమొగిలు విరిసినదనఁగా. 366

క. ఒకవంద గుఱ్ఱముల పర్వుకు దీటగునట్టి వేగరూఢి విముంచ
త్ప్రకటిత శరౌఘ నిర్ఝర వికీర్ణ మసురాయుధాశ్మ విసరము విరిసెన్. 367

సీ. పాములవలెఁ గొన్ని పడగలయందున నడుములయందున నడఁగివిఱిగి
పులులవోలిక కొన్ని ముఖములయందునఁ బార్శ్వమ్ములందునఁ బగిలినొగిలి
కుందేళ్ళవలెఁ గొన్ని కొస చెవులందునఁ బాదంబులందునఁ బడసి సుడిసి
కణుజులవలెఁ గొన్ని కణతలయందున గొరిజలయందున విరిసి యురిసి
గీ. తూనిగలువోలె త్రెక్కలఁ దునిఁగికొన్ని వాలుగలవోలె మెడలందుఁ బడసికొన్ని
దైత్యసేనాయుధంబులు దాశరథి వికీర్ణశరబద్ధ వాగురాక్షిప్తములయి. 368

ఉ. గర్వపుఁ గోపరేఖ కడకన్నుల నొత్తఁగ స్వామి యంత గాం
ధర్వమహాస్త్రమున్ దొడిగి దైత్యచమూతతిపై నిగుడ్చినన్
నిర్వమదగ్నికీలము తృణీభవదాసుర శీర్షపాదమున్
పర్వము నొక్కపెట్ట శిఖి సంగతవెట్టినయట్టు లొప్పఁగన్. 369

శా. క్రూరేభంబుల కృత్తమస్తములు రక్షోవీరకంఠంబులున్
ఘోరాశ్వంబుల భిన్నదేహములు రక్షోరాజి భిన్నాంగముల్
స్ఫారోద్యద్రథకృత్తభాగములు రక్షఃకీర్ణ భూషావళుల్
వీరాశంసనమున్ శ్మశానపదవీ విభ్రాంతిమచ్చండమై. 370

వ. ఈరీతిగా ఖరుని నవసహస్రచరసైన్యంబును దూషణునిచేత మరలింపఁ బడిన వరిశిష్టసైన్యం బంతయు సోదెలోనికి పేరు కూడ రాకుండఁ బోయిన దూషణుండు క్రుద్ధుండై తన అధిపత్యంబునన్న పంచసహస్రసైన్యంబు రాముని పైకిఁ బురిగొల్పిన. 371

క. అది ఖరుని మూలబల మయ్యది దూషణు ప్రాణపదము నద్ది జనస్థా
న దితిజసమూహ గర్వాస్పద మది సురలోకతూల వహ్నిక యదియున్. 372

వ. దూషణుని వెన్నెముకయైన వజ్రాయుధము నైదువేల యంచులు గల చక్రాయుధము నైదు మొనల శూలాయుధము. 373

క. ఒకవంద క్రతుధ్వంసములకు నొక్కొక బిరుదుగాఁగ లలిఁ బదిపదునే
నొకఁడొకఁడు తాల్చు నాసైన్యకమది యాపేరు చెప్పినన్ గుండెదిగుల్. 374

గీ. ఎదురుపడినఁ ద్రోవ నెచ్చటనైన సురేశ్వరుండుఁ బరిహరించు వారిఁ
బెనచి మూఁగి క్రమ్ముకొని యేఁచువారికి నడవి తేఁచుకుక్కలయిన నయము.

వ. అంత నాసైన్యంబు రెండువేలు స్వామి కెదురుతీర్చి మూఁడువేలు స్వామి మూఁడు దెసలు క్రమ్మిరాఁగాఁ జీలి యటవీ తరువులు చాటుగాఁ జుట్టిరాఁ బోఁగా రాముఁడది గుర్తించి. 376

మ. శితభల్లంబులఁ జుట్టునున్న యడవిన్ ఛేదించి తత్సైన్యపున్
గతిఁ జాటుందొలగించి తచ్చరణసంఘాతంబు ఘాతంబుగా

ప్రతతాభీలశరౌఘవర్షములచేఁ బాటింపఁ దత్సైన్యమున్
క్షితిపైఁ గూలియు దేకివచ్చుచు మహాసి(శ్రేణికన్ వీవఁగన్. 377

క. అవి రామబాణపంజరము వితథముగఁ జేసె సైన్యమును గైవారం
బు వెలయ రాముఁడు గోసెను నవచక్రశరాళిఁ గంఠనాళము లెల్లన్. 378

చ. ఒకనిముసంబులో జరుగుచుండిన నియ్యది రెండువేల సే
నకు నెడమంది రాముని ననంతమహాయుధశూలసంతతిన్
వికవికఁజేయ వీలుపడె విచ్చినపూవులతోడి సన్నకో
రకములతోడి మంకెన సరాగములాడఁగ సామి మేనితో. 379

చ. బుడుతఁడు చావడిన్ నిలిచి పొల్పుగజాతెడు చూరుధారలన్
వడిఁ దనచేతఁ బట్టుకొనువైఖరి వాన దినాల రాముఁడున్
దొడుగుట మాని యమ్ములను దోరముగా నిముసంబు వారు వి
చ్చెడు సకలాయుధంబు లరచేత గ్రహించె నదొక్కలీలగా. 380

చ. వెస శరపుంఖపంజరము భిన్నముచేసిన యట్టికత్తులం
బస నరచేతఁ దాఁకఁగను బట్టిన రాముని సాహసంబు సా
ధ్వసమునఁ జూచి దైత్యభటవర్గము గుండెలుకొట్టుకోను మా
ని సకలచేతనత్వమును నీల్చిన నిల్చిరి రాతిబొమ్మలై. 381

వ. అంతరాముండు మరల శరసంధానంబుచేసి యొకవిచిత్ర ఝంఝూవాత్య పుట్టిం
చిన. 382

సీ. పెనుభూతములు వచ్చి పీకలు నులిమి మింటికి నెత్తికొనుపోవు వికలలీల
ద్విసహస్ర సైన్యంబు వెసఁ జిత్రచిత్రంబుగా నెత్తఁబడి మింటిగాలిచేతఁ
గొంద అడ్డంబుగాఁ గొందఱునిడివిగాఁ గొందఱు శీర్షముల్ క్రిందుగాఁగ
నేటవాలుగఁ గొంద ఱిట్టట్లు పంగలు విచ్చిన కాళ్ళుగా విరిసికొంద
గీ. ఱాకసమున నెగురనగు గాలిపడగలు వోలెఁ గొంతసేపు పొలిచి పైనిఁ
ద్రాళ్ళు తెగినయట్లు తమపడినట్టి చోటైన నెఱుఁగరాక హతమయ్యెరి. 383

శా. ఆచిత్రంబునుజూచి దూషణుఁడు నత్యాశ్చర్య మేపార మా
రీచున్ గంధినిద్రోవగా బ్రదికె దూరేత్యుండు దోస్సార స
ద్ధీచీనుండని వెంబడిన్ దఱుము మిత్తింబట్టుచున్ శౌర్య రే
ఖాచిత్తంబున రాముపైఁ గవిసె దీక్షారోషపర్యాప్తుఁడై. 384

ఆ. పదియు నాల్గువేలు చదిసెను సైన్యంబు ఫలములేదటన్న తెలివిరాదు
తనకు నైనదాఁకఁ దట్టనీయదు బుద్ధి తనకునైన పిదపఁ దట్టుటెట్లు. 385

మ. ద్రుతరీతిన్ రథమున్ రఘూద్వహునిపైఁ దోలించె దూలించి వి
క్షత కాంతార మహాతరుల్ తలలు వేగవ్యాచలన్మాతరి

శ్వ తరంగాహతిఁ దత్ప్రభూత రవ సంబాధంబు బాధింపగాఁ
బ్రతతానేక విశీర్ణ సైనికమృతి ప్రారంభరోదధ్వనిన్. 386

చ. కిటిముఖకోటి కార్ముక వికీర్ణములై పదు లేబదుల్ శరో
త్కట నికరంబు రాఘవునిఁ గ్రమ్మినఁ గ్రుమ్మిన బాణసంతతిన్
దుటుములుగాఁగ నన్నిటిని దూలిచి వేలిచినట్టి వహ్నిగా
జటిలుడు మండి స్వామి పరిసర్పిత కోపమిల చ్ఛలద్యుతిన్వై. 387

సీ. పదిబాణములను నశ్వంబులఁగూల్చి యొక్క పృషత్కమునఁ బతాకంబు రాల్చి
పదియమ్ములను సూతు వక్షంబు చీల్చి యొక్కశరాన బండినొగల్ పగిల్చి
పదినారసంబుల బండిసంధులు ప్రీల్చి పదిశరంబుల వాని పట్టువిల్లు
నడిమికి విఱిచి యంతట రథంబుననుండి యుఱికిన దూషణు నున్న ధాత్రి
గీ. యినుపవాగేళ్ళతోడఁ బ్రవ్విన విధాన గుద్దలించినఁ జెంగు చెంగున నెగురుచు
విస్ఫురత్కోప చలిత దర్వీకరంబు వోలె నతఁడు వగర్చుచుఁ బ్రోదిగొనుచు. 388

సీ. వరుణపాశమునకు వల్లభంబంచును యమదండమునకు దీటైనదనుచు
సురలోకయుద్ధ విస్ఫురణంబులన్ బేరు మోసిన యది పట్టుఁబుట్టమునను
గూర్చిన రతనాల కుబుసంబుగలయది కృతలోహమయశంకు శతభయదము
పరిఘంబు గొని మహావ్యాఘ్రంబు వోలిక దూఁకుచుఁ బైకిరా దూషణుండు
గీ. రాఘవుఁడు రెండు దీప్తశరంబులం దదీయబాహాయుగంబు ఛేదించె నతఁడు
తొరఁగు రక్తద్విధారమౌ తూమువోలె క్షితిధరమువోలెఁ దా విఱిచికొని పడియె.

గీ. వాఁడు బ్రతికిన బ్రతుకేమి వాఁడు చచ్చినట్టిచావేమి రాఘవుఁడన్న నంత
నిర్దయుఁడు వానిగళము ఖండింప కట్టిచావు నొక గొడ్డుచావును జావనిచ్చె.

క. మువురతని చమూపతులున్ శవమయి మరిశవముకాని సైన్యాధిపతిం
దవిలిన కన్నులు దుఃఖప్రవిస్ఫురత్కోపవహ్ని భగ్గున నెగయన్. 391

వ. మహాకపాలుండు శూలంబు స్థూలాక్షుడు పట్టిసమును బ్రమాధి పరశ్వధముం
బూని స్వామిపై నరుగుదేర రాముఁడు మహాకపాలుని గపాలమోక్షణంబుచేసి
స్థూలాక్షుని యక్షులు శరవహ్ని దగ్ధంబులుగా నొనరించి ప్రమాధి బహుళబా
ణపాతంబునఁ బ్రమాధించిన ఖరుఁడు చూచి. 392

ఆ. తాను వీరుఁడగుచుఁ దమ్ములు బందుగుల్ సంగరమున మృత్యుసంగతిఁ గన
శోకమగునొ తనకు శోకంబుకంటెను గోపమగునొ తెలిసికోనులేక. 393

మ. తన పన్నిద్దఱు సైన్యనాథులకు జెంతంగాంచి మీరేగి యా
యన నేమైనను జేయఁగల్గుదురె చింతాకంత నొవ్వండు నాన్
దనుజుల్ స్వామి! మఱీవె చూతువని హస్తప్రోత్థితోగ్రాసి కం
పన వేగానిల వీచికల్పులయి రామస్వామిపై కేగినన్. 394

క. పన్నిద్దఱ రాక్షసులన్ బన్నెండు శరంబులన్ బ్రభంజన సాహా
య్యోన్నిద్రవహ్నిరేఖముల న్నిగిడించి పతి యయ్యిలాస్థలిఁ గూల్చెన్. 395

వ. అంత నయ్యుద్ధభూమి. 396

సీ. శవఖాదులైనట్టి జంబుకంబు లలర్కములువోలెఁ బచ్చచూపులఁ దనర్చి
సూదులవలె మోములై దేహములు బక్కచిక్కి యీఁగలు శిరస్సీమ మూఁగ
నాకాశమున నేరొ యదలించినట్టులు బిత్తరవోయి దిగ్వితతిఁ గనుచుఁ
గొనప్రాణములతోడి దనుజుల మూల్గులకును దినఁబోవుచు వెనుకకరిగి
గీ. నిక్కిౘాలు రాబందుల ఱెక్కగాలి కూఁగుచును తూలిపోవుచు నొత్తిగిలుచు
నొకవికృత్తపాదంబునో యొకవికృత్తహస్తమునొ మూఁతిఁగఱచుచునడవిఁజొచ్చు.

విశా

అడవిశునులు భక్షణాశన్ శవానీకసాన్నిధ్యముం
బడసి పెఱమ్రుగాలి పైరాఁ బలద్దర్శయద్దంతముల్
గుడగుడలుగ గొంతు ఘూర్ణారవ న్మంద్రరావంబుగన్
జడిసి జడియనట్లు పొగున్ మఱిం బేర్చి కవ్వించుచున్. 398

హరవర్తనము

బద్ధవాసనఁజేసి హోవళి శార్దూలావళి పొందుచున్
యుద్ధభూమిని జేరి దృష్టిగ్గి నౌదాత్త్యాయతి జిందుచున్
విద్ధసైంధవరాజిపై విచలద్భ్రుధావ్రుతి క్రోధపం
బద్ధగర్జనఁ బాపి తప్పక యట్లే కప్పక నిల్చుచున్. 399

శ్యేని

మింట దేగపిండు మేలిచక్రముల్ వెంట వెంట తిర్గి వేగ వ్రాలుచున్
మంటలేచు నట్టి మాంసఖండమున్ గెంటుకొంచుఁ బోవుఁ గీర్ణధాత్రిగా. 400

వ. అంత ఖరుండు యుద్ధసన్నద్ధుఁడైనఁ ద్రిశిరుం డిట్లనియె. 401

ఉ. సేవకుఁడుండగాఁ బ్రభువు సేయఁడ యేపని యట్లు చేసినన్
సేవకునందుఁ బెల్లఘము సెందున నీకును సంగరక్షకుం
డై విడ నిన్ను నీవఱకు నక్కట యట్టుల కాదయేని తా
నీ విలయంబు పుట్టునె మఱీవయి యుద్ధము సేయవచ్చునే. 402

ఉ. ఆతనియెత్తు నాకుఁ దెలియంగనునైనది మున్ హయంబులన్
సూతుని చాపమున్ నఱికి చొక్కముగా విరథున్ వికార్ముకున్
ఘాతము సేసెడిన్ సులువుగా మన మిన్నియుఁ గాచుకొంచు న
ల్లాతనితో నెదుర్కొనిన నాహవమేమగునో యెఱుంగనే. 403

శా. ఏనుండంగను భీతి యేమిటికి స్వామీ నీకు, దిక్కుంభికుం
భానన్ నిప్పులకుండ లెత్తితిన, యస్మచ్ఛౌర్య రేఖా పరి
జ్ఞానం బిప్పుడు విస్మృతింబడియె రాజా! నీకు, వాఁడంత జో
దైనా డెంతటిదైన జోదుతనమో యాయెల్లఁ జూపించెదన్. 404

క. నను నభిషేకింపు మనంగను నభిషేకించె వాని ఖరు డాతఁడె వా
హిని వాహినీపతియు నాతనిచే మరల ఖరునాశ తలయెత్తంగన్. 405

క. త్రిశిరుండును కార్ముకియై సశరుండయి రథియయి కవచ విభూషితుఁడై
దశరథ సుత సింహముపై విశద క్రోధంబు శలరి విధమున నడచెన్. 406

క. ఎదిరించుట ముగ్గురుగాఁ గదనము చేయంగ నొకఁడుగా భేదంబుల్
మది సర్దుకొనఁగ రాముని మృదువృత్తికి నదియు నొక నిమేషము పట్టెన్.

ఉ. అంతట వాఁడు రథ్యముల నాత్మరథంబును సూతుఁ గాచికొం
చెంతయుఁ దీవరించి తనయేచెడి యే పది కాష్ఠకెక్కఁగాఁ
దాంత శరౌఘ వర్షమున దాశరథిన్ బెనువానజల్లు వి
క్రాంతి మహామహీధరము క్రమ్మిన వైఖరిఁ గ్రమ్మియార్చుచున్. 408

క. పదిపది బాణంబులతోడ దాశరథి పాదములు తొడల్ వక్షంబం
గద భుజములు మొగము వెదా వెదగా గుప్పించి యొక్క పెట్టున నార్చెన్.

క. మరి మూఁడు బాణములతోడ రాఘవుని ఫాలమున విడిన్ బొమముడి ని
ష్ఠుర బాణపాతము నస్సృష్ఠరి పొడిపింపంగఁ గ్రుచ్చి చండత నార్చెన్. 410

ఉ. రాముని కంత కోపము భరంబయి క్రమ్మిన వీఁడొకండు నా
హో మొనగాడు వచ్చెనని హాసము చేయుచు నోరి దైత్యుఁడా
నా ముఖమందు బాణములు నాటిన దానికి నద్దిరా! సుశి
క్షా మహనీయ చాపకళ సాగిన రెండడుగుల్ ప్రశస్తమై. 411

మ. అరరే! నీవును నీఖరుండు నెటులేనై సుంత తప్పించుకొం
దురు? నిర్దానవరాజ్య మాప్రభువు నీతోడేమి సౌభాగ్యబం
ధురమా రాజును విడ్చిపోక మృతబంధూ! వచ్చినా వార్దరితా
స్ఫురణం దీటుగ శౌర్యముం గలవటుంచున్ రాముడుం గోపియై. 412

మ. ఒకవిద్యుత్పరివేగచండము శరం బోలాకొలేకుండ దా
నికిఁ దానొడ్డుకొనంగనే నెడము కన్పింపంగరాకుండఁ దే
లికగా దూసిన, దైత్యుఁడున్ శరముప్రాలెన్ నా నెఱుంగండు ల
స్తకసంఛిన్నముగా ధనుస్సువిడె హస్తంబందు బెండౌగతిన్. 413

మ. చిటికల్ చాలక యుగ్యముల్ మడిసెఁ జచ్చెన్ సూతుఁ డాఘూర్ణన
చ్ఛటమై కేతనమున్ ధరిత్రి పడె సంస్థాన ప్రకీర్ణంబుగా
విటతాటంబుగ బండి వ్రచ్చెను, గదావిస్ఫారహస్తుండు దు
ర్ఘటమై తాఁ ద్రిశిరుండు ధాత్రికిని దూఁకన్ ధ్వస్తదీర్ఘాశుఁడై. 414

వ. అంత శ్రీరామచంద్రుఁ డిట్లనియె. 415

క. విను బండిమీఁద నుండంగనె చంపుటో బండిచెరిపి కాఱించుటయో
మనసునకుఁ దోఁపలేదైనను మీవార్వోయినట్లె నడిపెద నిన్నున్. 416

ఉ. నాఁ ద్రిశిరుండు కోపపరిణద్ధ కరాళజటాల దంష్ట్రుఁడై
యద్రి సపక్షమై విహరణాతిభయంకర సర్వగహ్వరో
పద్రవ మేగుకైవడిఁ బ్రపాతమహోనలమూర్తి త్రిప్పికొం
చాద్రుఘణంబు రాముని శిరోగ్రపథంబున దూఁకెనేయనన్. 417

క. అదియొక విచిత్రశరజాల దంశితక్రీడ రఘుకులప్రమథేశుం
డు దనుజదేహము ముక్కలు పదు లిర్వదులై చెదరిన పాటుగఁ జేసెన్. 418

గీ. అంతటన్ స్వామి వ్రేళ్ళతో నమ్ములూది
కొనుచు మణిబంధతట మద్దికొనియె నొసఁట
ఖరుఁడు నంతట తాన యొక్కఁడును నగుట
చూచి రాముఁ డొక్కఁడగుట చూడలేక. 419

చ. బహుళసహస్ర వర్షము లపారమహాహవ ఘోరవీథులన్
విహృతి చరించినట్టి రణవీరున కా ఖరదైత్యలోకనా
థు హృదయగోళమందు నొక దూఁకుడుపుట్టె నిమేషమందు ని
గ్రహపరుషుండు వెంబడిన క్రమ్మిన శౌర్యము నిల్వఁద్రొక్కఁగన్. 420

క. ఒకనిమిషవేళ ద్విభ్రూ వికట జటాభావ సూచి విధురోహుఁడు కా
ర్ముకవామపాణి ధృతశస్త్రకదక్షిణపాణి ఖరుఁడు తా నిలుచుండెన్. 421

గీ. వీరుఁ డొకరుండు పదునాల్గువేలసేన త్రిశరుఁడున్ దూషణుండును విశదబాహు
బలులు సేనాధిపతులును బ్రభు పినాకి లీలగా నున్నయది విమలీకరింప. 422

చ. శివునకు మేము ద్రోహమును జేసిన దేమని యంతగాఁగ ను
ద్భవమగు కోపహేతు వగుపట్టదు నే మిగులన్ బ్రయోజనం
బవుపడ దిద్ది దానవ మహావిలయం బగువేళ కావలెన్
గవిసిన నిప్పువోని జడకట్టెను వేళ కమర్చినట్లుగన్. 423

ఆ. ఖరునిచేతి యమ్ము కార్ముక లస్తకసీమ చేరె నంత శివుఁడు కాఁడు
త్రిశిరు దూషణుని వధించిన దుర్మార్గుఁడొక్క రాచవాఁ డహో యితండు.

శా. అంతన్ శ్రీరఘురామ కార్ముక మహాజ్యాస్వాన సంఘూర్ణమై
వింతౌరీతిని సర్వధాత్రియును గంపింపన్, ఖరుండొక్కని
భ్రాంతంబందున మేలుకొన్నటుల స్వజ్యారావ సంపూరితా
శాంతంబుంబొనరించె దానికిఁ బ్రతిస్వానమ్ము నాఁజేయుచున్. 425

చ. తిడిమితిడిమ్ములన్ ఖరునితేరు రఘూత్తము మీఁది కేగినన్
గడువడి వారికిద్దఱకుఁ గయ్యముకల్గెఁ గులాచలంబులె
క్కుడువడి రెండు డీకొనియెఁ గ్రూర లయాంతపయోనిధానముల్
సుడివడి రెండుతాఁకెనన క్షుణ్ణ మహోపల శీర్ణవారిగన్. 426

మ. ఖర రామప్రవిముక్త బాణముల నాకాశం బనాకాశమై
సరసీజాప్తుని వెల్గుమాసి యిరులన్ సంఛన్నమై దిక్కులు
ద్ధురమై యమ్ములత్రోవ కన్పడక సందోహమ్ములై యమ్ములు
ర్వర వ్రాలెన్ బరిపుష్టిలేక చెడు సూర్యాంశుప్రతానంబునాన్. 427

ఉ. అంతట దైత్యనాయకుఁడు నంబుజనేత్రుని రాము సంగర
శ్రాంతునిగాఁగ నెంచె రఘుసత్తముఁ డంతకునంత పొంగి వి
క్రాంతి చలద్భుజార్గళుఁడుగాఁ దనుసంగత సర్వరక్తధా
రాంతర నూత్నశక్తి కలితాగ్నిశిఖుండుగ నుండెఁ జిత్రమై. 428

చ. ఖరుఁడు సహస్రమార్గములుగా శరముల్ పరగించుచున్ ధురం
ధరుఁడయి రామునిన్ శరశతంబులఁ గప్పి తదీయవర్మమున్
బొరలుగఁ దీసినట్లుగను ముక్కలుముక్కలుచేసి రాఘవో
త్తరుని శరీరమున్ రుధిరధారలు వాఱెడునట్లు చేయుచున్. 429

విచిత్రము.

ఖరప్రౌఢచాప స్ఫురద్బాణధారన్
ధరాకన్యకా రా ట్కురాసంబువిర్గెన్. 430

చ. సకలసురల్ మునుల్ భయవిషాదములంగని యక్కటక్కటా
యొకఁడు పొనర్పఁబోఫ మరియొక్కఁడు కావుటయౌనా దైత్యనా
యకుఁడు సహస్రవర్ష సముపాహిత సంగర కేళితీర్ణుఁడే
యొకఁడు రఘూత్తముండు మఱియున్ మఱియేమగునంచు నెంచఁగా 431

వ. మరల నగస్త్యదత్తేంద్ర చాపంబుపూని. 432

శా. హావాకంబుగ రాముఁడున్ ఖరుని నోయీ! వానికిన్ వానికిన్
నీవుం గార్ముకదక్షుఁడౌదు నగిషీల్నేర్తీవుచేయన్ ధను
ర్జ్యావల్లీకృత చిత్రకర్షణ వినీషన్ గైకయీాదేవి వి
ద్యావిష్కారము నీవెఱుంగవుసుమీ యంచున్ మఱిన్ నవ్వుచున్. 433

చ. శిశిరవసంతముల్ కలుగఁజేసితి నామెయి నాకురాలుచున్
భృశమును లేఁతయెఱ్ఱచివురించినయట్టులు గాఁగ గ్రీష్మక
ర్కశతను నీశరీరమునఁ గల్పనచేసెదఁ జూడుమంచుఁ క
ర్కశముగ నొద్దుకో నెడముచాలని నైపుణి వేగమొప్పఁగన్. 434

మ. త్రిశరవ్యాహతమై పతాకమును ద్వాత్రింశద్ధతంబై హయా
ళి శరద్వాదశవేధ సూతుఁడు శరాళిం బండియున్ వ్రయ్యఁ గ
ర్కశ మేకైక శరంబునం దనుజ వక్షంబుచ్చిపో నేయఁగా
నశరుండైన సురారికిన్ గదశరణ్యంబయ్యె లంఘించుచో. 435

గీ. అసుర గదవ్రాన దేవత లతిముదంబుగనిరి మునిరాజి వదనముల్ కందళించె
దనుజులకు నిద్ది రెండవదశ యటంచు ద్విత్రిదశలగు దక్షిణాయాత్రయందు.

వ. అంత శ్రీరామచంద్రుండు ఖరుండు చేఁబూనిన గదాదండంబు ముక్కలుచేసి
యిట్లనియె. 437

చ. ఒకయుగమందుఁ, గల్పమున, నొక్కనిఁ జూపుము పాపకారియై
ప్రకటిత తత్ఫలం బనుభవంబఱువాని, సరే సహస్ర వ
ర్షకములపెట్టు జీవితభరంబయి చేసినయట్టి పాపమే
యొక పదిసార్లుచేసి మఱియున్ మఱి దైవములేమి నెంతురే. 438

క. అయ్యయ్యొ జనస్థానపుఁగొయ్యలు మీ ర్మునుల తలలు కోఱలఁ గొఱుకన్
జయ్యన కటకటలాడిన యయ్యులివే నాదు జ్యామహాధ్వని యయ్యెన్. 439

మ. నరమాంసంబురుచో దురాత్ములయి యాగ్నాయీ ప్రియాస్యంబు ని
ర్భరులై బ్రద్దలుచేసి యంగిటను జిహ్వోల్తోడి హవ్యంబు తో
డిరి మీదుష్టసురారిమూఁక, యిదె కూడెం దత్ఫలంబున్, దృశా
సరణం బాహవభూమిఁ జేయుము ఫలాస్రావంబు కన్పించెడిన్. 440

మ. కులదోషంబొ యనగ్నిదగ్ధులకు మీకున్ సాధువైశ్వానరో
జ్జ్వలమార్గంబున నంత బద్ధము. మహాశత్రుత్వమేలా, యయ
ద్బలమున్ మీరయి చొచ్చువారలు ధరిత్రిం బూడ్చి పెట్టంగ న
గ్నులలో మండినవారు పోరు సజలాంధుశ్రీక విద్యుత్పథిన్. 441

శా. ఆకంఠంబుగ మెక్కినట్టి మునిరాజానేక మాంసంబులన్
నీకంఠంబును గత్తిరించి యిదిగో నీచేతఁ గ్రక్కించెదన్
భూకాంతుడయినట్టి యాభరతుఁ డబ్బో! శిక్షఁ డీ కార్యమున్
నాకుం బెట్టెను దైత్యరాడ్గళ గళన్నాళంబులం గోయఁగన్. 442

చ. బ్రతికిన నాళ్ళులా యమునిఁ బట్టి కడుంగడు బాధపెట్టిన
ట్టి తెలివి చచ్చునాపయి వడిం బిసరంతయు గిట్ట దగ్నిసం

స్థత నచటన్ హసంతుల దిసంతులుకొట్టుఁడు మౌని వహ్నులా
తతముగ విఘ్నముల్ వ్యపగతంబుగ సాగునుగాక దుర్మతీ. 443

వ. అనిన ఖరుం డిట్లనియె. 444

మహోక్కళి.

అకట! పదిమంది యలుపంపుఁ బొలదిండులకు చావుచేసితి వదియునొక్క
మొకరి కర్జమువోలెఁ జెప్పికొనంగ మ్రోఁగంగ నంతగాఁ బెద్దదియె
చికిలిచావులు బ్రదుకు లిచ్చుట నీవు చేసెడి పనులుగాఁ బలుకుచుంటి
వొకఁడు తనుఁదాను బొగడుకొనినకంటె నురికి బావిని చావు మేలనఁగ. 445

మధ్యాక్కళి.

పరగంగ విన్మ నీవంటివాఁడును బరుసముల్ పలుక
నరయంగఁ బనిలేద యనుచు ననుకొందు నల నిరాబారి
పరుసఁ జంపితిమేని మేము వారు మూవంగడమునకుఁ
బొరి తమ్మిచూ ల్సయు నన్నముగదయ్య మొగి రాచజోద. 446

మధురాక్కళి.

ఇంతదాఁకను నీవేమొ యినుమడి జమునిరూపు
పంత మొప్పఁగఁ దాల్చితివి పరగ నా కలుక యేచ
వింతగా నిప్పు చల్లనై విరిసితి వసలు నీవు
జంతపట్టు వెక్కంద్రోచి జడదారులిట్లు సేఁత. 447

అంతరాక్కళి.

నేను చచ్చెదనమ్మ నే బ్రతుక నేలపూని వంగసమెల్లఁ బొలిసె నామున్నె
కాని నీవట్టులైనఁ గలద యాయాస మా నెలంతకు నడవి నరిగెడు సకికి.

అల్పాక్కళి.

విల్లెత్తుకోవయ్య పెల్లు పల్కు జల్లెత్తుటేలయ్య చావెప్పుడో
కల్లగాదుగదయ్య కడిమియున్న నెల్లయున్నది లేదా యేమయ్యెలే. 449

వ. నాకేమిమిగిలినది. నన్నుఁగూర్చి నాకేమియుఁదలపులేదు. నిన్నుఁ గూర్చియే యని ఖరుం డొకమహాసాలంబు పెఱికి రామచంద్రునిపైకి రాఁగాఁ దద్వ్యధా నంతరమున స్వామి తదల్పగిరి ప్రస్తరంబున హస్తగత కపోలుండై కూర్చున్న పెద్దసేపునకు సవ్వడిలేమి జానకీ లక్ష్మణులు గుహాముఖమ్ములనుండి వచ్చి.450

ఉ. ఏ దనుజున్ వధించినను నిట్టివిషాదమునొందు నాత్మమ
ర్యాదుఁడు స్వామి యంచును హృదంతరమందున నెంచి లక్ష్మణుం

డాదట స్వామిడగ్గఱి కృతాంజలి యౌచును బర్ణశాలకుం
బోదమటన్న ముప్పురును బోయిరి నిర్నిమిషైకదృక్కులన్. 451

ఆ. అటవికులు వచ్చి యసుర వధానంద
కలితముఖులు రాము గాయములకు
మందు మాఁకు చెప్పి మఱియున్ మఱియు రాముఁ
జూచి చూచి చనిరి సొగసి సొగసి. 452

ఉ. తానును నట్టి సంగరపు ధారుణి చూచెన యేఱుమేర నిం
తైనను దమ్ముఁడుం బలుక డన్నయుఁ జెప్పడ యంతసుల్వొ యా
దానవు లంతకయ్యమును దాశరథిద్వయ బుద్ధికంచునన్
జానకి యెంచి తానునొక సన్నగఁ బల్కదు దాని వారితో. 453

వ. అంత మఱునాడు గోదావరీస్నాన సమనంతరంబున సకమండలు పాణులు సర్వర్షులు సికతా నిషణ్ణులయి సంధ్యా తర్పణంబులు చేయుచు స్వామితో నిట్లనుచుండిరి.

ఉ. మృగ్యముకాదె యీదృశ సమృద్ధి భుజాబలవృద్ధి యెందు నీ
యోగ్యత యేమిచెప్పవలెనోయి రఘూద్వహ! నీవుగల్గుటే
భాగ్యము బ్రహ్మవర్చసము ప్రత్యుషఊర్జితమైన తేజమున్
వాగ్యతులైన మాకు నిదె వచ్చినదో ప్రభు శుక్లపక్షమున్. 455

ఉ. నీవలయీకృతంబయిన నిర్భరచాపమునం దపాంనపా
దేవతలుంద్రుగా కవధి తెచ్చినకోటి యజుస్సు సుస్వరం
బై వసియించుగావుత వియత్పథి ఋక్షగణంబు తన్మహ
స్సేవన దక్షమై భ్రమణసేయుత మోయి త్విషాంపతిప్రభా. 456

వ. అని సర్వర్షి సంఘము ఖరాదులకుఁ దర్పణముచేసి వెడలిపోయిరి. అంత. 457

మధ్యాక్కఱ.

తొలియీఁత యావులవెన్న తోడి బంధురవాసనాత్త
ములు హోమధూమముల్ పొలిచె మునిలోకపుణ్యాశ్రమముల
కలిత వీణారావమధుర క్రమరేఖా సామగాన
మొలసి చల్లనిగాలి తరఁగ లూఁగిసలూగిసల్ గాఁగ. 458

ఖం డాం త ము

గీ. పంచవటియిది ముక్త్యాల ప్రభువునకును తక్కు శ్రోతలకును నెల ముక్కమౌళి
జాలువారిన కాంతి ప్రసార సారభూతమగుకీర్తి సమకూర్చి ప్రోచుఁగాక. 459

ఉ. కన్నులుమూసి దీపశిఖగా నినుఁ జూతును ధూమశేఖరా
భ్యున్నత తావకీన ధవళోజ్జ్వల లింగము భ్రాంతికన్నులం

గన్నదికాక యీ స్మరణఁగాంచుట యూరక జ్ఞానమాత్రమై
యున్నదియున్కిగా సలుపుమోయి మహాప్రభు! నీలలోహితా! 460

భుజంగప్రయాతము.

అనూహ్యస్వరూపా! చిదానందదీపా! ధునీబద్ధచూడా! విధూతాఘతాపా!
జని వ్యూహసంలగ్నజంతు ప్రతాన క్షణావృత్తి బీజాదిశమ్యా కలాపా! 461



# మా రీ చ ఖం డ ము

క. శ్రీ కాశీ సంవ్యాపిత నైకమహాలింగ సంభృతాత్మ సమూహీ!
యాకాశాదిక భూతతనూ! కైలాసాద్రి నిత్యనూతనగేహీ! 1

ఉ. కానఁగఁ గామినీ విరహ కంఠ వినిర్గత రోదన స్వనా
నూనములైన దిక్కులును నూల్కొను మిన్ను ఖగాధినాథ ప
క్షానతపాతభీకర రవాహతి దుష్టముగాఁగనై జన
స్థానమెదో భవిష్యఫలితంబు వచించెడు రీతి నొప్పఁగా. 2

మ. ఎవరో శత్రుచమూతతుల్ గుములుగా నేతెంచి స్త్రీ బాలవృ
ద్ధ వధంబున్ బొనరింతురంచును జనస్థానంబునన్ భీతియై
యవురా యూళ్ళు పరిత్యజించి జనులాహో వాఁగులై గుట్టలై
యెవరో యేగతినో సగానకుసగం బెచ్చోటనో నాశమై. 3

క. శూర్పణఖకూడఁ జచ్చెనో శూర్పణఖయుఁగాని యెందుఁ జూపట్ట దటం
చర్చిత నిఖిలాసులయి వగర్పుల నటఁ గొందఱుండి కదలన్ లేకన్. 4

వ. పరమవృద్ధులైన కొందఱు రాక్షసులు రక్షశ్చమూసర్వనాశన వార్తాముఖుని నకం
పనుఁడనువానిఁ బిలిచి 'యీ వార్త రావణునకుఁ దెలియవలయును తరువాత
మనమీఁద నెప'మని చెప్పఁగా నందులో నొక కృకలాసం బిట్లనియె. 5

క. ఈ యందఱిట్టులైరి కదా యాయన తొందరించి యాహవబుద్ధిం
జేయునొ వారికి మాయోపాయంబునఁ బక్షులట్లు వల పన్నవలెన్. 6

వ. అని యకంపనునితో మాటాడి. 8

మ. అదిమార్గంబుగనుండె రావణుఁడు స్త్రీయన్నన్ మహామోహదు
ర్మదవృత్తిం జనువాఁడు మీరెఱుఁగరే రంభాకథన్ వాని క
య్యదియే యెంతయు నచ్చఁజెప్పవలె నభ్యామర్దబుద్ధిం జనన్
బదునాల్గైచను వేల సైన్యము తలంపంగావలెన్ నీతిమై. 9

మ. అని పంపింప నకంపనుడు నశనాయా నిమ్నకుక్ష్యక్షుఁడై
మును లేరైనను ద్రోవఁ గన్పడెదరేమో యాఁకలేమయ్యె న
య్యెను గంఠంబున శీర్షముండ దనుకొం చేసాధుశైవాలినీ
వనతీరంబుల క్షుణ్ణమార్గములు పోవంబోక నుద్భీతియై. 10

మ. వనరాశిం గని దానవ ప్రణిధి గోప్యంబైనదా పాటిరే
వునఁ గంఠోపరివారి నందని స్థలంబుల్ బారుటేఁతంబడిం
జని లంకాపురి చేరి తెల్పికొని రక్షఃస్వామి దర్శించి రా
మునిచేనైన ఖరాదినాశ కథనంబున్ సర్వముం జెప్పెనన్. 11

చ. మఱియును నంతభగ్నమని మండిన రావణుమంట గాంచుచున్
విఱిగి యకంపనుండు వెనుభీతిని స్వామి ననున్ వధింపకే
చరణము లంటికొందు ననఁజక్కన పంక్తిముఖుండు చూచి యె
వ్వరు వధియింపుమీ ఖరునివంటి మహాబలు నిట్లు చేయుటల్. 12

చ. ఖరుఁడె కులాచలం బదియుఁగాకయు నేనిటఁ జక్రవాళమై
ఖరు పరిరక్షసేయ ననుఁగాదని యెవ్వరు వారు మౌర్ఖ్యని
ర్భరతను నూర్ణనాభ కృత వాగుర వోలిన నాదు బాహుపం
జరమునఁ జిక్కుచున్ జిగురుసాగిరి మృత్యుముఖంబు నందునన్. 13

క. మాట మనది వినిన నెడఁద బీటిచ్చు నుషర్బుధునకు, వేలుపుఁబడవాల్
కూటములకు, వీఁడెవ్వఁడు గోటన్ మీటందలంచెఁ గులపర్వతముల్. 14

వ. అనిన నకంపనుడు ప్రభూ! యయోధ్యారాజు దశరథుని కొడుకు రాముఁడను వాఁడు పదునాల్గువేల సైన్యము ఖరదూషణత్రిశిరులతోఁ గూడ ముహూర్తాధిక కాలంబున సమయించె ననిన రావణుఁడు. 15

గీ. ఏమిరా! వేల్పుసేనతో స్వామి తాను రామునకు సాయపడెనా ఖరప్రభృతులఁ
దూలిచినదెట్లు పదునాల్గువేల సేన వ్రాలిచినదెట్లు దోశ్శ్రీధురాభరఁబు. 16

చ. అనిన నకంపనుండు ప్రభువా! యతఁడొక్కఁడ వేల్పుసేనయున్
బనితభుజుండు వేల్పుపడవాలును, నా త్రిశిరుం డొకమ్ము వా
ని నొసట నాటుటే ఖరుఁడు నించిన యమ్ముల మర్చ్వించుటే
యనితరసాధ్యమైనది మహాద్భుతమైనదిగాఁ గనంబడెన్. 17

క. నా రావణుండు కోప శ్రీరంజిత దృశుఁడు దంత కృత్తాధరుఁడై
యా రాము నిదె వధించెదరార యన నకంపనుండు ప్రాంజలి యగుచున్. 18

ఉ. దేవర దివ్యచిత్తమునఁ దేవలె సత్కృపకాలవాలమై
నా విభు! యా మనుష్యుఁడనినం బెఱమానవులట్లు కాదయా
నా విభు! వాఁడు వీరుఁడనినం బెఱవీరులయట్లు కాఁడు బా
హావలయాకృతాహిపతియై చను తేజము మాఱటంజనున్. 19

క. అదియేమి చాపవిద్యయొ గుదులగు బాణముల గాలికొట్టించి సహ
స్రదళము చిఱుపింజలుగాఁ జెదరిచె, నత్యంతరక్షసీమం జనఁగా. 20

చ. అదియు విచిత్ర మౌఁగద ఖరాసురుఁ బాలిత శౌర్యుఁ జేయఁగా
నెద దయపుట్టి యమ్ములను నేమియుఁ జేయక చించనిచ్చె నా
ప్పిదమయినట్టి మైమఱువు వీనిని మించిన చిత్రమేమనన్
మృదువు తదీయభావుకత మింటికి మంటికిఁ గూడ లక్ష్యమౌ. 21

గీ. అతఁడజయ్యుఁడు వానిపై నరుగరాద యతని బాణమ్ము వమ్ముగా దతని వగతుఁ
డమ్ముతోఁ దాఁకరాద సహస్రలక్షరిపువధముచేసియును జెమరింప డతఁడు. 22

క. నానాదివ్యాస్త్ర పరిజ్ఞానాంభోనిధి భుజాప్రచండబలుఁడు క్ల
ప్తానేక బాణగతవే గానిల కల్పిత మహోలయానేహుండున్. 23

సీ. హైహయార్జునుని బాహామహాఘోరకాంతార కఠోరకుఠారధార
యతని భుజాసృష్టి మెతకబాఱిన దాతఁడొక్కఁడు లీలగా యుద్ధమాడె
నతని తమ్ముండుండె నారగ్వధ కిసాలయచ్ఛాయ మేనివాఁ డతనితోడఁ
బటుమంత్రశాలులు బవరంబుసాగిన విలయభైరవమూర్తి విచ్చినట్లు
గీ. యతని నెదిరించినిల్చుట యరిదిసూవె యతనినెదిరింపకయ గెల్చుటరిదికాద
యతనినెదిరింపకయ గెల్చునట్టిత్రోవ యొక్కఁడున్నది యదియకార్యోచితంబు.

ఉ. ఆతత మస్థిచర్మగతమై యసుసంతతి పోవునే కృత
త్రేతలయందు జీవులును ద్రెళ్ళరు వేఱొక హేతువొప్పి, కా
నీ తొలిఁ దమ్మిచూలు సృజియించెను హేతువొకండు రామునం
డాతని భార్య యాతనిది ప్రాణరహస్యము రాక్షసేశ్వరా! 25

ఆ. అతఁడు ప్రాణి యామె ప్రాణంబు, ప్రాణంబు నపహరింపుమయ్య యసురనాథ
సకల సృష్టిలోని సర్వసౌందర్యంబు మూటకట్టినట్లు ముగుద పొలుచు. 26

ఆ. అల సమృద్ధి యన్నయట్టి శబ్దార్థంబు సతి పయోధరములు జఘనతలము
విమలతర శరీర విన్యాస మౌచిత్యమన్న శబ్దమునకు నర్థ భూమి. 27

ఉ. అమ్మధురావలోకనము లద్భుతమయ్యెడు సీత లోచనాం
తమ్ములు సాగినంతన శతప్రమితుల్ మధురేక్షుచాపఖం
డమ్ములవారు రత్నమకుటంబులవారు జగద్విలోభనా
స్యమ్ముల వారునుం బ్రభవమందెద రంబుదనీలరోచిషుల్. 28

చ. నిగమమహార్థముల్ జగమునిండెను దన్నిగమాంతవైఖరుల్
నిగమచయంబుకన్న హవణించెను దన్నిగమాంతచూడమై
తగిలెను బ్రహ్మనాఁబడు పదార్థము బ్రహ్మముమౌళి సీతక్రాం
జిగురుపదంబు గోటి రుచిచే రుచిమంత మదెంతచిత్రమో. 29

వ. అనిన నేకవస్తు వికారంబులైన భయమోహంబులు క్రమ్మి రావణుండు. 30

క. పరకాంత వాంఛ నేరిపెదరు రక్షోవిప్రజాతి తలఁగు తలఁగు నాన్
గురుసులువారిన నవ్వుల విరిసి రకంపనుఁడు దనుజవిభుఁ డొక్కటిగా. 31

మ. ఖరయుగ్మంబు రథంబుపై నరిగె నాకాశంబునన్ రావణుం
డరయన్ సూర్యుఁడు భూమిదగ్గఱకు రానైనట్లు నీకార్యవా

గుర తానల్లఁగఁ జాలువాఁ డెవఁడు కన్గొవాని మారీచు ని
ర్భరచింతాభర నేత్రకోణ విచరత్ప్రహ్లాద భావంబునన్. 32

ఉ. వేచిన దైత్యనాథునకు వేగమ స్వాగతమిచ్చి భక్ష్యభో
జ్యాచమనంబులం దనిపి యయ్య! యెదో పనిలేక దానవ
శ్రీచణులైన రావణులు చేరరు పేదలయిండ్లకంచు మా
రీచుఁడు బిట్టు తాననుసరించెను దానవనాథు చిత్తమున్. 33

వ. అనిన రావణుండు సర్వజనస్థాన రక్షోబలంబును ఖరదూషణ త్రిశిరులను వనవాసి రాముండు వధించెనంట. వానిభార్యను జనకరాజదుహితను సీతామహాదేవి నపహరించవలె నన. 34

గీ. నివ్వెఱను బొంది మారీచుఁ డవ్వ! యెవరు నీకుఁ జెప్పిరి జానకినిన్ హరింపు
మనుచు మెడమీఁదఁదలలుండనభిలషింతె యన్నముందిని బ్రదుకఁగానభిలషింతె.

సీ. సేమమా! దానవశ్రీమహారాజ్యేందిరా సమాసన్న భద్రత్వమునకు
శ్రేయమా! లంకాపురీ పురంధ్రీమణీ భావిత సౌభాగ్య దేవతలకు
భద్రమా! దనుజసంపల్లతోద్యాన పోషక దీర్ఘికా సరోజాతములకు
హైహయార్జునుని బాహామహాఘోరకాంతార కఠోరకుఠార ధార

గీ. మెతకపరచిన సీతాసమేతుఁడైన చండరాము భుజాలీనశౌర్యవహ్ని
కల్పితాపకృతీంధనాకార పటు శిఖాళిగాఁ జేయఁబడలేదుగా సురారి! 36

శా. ఐపోవచ్చినవేమొ దైత్యులకుఁ గట్టా! మంచిరోజుల్ దనుః
శ్రీపాండిత్యపయోధి యంతరమునం జెందించి దీవ్యచ్ఛిఖా
వ్యాపారం బయినట్టి బాడబ శిఖిన్ వార్వేల నింకించి శ్రీ
ద్వీపం బుప్పెనలోన ముంచుకొనలేదే నిట్టులూహింతురే. 37

క. అమరఁగ నంతటి రక్షశ్చము వొకవింటివయి నొక్కజామున నాశ్చ
ర్యముగ హరించినదగు లక్ష్మి మి దైవముతోడ నేటికి విరోధింపన్. 38

మ. అనుకూలించునయేని దేహగతసౌఖ్యంబుల్ విచారింప వ
చ్చును గాదే నపవర్గవాంఛఁ జనవచ్చున్ దైత్యులున్ మానవుల్
మనకున్ వేల్పుల కట్లుగా నవధిక్రమ్మన్ భోగమాత్రంబు ల
క్షణముంజేయని బ్రహ్మకే నొక నమస్కారంబు గావించెదన్. 39

శా. ఆ సృష్టింబడి పూవులై పసరుకాయై దోరపండైన శా
ఖాసంపన్నముగాఁగ నౌ దనుజవంశక్ష్మారుహం బస్త్రమా
లాసందగ్ధము చేయఁబోకు శిఖి మూలచ్ఛేదమౌనట్టి యా
యాసంబేటికిఁ బుణ్యముండునుగదయ్యా దైత్యలోకేశ్వరా. 40

క. అరయఁగ నీ యూహను నీశిరసున కెక్కించినట్టి చెట్టు యతం డా
శర వంశ వృక్షమూలముఁ బురుగు తినంబట్టినట్టి మొదలు సురారీ. 41

గీ. చాలుచాలు నింకఁ జననయ్య లంక కనంగ రావణుండు ముంగివోలె
లేచిపోయె హస్తి లీలా సరోజాత మచటఁ బాఱవైచి యవశబుద్ధి. 42

వ. అంత సామాత్యుండు విమానస్థుండైన రావణుని దృష్టిగోచరయైన శూర్పణఖ.

క. తన కనులయెదుట ఖరదూషణు లిద్దఱు తేలికైన చావులు చావన్
మును రామువిల్లు పర్జన్యుని మెఱపును యమునిపాశ మొక్కటి గాఁగన్. 44

ఆ. అధికమైనయట్టి యాత్మభావం బల్పదేహభావసన్నిధిన్ హతంబు
యైనయట్లు తోఁచునంత శూర్పణఖకుఁ బ్రేమకంటెఁ బగయ పెద్దదయ్యె. 45

ఉ. ఎక్కడ నెట్టివేళలను నించుకయైనను సంచలింప డా
యుక్కివమైన యుద్ధమున నొక్కసుమంత చలింపఁ డేమి యా
యెక్కువ, చంపునట్లభినయించితి జానకి నంతమాత్రలో
నెక్కడి తొట్రుపాటుకనె నేమిభయంబది ప్రాణదఘ్నమై. 46

మ. సొరిదిన్ దానవయక్షరాక్షస పిశాచుల్ బద్ధవైరుల్ పొరిం
బొరి హింసించినవైనఁ జెక్కు చెదరంబోనట్టి యా శౌర్యము
ద్ధుర మా రాముని లొంగఁదీయుటకు నీద్రోహంబు సేయన్వలెన్
ధరణీసంతతి విప్రయోగికి రఘూదన్వత్సుధారోచికిన్. 47

ఆ. ఖరుఁడు సంప్రహార ఖరుఁడు దేవాసుర ప్రబలయుద్ధజలధి బాడబంబు
బ్రహ్మదత్త బహుళ వరప్రచండాకృతి చాపవిద్యముందు చాలలేదు. 48

ఉ. చీఁకటిచెట్ల క్రొంజివురు చెన్నులు మాఁగిన తచ్ఛరీరరే
ఖాకమనీయకాంతి పరికల్పితమార్దవ చిత్తవృత్తియై
చేకొన డా ఖరుండు వివశీకృత శౌర్యమహాగ్ని రేఖ పై
నేకసతీవ్రతంబొకటి యుద్ధతిమధ్య సమార్ద్రభావమై. 49

మ. అరరే! దానవు లెంతమూర్ఖులు సముద్యత్తీవ్రరేఖా తప
శ్చరణంబుం బొనరించి బ్రహ్మవలనం జా విట్లున గ్లెచ్చటం
బొరయన్ రాని వరంబు వేఁడెదర యేమూలో సదామృత్యువుం
జొరగా సందొకయింత యుండునుగదా క్షుణ్ణాఖిలార్థ్యంబులన్. 50

ఆ. దానికంటె సముదిత మహాస్త్రసంతతి యడిగికొనుట యెంతయైనమేలు
అసలు చావులేమి యడిగిన నీయనియపుడు తత్ప్రయత్న మనవసరము. 51

శా. తానైరావణుఁ డొక్కరుండు చటులాస్త్రజ్ఞాత మావాంద్రలో
నేనోమార్గగతాల్ప భౌతిక సుఖాకృష్టుండు యోజించినన్

దానై స్పర్ధవహింప సీతనికి నాతం డొక్కడేచాలు వాఁ
డే నన్నన్ భయముంగలండు తుదకెట్లోఁ జేయు మద్వాక్యమున్. 52

ఉ. పూవులరాచవానిదగుఁ బోఁడిమి గుర్తిడె దుర్ముఖుండు నా
దేవుఁడు రాముఁ డాతని వధించి మహోపకృతింబొనర్చె నే
త్రోవ నెదో గ్రహించెదరు ధూర్వహబుద్ధులు నావులించినం
బ్రేవులు లెక్క పెట్టెదరు హృద్గతి తోఁచగనీయరా దహో. 53

మ. ఒక మార్గంబున లోభపెట్టఁదగు దైత్యున్, వాఁడు నానాప్సరో
నికరంబుం జెఱవెట్టు కాముకుఁడగున్, నీరేజపత్రాక్షి జా
నకి సౌందర్యము పుక్కిలింతలగు గంధర్వాప్సరోయక్ష క
న్యకలా కేకర మత్స్యపుచ్ఛముల కెన్నన్ నేను వర్ణించెదన్. 54

చ. మెడతెగినన్ త్యజింపఁడది మేకొని పట్టిన మొండిపట్టరే
మృదుఁడును దాళుకోఁ జనక యెట్టెదుటం గనిపింపఁగావలెన్
బడఁతుక సీతవంక నెదవంగినఁ జాలును రాముఁ డేమి సే
సెడు దశకంధరుండు పదిచేర్వుల నీళ్ళులు త్రావజేసెడున్. 55

శా. మూలచ్ఛేదముగాఁగ నున్నదిది రాముండీ వియోగార్ణవ
వ్యాలీఢోగ్ర తరంగసంతతికిఁ దెప్పల్ కట్టునా? దాఁటునా?
యౌలే ప్రేమకు బ్రేమ వ్యర్థమయి కట్టా! బందుగుల్ చచ్చి నా
కేలా యాతఁ డటన్న జాలిపడ నన్నేమైసి మన్నించునా! 56

వ. అంత శూర్పణఖ రావణునిఁ గాంచి యాశ్చర్యము కోపము శోకంబు వ్యక్తం
బుగా నిట్లనియె.

క. నీకేమి మహారాజవు నీకోరిన కోర్కి మున్న నెగయు విమానం
బేకడ ముట్టిన రాజ్యము చీకయి ఖరుఁడొక్కఁడే నశించెనుగానీ. 58

చ. ఒకపినతల్లి పుత్రుఁడని యుండిన నుండగవచ్చుఁగాదొ నీ
ప్రకట భుజాభిగుప్తికిని బాత్రుఁడటంచును నుండవచ్చు మ
ప్పికగ ధరిత్రికిన్ వెనుకపీటికిఁ గాపనియుంఢవచ్చు న
మ్మక మదియంత యేకతమొ మానుగ నీకును జీమకుట్టదే. 59

మ. అలవాటైనది మొండిసాహసము నాహో! యంతవాఁ డింతవాఁ
డలఘుండంచని పేరువచ్చినది నీ కయ్యయ్యో! నీ తెర్విత్తే
టలకున్ నీతియొ దిబ్బొ! యంగదకిరీటా ల్లార్చి సింహాసన
స్థలిఁ గూర్చుండుమటన్న నౌర! మనతోసాటా! త్రిలోకంబునన్. 60

శా. అయ్యో! రావణునప్పగా రతివ యేమాశీవి, భోగంబు లే
లయ్యా వేతాకచోటఁ గన్నదునటం చాగొప్పు కాగొప్పయే
కొయ్యం జెక్కినయట్లుగా నయిన ముక్కున్ వీనులుంగాఁగ దా
ని య్యందంబది నా మొగానకు మొగంబే! యోయి! పౌలస్త్యుఁడా. 61

క. అని వెక్కివెక్కి యిట్లనెఁ దనయంతటి తమ్ముఁడుండెఁ దానను ధైర్యం
బును నిన్నాళ్ళకు వట్టిది పొనరించిన రాముఁడొకడె పురుషుఁడు ధాత్రిన్. 62

మ. కులమర్యాదయు బాంధవాశ్రయము నీకున్ బట్టవో యా గుణం
బులు నతఃకరణప్రధానములగుం బోనిమ్ము నీ సౌఖ్యముల్
తలఁపన్ నీవును జూచుకోవలయుఁగాదా! యట్లె పాథోధికి
వల నీ దక్షిణ వేలదాఁక రిపు ప్రాబల్యంబు సైరింతురే. 63

క. అలసుఁడు నిర్వ్యాపారుఁడు కలితవ్యసనాయమాన కాంతాలౌల్య
స్ఖలితాత్మధైర్యుఁడై చను నిలాపతిఁ ద్యజించు ధారుణిందిర కంటే. 64

మ. తలక్రిందన్ దన కందరాని రిపుఁడై తానెవ్వఁ డాలోచనా
స్ఖలితుండై నిదురించుఁ జంచదహిదంష్ట్రాఖట్వసుప్తుండు వాఁ
డెలమిం బొందగరాద యెవ్వనికి నాయీమేర శత్రూర్వినా
థుల కప్రాప్యమటన్న భ్రాంతిపడి యెందో రంధ్రమేదారినో. 65

మ. తన సామంతపు నేల నీకును జనస్థానంబు, తద్ధాత్రి రా
మునకుం గైవసమయ్యెఁ గాల్కదువగా బోకీవు తద్ధాత్రి నీ
కును సామంతపు నేలయౌట చని కైకో లంకయే రామచం
ద్రున కారీతిదియౌను నిష్క్రియు సపత్నున్ బట్టి మన్నింపరే. 66

వ. ఏదో లోకసామాన్యులు కాదో కించిదధికులనుకొంటి నవిషహ్యాలన్న ఖరునిచే
తనే యట్లు చేయించి యుందును. 67

శా. ఆలంబో, జయమో, యపాయములో మర్యాదావిశేషంబో, రా
జ్యాలో, పాడో, యవెల్ల నేమిటికిఁ గట్టా! జానకిం గాంచినం
జాలిం జచ్చుచునుంటిఁ దాదృశ మహాసౌందర్యభాగీరథీ
నాళికాకృతి బొద్దపుర్వును సుధాంధఃప్రాశిగాఁ జేసెడున్. 68

గీ. అందకత్తె బైరాగికి నతివఁజేయు దానికంటెను బ్రహ్మ ఛాందసము లేదు
ఛాందసము దాఁటిపోయెను జనకదుహితఁ జెడు బికారికి భార్యను జేసినపుడు.

గీ. అల్పసౌందర్యవతులైన యచ్చరలయు సోమయాజుల కూటమి చూడలేమె
కలిగియుండను వలయునుగాదె చూడగాను సీతను బిచ్చి బికారితోడ. 70

చ. అరయఁగ మత్పరాభవము నార్పు మటంచును గోరఁబోవ న
ద్దిర! ఖరనాశమౌ వగను దీర్పుమటంచును గోరఁబోవ న
చ్చరలకు బోడి యాజుల ప్రసంగము మాన్పిన త్వద్దయారస
స్ఫురణము పావ మా జనకపుత్త్రికి సైతము గల్గఁగోరెదన్. 71

వ. తాతమ్మగారు సరస్వతీదేవిగారి సౌందర్య మెఱుఁగుదున, ఆలోచనకొలంది గాని యామె సౌందర్యము పొడకట్టదు, పరమప్రపితామహి భవాని సౌందర్య మెఱుఁగుదును, తదేకధ్యాననిష్ఠఁగాని యామె సౌందర్యము సౌందర్య మనిపించదు. సంగీతమువలె నాపాతమధురమైన సీత సౌందర్యమే వేఱు. 72

శా. ఏ విద్యుల్లహరీప్రవాహములో యిట్లే సర్వానాళంబులన్
ప్రావృట్కాల పయోదశీతల మరుత్ప్రాగ్వార సంస్పృష్టిగాఁ
గ్రోవుల్ కట్టి మనోజ్ఞసారణఁదనూరోమాంధువుల్ సొచ్చి యం
దావిష్కారము పొందు పుల్కలుగ మోహానందసంధాయియో. 73

క. అని చుప్పనాక యుబ్బునఁ గనుఁగొలుకుల నున్న వారికణమును గోటం
దునిమి దశకంధరునకున్ వినఁబడి వినఁబడనియట్లు విలపించె నిటుల్. 74

అపరాజితము

కుహలి చెవులు ముక్కు కోసె దురాత్మకుం
డహహ పొడువఁడాయె నక్షియుగంబు నా
గ్రహము కనఁగలేని రావణుఁ గాంచఁగా
దహనమయినఁ గంటఁ దార్కొన దేలొకో. 75

క. అన రావణుండు రాముండని యెవ్వఁడు లక్ష్మణుండటంచని యెవఁడున్
వనజాక్షి సీతయును రామునకుం గామినియ చెప్పుము సవివరమనన్. 76

క. నీకున్న కోపమునకును నీకుండిన గర్వమునకు నీవు తొలుతగా
నాకథ విని కదలమిఁగై కోకేమి సరే వినను దగు నడిగినదియున్. 77

గీ. రాముఁడును లక్ష్మణుఁడు దశరథనృపాల సుతులు సాకేతవాసులు నతులధర్మ
పరులు కోదండధూర్జటుల్ వారిలోన రాముని లతాంగి వైదేహి రమణి సీత.

ఉ. ఒక్కరికన్న నొక్కరు మహోగ్రులు నన్నయుఁ దమ్ములిద్దఱున్
దిక్కరి కంఠఘీంకృతుల దెప్పరమై చను నారిమ్రోఁతగా
నెక్కిడునట్టి వింటఁబడి మృత్యువు బాణపరంపరాకృతిన్
నెక్కొనువారికై యెదురు నిల్చుట వేఱొక బ్రహ్మమొల్చుటే. 79

క. జన్యాధ్వంబున జావని యన్యాధ్వంబున హరింప ననువుపడని రా
జన్యున్ వానిని ధారణి కన్యాధ్వంబున జయింపఁగా వీలుపడున్. 80

చ. పొలుపరి యెవ్వఁ డెత్తికొనిపోయెను బోయినదారి యేది యే
వలనున నుంచె నేగుఱుతు పట్టగరాని గతిన్ హరించినం
బొలఁతుక నూహయేర్పడకమున్న వియోగమహాగ్ని రామచం
ద్రులు మరణింత్రు లక్ష్మణుఁడు తోడన చచ్చుసదానుగామియై. 81

గీ. సీత యంత తేజస్వతి సీత వచ్చెనేని లంకలోపల శీతభానుభాను
కాంతి యక్కఱలేద సంక్రాంతరత్నసమితి దీపికలయును బ్రసక్తిలేదు. 82

వ. అందున వెలుఁగు చీఁకటి పాళ్ళు సరిగా శూర్పణఖవలె లెక్కగట్టి రావణుండి
ట్లనియె. 83

క. ఆజ్ఞాపించెడిదానవు విజ్ఞాపన చేసినట్టి విధముగ నాయెన్
ప్రజ్ఞాన ఘనవు నీ నీతిజ్ఞత నా రాజ్యసౌధదీపిక కాదే. 84

గీ. అంత చచ్చిలేనమ్మ ఖరాదిమరణ జనితదుఃఖమ్ము బొందఁగా జాలనంత
త్వత్పరాభవ జనిత సంతాప మెఱుఁగనంత పగతీరుదారి యెట్లనుచుఁగాక. 85

ఉ. అక్కట! దండనీతి మొదలాడుట కార్యపథంబుకాదు తా
నిక్కడ సామదానముల కించుకయైన ప్రసక్తిలేద యా
యొక్కడు భేద మున్నయది యున్నది శాత్రవధైర్యభేద మీ
దిక్కునసీతిసస్యములు తెచ్చిన నాటుట పండు టొక్కఁడై. 86

వ. అంత రావణుండు ప్రచ్ఛన్న వేషుఁడు మందురైకదేశనిద్రాణు రథచోదకుని
సభయ వేగసజ్జితము పిశాచవక్త్రఖరయుగ్యంబు రథంబెక్కె. 87

క. పదితలల కుండలంబులఁ గదలాడిన రవలకాంతి కడలందున ని
ర్వది జాబిల్లి వెలుంగులు పొదలినవగు వెలుఁగుఁ గంబములుగా నొప్పన్. 88

క. పదితలల పాము క్రతుసంపదతూలించెడు నఘంబు బయలువెడలె నాన్
మొదలిటి యసత్వదార్ఢ్యము పది వివృతాస్యములతోడ బయలువెడలె నాన్. 89

ఉ. ఉజ్జనచేయరాని యొక యోగము సేయఁగఁబూని బ్రహ్మయన్
వెజ్జు జగంబులన్ బుటముపెట్టి రసంబును మాడ్చ నెంచుచున్
విజ్జిన యగ్నిసంగ్రహణ వింశతికాష్ఠక పార్శ్వయుక్తిగా
జజ్జరకాదు పంక్తిఘట జంగమయంత్రము చేసిపుచ్చెనాన్. 90

గీ. విద్యయు నవిద్య శౌర్యంబు భీరుతయును ధైర్యము భయంబు పరమమౌదాత్త్యరేఖ
మత్సరతయుఁ బ్రతీప సామగ్రి కలసి మోహనామోహనాకృతి పూనె ననఁగ.

వ. సముద్రము చన్న యతనికిఁ బ్రత్యక్షమైన సాగరవేలాభూత పర్వతకాననంబు.

సీ. కోకిల. తూరుపు కోనలోఁ గూసినఁ బడమటి కోనలోఁ బగిది తోఁప
నుత్తరదిక్కున నుదయించు సెలయేఱు దక్షిణదిక్కుంధి దారిపట్ట

నాకాశగత తారకాళి నానాతరు ప్రసవ సంతానమై పరిణమింప
నన్నాద సంబంధి హాఉహాఉ రవంబు యక్షకన్యాగీతు లట్లుపొలయ
గీ. భ్రాంతిమయచేతనుండైనరావణుండు చిన్నసెలయేళ్ళు మొలనూళ్ళచెలువుగులుక
గిరి నితంబములను మతిక్రీడమైన రతిసముత్సాహమున సంచరణముచేసె. 93

సీ. చూలెంతరాంధ్రు పక్షులు వృద్ధవృక్ష కషాయ నిర్యాసముల్ చప్పరింప
ముసలిలేళ్ళులు నోటిపూఁతకు నేరేటి పాదల నిర్ఝరవారి పుక్కిలింపఁ
గృకలాసతతి లవంగకవల్లి తుదికాడ నితవరి నోటి శుభ్రతకుఁ గొఱుకఁ
బ్రతను శీతల మరుత్ప్రచయ తరంగమ్ము నహిరాజ కన్యక లభిసరింప
గీ. నిదిగొ కేళి నిధాన సాహిత్యరాశి పల్లవ లతాంత మధుర సంభారభాసి
జలధివేలా వనాంత వసంతమూర్తి యనుచుఁ గోకిల పిలిచిన దనఁగఁ గూసె.

మ. తన శౌర్యంబునయందు నచ్చటి ఋషిధ్యానంబునం దేకబు
ద్ధినిజేయున్ మఱి పంచభూతములు శాంతిందాల్చి, వ్యాఘ్రాదిజం
తు నికాయంబు భయంపడున్ దనకుఁ, దోడ్తోమౌనులం బ్రేమతో
గను, మాత్సర్యము పొంది రావణునిక్రాల్గన్నుల్ దువాళింపఁగన్. 95

సీ. కఠినీకృతాంగలు కమలాయతాక్షులు నాజానుబాహువు లైనవారు
మొగములయందున ముంజేతులందు ముగ్గులచుక్క పొడిపించు కొనినవారు
చిక్కవేసిన రంగుచీరంచు కొట్టురా విఱిచికట్టినవారు, వివృతవదన
జలజాతములయందు స్మరుఁడు విల్వంచి ప్రత్యాలీఢపాదుఁడై యలరువారు
గీ. విపులరవమోహకములు కాళ్ళపదిజతలు చేతులపదాఱుజతలును జెలఁగఁజనుచుఁ
గిన్నెరలు మీటునట్టి యక్షీనివాహము గిరి నితంబ్రాగ కాంచికాకృతులఁ గంచు.

చ. జలధి వినీల భంగపరిసర్పిత ధూత పయోజ బాంధవో
జ్జ్వలిత లురల్లురత్కిరణ సంతతి తీర ధరాధరేంద్ర పా
ర్శ్వ లలితధాతు మిశ్రణ లసచ్ఛవి పర్విసఁ గృష్ణపక్షపున్
మలుదెస సంజ మూసికొనుమాదిరి, నూఁది రిరంస పెంపగాన్. 97

చ. మొనసి తరంగముల్ కుటిల పుచ్ఛములన్ విదలించు మత్స్యరా
జన వదనోత్థశైవల లసత్కణఖాదనతః కషాయ వా
ననలును, నర్వుతెట్టియల చాలుల యుష్టని గోరువెచ్చగా
లిని జనుదెంచు వాసనలు, శ్లేషితమైచన మూలజిహ్వలన్. 98

గీ. రావణుని రథధ్వని సముద్రంబు నగరములయు మ్రోఁతలు చీల్చుక పోవుచుండె
చిందుల సవేగవాహిని చీల్చి రెండుకడల నిలుకడ నీటిని గదిమినట్లు. 99

చ. గగనము తీరకాననము కంధియు దానవుమేను నెల్లన
ల్లగనయి చాయలో విఱుపులం దగి చుట్టుచునుండి నల్లనౌ

పొగ పవమానధూత మవుపోలిక వట్రువ నల్ల కాంతులై
యెగసిన రీతి నొప్పెఁ దమి యేచిన యగ్గిని నూహసేయఁగన్. 100

వ. రావణుం డిట్లు పోయి యొక మహాన్యగ్రోధ తరువుచేరి. 101

ఉ. పచ్చని కన్నులన్ గగనపద్మము పుష్పాడిరేఁగ నప్పుడే
విచ్చిన గ్రుడ్డు డిప్పలను వెచ్చని తెక్కఁల బాయఁద్రోచి వే
గోచ్ఛలదాత్మదేహుఁడు మహోదధిపయోధిని దాఁటి మింటిలోఁ
జొచ్చు స్వతంత్రుఁడౌ గరుడి చూచుచు వీపునయందుఁబాములన్. 102

క. మీ రెవ్వరంచు నడుగఁగ వారిట్లని రోయి చండభాస్వరవేగా!
ధారుణికి దింపు మమ్ముల దోరింపంబడితి మగ్నితో సూర్యునితో. 103

ఉ. నీ పెదతల్లి పుత్రులకు నిర్విత ప్రాణములన్ దయామతీ!
యాపతితోరు మేరుమహితాద్రి సపక్షగతీ! నిజంబుగా
నా పినతల్లి దాస్యవిషయంబున నేమియు మేమెఱుంగ మే
దో పణమాడిరంచు వినుటొక్కటిదక్క లయాగ్నికల్పుఁడా! 104

వ. అనుచుండ నందొక్క డిట్లనియె. 105

గీ. పుట్టి నిముసంబు కాలేదు భూమి యాకసంబు సూత్రపట్టినయట్లు సాగినావు
తల్లి దాస్యంబు నిజముగాఁ దలఁగుటనుచు నీకు నొక పెద్దపనియటే నీడజేశ!

క. తలప్రాణంబులు తోఁకకు మలఁగెను నీతాఁకు సూర్యమండల చండ
జ్వలనంబున నీవు సుధాశిలవోలిక నింత చెక్క చెదరవు కంటే. 107

మ. రవి యా దూరపువేఁడిఁ దాళక సముద్రంబందు నిద్రించు మా
కవురా! నిప్పులు తాఁకి చావని శుభంబౌ నా హిమానీసుధా
భ్యవహారంబు ఘటించి పెట్టుము పవివ్యాకృత్తపక్షంబులౌ
నవనీధ్రంబుల నూడు తీర్చినటులౌనయ్యా! విహంగోత్తమా. 108

ఆ. అయినవారిలోన నక్కటా! దాస్యంబు మనకుఁ దగదటన్న వినదు తల్లి
యిద్ది చేసిపెట్టుమెట్లొ యొప్పింతుమయాఁడి చావులేమి చేఁదొ యనఁగ. 109

వ. గరుడికి లౌకికంబెల్ల తెలిసి వైరాగ్యోదయంబై మాతృప్రాణ విముక్తికోరి యిట్లనియె. 110

క. నావంటికొడుకు గలిగియు నీవీ వరవుడముసేఁత నెగడునె తల్లీ!
బావుకొననిమ్మ యమృతము వే వారి మొగాలఁ బాఱవేయుదు ననుచున్. 111

వ. క్షుధాపనోదార్థం బనంతశక్తిసంపాదనార్థంబు జనకోపదిష్టమై సాగరమున నొండొంట స్పర్థవహించి యనంతసంవత్సరములుగా యుద్ధముచేయుచున్న గజకచ్ఛపంబులఁ బాదనఖంబుల గ్రహించి యారగించుతావునకై వెదికి యా

మఱ్ఱికొమ్మపైననే వ్రాలె. ఈశాఖ నాశ్రయించి యంగుష్ఠమాత్రదేహులు వాలఖిల్యులు సహస్రములు వ్రేలాడుచుఁ దపశ్చర్య గావించుచుండిరి. మూఁడు పర్వతంబులంత యా బర్వునకాఁగక యాశాఖ పుటుక్కున విఱిగె. సువిభక్త కాలజ్ఞుండైన యగ్గరుడి.

ఉ. ముక్కునఁ గొమ్మకొంచు నవిమూఢతఁ జేసిన ప్రార్థనోక్తులం
జొక్కుపుఁ దొక్కుఁబల్కులుగఁ జూచుచు వారు ప్రసన్నులై చనన్
జిక్కని వైనతేయుఁడు గ్రసించెను వానిని శక్తి నంది స
మ్యక్కరణుండు నింద్రముఖుఁడై తొలగించెను దల్లి దాస్యమున్. 113

క. చని సాగరాంతవేలావని నేకాంతప్రదేశ పరిరంజితమై
చను నాశ్రమంబు మారీచుని యునికిని రావణుండు చూచుచు నిలిచెన్. 114

క. శంకా నివృత్తి సూచిత హుంకారము హస్తచలన మొప్పఁగ రక్షః
శంకర యుగమూర్తి నిరాతంకమతిన్ దాటకేయు ద్వాఃస్థలి నిలిచెన్. 115

మ. కని మారీచుఁడు విప్పఁగన్నులను రక్షస్స్వామి! రా స్వామి! ర
మ్మని మర్యాదలు సర్వమున్ నెఱపి యేలయ్యా సురారీ! మఱిం
గన నీయింతయులోన వచ్చితివి లంకారాజ్య వృత్తాంత మం
దున నేక్రొత్తయుఁ బుట్టలేదుగద తోడ్తోనంచుఁ బ్రశ్నించినన్. 116

క. పదియు బిగించిన మొగములఁ బదిలిప్తల పాటు మౌనభావము వెలయన్
వదనం బొకంట సవ్వడి పొదలఁగఁ దక్కినవి యధరములు కదలంగన్. 117

క. అది నిశ్చయంబు చేసితి ముదిత జనక సుత హరింపఁబోవలె నిది త
ప్పదు మఱి కోఱలుతీసిన పృదాకువగు రాము డతివ విరహము కనఁగా. 118

ఆ. దనుజుఁ డిట్లుపలుకఁ దాను మారీచునకొక విచిత్రమైన యూహ కలిగెఁ
బదియుఁదలల నొకఁడెపలికెడుఁ బలికినఁబదియు నొకఁడెపలుకుఁ బదియునేల?

వ. నేనువినలే దేమియేమి యనిన మారీచునితో రావణుండిట్లనఁదొడగె. 120

శా. ఓహో విన్పడలేదయేమి యెదియో యూహించుచున్నావొ, నీ
యూహల్ నేను నెఱుంగుదున్ ముదిత లేదో సీత, యా చాపికిన్
దేహార్థంబును బ్రాణసర్వముఁ బడంతిం దెచ్చెదన్, రాముఁడో
హో! హోహో పరిదేవనా శిథిలమై యుల్లంబు పొల్లంబడన్. 121

ఆ. అతఁడు నాకుఁ జేసినట్టిదానికి వానికింత సేయఁదగదొ యేనుగాని
యనినమాట తాను వినలేదఁట వినలే దంతయుష్టమేమి యాతఁ డనఁగ. 122

మ. ఖరుఁ డీశానుఁడు దండకాటవి మహాక్రవ్యాదసేనాధురం
రుఁడున్ దూషణుఁ డంతటన్ త్రిశురుఁ డంతన్ మువ్వురున్ దానవే

శ్వర సామ్రాజ్య రమా ధరిత్రికిని బశ్చాద్భాగ రక్షామహే
శ్వరులౌ నాపినతల్లిపుత్త్రకులు చావంజూచు చిట్లుందునా. 123

మ. ఒకటా! రెండ! చతుర్దశంబగు సహస్రోపేతసైన్యంబు తే
లికగా వాలిక వింట దూసెనఁట యోలింబెట్టి యయ్యస్త్రవ
హ్నికిగాల్పంట్ల కటారికాంద్రగమి మండింత్రేమి! యమ్మంత్రసా
యకముల్ సూతురు యుద్ధనీతి విదులై యస్త్రజ్ఞ లస్త్రజ్ఞులున్. 124

శా. మండింపందగు నెల్లలోకములు బ్రహ్మాస్త్రంబుచేఁ గాలతా
జ్ఞండెవ్వాఁడును జేయునే పరముఁ డజ్ఞం ధూషవద్దగ్ధమ్ము
ద్భాండంబౌన యఖండకాలమున నాత్మద్రవ్యతం బాయు ని
ష్పిండీభూతము లాత్మభాగుపనిష త్సిద్ధాంతముల్ పట్టకన్. 125

చ. పరమములైన యియ్యవి యపండితుఁగూరిచి వానిగూర్చి యే
లఱుమగ వానిచేసిన మహోపకృతిం బ్రతికారవైఖరిం
దిరుగఁగఁజాల సర్వగమతిన్ బహుధా వెలయించి తత్సతీ
హరణము నిశ్చయించితి నహార్యము హార్యత యెంతనొప్పియో. 126

ఉ. పోయిన సేన లేదు చనిపోయిన బంధులులేరు వానికిన్
బోయిన సేన బంధువులఁ బుట్టిన పెన్వగ యెట్టిదో యిదిం
జేయఁగ వానికింఁదెలియఁ జేడియఁబాసిన సీలయూడు బొ
మ్మై యురియంగ నాయురియు టయ్యది వానికెఱుంగనయ్యెడున్. 127

మ. పదుమూఁడేడు లరణ్యదేశమున సంవాసంబుగావింప నే
యదనన్ గిల్లిన రాలిపోవు నతఁడా వ్యాసంగముం జేయఁబో
నెదలో సూదిగ వచ్చి దబ్బనముగా నీ తేలుటట్లున్న దే
యిదియుం జూచుచుఁ బోవుచున్న యెడనట్లే మేయుచుంబోయెడిన్. 128

మ. అదిపోనీ! యొక యాఁడుదానిచెవు లాహో ముక్కునుం గోయువా
రిది ధీసంపుటి యెట్టిదందువు •పరిస్పృష్టాఘ నానాజనుః
పదమై యాదృశమైన యూహ జనియింపన్ వచ్చుఁగా కక్కటా
యిదియుం గామమ. క్రోధమా మదమ కాదేన్ మోహమా లోభమా? 129

మ. నలువౌ శబ్దజగత్ప్రకాశకులు నంతర్ద్రష్టలున్ జిత్తవృ
త్తులు బాహాటములైన వానికిని సాధుల్ పేర్లుతేఁగా నమం
జుల మీద్రుక్కృతి దేనిక్రిందికిని వచ్చుం జెప్పవే! వేళలోఁ
గలియుం జొచ్చినఁగ్రొత్తలిట్టివి చెలంగన్ జిత్తవృత్తుల్ చనున్. 130

మ. అది పౌలస్త్యకులాన సర్వశుభకార్యశ్రేణి నారాధనీ
య దశాగౌరవభాజనాకృతియు మా, కా భావ సంపద్దశా

స్వదులొ వారికిం దోడంబుట్టువును విస్పష్టంబుగా మాకు, ని
య్యది మన్నింతుమయేని సర్వమగు మర్యాదా పరిభ్రంశమే. 131

చ. విగత సమస్తధర్ముండును వీడిండి క్రూరుండు వానిచేత ని
ట్టి గతిరచింపంగాబడి కడిందిగ నా తలకొట్టివేసిన
ట్లుగ ననిపించుచున్నదియు లోపలలోపల మండిపోవు నీ
పగ పొగకుమ్ములో నణుంగుపోలిక చేయంగనేరనయ్యెదన్. 132

చ. ఖరుని విధానం జేత విలుగైకొని యెట్టిదు రేగుమందువా
యరయంగ సర్వదానవ మహోంచిత రాజ్యరమా విధాత నాం
టరిగను బోవుటొప్పదు, వినాకృతరాజ్యుండుగాక యాతండున్
ధరణి వహించువాండయినం దారునె యొంటరి వింటికాండుగా. 133

చ. అమరునె భీతి ధూర్జటి పదాంబురుహోంచల దేహాళీసుమా
గ్రిమము పునఃపున స్సువినికృత్తమయయ్యుం బునఃపునః ప్రరూ
ఢము ప్రకటార్చనాకృతి విడంబి శిరోదశకంబు వాని చా
పము తుద నేమొ యౌననెడు భావము పుట్టును దావులేదనన్. 134

క. ఇలు వెడల నడంచె దనయుని నల యసమంజసుని సగరుం డావంగడమం
దలి చాలిక యదియే వీండిలు వెడలంగ నడవంబడియె నిప్డు పితచేం. 135

ఉ. ఇయ్యజితేంద్రియుల్ స్వకులహీనులు పైని స్వదేశదూషితుల్
కొయ్యలు కొంపలన్ వదలికోనగు చెట్టులుచేసి నిష్క్రియుల్
చియ్యలుపట్టు గొడ్డములుచేయుచుం గైతవశూరు లుగ్రులై
వెయ్యివిధంబులన్ వెసలపెట్టెద రెల్లజగంబులందునన్. 136

గీ. అతండు జీవించియుండంగా నసురజాతికింత క్షేమమ్ములేద యా యంతకార్మ
కిని మదితరుండెదుర్చుటయును శుభంబుకాదు మాయాప్రతారణకార్యమిద్ది. 137

క. శౌర్యమునకు శౌర్యంబును ధైర్యమునకు నంతయైన ధైర్యము మాయా
కార్యజ్ఞతలకు మాయా కార్యజ్ఞతలు నిను వదలి కనరాని వగున్. 138

గీ. ఈ రహస్య కార్యంబుల నెల్ల నీవు కాకను సహాయభూతుండు నాకు లేండు
ప్రాక్సమయ కార్యముల సమర్థతయు నీది యుజ్జ్వలత్వ9తిభము నికషోపలంబు.

మ. పలలాదుల్ పలుకామరూపములు తాల్పన్‌వచ్చు, నాకోర్కి మే
నులు నాతాల్చినవారి యూహలకొలందుల్ వట్టినే భీతి హే
తులు క్రూరంబులు, నీవా యూహ యదియేదో క్రొత్తకుంగ్రొత్తగా
గలిపింతెప్పటికప్డు నీదగు విదగ్ధత్వం బుదారంబుగా. 140

చ. హరిణకులంబునందు జనకాత్మజ మిక్కిలిమెత్తనౌ స్పృహా
సరణి వహించునంట నవసారసలోచన తాం గృపాగుణా

కరమతి యంతకావలయు గర్భదరిద్రుఁడు రాతిబొమ్మ వాఁ
డరయఁగ వాని కక్కట! కులాంగన యౌటయె చిత్రమైచనున్. 141

క. మరకతములు వైదూర్యము లిరవుగ మఱి వజ్రమాది యెందెందగు బం
గరులేడివోలె నౌచును దిరుగుము జనకాత్మజాత దృక్పథమందున్. 142

క. అ వర్ణసామరస్యము నీవే యూహింపు మెందు నెగడెడునెది దృ
గ్భావాకర్షావధిగను నా వెలయింపునను నూహ యూడకయుండన్. 143

చ. నినుఁగని తెచ్చిపెట్టుమని నీరజలోచన కోరు, రాముఁడున్
దన ప్రియురాలిమాట జవదాఁటడు, కార్ముకమూని వెంబడిన్
జను, వెనువెంటవచ్చు నమజన్ముఁడు, కన్పడి కానిపింప వీ
వును వని దవ్వుగా, నెడముపుట్టఁగ నాకును సీత దొంగిలన్. 144

క. ఖరుఁ డేమి తనకుఁ జేసెను మరి నా చేనైన నేమి మసలెను దనకున్
దురితాచరణుఁ డకారణ విరోధి మతిహీనుఁ డాత్మవిద్ధుఁడు జడుఁడున్. 145

వ. అనిన దీర్ఘనిశ్వాసుఁడు కంపిత తనువు నేత్రగత బాష్పుండు మారీచుండు
కొంచెమాఁగి యిట్లనియె. 146

ఉ. నేనొకమాట చెప్పెదను నీకును గోపమురాదయేని నే
నైనను వీరశైవమత మాపితి వైష్ణవబుద్ధిఁ జొచ్చితిన్
బూని భవాదృశుల్ చటులమూర్తులు సాహసు లుగ్రనిష్ఠచే
మానని చంద్రశేఖర సమాధి వహింతురుగాక దక్షులై. 147

చ. అలుపము శక్తులంగలిగినట్టిరు మాదృశు లీ శరీరదు
ర్బలతకు లొంగిపో.యెదరు పట్టి యుమేశ్వరు జ్ఞానమూర్తిలో
నిలుపఁగలేమ యే సులభనిష్ఠకునైనను సంతసించు వే
ల్పులకయి భక్తిచేఁ దనకు లోఁగొనువారలఁ గొల్తుమింతటన్. 148

క. పదిసార్లు తనదు నామము పెదవులు కదలింప నిట్టె ప్రీతింగొను స్వా
మి దయావార్నిధి విష్ణువు మది నాతనిఁ గొల్తు సులభమార్గము పొంటెన్.

వ. అనిన రావణుండు. 150

ఆ. వైష్ణవుఁడవుకావు పాషండుడవు కమ్ము భక్తిమాత్రమేల వట్టి నమ్మ
కమ్ము చాలు మోక్షగామియ న్మతమును స్వీకరింపు మద్ది నాకునేల. 151

క. చెప్పిన నాదే సంగతి చెప్పిన నీదేమి మనసు చెడెనా యేమీ
యప్పుడె తలకెక్కినదో యప్పా! నీమతము మాట యదుకకయుండన్. 152

చ. కడువడి రాముసేయు నపకారము నోరువరాదు, వాని య
ప్పుడఁతుకఁ దెత్తు, వానికిని బ్రత్యపకారము సేయుటెట్లొ, నీ

విడియఁగఁబోవకన్ పసిఁడియిఱ్ఱిగ నామెను మోహపెట్టు, మ
ప్పడతఁడు కాన దవ్వుచను, భూసుతఁ దెత్తునటంచుఁ జెప్పితిన్. 153

మ. వినతుండై యల తాటకేయుఁడు ప్రభూ! విన్నాను విన్నానయా
వినరాకుండుట యెట్టు లెట్టయెదుటన్ పృథ్వీధరం బూర్జితా
శనిపాతంబున భగ్నమై చన దిదృక్షాప్రశ్న లేదట్లె చూ
డ నగున్ జూడక తప్పదున్ దనువుతోడం బుట్టు దోసంబుగా. 154

ఆ. నీవు సీతఁదెత్తు నే రాముఁగానన భూమి దవ్వుకొంచుఁబోదు రాము
పఁడతి లంకలోన భద్రమ్ముగా దాఁచె దంతతోన యైనదా యటన్న. 155

గీ. అంతతోఁగాక యేమి యోయనవసరభయప్రతారితబుద్ధి! యటంచుదనుజుఁ
డంతతోఁగాద యనుము కాదంచు నోర్చికొందురటె వానిచేసిన కుందునింత.

శా. కాదేమౌనొ వచింపు మాతఁడు ధనుష్కాండోర్జితాంభోద మ
ర్యాదాభీకరమూర్తి క్రమ్మునొ సముద్రాల్నాలు గాకాశముల్
కా దంభోనిధి యీదివచ్చు మఱి లంకంగూడఁ జొచ్చున్ మనీ
షా దారిద్ర్యపయోధి వాఁడొకఁడె యీక్ష్మాఁజూపి లేరెవ్వరున్. 157

గీ. కడఁగి భూమిజాతఁ గబళించి యుండును నడవి నోరు తెఱచి యావులించి
యాకసంబునందు నరదంబు రోజాల కరవ యేరుపడద యసురమంత్రి. 158

క. నే నెత్తుకపోతి ననంగా నగు గుర్తేమి యెచట క్ష్మాసుత యుండెన్
నేనును నీవును మూఁడవ వానికిఁ దెలియదు సభీతి భావాంభోధీ! 159

వ. అజితేంద్రియుఁడు క్రూరుఁడు ధర్మాత్ముఁడు పితృపరిత్యక్తుఁడు వానినిగూర్చి విచారించుచుంటివన మారీచుం డతఁడు నీవన్నవేమియుఁగా డిట్లు చూడుమని. 160

మ. అసమర్థత్వముచేతఁ జేసిన పరిత్యాగంబు త్యాగంబుగా
దు, సమర్థుండగు రామచంద్రుఁడు ధనుర్దుర్వార బాహాజగ
ద్గ్రసనాభీల పరాక్రమ ప్రళయ వారాశి ప్రథామూర్తి, రా
జ్యసమాసన్న నిరంతభోగము త్యజింపంజాలె ఘాసంబుగా. 161

చ. పురుషునియందు స్త్రీలు తమిపొందఁగ నెన్నిగుణంబు లొప్పునో
సరసిజ పత్రలోచనుఁడు శ్రావణమేఘ శరీరుఁ డుగ్రదోః
పరిఘుఁడు శైలవక్షుఁ డణుభావ వలగ్నుఁడు శూరుఁడన్నియున్
వఱలును రామునందుఁ గులభామినిఁ దప్పి చరింపఁడెంతయున్. 162

గీ. అట్టిపూరుష శ్రీదేవి యభిసరించు నీరజాతాక్షుఁ డేకపత్నీవ్రతుండు
అట్టి పూరుషు భూదేవి యభిగమించు ప్రభువు తన కోసలంబులే వదలిపెట్టె.

మ. విహరత్స్వాధు మృగద్విజారవ లసద్విస్ఫారసాకేత పూ
ర్వహిరుద్యాన విహారకేళి పరమప్రాణంబు సీతామనః
కుహరాంతస్స్థితయోగమూర్తికిని గైకోఁ దుగ్రకాంతార యా
త్ర హరింపం దనయిష్టకేళి యెడఁదం దాఁ జెంద డీషద్వ్యథన్. 164

చ. ఎఱుగనివారిఁగూర్చి మఱియెవ్వరొ యెవ్వరొ చెప్పినట్టి యా
కఱదలు నమ్మి తెలికయుఁగా వచియించుటచేయ రుత్తముల్
మఱి రఘురాముఁ డింద్రియ సమాజము తీసినత్రోవఁ బోఁడు ద
గ్గఱిన సుఖం బధర్మపథ కచ్చరమైనను గాలఁద్రోసెడున్. 165

మ. ఒకఁడేకార్యమొసేయు దివ్యమతి, నేదో మాటవాక్రుచ్చుఁదా
నొకఁ డాచేసిన చెప్పినట్టి జనుఁడేయూహం బ్రవర్తిల్లె దా
నికి నిష్కృష్టముగాఁగఁ జూడవలెఁగానీ, నీ యధేచ్ఛాను వా
దక సిద్ధాంతములందుఁ జొన్పిన యథార్థంబందుఁ గన్పించునే. 166

ఉ. ధర్మము నెల్లలోకమునఁ దత్వల లౌకిక భోగబుద్ధులై
శర్మము గోరి చేసెదరు, సజ్జనమస్తకరత్నమైన వీ
తోర్మిచయుండు సాధువు రఘూద్వహుఁ డూర్జితశాంత చిత్తుఁడై
ధర్మము చేతలోన సముదార సుఖంబునకై పొనర్చెడున్. 167

క. క్రూరతను దేనినందుము చేరి ప్రయోజనము మించి చేసిన కరుణా
దూరమగు హింస నందుము శ్రీరఘురాముండు దానిఁ జేయంగలఁడే. 168

క. ఎగకొలిపిన గాధేయుని పగిది కెదురుపలుకలేని పసితన మది తా
నుగఁ దాటకావధంబునఁ భోగిలిన పొగులా రఘూత్తముఁడు నెఱజోదై. 169

శా. టెక్కం బొక్కఁడులేని హరిని గిరిటిన్ ఘోరదంష్ట్రోగ్రుఁడన్
దిక్కుంభీంద్రకపోల పాటనకళా దీర్ఘోరుబాహుండ నే
నిక్కాంతారము చండశాసనుఁడనై యేలంగ నానామహో
స్పృక్కంధుల్ ప్రవహించె బ్రాహ్మణక్రతు శ్రీ లేఱులై పాఱఁగన్. 170

క. నా త్రిప్పలు పడఁజాలక ధాత్రీపతి రత్నమైన దశరథుకడకున్
శ్రోత్రియుడు కౌశికుఁడు చని పుత్రుం గ్రతురక్షకొఱకుఁ బుచ్చుమనంగా. 171

మ. పదిరెండేడులపోఱఁడీతఁ డపుడాబాలున్ మఱేతండ్రి యొ
ప్పదలంజూపును బంప నీతల లయాంభోదోగ్రదేహుండ నే
నదిరా యాతల గాధిరాట్సుతుఁడు సద్యఃకోపి యా రాజు నొ
ప్పదలంజూపెను లేదు లక్ష్మణుఁడు రాముండిద్దఱున్ వచ్చినన్. 172

క. అబ్బో! నా యప్పటి యాయుబ్బున సీ పోఱగాఁడు హా యనిపించెన్
గబ్బైన యెఱచిశిల పడద్రొబ్బితి హుతభుక్శిఖాక్రతుక్ష్మావీథిన్. 173

వ. అంత బాలుఁడైన యీ రాముండొకయమ్ము నేసె. 174

క. ఆ యగ్ని వేఁడి మెంతయొ మాయురె యొకలిప్తమింట మాంసము భస్మం
బాయెను దదగ్నియంటిన నాయొడలున నెముక మిగులునా! రఘుమూర్తీ! 175

చ. అచటికి వందయోజనము లంబుధి రాముఁడు నంపగాలి తూ
లిచెఁ బడినాఁడ నిందు స్మృతిలేదు మఱెప్పుడొ నీటిపై స్మృతి
ప్రచయముగల్గె నుప్పలను ద్రావిన నీళులు త్రావిత్రావి చ
చ్చి చెడితి నద్దయాపరునిచే రఘువీరునిచే సజీవుఁడై. 176

ఆ. జీవిలక్షణంబు చిత్రమైనదికదా బుద్ధివచ్చి మరల బుద్ధిరాదు
తల్లిచంపినాఁడు తమ్ముని జంపెను నేల నను మిగిల్చె నెఱుకలేక. 177

మ. పులికోఱల్ శితఖడ్గశృంగములుగా మున్యాశ్రమంబుల్ మృగా
వలిలో నేను మృగంబనై తిరుగుచున్ వారెల్లరున్ లేడిగాఁ
దలఁపన్ మౌనుల నొంటిపాటుగని క్షుద్వైరంబులన్ రెండు జో
ళ్ళులుగాఁ దీర్చుచు సంచరించితిని తాలుస్పృష్టరక్తంబుగా. 178

గీ. అచట నున్న మనిసి యగుపింపఁడాయెను యేను నతఁడు తప్ప నెవరు లేరు
కనులు నావి నిప్పుక్రక్కుచునుండును నెలవులందు నెత్రుచిమ్ముచుండు. 179

చ. మునులకు నంతయుం దెలిసిపోయెను పోయెనుగాని లేళ్ళలో
ననుఁగని నన్నుఁ గాదనరు నన్ను నెఱింగి యెఱుంగనట్లుగాఁ
జనెదర యాశ్రమాంతమున జంటలువీడరు తత్స్వభావమే
కనుకని చిత్రమైనదిగఁ గన్పడు బ్రాహ్మణజాతి యక్కటా. 180

క. తనకంటె నితరమైనను మనకెందుకులే యటంచు మానుట యొకటిన్
దనదాఁక వచ్చినప్పుడు మన కర్మములే యటంచు మానుట యొకటిన్. 181

చ. చనచన నంత నిష్క్రియుల సాధుల నచ్చపు గర్మవాదులన్
దినదిన నేమొ నాకును మతిన్ జనియించె విరాగభావమం
తన తన యాలు తమ్ముఁడును దానును వచ్చెను స్వామి స్వామినిన్
గనఁ గనలూని పూర్వకథ కట్టినమూర్తిగ వైరమూనుచున్. 182

వ. తక్కినకదుపుతో నతని యునికికి రాకపోకలు నెఱపుచు సమయంబు వేచియుండ
నొకనాడు లక్ష్మణుండు రామునితో నిట్లనియె. 183

గీ. ఆ నడక లేడినడకగా దల్ల దాని ముఖముచూచిన హరిణంబు ముట్టిగాదు
బెదరు కన్నులు కావును బెద్దకోఱ మాటిమాటికిఁ బెదవితో మప్పుచుండె. 184

శా. ఇన్నాళ్ళెచ్చటఁ జూచినా ననుచు నూహింపంగ గుర్తయ్యె నో
యన్నా! నీదగు నంపమంట వెలుఁగై యానాఁడు మారీచుఁడు
త్పన్నంబైన నిమేష దర్శనములో దంష్ట్రాగ్ర మారీతిగా
నెన్నం గ్రీఁబెదవిన్ స్పృశించె మఱి వాఁడే వీఁడు మాయావియై. 185

శా. అమ్మో! గుండియ గుండియ న్నిలిచెనా యా నాకు నీవెంత వే
సమ్మున్ మార్చినఁ బట్టియిచ్చు నొకచంచల్లక్షణం బాతఁడా
తమ్ముం డుండఁగ రామునోర్వనగునే తానై యసాధ్యమ్ము సా
ధ్యమ్మున్ జేసెడువాఁడు చూచెదవుగా తద్వైరయాత్రాస్థితిన్. 186

క. నను మరల బ్రదుకనిచ్చెను వనజాక్షుఁడు రామమూర్తి వాల్చిన యమ్మున్
నను దాఁకకుండ దూసెను గన నింకెందాఁక చంపకయ చనఁగలఁడో. 187

ఉ. తమ్మునిఁ జంపితిన్ మఱియుఁ దల్లినిజంపితి వాఁడు పోవనీ
పొమ్మని రామమూర్తియును, బోవఁగనిత్తునె యంచు నేను, నీ
క్రమ్మిన కార్యమిప్పటికిఁ గల్గెన యంతటి మెత్తనైన చి
త్తమ్మువుస్వామిఁ గ్రూరుఁడని తాననరాదు యెవండు నేనియున్. 188

క. అవుఁ జుప్పనాక ముక్కుంజెవులనుగోయు టదియేమి చెప్పమనెదవో
యవురా ప్రాణము తీయఁడ యవనీసుతఁ జంపఁబోవు టది కని కంటే. 189

మ. మనబంగారము మంచిదైనయెడఁ గంసాలిన్ మఱేలా యనన్
నను దానించుక వచ్చి యడ్గిన ఫలానా వాఁడు వాఁడెట్టి వాఁ
డని యా జోలికిఁబోవ వద్దనుచుఁ గట్టా చెప్పనా! యైనమం
దనయీడేమిటి యేమిటీ వలపు? సంధ్యాదేవతల్ నవ్వఁగన్. 190

ఉ. ఆ పరమోత్తమోత్తమున కక్కట! యున్నది లోప మొక్కఁడా
హా! పరిహాసశీలి యతఁ, డద్దియ హేతువుగా నతండు వ
న్యాపథమిట్లు రావలసియైనది, యయ్యది యొక్కదాసి తా
నా పినతల్లి దాసి, పగయన్నది రూపముగొన్న దక్కటా! 191

గీ. ముసలిమొగముది యొక కొండముచ్చుముండ పసితనంబున రాముని పారిహాస్య
మునకుఁ బగపూని కైకతోఁ బుల్లవిఱుపులాడి రాముని వనమేగు టాచరించె.

చ. అవి యెపుడిచ్చె నెందుకొ రహస్యము మిన్ననుండి యూడి ప
డ్డవి వరముల్, వినం దెలివి దక్కెను భూపతి, తెల్విలేమి మృ
త్యువు గనుదాఁక నల్లైచనె, నూరక తండ్రి యొసంగియుండు న
న్న వినయభావబద్ధుఁడు సనాతనుఁ డీగతి వచ్చెఁ గానకున్. 193

శా. ఈవే చూడుము తండ్రిపోనడఁచెనో యాకానకున్ వచ్చు టే
లో విధ్వస్తమతిన్ సుతున్ వెలిచి యా యుర్వీకళత్రుండు తా

నా విధ్వంసిత ధీకుఁడౌ సుతుఁ వియోగాగ్నిన్ మృతిన్‌గాంచు చే
లో విన్నట్టినుడుల్ పొసంగవలెఁగా యూహాప్రకల్ప్యార్థతన్. 194

ఉ. తానుగ నాకృతింగనిన ధర్మము రాఘవుఁడన్నచో నభూ
తో నభవిష్యతీదృశుఁడు తోఁకొని ధర్మపథంబుతప్పఁ డిం
తైనను లోకమందితరులైనను దప్పిన నోర్వఁబోడు శి
క్షా నిరతుండు వానిదెసఁ గల్గ దధర్మియటన్న మాటయున్. 195

శా. ఆ పాండిత్యపయోధి క్లిష్టపు సమస్యల్ గూర్చి నిష్కృష్ట ధ
ర్మోపన్యాసము లాడఁగా ఋషిచయం బూహాప్రధావన్మతి
క్షేపంబై చనఁ దెల్లవోదురఁట రాశీభూత మర్యాదుఁ డ
ద్ధా పర్యాప్తుఁడు నట్టివాని దెస నిందల్ పాపముం దెచ్చెడిన్. 196

వ. అనిన రావణుండు నేనన్నవేమియు నతఁడుకాఁడు వాని యాయపకృతి దిగ
ద్రావుమందువా యనిన మారీచుఁడు. 197

సీ. తనకు మించిన శత్రుజనకృతాపకృతి మాయందగు నర్జుననందుఁబోలెఁ
దనకుమించని శత్రుజనకృతాపకృతి తీర్పందగు నింద్రునియందుఁబోలెఁ
దనకు మించియును మించనిదాన నూరకుండందగుఁ గపిరాజునందుఁబోలెఁ
దనకుబందుగు సాధువును నైన నిద్రింపనుందగును గుబేరునందుఁబోలె

గీ. నిచటనెచట నీతలఁచిన యిట్టికృతిని జేయనైతివి దీనికిఁ జివరి కితఁడు
దొరకెనా పూర్వులందఱు దొరయరాని గాఢతమమైన తీక్ష్ణత గలుగువాఁడు.

క. ఓరె మ్ముడికిన దనఁగా సూరిమణీ! మెతుకు పట్టిచూచినఁ జాలున్
దా రాము ప్రకృతి కార్యోగ్రారూఢత దెలియు నడవికరుగుటఁ గనినన్. 199

క. అందఱవలె మాటాడఁడు నందఱవలెఁ జేయ డేదియైనను దన యా
త్మందెచ్చి యొలుకఁబోసిన చందమ్మునఁ బలుకుఁ జేయు సర్వముతానై. 200

ఉ. తాదృశగాఢశీలునకు ధర్మపథంబునఁ బోవుటెంత తీ
వ్రాదరభాజనంబగు, సురాసురమౌళి కిరీట సంస్పృశ
త్పాద నవాంబుజాత! పగపట్టిన నంతటి తీవ్రతాగుణా
పాదనచేయుఁ టొప్పఁ గులభామిని దొంగిల నెంతయో పగో. 201

శా. ఆధారంబయి సర్వధర్మముల కాహో వారు! మార్తాండ తే
జోధారాకృతు లా రఘూద్వహులు దక్షుల్ గేహినీ గర్భధా
రాధృత్యాశయు లీ కృతిం గలుగు వైరంబెంత దూరంబుగా
సాధింపం దగియుండునో కనుము వంశస్వచ్ఛ మర్యాదకై. 202

క. ఇది నీవుచేయు పనిలో నొదిగిన యర్థంబులోని యుజ్జ్వల తైక్ష్ణ్యం
బుగితక్రోధుఁడు తైక్ష్ణ్యంబెద నెఱిఁగిన రాముఁడింక నెట్టేఁడొ వినుమీ. 203

చ. అరుదుగఁ గార్తవీర్యుఁడగు నర్జును నీవు నెఱుంగు దాతనిన్
నఱికెను గండ్రగొడ్డలి కొసం బెను వ్రేటున వేయిమందినిన్
నఱికినయట్లె భార్గవుఁ డనారతకోపి కులాలచక్రమై
యిరువదియొక్కమార్లు భ్రమియించెను క్షత్రకులంబువేనిచే. 204

మ. మడమలు త్రొక్కికొం చవనిమార్గము వీడి పలాయమానుఁడై
విడివడికట్టు! యే యడుగు పెట్టినచోటను సీలమండలం
దడఁగఁగఁ బిన్న పెండ్లికొడుకైన రఘూద్వహు బాణఘాతమై
చెడెద నటంచు గ్రుడ్డుకుడిచెన్ దనయంతటి జోదుతానయై. 205

ఉ. దూర సమీప భేదములు దూసిన యమ్మునయం దమర్చు వి
స్తార సవేగ భేదము లుదారపు లెక్కలు యోజితాగ్నివా
యూరు తరంగసంతతు లదొక్కఁడు తూనిక, తద్ధనుఃకళా
సారము శుల్బమున్ గణితశాస్త్రము సర్వ పదార్థవిత్త్వమున్. 206

గీ. అతని నడవికిఁ బంపించినట్టి తల్లి యతని చాపకళాగురు వామె యసుర
లోక బద్ధ విరోధిని లోనఁ దల్లి కొడుకు లిద్దఱుగాని యొక్కఁడను కొందు.

చ. అరయఁగ నస్త్రదైవతము లాత్మవిశుద్ధున కెట్టు లట్లుగా
నొరులకు సిద్ధిపొందవు నవోదయ ధర్మవిశుద్ధచిత్తుఁడా
దొరయెడ నిత్యసిద్ధములు ధూర్వహముల్ పరిదీప్తశక్తులై
వఱలు సమస్తసాధక శుభాకృతు లూర్జిత సత్త్వమూర్తులై. 208

సీ. అతఁడాజన్మకు నాధ్యాత్మిక ప్రవృత్తిని బొందడేని వధించు, నతఁడు
కాలాంతరమ్మునఁ గడఁగి సన్మార్గగామి యగునేనియును క్షమించుచుండు
నరగ నాతనికిఁ బశ్చాత్తప్తి పొందువానికిని బ్రాణాలమీఁదికిని దెచ్చుఁ
దాను సుబాహుండు నేనుఁ గాకాసురుండును నుదాహరణముల్ నూలుకొనఁగ
గీ. రాఘవుని పేరిడగు నక్షరముల రెంటి నవ్వడియు వాయువీథుల సంచరించు
మేర తీవ్రధర్మాభిరక్షారచనము తగ నతనితోడ మనకేలదానవులకు. 209

వ. అనిన రావణుం డబ్బో! నీ కతనిగుఱించి చాలఁ దెలియునే యన మారీ
చుండు స్వామీ! యెత్తిపొడుపుమాటల కేమిగాని. 210

గీ. ధృతిఁ దెగించి సీతందెమ్ము దితిజవృక్ష మూలమునయందు నిప్పులుపోసినట్లు
విమలలంకాపురీ రాజ్యవిజయరమకుఁ దెచ్చికో ల్నైత్తికి ముసుంగు వచ్చినట్లు.

మ. ఉవిదందెచ్చుట రామచంద్ర విషయం బూహింపరాకుండ నుం
డ వలెంగాని మఱింత యూహమెదలన్ నా గుండెలోఁ గొండవ

డ్డ విధానం గనిపించుచున్న యది కట్టా! లంకలోనున్న బం
ధువు లందుండిరి యందఱున్ సుహితబంధూ! చేయకీయూహలన్. 212

క. నే మాయలేడి నౌటయు సామీ! చేయంగ లేద, చని నీవు నహో!
భూమీసుతఁ దేలేదును నా మాటకె నాదుగుండె యాడుటమానెన్. 213

మ. కనులం గన్పడుచున్న దిప్పటికె లంకారాజ్యధూమంబు నీ
కును నేనిట్లుగ నాడుటన్ వినుటకుం గోపంబురావచ్చుఁ, జె
ప్పను నా కేటికిఁ దప్పు, నీకును నిలింపారీ! రహః కార్య మం
త్రిని, నీ సేఁతల మంచిచెడ్డల విమర్శింపన్ వలెన్ ధర్మమై. 214

క. హితమునె చెప్పనెవండేన్ క్షితిపతికిని బథ్యమింత చెప్పఁడు ధాత్రీ
పతి యోర్వలేఁడు కోరును సతము జనుఁడు మిపుల రాజు సద్యస్సుఖమున్.

గీ. అవనినాథుండు నిజముగా నధికరోగి వినుటకైనను బథ్యంబు పనికిరాదు
అసలులోఁ దప్పలేదు సద్యోల్పసుఖము కోరియే జీవుడయి జన్మగొనుట కలుగు.

మ. మఱినీ వొంటిగఁ బోవరా దతనిపై మన్నించు మే హేతువై
ధరణీశుండు గతించినం బ్రజ నిరాధారంబుగా నౌటచే
మఱియాధారముగాఁగ నుండఁదగు నా క్ష్మానేత తానై ప్రజా
హరణక్రూరకృతుల్ పొనర్చునెడ నేలా పోవరా దొంటిగా. 217

గీ. ప్రజలతో రాజుపుట్టును రాజుతోడఁబ్రజలుపుట్టరు, మంత్రులు ప్రజకుఁబతికి
నడిమివారలు, ప్రజలయుఁబుడమిపతియు నుభయసుస్థితి మంత్రులయుజ్జ్వలమతి.

చ. రమణిని నీవు దొంగిలిన రాముఁడు తద్విరహాగ్నిదూయమా
న మగు నెడందతో బ్రదుకునా యని నీ యెద నాటినట్టి భా
వమునకు నంతగా నిజముపట్టదు రాముఁడు ధాత్రియందు ను
త్తమమగు ధర్మరక్ష కవతారము తాల్చినవాఁడు కావుటన్. 219

గీ. మహిమకోల్పడునందువో మఱియుఁ బిచ్చివాఁడ! సంగతమగు పరాభవమువలని
దుఃఖమునుదాఁటి ప్రకృతితోదూఁకుచున్న యధికకోపంబుచేఁబ్రళయాగ్నియగును.

ఆ. అల్పుఁడైనవాని కాపత్తి కలిగిన గుండె నీరసించి కూలిపోవు
నధికుఁడైనవాని కాపత్తి కలిగినఁ దోఁకత్రొక్కు త్రాఁచువీఁకఁ గాంచు. 221

వ. ఎంతచూచినను నీవన్నది యాలోచన మాటగా లేదనిన రావణుండు నీ యాలో
చన నాయాలోచన యొక్కఁడు కావలయునని యెక్కడ నున్నది? నేను సీతను
దెచ్చెద ననగా రాముని వర్ణింతువే యనిన మారీచుం డట్లు చెప్పాము. 222

చ. పగయనుచున్ ఖరాదులను బట్టివధించె నటంచు నక్కటా
భగిని మొగంబునుం జెవులు వాడ్వఱచెంజుమి యంచు నేల, కా

మగమగు తొల్లినాఁటి మతి మానవు కాకను గొంత సాగిసా
గఁగ నెదిరించుఁజూ మనది కాదు నిజంబుగఁ గాల మెప్పుడున్. 223

ఉ. మానవనాథు లెంతయు నమాత్యులతో ననఁగూడనంత సి
గ్గైన పనుల్ పొనర్పవలెనా! కొడు కింద్రజి యొక్కమంత్రి, యు
ర్వీనుతులైన బిడ్డలకు బిడ్డలు కల్గఁగ నేమి నీతికై
కో నిది? పిల్ల లేమి యనుకొందురు పైకన రంతియేకదా. 224

మ. ఇలలో నెవ్వఁడొ యిట్లుసేయుటకుఁగా దీవిట్లుగాఁ జేఁతకున్
దలఁపన్ భేదము లక్షయున్నయదికాదా! సన్నజాబిల్లి వె
న్నెల సీమంతపుఁ బూఁబరాగమగు వాని న్నీవు మెప్పించి న
ట్టి లసత్కీర్తి యుగాలుగా నిలుచునట్లే యిద్దియున్ నిల్చెడున్. 225

క. ఇది నీకు సొంత విషయము యిది మఱి కులమెల్లఁ బ్రాఁకు నీ హేతువుగా
మదినెంతు విభీషణ ముఖసదమల చిత్తులకుఁ దెలుపఁజనునని తొలుతన్. 226

మ. ద్రుతిఁ దానెట్లునువచ్చు మంచికొని, మాతో సుంతయేన్ జెప్పి చే
సితివా యందురు గానఁ జెప్పలయగున్ శ్రేయంబు, నావేళకు
ద్గతులై యెవ్వరి త్రోవ వారలయి పోఁగాఁ గొంపలో ప్రీతిపో
నతుకున్ గుంభన కొంచెముంజెడినచో హాహా రసాభాసమౌ. 227

శా. నాకాశ్చర్యము సృష్టిలో నిది దురంతంబౌ రహస్యంబ, య
స్తోకంబై యొకజాతి యొక్కపుడు చెందున్ దీపితౌన్నత్య, మ
ట్లే కాలాంతరమందు వేఱొకఁడు తేలెన్ బైకి, నెవ్వాఁడొ య
ఱ్ఱాఁకన్ మొగకయుండఁ బట్టుకొను నౌరా! యీతులాదండమున్. 228

చ. తొలుతను నీవు వచ్చితివి దూరము చెప్పితి నేమి యెంచితో
వలదనుకొంటి పోయితివి, వచ్చితి వీగతి యింతలోన, నీ
యులుకు జనింపఁ జెట్టపురుగూఁదిన దెద్దియొ, నిన్ను నీతలం
పులఁబడిపోవనీరు హితమున్ వచియింతురు స్వార్థచిత్తులై. 229

చ. నలువుగ మీరుమీరు కనినం బెదతల్లియుఁ బిన్నతల్లి బి
డ్డలు, మఱి వారలట్లయి కడంకను మీరలు సర్వభోగముల్
కలిమికి బంధుతాగుణముగాని సహింపదు, పైని దానవో
జ్జ్వలరమ యింక నెంతవు నపారపుఁగాలము సాగనయ్యెడున్. 230

ఆ. ఉన్న మాటయన్న నులుకెక్కువగుగదా రావణుండు కోప రంజితాస్యుఁ
డిందు జుప్పనాక యేమియుఁ జేయలే దేన నిశ్చయించినాను దీని. 231

ఉ. ఆడకు వేయిలక్ష విన నయ్యవి యింకను, నీకు బంగరున్
లేడిగఁబోయి రాము కదలింపక తప్పదు, నాకుఁ బొంచు సా
లీఁడుగఁ బోయి సీతఁగమలింపక తప్పదు, నీవు మారుమా
టాడక పొమ్ము, చెప్పఁదగినంతయుఁ జెప్పితి వంతియేకదా. 232

వ. ఇది రాజాజ్ఞ.

శా. నా మారీచుఁడు నవ్వి నిక్కువముగా నాపైని గోపంబు నీ
కేమంత్రిత్వముమాని యిన్నిదినముల్ స్వేచ్ఛాగతిన్ మన్కికిన్
నీ మంత్రిత్వము మానలేదుగద పైనేనిట్లు సన్న్యాసినై
నీ మంత్రిత్వము చేయుచుంటి నసురానీకిన్యసుప్రాజితా! 233

ఉ. మంతిరినౌటఁ జెప్పితిని మానక బంటునుగాన బోయెదన్
జింతిత మెద్దియో యదియ చేయుదు నీవును నీదునాజ్ఞయే
యింతయుదాఁటినం బ్రతుకనిత్తువె నేను నెఱుంగఁజాలనా!
వం తెపుడేగుదెంచునని వాఁకిలి చూచుచునుంటినెప్పుడున్. 234

ఉ. రెండు విధాల నాకుఁ బచరించితి సాయము రామచంద్రుతోఁ
జండత మానలేదు పగజ్ఞప్తికి దెచ్చితి నీవుగాని యు
ద్దండత దానిఁ దీర్పనగు దారిని జూపితి పూర్వమైనదే
దండిగ లేడిగా నగుట దాన మెఱుంగులు తెచ్చునే కదా. 235

గీ. అనిన రావణుఁ డానందితాస్యుఁడగుచు నట్లనుము బాగుగా నున్న దసురరత్న!
యిపుడుమారీచుఁడవటంచు నింపుమీఱ దనుజమంత్రిబుజంబు నందముగఁజఱచి.

వ. మఱి బయలుదేఱుమ న్నిన్నందు దించెదనన మారీచుం డిదిగోనని తన యాశ్ర
మమునఁ గుండలన్నియుఁ బగులఁగొట్టి పైకప్పంటించి గోడలు పడఁద్రోసి తన్నుఁ
దీక్ష్ణముగాఁ జూచుచున్న రావణునింజూడక రథంబెక్కి రాముని యునికి కల్ల
నిద్దఱు రథావతరణంబు చేసిన మారీచుం డిట్లనియె. 237

ఆ. అయిదు మఱ్ఱిచెట్లు నైదు ప్రాణంబులు నడుమ పర్ణశాల నాథునిలయ
మన్నయట్లు తోఁచు నాత్మసాధకునకు మృత్యువేళ నాగమించినట్లు. 238

ఉ. ఐనను నిక్కముందెలియ నడ్డెద మద్వ్యథ మొక్కడెంచియే
నా! నలినాయతాక్షి జనకాత్మజ నిక్కముగా హరింతువా!
పూని హరించితేని రఘుపుంగవుఁ డార్తిభరింపలేఁడు రా
జ్యానికి రాజ్యమట్లయి కులాంగన యాగతి దూరమై చనన్. 239

మ. పదుమూఁడేడులవెట్లునుం గడచె నప్పా! యొక్కయేఁడాది కా
నిదిగాఁ గన్నులుమూసికొన్నఁ బదుకొండే మాసముల్ మాస మ

య్యదయోధ్యాగమనాంతరం బెసఁగు వారాపైని నిందుండ వ
చ్చెదరా! వారెవరోను నీ వెవరో దాక్షిణ్యైక వారాన్నిధీ. 240

వ. అనిన రావణుం డించుక కుడికంటి కండలు ముకుళింప దక్షిణగల్లభాగ విక్సి
తంబుగా నవ్వి యిట్లనియె. 241

ఆ. పరమభక్తుఁడుండఁ బరమేశ్వరుండు కాలేక యేమి నిన్ను లేడిఁ జంప
నేను రాముఁడైన నినుఁ జంప నేనైన రాముఁ డపహరింపఁడా మెలంత. 242

వ. మఱి మారీచుం డిట్లనియె. 243

క. వేసిన పదకము మూసను బోసితె యిష్టానుసారమున నది నడువన్
దా సీత నీకు దొరకుట కోసము గాదిద్ది నన్నుఁ గూల్పఁగఁగానీ. 244

మ. మృగమున్ నన్నును జూచి లక్ష్మణుఁడు గుర్తించున్, ధరాజాతకో
రఁగనే పో, దొకబాణపాతమున నన్ రాముండు ద్రుందించు, నీ
పగయేమౌను? రథంబుతోలికొని పోవంజాతువో లంకకున్
దెగి శ్రీరాఘవు నిందెదిర్చెదో పరాధీనుండవై యొంటిగా. 245

చ. అనవుడు రావణుండు సచివాగ్రణీ! నీ తెలివెల్ల నేమియ
య్యె నదియు నిట్లు సాగుననవేటికి సాగును, దానిలోని ల
క్షణములు నిట్లుసాగుటకుఁ జాలునుగావున సాగు, సాగు నం
చని పదకంబు నెత్తెదమ యాగతి నెత్తినయట్లె సాగెడున్. 246

ఉ. నాపగయెత్తికోలునకు నాటినయట్టి విచారమేటికిన్
నీ పగయెత్తికోలును గణింపుము ముందర వైరయోగి! లే
డై పద, రెండుజాలు పగలైనది సూర్యుని యంశు జాలముల్
చూపి తళత్తళల్ నెఱయఁ జూడుము వజ్రవిదూరజాంశులన్. 247

మ. అన మారీచుఁడు స్వామి! పోవుదునులేవయ్యా! సరే వచ్చియా
దనుకం బోవక యేమియయ్యెదను మత్తస్సర్వయత్నంబు లే
దనకుండం దుదిదాఁకఁ జెప్పెదను రామాధీన మీలోక మొ
య్యనఁ దచ్చాప వినిర్గతాశుగ భుజంగాన్నంబు దైత్యాసువుల్. 248

శా. ఏనుం జచ్చెద నీదు వెంటఁబడి యిట్లేవత్తు లంకాపురీ
నానాదైత్య చమూ సమూహములతో నారాచ వహ్న్యుద్గతం
బై నీరాకార మెండిపోయి జలదుర్గాధీన ధైర్యంబు పో
గా నిప్పైజలముల్ దహించెడిని లంకాదుర్గ సౌధాగ్రముల్. 249

శా. ఏనున్ రామునిచేతఁ జావవలెనంచే యిట్లు కూర్చుంటి నీ
వైనం జావనటంచు నెంచెదవు, నీకా చావు తప్పింపరా

దానీహార నవాంశుమౌళియును జేయన్ లేఁడుపో! సీత నా
గా నొప్పారెడు ధూమకేతువును లంకామధ్య మందుంచుకో. 250

ఆ. భూమిజాతఁ గొంచుఁబోవఁగా నీకెంత చేయవలయు నంతచేతుఁ జూడు
మనిన నిముసమందె కనులు మిర్మిట్లు కొల్పినవి రావణునకు దనుజపతికి. 251

శా. నానా వర్ణ మనోజ్ఞ పర్ణక లతాంతశ్రేణికా గర్భర
థ్యా నిష్పావక సర్వభూమిజ లతాంతశ్శక్తి మేల్కొన్నదో!
నానా సూర్య మయూఖ గర్భకుహరాంతర్వ్యుత్రహోద్యన్మణి
శ్రీ నిర్వ్యాధ మనోజ్ఞతా సుషమ లుత్సృష్టంబులై పొల్చెనో. 252

క. పురివిప్పి నెమలి యాడె నమరకన్యక లొక్క వేయిమంది నవాకే
కరదృష్టుల్ ప్రసారించిరి హరి సీతాకోకచిలుక లర్బుదమాడెన్. 253

సీ. చీఁకటిలో వ్యాఘ్రశిశువుల కనుపాప జిలుఁగు వెల్గులు బొమ్మచేసి రనఁగ
బ్రాఁతి వెన్నెలఁ గాన్గలేఁత చివుళ్ళలో మిణుఁగురు పుర్వులు మెఱసె ననఁగ
మఱి త్రివేణీ సంగమమున తారలవెల్గు రాసులన్ నీళ్ళెత్తి పోసి రనఁగ
మేఘమ్ములోనున్న మెఱపులో వేల్పు పెండ్లిండ్ల బుక్కాములు నిక్కె ననఁగ
గీ. తమ్మిపువులోని పచ్చలదిమ్మ కించి దరుణ కింజల్కములు తేనె విరియుబొట్లు
సర్వ మల్లల్లనుబ్బి భాస్వరము లయ్యె ననఁగ మారీచుఁడును లేడియయ్యె నంత.

సీ. కొమ్ము గారుడము లన్కొందువా! గారుడంబున సన్నజీర యెల్లునది లేదు
కనులు మాణిక్యంబు లనెదవా! మాణిక్యమున నింద్రనీలపుఁ దనుకు లేదు
మెడక్రింద వజ్రంపుఁబొడి తాపిరన వజ్రముల విదూరజకాంతి పొసఁగఁబోదు
ముకుపుటమ్ములయందుఁ బుష్యరాగములన గోమేధికంబునఁ గ్రోవి రాదు
ఆ. ఒడలి పైఁడి యెంత? పొడలె సర్వంబును మఱియు గారుడములు మరకతములు
గోర వజ్రములును గోమేధికంబులు పొడిగఁజేసి ప్రముగ్గులిడిరొ యనఁగ. 255

సీ. మసృణ పశ్చాద్భాగ మెసఁగఁ గార్తస్వర శతపత్ర నీరేజ నతముకుళము
ముంగాళ్ళపై భుజాస్థిం గండచర్మము లలితంపు టింద్ర నీలంపుచెక్క
నడివీపుపై చార నవ్యమవక్రంబు నిశ్చల సౌదామనీ సుషమము
పొట్టక్రింది మెఱుంగు పుష్యరాగంబుల మేల్పొడి తేనెలో మెదుపు పూఁత
ఆ. సన్న ముకుపుటములు కన్నులు వదలిన వదనమెల్ల మేలిపైఁడిముద్ద
కాళ్ళు సన్న మేలికమ్ములు గొరిజలు నచ్చమైన యసలు పచ్చరాళ్ళు. 256

క. ఒక యింద్రియానుభవ మింకొక యింద్రియమునకుఁ దెలియ దూరకచెప్పన్
మొకరియగు జిహ్వపూనిక యకటా యాలేడిఁ జూడవలె నది యంతే. 257

శా. తానై చూచిన నేదికల్గునొ హృదంతఃప్రీతి తత్ప్రీతి న
ల్లైన నీకున్ ఘటియిల్లఁ జేయుటకునై యత్నంబు గావించు వా
క్స్వానం బావచియింపగాఁబడిన దాధారంబుగా నీవు చి
త్తానం జూచిన మాయలేడిదగు సౌందర్యంబు సువ్యక్తమౌ. 258

గీ. అంత శిల్పి కావచ్చును యంతకంటె రాక్షసుఁడుకూడఁ గావచ్చు విక్షతఘుగ నధికసౌందర్య విజ్ఞాన మన్యవిషయ మాత్మగుణముల యునికియు నన్యమవని.

ఉ. ఎంతటికాష్ఠ కెక్కఁగ వహించునొ ప్రేమను స్వామిదర్శనై
కాంత మనస్కుఁడై మతిరహఃక్రియ సాధు వుపాసకుండు, తా
నంతటికాష్ఠ కెక్క మది నందెను వైరము, స్వామిదర్శనై
కాంత మనస్కుఁడౌచు హరిణాకృతిఁదిర్చుట దానవుండొగిన్. 260

ఆ. విసరి యుత్తరీయ మసురలోకేశుండు లేడిమెడకు వేసి కూడఁబట్టి
యిట్టులనియె నోయి యిట్లైన యసురమంత్రి! వచించినంత యేపు చూపు.

శా. ఆ రాముండరుదెంచి మత్పరిఖ నాల్గంభోధు లింకించి యో
హో! రోదస్సుదితాగ్నిమండలము చేయున్ విష్ణుచక్రంబు, చ
క్షూరాజీవ యుగంబు విచ్చికొని కన్గోఁజూడు చాకుండ, మా
మారీచుం డనిపించుకో యతఁడు చంపం డాత్మభక్తున్ నినున్. 262

మ. క్షితి కన్యామణి నేత్ర తర్పణముగాఁ జెల్వైన రూపంబు తా
ల్చితి, మండోదరి కింత సంతసము కల్పింపంగ నెప్డైనఁ జే
సితివా! యిన్నిదినాలు దాఁచితి పరశ్రేయో నిధానైక దు
ర్మతి! చంపంగను వీలుగాని తఱి మర్మవ్యక్తిగాఁ దోఁచుచున్. 263

క. నీతో నేమనినట్లుగఁ జేతోవిధృతి వరదీప్తి జెంగున దూఁకెన్
దైతేయుఁ డట్లు దూర ధరాతలమున కేగి తిరిగి రావణుఁగాంచెన్. 264

గీ. నీ స్వభావంబుతో పాటు నీ వహించు నాకృతి కలట్టి జంతువుదగు స్వభావ మునునినుంబొందు నవయవములయునికికి ననుగుణంబగుకదలిక యగుచుమేన.

ఉ. దగ్గర పర్ణశాలయును దానవులిద్దఱ రాచకార్యముల్
నిగ్గులమేనితోడ రవణించుటలేడిగ దానవుండొగిన్
మ్రగ్గిన గుండెలందు ననుమానము కల్గఁ జివుళ్ళ యొత్తునౌ
జగ్గుల కంటికెంపులుగ సాగిరి కానన దేవతావళుల్. 266

ఆ. రథములేదు మఱియు రావణుండునులేఁడు మాటయులివు లేదు మాయగాఁగ
దూర దూరములను మారీచహరిణంబు తోడుకొఱకు వెదకె లేడికదుపు. 267

చ. వెఱ హరిణంబు లాపాడలపేరిమి మోహపడున్, మఱేదొ క్రొం
జిఱుత యటంచు భీతిగొనుఁ, టెంగున దూఁకెడు మేనితీరులం

బెరసి స్వజాతి లక్షణముఁ బేర్చుట కాంచుచుఁ బ్రశ్వసించు, డ
గ్గఱి ముకుదావి చూచి పెడగాఁ జను, బిత్తరవోయి చూచుచున్. 268

చ. నికటమునన్ జరించు హరిణీతతిఁ దేలికగాఁగబట్టి మ
స్తకములు త్రుంచి మాంస సముదాయము భోజనమాచరించు నూ
హ కలుగుఁగాని సన్న్యసనమందుట రావణుకార్య మాచరిం
పక చనరామి దానవుఁడు మానసమంతయు బిగ్గపట్టుచున్. 269

క. ఒక కొంతవేళ హరిణీనికరము లెదియెద్దిసేయు నేర్వఁగఁ జూచున్
బ్రకృతపుఁ గార్యబలంబునఁ జకితుండై దానవుండు సంభ్రాంత మతిన్. 270

శా. ఆకాశంబున వేళ్ళుపారిన శిరోవ్యత్యస్త భూమీజమై
వ్యాకీర్ణంబుగ వంద పంగలగు శృంగానీత గర్వంబునన్
భూకాంతుంబలె నున్న దుప్పిగనుచుం బూర్వామరుం డల్ప దే
హాకారాత్తమతిన్ భయంపడియె లిప్తాంశైక భాగంబునన్. 271

గీ. కనక శతపత్ర ముకుళముల్ కట్టినట్టి
మోపెగురవేసి నట్లుగ నూపుతీసి
కొంచుఁ బృథుల పశ్చార్ధ మాకుంచితముగ
నెగురు మాయామృగ మ్మంద మెగచిపోపె. 272

గీ. మేల్మిబంగారు ముట్టియ కల్మి పుష్యరాగముల ముకుఁగ్రోవుల సాగి లేఁత
పచ్చికను మేయ మరకతప్రభము శాద్వలము పొలిచె సంసర్గబలమ్ముమవలన. 273

చ. ఒనరఁగ లేడి తా నెగురుచుండిన మింట నిరమ్మదోరువా
హిని పరిదీప్తసూర్యకిరణేందిర నల్లని చిన్నగుంటలం
దున విదలించు కాంతిగమితో నమితోరు మణిప్రవాహమే
చిన సుడులై స్రవించునొక చెల్వున మచ్చలపేర్మిఁదోఁచుచున్. 274

ఉ. ఆకృతిచే స్వజాతియును నక్కట వాసనచే విజాతియున్
జేకొనవచ్చునో మఱియుఁ జేకొనరాదొ యెఱుంగలేక య
ల్లాఁకఁల గూడుచుందొలగు నందు మృగీమృగముల్ మణిప్రభా
శ్రీకమనీయరూప వివశీకృతచిత్త వశంవదమ్ములై. 275

చ. కడుకొని పచ్చికల్ గుబురుగాఁ జనుచోట్లనె మేయునట్టి కై
వడి పెనుదాట్లుగాఁ జనుచు వచ్చి మఱిన్మఱి పర్ణశాలకున్
గడు నికటస్థలిన్ మసృణఘాసము మేయునటుల్ నటించెడున్
దడఁబడి యంత గ్రీఁబెదవి దంతము పైకిని రాక చూచుచున్. 276

ఉ. దగ్గరకుం జనున్, మరల దవ్వుగఁబోవును, మాటిమాటికిన్
దగ్గరకుం జనున్, మరియు ద్వారముముందుగఁ బోవనెంచుచున్
బగ్గెకొలంది గుండియను బట్టుకొనంగనులేక, యూపుతో
మొగ్గినగుండె తోఁపకయపోయె హఠాత్కృతసాహసంబునన్. 277

క. ఇరుపార్శ్వంబుల కాంతిస్ఫురణంబులు నొక్కపార్శ్వమునవె యొసంగన్
విరిసిన ద్వారములోఁ బొరిఁబొరి వెల్గులు చిమ్మఁగ్రోవి పోసినయట్టుల్. 278

చ. అది క్రతువాచరించినటు లైనది యూపము కొంతవేళ యొ
ప్పదలకు గుమ్మముం దరిసిపోవఁగదాదు మనస్సు, పైని నె
మ్మదిగను దాఁటె ద్వార మిరుమాఱు క్రమంబుగ ధైర్యమై పదిం
బది నిటులట్లుగా నరిగె మండలితోరువిచిత్రకాంతియై. 279

శా. సూర్యుం డింకొకఁ డెవ్వడోఁ యరుగుదెంచున్ రత్నమాణిక్య వై
దూర్యాంశూజ్జ్వల నూత్న కాంతిచయబంధుం డుజ్జ్వలద్దేహళీ
మర్యాదామయమూర్తి శ్రీప్రభువు రామస్వామి సేవాగ్ర ధీ
ధుర్యుండై ప్రభుదర్శనావసర సాధుశ్రీప్రతీక్షాబ్ధినాన్. 280

క. మారీచుఁడు తిరుగుటలో దూరంబున కరుగ వచ్చి తోయజదృశ సీ
తారామ గుమ్మ మటునిటు పాఱంగని వ్రూలమబ్బు వాఱెనని చనెన్. 281

గీ. నిండ మునిఁగినవానికి నెక్కువయుగ నేమి చలియని దైతేయుఁడింతకాంతి
పర్ణశాలాబహిర్ద్వార భాసురమ్ము లుంగరంబులు కట్టగా నూఁది నిలిచె. 282

క. పరుగెత్తి వచ్చి కన్గొనె ధరణీసుత జన్మకెల్లఁ దానెఱుఁగని దృ
క్పరమార్థ మల్లసాక్షాత్పరిణతిఁ గని యింటిముందు బచ్చిక మేయన్. 283

గీ. ఇదిగొ!యోస్వామి! యిట్లురమ్మిట్లురమ్ము ఓమఱిది!నీవుకూడ రావోయిరమ్మ
టంచు జానకి పిలిచినయట్టి పిలుపుటచ్చెరువు నన్నదమ్ములు వచ్చి చూచి.284

వ. అంత నా లేడి మేయుచున్నతలయెత్తి వారివంకఁ జూచి బిత్తరవోయి దవ్వుపరువె
త్తియటనుండి మెడనిక్కించి చెవులుఱిక్కించి మరలఁ జూచి మరల దవ్వుదూఁకి
యటఁ బచ్చిక కొఱుకఁబోయి మరల వారివంకఁజూచి కొంతదవ్వు నడచిపోయి
పచ్చికమేయుచు మారీచుండు సర్వశ్రవణంబు వారిదెసనే యుంచె.

ఉ. అంత ధరాతనూజ పతిహస్తము చేఁ దెమలించి, యెందు క
న్నంతటిలేడి కాదు వినినంతటి లేడియుఁగాదు, రత్నపుం
గాంతులుమాత్రమే యగునొ, కాదని రత్నములే శరీరమో
చింతయొనర్ప ఱాయయిన చేతనతాగుణ మిట్టులుండునా. 286

గీ. అవిమృదులదూర్వతీసి రమ్మంచు లేడిదిక్కుచూపించి యదియెంతదినమూర్తి
మనమెదో దానిఁ జేయుదుమని భయంబు భయములేదులే రావమ్మ పైఁడితల్లి.

మ. అని శ్రీరామునిఁ గాంచి యిట్లనియె నే మాశ్చర్యముల్ కానలో
ననుఁ దోకొంచును రానయంటిరికదా నన్ గొంచురాకున్నచో
మన సాకేతమునందుఁ జూడనగు సామాన్యంబులా యివ్వియున్
ననుఁ దోకొంచును వచ్చినందుకుఁ గృతజ్ఞన్ మీకుఁ బ్రాణాంతమున్. 288

శా. పారిభూతములైన గీతకములం బంచాప్సరస్త్రీర్థ మ
న్నారే, సాధువృషత్సబుద్బుద చమూనాట్యంబు కాసారమున్
వా రేమందురు దీని, దీని కెదియో పట్టింతు, రీదృగ్వ్రశా
స్వారాజ్యంబగు మూర్తి హేతువుల నాశ్చర్యంబు లోపింపఁగన్. 289

క. మన మిట్టిలేడిఁ గనినామనిచెప్పిన నమ్మరెవ్వ రసలీ లేడిం
గొని చని కనకమృగం బంచును జెప్పుచు నమ్మనపుడు చూపింపఁవలెన్. 290

ఉ. ముంగిట నిద్ది యున్న యెడ మోహనదీప్తులు పర్ణశాల యెం
దుం గనిపించు జీఁకటులతో శతసూర్యులకంటె వైరమే
లం గల లేడి, యా ప్రమిదలన్ నడుమోవఁగరాని యోర్మితో
నింగుది నూనె పోయుశ్రమ యిప్పుడు తగ్గిన దేమిచెప్పుదున్. 291

శా. ఈ ప్రాక్పర్వతకాననాళి హిమభూభృచ్ఛ్రీసమాన ప్రభా
దీప్రం, బచ్చట నెన్నివింతలు కడిందిన్ విందుమో యిందు నే
త్రప్రీతిన్ మఱి యన్నికందుము, సముద్రంబొక్కఁడే చూడలే
దా ప్రౌఢోగ్రపయోధి యీహరిణమం తందంబుగా నుండునా. 292

గీ. ఇంత యందంబుగా నుండకేమి కడలి తనకడుపులో మణుల్ దాఁచికొను పినాసి
పరఁగ నీ లేడిదైన రూపంబె వేఱు తనదు నాత్మ వెలార్చు నౌదార్యమూర్తి.

చ. సమిధలు దర్భలున్ ఫలరసంబులు దుంపలటంచు మీరు బా
ణములను బూని కాననమునన్ జనువేళల బిక్కుమంచు నా
శ్రమమున నొంటరిన్ మనెదఁ, జిక్కని యీ హరిణంబుతోడుగా
నమరిన నాకు భీతియనినట్టిది తోఁపద యే నిమేషమున్. 294

క. నాకేమి తెచ్చిపెట్టితి వా కాననజాత చిత్రమని యడుగంగా
నా కన్ను లప్పఁజెప్పుదు నా కౌసల్యమ్మగారి కాప్రేమధికిన్. 295

మ. ఇది మాంసంబు భుజించుఁ ద్రావును మహాసృగ్వ్యాహినుల్ దీనిఁదె
చ్చెదమా పోషణసేఁత కష్టమని నీచిత్తంబునం దోఁచునా

పదమా! రాఘవ! పచ్చిగడ్డి తినుచుం బ్రాణంబు పోషించుచు
న్నదిగా పాపము లేడి జాతియయి యెన్నం గష్టమిందున్నదే! 296

మ. మన యానందముమాట యావయి వనీమధ్యంబునం దక్కటా
మనమై వీడిన దీని నేపురియొ చంపన్వచ్చుఁ, గాదింద యే
దనుజాధీశ్వరుఁడో వధించు, సముపాత్తంబైన పాపంబు నీ
కును నేమున్నది యూహ యెవ్వరికిఁగల్గున్ వారికిం గానిచో. 297

చ. ఎద యొకరన్నచోఁ గను నదేలొ సమార్థ్రిత మామగారు జ్ఞ
ప్తిఁ దవుల గుంభసంభవుఁడు విశ్రుతి సీత జగత్ప్రతిష్ఠఁ డ
భ్యుదిత మనస్కుఁడున్ స్మృతిపథోపగతుండగు మౌని నన్ను నా
త్మదుహితకంటె నెక్కుఁడు పదంబున నుంచె విచిత్రమెన్నఁగన్. 298

ఉ. అయన నీకుఁ జెప్పెనుగదా ధరణీసుత యేది కోరినం
బాయక చేయుమంచు నినుఁబట్టి వనీస్థలి వచ్చెనంచు దై
తేయ జగత్ప్రమాధివి కదే యొక లేడినిఁ దెచ్చిపెట్టలే
వా యిది నేను గోరఁదగనా విపరీతపుఁగోర్కి యందువా! 299

ఉ. ఆరిన కోర్కిగానయి రవంతయు నెద్దిి త్రయోదశాబ్దముల్
కోరనె, పాడులేడి యిది కోరఁగఁజేసెను పైఁడిలేడి, సం
ధ్యారుచి మత్రిశంగక సితాసిత వారిధరాంశు సంతతుల్
శ్రీరఘురామ! యవ్వెలుఁగు చెండులు దూఁకినయట్లు దూఁకుచున్. 300

క. కావఁగ వలయా! జిగురా? ప్రాణముతో లేడి నెట్లు పట్టనగు ననన్
మానె, హరిణంపుఁ జర్మము తేనైనం దేనగుంగదే రఘుతిలకా. 301

గీ. జనక తనయా మనః పరిష్వక్తహృదయ! లేడిఁ దేవయ్య తెమ్ము శిలీముఖోగ్ర!
జీవితాంతము విస్మరించెడిది కాదు దీనికథ యంత కంటికి దిగులుపట్టె. 302

శా. ఏతాదృఙ్మణి వజ్రరత్న సుషమాహేలా తనూరాశి వి
ఖ్యాతంబైనది లేదు లేడి, యిది సృష్ట్యారంభమా- కాదు, నా
చేతంబున్ హరియించు కోసమయి వచ్చెన్నాఁగఁ గన్పించు న
ట్లే తేవయ్య మహాత్మ! పొంగులయి గట్లెక్కెన్ స్పృహావాహినుల్. 303

ఉ. నీ పినతల్లిమాటకు వనీతతిఁ జేరితి వంతలేదటే
నాపయి నీకు లేడి మఱి నాదగు మాటకుఁ దేనుజాలవా
యాపనిచేయవేని వన మీగతివచ్చి ఫలంబు లే దయో
ధ్యాపురమెల్ల నమ్మవలెనా! వనవాసముసేఁత నా ప్రభూ. 304

వ. అనిన లక్ష్మణుం డిట్లనియె. 305

శా.. ఏతాదృఙ్మణి వజ్రరత్న సుషమాహేలా తనూరాశి వి
ఖ్యాతంబైనది లేదు లేడి, యిది సృష్ట్యారంభమా కాదు, త
ల్లీ! తా నీహరిణంబహో యిచటఁ దేలెన్ ముగ్గె నెచ్చోట? నిం
దై తేలంగ విచారణన్ సలుపఁగానైనట్టి యంశంబగున్. 306

ఉ. ఆహిమభూధరంబు సకలాటవులం జరియించినామ యెం
దే హరిణంబు నీదృశ మధీత నిరూపిత రత్న శాస్త్రమున్
మోహకముం గనుంగొనము భూధర కందరపాళి నెచ్చటన్
దేహముతాల్చు రత్నసమితిం గనుగోమ యిదిన్ని యేండ్లుగా. 307

శా. అకుల్ పూల్ ఖగకీటపుం గఱుల వెల్గై వర్ణసమ్మిశ్రణ
ప్రాకామ్యంబగుపించు నెచ్చటొ స్వభావంబన్న యట్లుండుఁబో
యీ కూర్పీ హరిణంపు వన్నియల తీర్పేచిత్రకారుండొ భా
వైక స్ఫూర్తి ఘటింపఁజేసిన విధంబై తోఁచు నిక్కంబుగా. 308

గీ. ఇదివఱకు రెండుకాళ్ళపై నేగుప్రాణి యిపుడు నాలుగుకాళ్ళపై నేగవలసి
పడెడు నిబ్బంది యల్లకన్పడెడు సన్నలీల పొంతన పెట్టుకోలేనితనము. 309

క. నిరతం బింద్రియ వశులై తిరిగెడు వారికి విపత్తు తెచ్చును దే దు
ద్ధర మింద్రియవశవర్తిత తిరుగనివారి కొకసారి తెచ్చియతీరున్. 310

ఉ. పచ్చికమేయఁబో దదొకవాటుఁగఁ దాఁగొఱకున్ దదారుచిన్
మెచ్చదు కన్నులన్, నమిలిమ్రింగద యాదెసపెట్టు వీనుగా
నిచ్చటి వార్తలన్ వినునొ యేను వచించుచునుండ నంతలో
నచ్చపు మైజిగుల్ వెలతెలైనవి ముందరి కాంతులొప్పవే. 311

గీ. భీతి ముఖ్య వికారముల్ పేర్చినపుడు జంతువుల దేహకాంతులు సన్నగిలును
మృగములు మనుష్యభాషణంబెఱుగఁగలవొ యిచటమృగభీతిహేతువింకేమి కలదు.

వ. అనిన బహిస్సౌందర్యదఘ్నరసికత సూక్ష్మపరిశీలనానిరాదరయని మారీచుండు
ధైర్యంబు వహించిన రావణుం డిట్లనుకొనియె. 313

అ. సేనలేదయేని చెల్లును, రాజ్యంబు లేదయేని చెల్లు భూదయితున
కుగ్రధీకుఁ డొక్కడుండినచో మంత్రి యన్ని యున్నయట్లె యవనిపతికి. 314

ఉ. ఈపరిశీలనా మతియు నీదృశసూక్ష్మతమాభిదర్శన
వ్యాపృతబుద్ధి యిట్టి విషయాభిముఖీనము హేతుకల్పనం
బే పదవిన్ ధరేశుని మృగేక్షణయందలి సాధుగౌరవం
బోపి సమీపబాంధవతయున్ సచివత్వపు టుత్తమత్వమౌ. 315

శా. బాహాశౌర్యధురంధరత్వ మొకఁడే పాటించితిన్ దీనితో
నూహా ప్రౌఢియు శేముషీమహిమ తా నొప్పారం గడుం బాసలై
యోహో దుర్జయులిద్దఱన్ విఱువఁగా నూహించినన్ జాలదే
సౌహార్దంబునుమించి భక్తిమయ దాసత్వంబు పెల్లేచఁగా. 316

ఉ. తా నటువంటి పండితుఁడు తమ్ముఁడు దాసుఁడు మంత్రి, రాముఁడే
శ్రీనిధి, వీని దెంతటి యదృష్టము, జానకిఁ గొంచుఁ జన్ననున్
దా నితఁ డన్నఁ బ్రాణపుఁబదంబుగఁ జూచును, లక్ష్మమార్గముల్
గా నిలువంగఁ ద్రొక్కికొనునై వడిఁ జేయున సర్వదక్షుఁడై. 317

ఆ. ఇంత భయమెఱుంగ నేనెన్నఁడును వీని భావసరణిఁ గనిన భయము వేయు
నొక్కమంత్రి యిట్టిఁడున్న చో నాకును శతములైన జనకసుతులఁ దెత్తు. 318

వ. మఱియు లక్ష్మణుండిట్లనియె. 319

గీ. ఐనచో లేడి ఋషి కాదయేని యసుర ఋషియయిన నింత కాంతి సమేతదేహ
మందు మమకారమేటికి నసురయైన జనులమోహంబుపెట్టుట సహజగుణము.

శా. అదిన్ గాధిజు యజ్ఞవేళను బరిత్యక్తుండు దాక్షిణ్యమ
ర్యాదామంజులమూర్తి నన్న నెఱుఁగం డానీచు మారీచుఁ డం
బాదాహంబున వైరమున్ హరిణ రూపం బూనఁగాఁ బెద్దపెం
పేదన్ రెండవసారి యిద్దియగుఁజుమ్మీ తీర్పఁగా నెంచెడున్. 321

ఆ. అన్న కార్ముకంబు నన్నుఁదాఁకఁగ నీఁడు చిలుకు మిగులఁ జేయు శిక్షయందు
నదియు దుబ్బుకట్టి ముదిరి తేలి మహోక్షనిశిత దంతములకు వశముగాదు.

ఆ. అనిన రామమూర్తి యల్లంతగా నవ్వి వశముకాదయేని వహ్నిచూపు
మనినపలుకునందు నంబుజాప్తాన్వయుం డుగ్రగ్రీష్మమూర్తి యొకఁడు తోఁచె.

వ. అంత జానకీదేవి యిట్లనియె. 324

ఉ. మాటలమీఁదఁ బెట్టి నను మప్పఁగఁజూతురు మీరలిద్దఱున్
జాటుగ లేడిగానయి నిశాటుఁడు వచ్చిన నీవు గుర్తిడం
గాటపు బీతునుం గదిరి కన్పడకుండగఁ బాఱిపోవువాఁ
డేటికి గడ్డిమేయు మన యాయెదుటం దెలివెల్ల బోవఁగన్. 325

చ. అసురులు కామరూపులని యాడఁగవింటిమి దాన వచ్చు లే
డి, సనినయట్టి కుందెలు కడిందిగ దానవు లేగుదెంతురో
మసృణ తమాలపల్లవసమాజ రమా జనితోరుకాంతులై
యొసవరి మేను గల్గుటయు నొండొకదోసమ యయ్యె నక్కటా. 326

గీ. మన యనుభవంబులోనసుండినవికాక యన్నియునుకావయేమియీాయవనియందు
నందులోఁ బైడిలేళ్ళు లేవనుటయెట్లు కనులయెదుటన యిట్లు సాక్షాత్కరింప.

సీ. ఇది వారినిధి గర్భ పదవీ మహారత్నమూాల నిర్గతి వెల్గుముక్క వచ్చె
నిది హిమాచల ధాతు పదరహః కందరా పరమార్థలేశంబు బయలుదేఱె
నిది వేల్పుదొర విండ్లమొదలి క్షీరముపేరుకొనుచోటి మీఁగడ తునుక చెదరె
నిది చందిరుని సృష్టి మొదలి సంజవెలుంగు మెచ్చిన విధి కంటికచ్చు విచ్చె
గీ. శాంత లీలాచరన్మౌనిసరణి కాదు
విధుర మాయా చరద్దైత్య విధముకాదు
పరఁగ నొక యింద్రియాభితర్పణము జరుగు
చోటు పెఱయూహలకు నిది చోటుకాదు. 328

క. నీ వేదృష్టింజూచిన భావంబును దానినే ధ్రువంపఱచు, మతి
వ్యావర్తకమగు హేతు శ్రీవెలయును ఫలముగాని చెందఁగవలయున్. 329

ఉ. ఏనొక కోరికం జనన యెయ్యదికోరిన నద్ది యిమ్మనెన్
మౌని తదుక్తికిన్ ఫలముమాటగఁ గోరికగల్గె లేడిపై
మౌని త్రికాలవేది యిది మానసమందు నెఱింగి చెప్పెనో
కానిది నాకు లేడిపయి గాటపుగోర్కి యిదేల కల్గెనో. 330

వ. అంత మారీచుండు సీతానిశిత సుకుమార ప్రసంగనైపుణి కచ్చెరు వందుచుండ
రావణుఁ డిట్లనుకొనియె. 331

ఉ. అతఁడు కుంభసంభవుఁ డహార్పతితేజుఁడు నిద్ది చెప్పెనా
చేతమునందు రాఘవునిచే దనుజోన్మథనంబు కోరి యీ
రీతి వచించియుండు వివరించిన రాముఁడు చాలుఁగాని సీ
తా తరుణీ వియోగము నుదారపయోధిఁ దరించుటెట్లగున్. 332

శా. ఏదో గూఢపురాణి చేయుదురకాదే మౌను లానంద వ
ల్లీదీప్తోరులతాంతముల్ హతజగల్లీలాకృతుల్ వారికే
లో దుర్మార్గులు, కుంభసంభవుఁడు కాదో చేయఁగావచ్చు మ
ర్యాదన్, గుంభజు నేమిచేసినను నౌరా! బ్రహ్మదాఁకం జనున్. 333

వ. అపుడు శ్రీరామచంద్రుం డిట్లనియె. 334

ఉ. ప్రీతిని వచ్చెఁ దా నుడుకవేసెడి దిక్కును లేక చేతులం
బ్రాఁతిగఁ గాల్చుకోవలసివచ్చెడి దీవును నేను, నేండ్లుగా
నీతరలాక్షి నిక్కముగ నెద్దియుఁగోరదు మున్ను, కోర్కి ప్ర
స్ఫీతము సందియంబు కలిపించిన చోటునఁ గల్గె జిత్రమై. 335

క. పుట్టిల్లును నత్తిల్లును నట్టడవిగఁ జేసినాను నాతికి నటవీ
పట్టాభిషేక మారిచి పుట్టిన యొకకోర్కి యేచఁబోవనా పతినై. 336

చ. నిజముగ లేడియైన ధరణీసుత కోసము తెచ్చిపెట్టెదన్
రజనిచరుండె యైనను శరప్రహతిన్ వధియించి వచ్చెదన్
గజిబిజిగాఁ గనంబడెడు కారణసంహతి మౌనిచెప్ప టు
ర్విజ యిదెకోరు టీహరిణవిగ్రహ మిట్టులయుంట యన్నియున్. 337

వ. అని శ్రీరామచంద్రుండు ధనురాద్యాయుధధారణార్థము పర్ణశాల లోనికిఁబోఁగా సీత తోడంజని కవచాదు లందిచ్చి సాయపడి మరల నెప్పుడు కనిపించుట యనిన రాముం డామెవంక నిశ్చలంబుగఁ జూచి లేడియగుటయో తెగుటయో వెంటనే వచ్చెద నన సీత. 338

గీ. బాష్పమందాక్షమందాక్షి ప్రభువ!నీకుఁగోపముగనున్నఁ బోవఁబోకుముమఱింత
మాత్రఁ బ్రాణంబులుంబోవునా!త్రిలోక మొడ్డిగిలునా! యెదోకోర్కియుడిగినంత.

మ. నిను నేఁ గోరినయప్పుడున్నటుల లేనేలేద యిప్డీవుగాఁ
జన నీయింతయు నుండదేమొ మఱియున్ సాధింపనేలా స్పృహన్
దనుజుండే యగునేమొ వాఁడు నయినం దానేల వచ్చెన్ బ్రియో
జనమున్ నేర నెఱుంగ నందఱుఁబడిన్ దాఁ జావఁగావచ్చెనా. 340

గీ. అనవసరమైన దనుజసంహార మింత నా కసువులపైఁ గూరుచున్నది నృపాలుఁ
డనుచు నొక ధర్మమూని కట్టా! తదీయ ధర్మరక్షకు హింసావధంబు చనుట.

ఉ. ఆయెను దైత్యసంహరణ మయ్యది చేయుట ధర్మరక్షకై
న్యాయమె, చేయు జీవునకు న్యాయమొ, కొంత జగజ్జనాళికిన్
శ్రేయము కల్గి పున్నెమును జేకురు, దానవ హింసచే నఘం
బాయెను, రెండు రెండనుభవాకృతి పూనెడు సౌఖ్యదుఃఖముల్. 342

గీ. అరయ జ్ఞానంబె కర్మసంహరణ శీలి, కర్మ వైదికమును లౌకికంబు ద్వంద్వ
ఫలవిధాయి, యీద్వైతేయవధము మనకుఁ గడకు నిప్పుడుకాకున్నఁ గట్టికుడువు.

మ. అలఘుప్రీతుఁడు రామచంద్రుఁడును భార్యం గౌఁగిటం బూని మై
థిలి! నీ యీ మతివైభవంబునకె బుద్ధిన్ నిన్ను మన్నించెదన్
దల పేదైనను నీది చేయుటకుఁ జిత్తంబందు భావించెదన్
వలదే నించుక కోపగింపను జుమీ బాణంబు విల్లీగదే. 344

ఆ. అనుచు వెలికివచ్చినట్టి స్వామికి వెన్కఁ గవచ ఘట్టనమునఁ గందినట్టి
భుజముఁ దడుముకొంచు భూసుత వచ్చిన దితిసుతునకుఁ గనులు తిరిగిపోయె.

శా. సౌమిత్రింగని రాముఁడిట్లనె ధరాజాతన్ నిమేషంబు నీ
వేమో వీడకయుండఁగా వలెనయా యీవేళ దుష్టగ్రహ
గ్రామాభీలముగాఁ గనంబడెడు నీ కైవిల్ నిమేషంబునున్
భూమిన్ వ్రాల్పకయుండుటొప్పు నయనాంభోజాత సువ్యగ్రుఁడై. 346

శా. మారీచున్ వధియించి వచ్చెద మృగోన్మత్తాకృతిన్ లేడి రూ
పీరీతిన్ ద్యజియింపఁడేని మృగమట్లే తెచ్చెదన్ మూర్ఖు నా
నారాచాధ్వము దాఁటిపోవను బ్రయత్నంబూనునేనిన్ ద్రిలో
కీరేఖావధి వాని ద్రోవ నవలోకింతున్ శరాంత ద్యుతిన్. 347

క. వనవాసము పూరితికాఁ జన నయ్యేడుఁ గొంతకీడు జరుగక యుండం
జననీయదు సాకేతము చననిచ్చిన జెడ్డవేళ చనుననఁగలదే. 348

ఉ. అక్కట! కాల మీదృశ మహాకృతియైన దనంతలిప్తలై
యక్కడి కక్కడే యదుకులైనది, యీాయదుకుల్ పగుళ్ళలో
నొక్కి ప్రవేశమందెద రనూతను లట్లసురుల్, మతిప్రభం
జిక్కఁగఁ బట్టగావలయుఁ, జేతము కాలమయాకృతిం జనన్: 349

క. అది యసురమూర్తి లిప్తల్ గదిపినచో బీటులీయఁ గని సందులలో
నొదిగి ప్రవేశించెదు నట్టిది, వదలకు లిప్తలై ఘటించెదు బిగువుల్. 350

క. అనిన రామచంద్రుఁ డసురలోకేశుఁడు కానిపించెనేమొ తాను రాము
నకు నటంచు నులుకుకొని చూచికొనెఁ దిరోధానశక్తి సడలిపోనితనము. 351

వ. అనిన మారీచుండు స్వామిఁ గొంతమేర రానిచ్చి యెగిరిపోయెదనన్నంతలో రాముండొక విచిత్రచంక్రమణంబునఁ బరమసమీపదేశంబు చేరి యల్లెత్రాడు లేడి చుట్టు విసరఁ ద్రాఁటిపొడుగుపై మింటనెగిరి దితిజుండు దవ్వు దూఁకిపోఁగా.

గీ. కాంచి రాముండు నవ్వి నిక్కముగ నీవు నడవిలేడివి కా వట్టులైన నంత
యెగురలే వల్లెత్రాడింత యింతలో బిగించి నారసమేను లగింపఁగలను. 353

లాటీవిటము.

పదమన్న సురారి వియత్పద మూవాంఛారేఖాలంఘనరీతిన్
కదలెన్ జదలన్ వదలన్ మిథిలాకన్యాప్రాణేశుండును ద్రాడున్
గుదులౌ హరికార్ముకముల్ చెదరన్ గుంజత్పాథోదంబయి విద్యు
న్మృదువల్లిక మాటికిమాటికిసారించున్ వారించున్ ధృతినాఁగన్. 354

లాటీవిటము.

కలితేంద్రమణిచ్ఛవి రాజి మణిక్రాంతిశ్రేణిన్ గప్పిహరింపన్
వలితోరు విదూరజ కాంతి పరివ్యాప్తంబై వజ్రావళిఁ గప్పన్

విలసత్సుషమా భర వజ్రరుచుల్ విద్ధంబై మాణిక్యసమృద్ధిన్
చెలఁగెన్ హరిణంబొక చిత్రతనూశ్రీ చెందన్ శ్రీరాముఁడుచూడన్. 355

మదరేఖ.

కోదండాగత రజ్జుల్ పాదాంతమ్మున యందున్
మోదించెన్ హరిణంబున్ నా దూఁకున్ బదిబారల్. 356

చిత్రపదము.

కూడియు మున్నుగఁ దోఁచున్ వాఁడి శరంబున దూయన్
బోఁడి వియత్తునయందున్ లేడియ కన్పడకుండున్. 357

మణిరంగము.

చెంగనాలుగఁ జిత్రగతుల్గా దొంగయేణము తోఁచును దూరో
త్తుంగధారుణి దూర్వను మేయన్ వంగినట్టుల పాతరలాడున్. 358

మనోరమ.

కసవు మేయఁగాఁ గ్రమంబునన్ విసివి చంపఁడున్ వినోదమై
మసృణచేతమై మహీసుతా ప్రసృత బుద్ధి శ్రీప్రభుండు తాన్. 359

భుజంగప్రయాతము.

సమీపావనీయాత చామూరు రాజున్ ప్రమీలాక్షి పాతంబు పాలించుచుండున్
చమచ్చాప దండంబు సారింపఁబోఁగా ద్రుమానేకవల్లీవిధూతిం జలించున్. 360

హరిణి.

మృగము కనిపింపన్ లేదేయన్నన్ మించిన దవ్వునన్
దొగరు చిఱువన్నెల్ కాంతారమ్మై దూఁకును రివ్వునన్
జిగురుగుబురుల్ వృక్షమ్ముల్ చాటై చేరినయంతలో
మొగము కనిపింపంగన్ దూరంబై పోవును గొంతలో. 361

హరిణి.

తరణికులుఁ డెంతన్ లేడిం బట్టం దాను తలంచునో
విరిసి మృదువల్గత్క్రీడాళిం దప్పించుకపోయెడిన్
దరణికులుఁ డెంతన్ లేడిం జంపం దాను తలంచునో
విరవిర నదృశ్యమ్మై గాలిన్ గన్పింపక పోయెడున్. 362

తరళ.

హరిణ మంతట రామచంద్రుని నంతకంతకు గానలో
విరిసి దవ్వుగఁ గొంచుబోవుచు వీఁగినం బ్రభు డంతలో

దరిసి, కోరిక రేఁగి వచ్చిన దవ్వులన్ జని, భూమిజా
పరమ జీవితనాథు నామడపైని దేశము చొన్పుచున్. 363

బంధురము.

ఇపుడు తరణికులుఁడు తిరిగి చనదైత్యేంద్రుఁడు జానకి దొంగిల, ని
ప్రపుడునయిన సమయమిదియుం జాలునో యంచును లేడిమదిన్
దిరుగఁ దిరుగ గణనబెరసి వనిలోఁ దీర్చిన మార్గము వెంబడిగా
నరిగె సురిగిసురిగి రఘుపతి క్రుధాయాసము నిండినగుండియరాన్. 364

ఫలసదనము.

అరరె పసిఁడిహరిణ మనుచు నెదయందున్
గరుణకలిమి చనఁగ గడుసుఁదన మేచున్
బిరుసుఁదనము మివుల బెరయు మృగమాయా
హరణశరము తొడిగి యడరు పస తూల్చన్. 365

అంచును స్వామి తలంచినయంతన లేడియు నే
కొంచెముదూరము పోయిన కూడిక చాలునలే
యంచును జెంగునదూఁకుచు హేళి వనీతరు వ
ల్ల్యంచిత గుల్మములందున నంతటఁ జొచ్చి చనెన్. 366

ఇల.

ఒకయింతలోనన యుదరిపడు హరిణ
ప్రకటాధ్వమంతయు బయలుపడె దితిజుం
డకటా స్వమాయ చెడ నలఘుఁడు రఘురా
మ కరాగ్రబాణమ యయిన పథిఁ గలఁగన్. 367

సుగంధి.

ఓరి నీదుమాయరూప మున్నదున్నయట్లుగాఁ
గోరి పట్టికోఁ దలంపఁ గూడ్చిరావు దుర్మతీ
యోర! చావుమంచు స్వామి యగ్ని బాణసంధిగా
నూఱి తాటకేయు మేన నూల్కొనన్ విదిర్చినన్. 368

పంచచామరము.

నిజానిజంబు మేనుపోయి నేలమీఁద దైత్యుఁడై
గిజాగిజన్ గలంగికొంచుఁ గ్రుత్తిముండు భక్తుఁడై
విజాతిగొంతువెట్టి స్వామి వేఁడినట్లు 'లక్ష్మణా
గ్రజా' యటంచుఁ గేక వెట్టఁగా దుదిన్ 'గ్రజా' హతిన్. 369

చ. ఖగమృగదేవతావళులు కాననమెల్ల నెదో మహాభయ
స్థగిత హృదంతరంబులయి సవ్వడి సేయఁగరాక యట్లె యుం
డఁగ దితిజాతు 'లక్ష్మణ' నినాదము నామడపైని దాఁటి హె
చ్చుగ వినిపించె దక్షిణదిశా వియదేకచలత్తరంగమై. 370

చ. మతకరి తొంటివేల్పు కసుమాలపు సవ్వడి సన్న రేకగాఁ
బ్రతను వనీ మరుద్వ్రతతిపై నటవిం జని పర్ణశాలయు
న్నత నికటస్థలంబున నినాదము బొంయిమటంచు రేఁగినన్
క్షితిసుత వీనులం జలుచెఁజెట్ట సమస్తము కూయియైనటుల్. 371

చ. అరయ స్వభావమందుననె యాసురశక్తులు దైవశక్తులున్
దిరుగుచునుండు జంటలుగ దేనికి వీలగు నెప్పు డద్ది సు
స్థిరత ఘటింపఁజూచుఁ దమ చెందిన భావపరంపరా పథాం
తరమున నంతదవ్వున వినంబడె దైత్యుఁడు కూయివెట్టినన్. 372

మ. పదిపగ్గాల బిగించిపట్టెను చలద్వాయువ్రజంబుల్ వియ
త్పదమున్ శబ్దగుణంబు లొచ్చువడుచెన్ దవ్వన్న వ్యాజంబునన్
బదివక్త్రంబులు విచ్చి రావణుఁడు తత్ప్రాంతంబు భూభృద్దరీ
వదనోద్ఘోషణ శక్తిమత్ప్రతిభమై వండింపఁగాఁ జేసెనో. 373

గీ. దైత్యగళరుతి యామడ దవ్వు చనదు లేడి గళమెంత భీతమై లేవదంత
యదియువాఁడుగామారు వికృతపుజంతుసంధిసమయ బాధాధురాస్వనమొయేమొ.

వ. అంత జానకీదేవి యిట్లనియె. 375

మ. అది మీయన్న గళస్వనంబగుఁ గదయ్యా కాదయేనిన్ వనీ
పదమం దెవ్వఁడెఱుంగు నిన్ను నిను బిల్వంబూను నెవ్వాఁడహో
తుది నేదోయగు నక్కటా దిగులుపొందు న్నామన స్సారకే
యది నామీఁదకి రాక స్వామిపయి కేలావచ్చె నాహేతువై. 376

గీ. పాడు రతనాల మచ్చల పైఁడిలేడి యెచటవచ్చె నదాకోర్కె యేలకలిగెఁ
బరశురాముని నెలిచిన బాహుశాలి హరిణ హరణంబునకుఁ జాలఁడనుట యెట్లు.

చ. ఇది యిదియన్నఁ గాదనెద వెప్పుడు నీ, వదియేమొ యట్టులే
యది జరుగున్, మృగంబయిన దక్కట! తా హరిణంబుకాక ఘో
రదనుజుఁడౌట నీపలుకు రాపిడికాక మతేమి, నీవు న
న్నది పాలిపోని నిక్కమగు నాలుక నీకు నొసంగె దైవమున్. 378

మ. అవు నాకర్మ మిదిట్టులుండఁగను నేలా కాఁడు దైత్యుండు వా
డిపురున్ మెత్తనిమేని రాము హరిణం బేడొక్కలోఁ గ్రుమ్మెనో

యవురా నీవును గేక వింటివి కదయ్యా! చీమయుం గుట్టదే
నవ నీలాంబుద చిక్కణాపఘను నన్నన్స్వామి నూహింతువా. 379

మ. దనుజుం డంచును జెప్పినాఁడను దురంతంబైన వాంఛామతిన్
వినలేదంచును గోపగింపకుము నే విన్నన్ మఱేట్లేల మూ
డును గోపంబును బెట్టుకోఁ దగునె యిప్డున్ నన్ను మన్నించి య
న్నను రక్షింపఁగఁబొమ్ము నన్నిచటఁ గాంతారంబు భక్షించునా. 380

శా. ఏరైనన్ విని నవ్విపోయెదరుగాదే నీవు మీయన్నయున్
ధారాబుద్ధులు సీత సీత యని కాంతారంబునన్ నాదు ర
క్షారోచిష్ణుమతుల్ చరించెదరు నిచ్చల్ నాకు నాపత్తి రా
నేరాదేనయి యుద్ధమాడుదునె నేనీదైత్యు లాదైత్యులన్: 381

మ. పగచే వీఁడు సురారి యెత్తికొనిపోవన్ వచ్చెనా! వాని నా
భిగత ప్రాణములందు నిప్పరల గంభీరాంబుధిన్ బాడబా
గ్నిగఁ దద్దేహము నగ్గిగుండమగు నన్నేఁ గొంచుఁబో, నన్న చె
ప్పెఁగదా యంచని నిల్వఁబోకు తఱితప్పెన్ బో మఱందీ వెసన్. 382

ఆ. కేక వినుచుఁ దమ్ముఁ డీకానఁ గోదండి యుఱికి వచ్చునంచు నూహచేయు
నింత జాగుసేయ నెగుడును దిగుడైన ప్రాణముల నతండు పట్టలేఁడు. 383

వ. అంతఁ బంక్తికంధరుం డిట్లనుకొనియె. 384

క. ఈ ముప్వురు నీముప్వురె యేమాటాడినను బదకమెల్ల ధ్వనించున్
తా మఖిలసృష్టి విజ్ఞానామృత రసమూర్తులైనయట్లుగఁ దోఁచున్. 385

ఉ. దానవమైన మాయయు నుదారత నన్నును గప్పి నా తిరో
ధానమునందు భద్రత నెతారము గల్గదు, చూచినట్లుగా
నే నమఁగూర్చిపల్కెదర యాదృశ సర్వగబుద్ధి యేమి, యే
మైనను వీరితోడఁ బగయైనను బూనక యెట్టు లొప్పెడిన్. 386

వ. అపుడు సౌమిత్రి యిట్లనియె. 387

క. మనుజుల కాపదరెండై చనుదెంచును బయటనుండి శత్రువశంబై
మనలోననుండి మనకు ననునుకూలపు టూహవశమునై రామసతీ! 388

ఉ. ఆసురశక్తి బాహిరము నైనది యల్పము, చాపతాడితం
బై సమయింపవచ్చు, మఱి యాంతరమై చనుదాని ధీసమ
భ్యాసిత నిగ్రహోకృతిఁ దపోగ్నిదహింపవలెన్, దలంచుచో
నాసురవేళ యియ్యది కృతాధికయత్నమునన్ జరింపనౌ. 389

చ. ఇఱువదియేడు లన్నయెద నీవును నీయెద నన్నగాఁగ నై
తిరిగితి, రన్న బాహుబల ధీప్రతిభా మహనీయవైభవ
స్ఫురణము నీ వెఱుంగవనుచున్ వచియింతునె, యన్నముందు దు
ర్భరము త్రిలోకి గుప్పిలికి రాదు శరాసన లస్తకంబునన్. 390

మ. అకటా! తాను సమస్తం దధిపుఁడై యాధ్యాత్మికం బాధిభౌ
తిక మీ రెంట నియంతయై నిలుచు సందీప్తంబు జ్యోతిర్జగ
న్నికరంబందున నాధిదైవికమునన్ నిల్పిండు లోకప్రవా
హకృతిన్ దైవము పొగనిచ్చెడిని మర్యాదావధీభూతుఁడై. 391

ఆ. తలకుమీఱి వచ్చె దైత్యమాయ యటన్న నతఁడు పొగనిచ్చినంతవఱకు
నఖిలలోకచయము లాడఁగా నూడఁగా నతని యమ్ముచివర నంటియుండు. 392

శా. నా వాక్యంబునయందు నమ్మకము పూవన్లేవు మారీచుఁడ
న్లై వాతాయువుగాఁగ వచ్చెనన రత్నాంశుప్రభా మోహితం
బై విధ్వంసముకన్న యూహబడి మోహంబడ్డ దట్లయ్యెనా!
ప్రోవౌ సవ్వడికేక విన్పదు విధంబున్ యోజనంజేసితే. 393

క. అది పూర్తికేక కాదది తుదియక్కరములును నేవౌ తోఁపకయుండెన్
బ్రిదిలిన పిలుపుం జివరం గుదించి లోగొంతుతోఁడ గూసినయట్లై. 394

క. అవు జంతు కంఠ నిర్గతరవమువలెన్ దొలి లకార రావముచనె లే
డివలెం జచ్చుచు దైత్యత కవిసిన మారీచుఁ డఱవఁగా నైనయటుల్. 395

ఉ. ఏచిన వట్టి యూహ యను మియ్యది నా యది, యట్లయైన మా
రీచుని రెండుసార్లు విసరెన్ మును బాణపుగాలినన్న, దో
షాచరుఁ డింతలోఁ బ్రభునిశక్తిని మీరెడునంతలేఁడు, తా
నై చనుదెంచు రాఘవుఁడు నాఁగుము రాహు విముక్తసూరుఁడై. 396

వ. ఇది గడ్డుసమయ మాసురవేళ బలవత్తమమై నడిమిభాగమునడచు చున్నది. నియమమూని యంతర్ముఖులమై యున్కి లగ్గనిన జానకి కనులు కణకణలాడ నిట్లనియె. 397

ఆ. ఇంతకంటె నాకు నిష్టమ్ములేదను మన్న యట్టులగుటె యభిమతమను
చల్లకొఱకువచ్చి చనునె ముంతనుదాఁచఁ జనెను గద త్రయోదశములు సమలు.

శా. ఇన్నాళ్ళీగతి బిగ్గఁబట్టితివిరా! యాకోర్కి ప్రమ్గించుకోఁ
గన్నా వెంతటియోర్మి నేఁటికి సమాకాంక్షాఫలం బబ్బెఁబో
యెన్నన్ రాముఁడు వేఁడు వేఱొకఁ డెవం డేన్నాను పీన్నాను తా
నన్నంతున్నది భేద మీయెఱుక లేదాయెన్ వృథాబుద్ధికిన్. 399

ఆ. ఆ యమాయకుండు మీయన్న వినవలె సూక్ష్మములుగ విఱిచి చూపుచుండ
పాముచెవులు నీవి బహుసూక్ష్మములు విందు విననురానివియును వినుచునుందు.

ఉ. దైవము సాగనిచ్చున యతండును, నీవయి సాగనీయవో
కావలమైన నీపురుషకారముఁ జేయఁగ నీవు చొత్తువో
నీవును రామచంద్రునకు నిక్కపు భక్తుఁడవేని యాతఁడే
భావము గల్గు నాపథము పట్టక యింకొక త్రోవపోదువే. 401

శా. భార్యాత్వంబన నూరకే పురుష సంపర్కంబుగా నెంతురో
ధుర్యంబై చని భర్తృనిష్ఠముగఁ జేతోమోహ కుల్యాతటీ
మర్యాదాకృతిఁ దీర్చు యోగమిది, యమ్లానైకరోధస్కమై
నిర్యత్ప్రాణమువేళ జీవుఁడు చనన్ నిశ్శ్రేయసాంభోనిధిన్. 402

ఉ. అకట! స్వభావ వాదులకు నైహికమే సకలంబు దాన వా
రికిఁ బరమంచు లేద యురరీకృత తన్మహనీయముక్తి సా
ధకము తపస్సమాచరణ తన్నియమంబులు లేవు వారికిన్
సుకముగఁ గంటిలో వెలుఁగు చూడరు బాహిరవోవు దృష్టులన్. 403

శా. నేనాత్మేశ్వరి యోగమూర్తిని పెఱల్ నీరేజ పత్రాక్షు లి
ట్లేనా పోయినత్రోవ పోయి వృషవల్లీ పుష్పముల్ గావలెన్
తానై రాముఁడొకండె పూరుషుఁడు సీతారాము లానంద వ
ల్లీ నిర్ముక్తలతాంతముల్ రసవనీ లీలా లతాంతంబులున్. 404

క. మును దక్షుని కూఁతురు బొట్టనవ్రేళ్ళన్ రాచి కడువెడలు నగ్నులయం
దున నిర్దగ్ధత కను రీతిని రాముఁడు లేని నేను దిగుదును వహ్నిన్. 405

శా. నాపై మోహము పెట్టుకోకు మఱియుం దానైన మీయన్నయే
నాపై మోహముపెట్టుకోక చనియెన్ నారాచ మారీచ సం
ధ్యాపాదాతికుఁడౌచు నాదయిన శ్రద్ధంజూడ నాచే నగున్
నాపై నా కధికారమున్నయది కానం గానకున్ వచ్చితిన్. 406

ఉ. రాముని యట్టివాని కపురా యొక యెవ్వతెయైన భార్యయై
యామనసున్ మరల్చుకొని యన్యుని నెంచుట యంచుఁగల్గునా!
రామునియట్టిఁ డింకొకఁడు రాక్షస దైవత మానవాళిలో
లేమికిఁ బంచభూత విమలీకృత బుద్ధియె సాక్ష్యమొప్పగాఁ. 407

చ. ఒకటి పతివ్రతన్, మఱియునొక్కటి రామునిభార్య, నింక వే
ఱొకటియుఁ గృత్స్నధర్మ విమలోజ్జ్వల బుద్ధి, నొకండు యోగినిన్
వికృతుఁడు నన్నుమృత్యు పదవీస్థితిఁ గోరెడువాఁడు మూర్ఖు, వా
నికిఁ బదిచెక్కలౌను దల, నింగికి నేలకుఁగాని జంతువై. 408

ఆ. ఎవని కడుపులోన నేయూహ లుండెనో యెట్లు తెలియుఁ గోర్కిగట్లుతెగక
యేండ్లకొలఁది యూహ లెద దాఁచియుంతురు పైకిఁ బట్టరాని భక్తితోఁప. 409

క. మరి యిందులోన నభినయపరమార్థము చిత్తవిత్తు పండింతుర యా
సురవేళయంట యిది యాసురవేళ మఱిట్టియూహ చూపెట్టుటకున్. 410

వ. అనిన లక్ష్మణుండు మొగమునఁ గత్తిగంటు పెట్టిన నెత్తురుచుక్కలేనివాఁ
డధోముఖుండై యించుక సేపిట్లనియె. 411

క. నేఁ బోదు నాత్మరక్షా శ్రీబంధురబుద్ధి రక్షచేసికొనుము గా
థా బద్ధ విద్ధ వాచాప్రాబల్యఫలంబు నొసట వ్రాసియయుండెన్. 412

శా. అచ్చుంబో పెనుభక్తిస్థాణువను గట్టా! నోటి కీమాట రా
వచ్చున్ రాఁదగదంచు నెంచక మృషావాక్యార్థముల్ చేసి తీ
విచ్చోనుండినచో నఘాంశము మనోహేలావధిం గాంచెదన్
వచ్చెన్ దుష్టపుఁ గాలమీవు నను నీవాక్యంబులం గుప్పఁగన్. 413

ఉ. ఎందుకు నీవు వచ్చితన నిందుకు వచ్చితినంచు నోటికిం
బొందఁగరాని గొడ్డములు మ్రోఁగితి, వన్నకు దోషివైతి, స్త్రీ
లెందున నాత్మ నిగ్రహ మహీయసు లింతయుఁగా దనంగ నీ
యందునకంటె వేఱెచటనయ్యెఁ బ్రమాణము సర్వసృష్టిలో. 414

ఉ. అసురియైన మాయ నినునందుట నీపలుకిట్టు లోర్చితిన్
భాసురబుద్ధి నీవిటులఁ బల్కినచో సెలకట్టె గుండియన్
దూసియయందు, దుష్టవిధి త్రోసుకవచ్చెదు, నేరి నన్నచో
నీ సమయాన నేమి ఫల, మెంత లిఖించిన నంతభోగ్యమౌ. 415

వ. అని యాకాశమువంక జూచి. 416

చ. నిరతము తెక్కలార్చుచును నింగిని నిల్చెదు తాత మింటిలో
నరసిన నెంతదూరమున నానడ యన్నియుఁ గూడివచ్చె ని
ష్ఠురవిధి నీతలం పిటులఁ జొచ్చిన దెంతటిదంచు లక్ష్మణుం
డురుతర దుఃఖమూర్తి తలయూఁచుఁచుబోయె వనాంతవీథిలో. 417

ఖం డాం త ము

గీ. ఇద్ది మారీచఖండమ్ము వృషభవాహ! చంద్రమౌళి ప్రభునకు నిస్తంద్రకీర్తి
దీప్తిసమకూర్చి పెట్టవే త్రిపురదాహ! యీమహోద్భుత కృతిశ్రవణేచ్ఛఁజేసి. 418

ఉ. అశ్రమసాధ్యమైన సులభాకృతి ధ్యేయమయైన లింగమున్
ధీశ్రమలేని నే ననుమతించితి నద్దియు వేద శేఖరా

ర్థాశ్రయ భూతమైనది మహాప్రభు! మాదృశ లుప్తధర్మ లో
కాశ్రయణీయ దివ్యమహిమాద్భుతు నిన్నునెపట్టితిన్ శివా. 419

తోదకము.

అద్భుతలోకపదార్థక సామానాధికరణ్య సమూహిత సత్త్వా!
సాధు సమస్వర సంగతసామోద్గీథ విధా పరిదీపిత తత్త్వా! 420



# జ టా యుః ఖండము

క. శ్రీ దేహకాంతిపార దయాదీపిత శారదిక నవాధికవర్షాం
భోద సమూహావమ్యా! ప్రాదుర్భవదాంతరార్ద్రభావ సుగమ్యా! 1

చ. పడమటిసంజ నెఱ్ఱపడి భానుడు నిట్టమొగిల్ భుజాంతమౌ
పుడమిని మీఱఁగాఁ దిరిగిపోయెడినట్టుల లక్ష్మణుండునున్
గడియలపై గిరుల్ మలగి కన్పడకుండఁగఁ బోయినంతలో
గడగి హఠాత్తుగాఁ బుడమికానుపుగుండె గుబుక్కు మంచనెన్. 2

ఉ. ఒంటరియై ప్రజాపతియు నూరక భీతి వహించి తోడు వా
ల్గంటిని సృష్టిచేసె నఁట కానఁగ నొంటరియౌట భీతియున్
జంట సమస్తసృష్టియును సాగిన మొట్టమొదల్ మఱింతలోఁ
బంటవలంతి కూఁతునకు భావము చిత్రముగాఁగ మాఱినన్. 3

మ. అని యేమంటిని యన్న లక్ష్మణునితోనా? వచ్చి పెద్దమ్మ నె
త్తిన కూర్చున్నదయేమి? నాపలుకులం దెల్పున్ రఘుస్వామితోఁ
జనఁగా ఁబాతిక యేండ్ల శీలము నిమేషంబందునన్ బూదిఁబో
సిన పన్నీరుగఁ జేసితిన్ రఘుపతీ! సీతామనోనాయకా! 4

చ. ప్రభువును వచ్చి నా మొగము వంకనె యింకను జూడఁడేమొ, యా
ప్రభుని జగత్పతిత్వమున వాని సహోదరు సత్త్వశీలమం
దుభయమునందు నజ్ఞతయె యొప్పఁగ నాడితి, దోషమాచరిం
చి భయముపొందెదన్ బ్రభుని చిత్తమెఱింగిన తెల్వి మాయఁగన్. 5

చ. అమర జగజ్జనావళులు నాపద పొందిన వారిమీఁదఁ గో
పము ప్రకటింప రెవ్వరును స్వామియు గోపము విస్మరించు నా
కమరి యెదేని యాపద రయంబునఁ గల్గిన మేలటన్న చి
త్తముగల సీత లోచనపదంబున మస్కరి యొక్క డేచినన్. 6

చ. పదితలకాయలంతజడ పట్టినదండము చంద్రహాసవ
ద్విదళితరత్న కాంతిచయ వీధిక పండిన కొండగోఁగుపూ
ముదిరిన వన్నె కచ్చడము భూతివిలిప్త శరీర మింత న
వ్వొదిగిన రేక తా సెలవులొప్ప నొకింత వెడందవాయియున్. 7

సీ. తలమీఁది చాఱ రత్నకిరీటమొత్తదు ఫాలాక్షదృక్ఛిరోమాల గుర్తు
తగ బుజంబుల నంగదములరాపిడి కాదు పర్యంకబంధంబు వలు పొరిపిడి
తమ్మిపూ లోచనాంతముల దర్పముకాదు మనసు సంతృప్తి లక్షణముగాని
తనగళంబునను ముక్తాహారములుకావు స్ఫటికంపు సరముల వరుసకాని

గీ. బ్రహ్మవర్చస్సుతోపాటు రాజకళయు మొగమునం ద్రోసికొనివచ్చు మిగిలి కనుల
తుదల కాఠిన్యరేఖగాఁ దొంగిచూచు భూతి పరిలేపమది కప్పిపుచ్చుఁగాని. 8

సీ. మెడక్రింద గంట్లేమి మృదుని మెప్పింపఁగాఁ దీవ్రవ్రతంబూను తెగువయేమొ
యెదుఱొమ్మునఁ గిణమ్ములేమి శాంభవ లింగ ఘన పరిష్వంగ సంఘటిత మేమొ
కనమూపు సుంత వంగిన యట్లుతోచు కైలాసనాథుని బర్వుమోసెనేమొ
కరతలంబుల నింత కాఠిన్యమేటికి శివుని రత్నాలఁబూజించెనేమొ
గీ. కడుఁ బ్రభుత్వలక్షణమెదో కానిపించుఁ బరమ శివభక్తిసామ్రాజ్యపట్ట మేమొ
కుంభసంభవు తరువాతఁ గూడి యింత దర్పముగలట్టి యోగి యీదారి రాఁడు. 9

క. అందఱు భయదుఃఖాదులు చెందినచో ధర్మమున్ త్యజింతురుజనముల్
పొందిన ధర్మాచరణము ముందిడి దుఃఖములు మఱచిపోదురు సుజనుల్. 10

ఉ. కానన వాసపున్ ఫలము కల్గెను రాముని పర్ణశాలకున్
దా నవయోగి వచ్చె నరుదార విధాతృనివంటివాఁడు స్వా
మీ! నెఱి నర్ఘ్యపాద్యములివే కొను పీఠము స్వీకరింపుమీ
కానన కందమూలములకంటె యొసంగఁగ లేనయైతినే. 11

చ. పదినిముసంబు లిచ్చటనె భక్తివిధేయులు విశ్రమించినన్
మదిఁ దమిచేఁ జనెన్ హరిణ మాంసము తెచ్చును గేస్తు, నారగిం
చెదరు, మముం గృతార్థులను జేయుఁడు, త్వాదృశు లిట్టిరాక త
ప్పద యనఁగాఁ బురాకృతము పంట మొగంబగుటే యతీశ్వరా!

వ. అనిన యోగి యిట్లనియె. 13

క. మారీచుఁడన్న దైత్యుఁడు వీరుండై లేడిరూపువెట్టి తిరుగుఁగాం
తారంబందున నిచ్చట నౌరా! యీగేస్తు లేడియని తేఁడుగదా! 14

శా. నీవు న్నీపతి యిద్దఱా యిచట, బండెం బాప మీయందమే
మీ! విశ్వేశ్వర !కానలో నునికియేమీ. ! భీతి కాదేమి ! మీ
రీ వేత్తై చనుచోటఁ గట్టితిరి పూరిల్లోడు లేకుండఁ ద
స్వీ ! వార్వీరని పిల్వఁగానయిన లేదే యేదియే న్వచ్చినన్. 15

శా. ఏ సన్న్యాసియొ పెండ్లియాడు నిక వాఁడేయంచుఁ గూర్చుందురా
హా! సంసారపయోధి భద్రతరులౌ నంభోజనేత్రల్ హిమా
నీ సంసద్గిరి కూఁతుఁజూచితిని పై నిన్ జూచితిన్ భర్త ల
న్నా! సన్న్యాసులు కొండలందుమయుఁ గాంతారంబులం దీవునున్. 16

చ. అతఁడెవఁడోను రాజసుతునంట యయోగ్యునిఁ దండ్రి కోపి స్వ
క్షితిని బహిష్కరించెనఁట కేవల మాతఁడె యీతఁడా! దురా

గతుఁడయి రాకరాక తుదికాలము భిక్షుకుఁ బర్ణశాలకున్
యతినయి వచ్చితిన్ శివ శివా! యన జానకి యిట్లుగాననెన్. 17

క. మీర్విన్నది యెవరో సౌపర్వగణస్తుత్య ధర్మవైభవుఁడు మహో
ఖర్వపరాక్రముఁ డూర్జిత గుర్వాశీస్సాధు వితడు కొంచెముఁ గాడున్. 18

చ. జనకధరాతలేశ్వరుని సద్మమునందున నున్న శైవమౌ
ధనుసును రెండుగా విఱచి తత్సుత నన్ను గ్రహించె, భర్గశి
ష్యుని నల జామదగ్న్యు ధనురుద్ధతి సద్గతిలేక తూల్చె, స
జ్జనుఁడు నయోధ్యకున్ గుణవిశాలుఁడు వచ్చెను దండ్రియింటికిన్. 19

చ. తనకు నెవోవరాల్ సవతి తల్లికిఁ బంక్తిరథుండు పూర్వమి
చ్చెనఁట, సమస్తధాత్రి కభిషేకము నాఁడనుకొన్న ప్రొద్దుటన్
బెనకువ గల్గఁగా బయటఁబెట్టెను, రాముఁడు సాధుశీలి న
న్నును దన తమ్మునిం గొని యనూతనుఁ డిచ్చటవచ్చె శాంతుఁడై. 20

క. ఆ పరమధర్ము రాముని నీ పుణ్యాశ్రమ ఋషీంద్రు లెఱుఁగనివారల్
దీపింపరు తమ రెవరో యీ పదుమూఁడేండ్లు చూడ మెప్పుడు తమరిన్. 21

ఆ. అనిన యోగి పిన్ననైన నవ్వులుగాఁగ నంత తిరిగినారె యడవులెల్ల
మాది దక్షిణాది మఱియు లంకారాజ్య మనుచు వినఁగలేదె యద్ది మాది. 22

ఉ. మా పరమాద్భుతంబయిన మన్నన లేకయ రాజు చేయఁడే
యే పని, దానవేశ్వరు నహీను నహీన భుజాంగదోరు సే
వా పరిణామ సంజనితవైభవుఁ డ్రైభువనోగ్రశౌర్య రే
ఖాపరమావధిం దెలియఁగావలె వేఱొకనిన్ వచింపగా. 23

ఉ. చల్లని దక్షిణాపవనసంచయముల్ చనుదేరఁగా జనుల్
పల్లవితాత్ములై మలయపర్వతకందర చందనక్షమా
వల్లభజాత సంవలిత వాసనలంచుఁ దలంత్రు దైత్యరా
డ్గల్ల విలేప సంకుమద గంధిల నిశ్వసనం బెఱుంగకన్. 24

శా కుద్దాలింపనుబడ్డ సంపదగ గగ్గోలైన వేల్పుల్ విటుల్
క్షుద్దాహంబుల, రేలచెట్టు చివురాకుంబోఁడులా నచ్చరల్
సద్దాక్షిణ్యము సూపుమంచు నభిశంసా స్విన్న శృంగారభా
వోద్దీపంబులు లేఖ లంపెదరు దైత్యోర్వీమహాస్వామికిన్. 25

గీ. వానిరాజ్యంబునందున వైభవంబు నందు శౌర్య రేఖావీధియం దదృష్ట
మందుఁ దరుగువోవుటలేద యుపహతత్వ మందుటయులేద సంపూర్ణుఁడైనవాఁడు.

ఉ. దైవము పౌరుషంబు నొకదానను లోపము లోపమే, జనుల్
దైవము చేసె వాఁడు సముదార మహోనిధియందు, రన్నచో

దెవము వాని మించెఁగద, దానవనాథుఁడు పౌరుషంబునన్
దైవము రెంట నాథుఁడు శితప్రతిభాయుగనాథమానుఁడై. 27

ఉ. లోపల దాఁచి పెట్టెదరు లోకమునందునఁ గోర్కులెల్ల స్త్రీ
లీ పరమంపు గోపన మొకింతయు నింద్రియ నిగ్రహంబు గా
దీ పగిదిన్ లతాంగులు మహేశ్వర! యిచ్చటనుం బరత్రహా
స్తావతితంబు సౌఖ్యమునయందు స్వవంచితలై మెలంగుచున్. 28

ఉ. ఎవ్వరిమాటొ యేమిటికి నిచ్చటఁ జూడుము నీవు భర్త యా
త్రెవ్విన సంపదన్ వనగతిం జనఁగా వనవాసయోగ్యమా
పువ్వునుబోని నీ తనువు పుక్కిటఁబట్టిన కమ్మగంబురల్
రివ్వని దూసిన ట్లనుసరించెను దావులు ముక్కుఁగ్రోవులన్. 29

క. ఓహో! నీ సౌందర్యము బాహిరమగు సృష్టిలోనఁ బ్రథమమొ సంక
ల్పోహము కదలని పూర్వపు దేహేతరమౌ నమూర్తదీప్తియొ తెలియన్. 30

ఉ. ఈ స్థల మగ్నిమండలమ యిచ్చట గౌతమియేచుఁ బచ్చచె
ట్లై స్థవిరాతపంబు లొకహద్దున నుండునుగాని రమ్ము లం
కాస్థలిఁ, జుట్టు క్రమ్ముకొను కంధి సుషీమ తరంగవాయు వీ
చీస్థితిఁ బ్రాణముల్ పవన శేఖరవీధుల దేలిపోయెడున్. 31

గీ. నీవు లంక రావలయుఁ గానీ! యయోధ్య దొడ్డదొరబిడ్డ నిజముగా గడ్డికఱచు
నీరనిధి నిప్పలూఁది మండించును గడలిపయి ఊాలుతేలించు రాలేఁడ లంక.

చ. ఇరువదిబాహులం బయికి నెత్తితి రాజతశైల మాపయిన్
సరి దొర యుండెఁ బైని దొరసానియు నున్నది, యున్నదైన నా
గిరిసుత కేమి గర్వమిది కేవలభక్తుఁడ నోర్చినాఁడ, నీ
వరయక రమ్ము లంకకు హిమాచల కన్యక గర్వ మేమగున్. 33

చ. నెత్తిన పెట్టుకోఁదగిన నిన్ను వనంబులఁజేర్చె, మేనిలో
శొత్తుకయుండనైన నిను నోర్వములేక సగంబుచేసెఁ, దా
నొత్తిలి రాజశేఖరుఁడహో పతి, లంకకు లేచిరమ్ము ని
న్నెత్తినయట్టి యెత్తుగడ కెప్పుడు దింపుగడంచు నుండదే. 34

చ. మనసు విచిత్రమౌదినుసు మానిని! తా నలవాటుపడ్డ దే
తన కభిమానపాత్రమగు, దగ్గతదోషములున్ గుణంబులై
కనఁబడు నద్ది కాదయనగా నగు నాగ్రహ మెంత? యెట్లు పో
యినఁ జనుదెంచు నూహ యదియే వినిబద్ధ తదాత్త సంస్కృతిన్. 35

వ. అనిన జానకీదేవి యిట్లనియె. 36

క. కై లాస మతిశయిల్లఁగఁ గైలాసము నెత్తెఁ బంక్తికంధరుఁడని లో
కాలాపము వింటివి నీ యాలాపము లీవు చేసినట్లుగ నయ్యెన్. 37

చ. పరిచితమైనదానిపయిఁ బాఱు మనస్సని మీ యథార్థవా
క్స్ఫురణిచనెన్, బురాకృతము సంస్కృతిగాఁ జనివాని కందునం
బరిచితికల్గు, నా మనసుపారినవైఖరి దాని పూర్వసం
స్కరణఫలంబు, దైవమనఁగా నదియే యసురేంద్రుఁ బెగ్గడా. 38

చ. దనుజపతిం గనుగొనికదా పెఱవారి వచింపఁగావలెన్
మనుజపతిం గనుంగొనక మానవరాముని నెట్లు చెప్పనై
చనుఁ బెఱవారిఁ, మీ దనుజచక్ర నియంత మఱెట్టివాఁడొ నా
కు నతనిఁగూర్చి యేల? తమకుం బ్రియు నాకడఁ జెప్పనేటికిన్. 39

ఉ. దైవము పౌరుషంబునను, దైవము చాలమి లోపమంచనన్
దైవముకాక పౌరుషము ధారుణి నున్నదె? దానికే మయో
ధ్యావిభుఁడైన రామునకు దైవము చాలక పోవుటౌనె? తా
నీ వనయాత్రచేయుట య దేరికిఁ జాలదొ చిత్రమయ్యెడున్. 40

ఉ. పూర్వము పిన్నయత్త వనిఁ బుచ్చిన నామె యసాధువంచు నం
తర్వితతోహ మేచితివి దానవు లిచ్చట మౌనిలోకమున్
గర్వితచిత్తులై విద్రువఁగాఁ గని మంచిపనిం బొనర్చె ధీ
ధూర్వహురా లటం చిపుడు తోఁచెడు దైవ మెవండెఱింగెన్. 41

ఉ. ఈ దనుజాలితోడఁ బగయేలని చెప్పితి వేయిసార్లు భూ
మీదయితుండు రామునకు మించఁగఁ జూడనుజూడ న్యాయమే
యా దనుజాళి మర్దన మటం చనిపించెడు, నీవు మంత్రివై
దాది విధాన దైత్యునకుఁ దార్చెదు దైత్యగుణం బికెట్టిదో. 42

శా. అన్నాదమ్ములు మాయలేడి వెనుగానై నట్టి యీవేళ యే
సన్న న్నీ కెఱుగంగనైన దిట నే చాయన్ రహస్యంబుగా
నున్నా వట్టుల వారలేగిరిని నీవో వచ్చినా విట్లు మీ
రెన్నం బన్నినయట్టి పన్నుగడకా కీరీతి సిద్ధించునే. 43

వ. అనిన నయ్యోగి యుర్వదిచేతులప్పళించుచుఁ బదిమొగంబులతో ముంగిలి విఱు
చుకొనిపడునట్లు నవ్వఁదొడంగె. 44

మధ్యాక్కఱ

వర్షర్తువును, నమావాస్య, వనవీధి, పదివులుల్ కను ల
మర్షోగ్రగర్జలు, నొంటిమనిసి భీమలిన చిత్తమ్ము,
నార్ష దుష్టమువేళ పటిమ, యపహతావ్యక్త నక్షత్ర
శీర్ష దేశోపరి సువివశితము దృష్టిప్రసారమ్ము. 45

వ. తాదృగవస్థాగతయైన జానకితో రావణుం డిట్లనియె. 46

మధ్యాక్కఱ

మాధాత్రి నీవురావలయు మాణిక్యమణులు పండవలె
సాధించి యెందఱచ్చరల జలధిరాట్సంతతిఁదెచ్చి
బాధించి కొంటి పుష్పశరభావంబు, భావాంబునిధి సు
ధాధామసౌందర్యభూమ! తారుణ్య తాత్పర్యసీమ! 47

చేయి యాపనియట్టి రాజసేవకుల్ చిన్నిచల్లనలు
వాయువుల్ సురటులుపూని ప్రతిలిప్త బహుభక్తి వీతు
రే! యోసి దశరథధారుణీశుని యింటికోడల! ర
మాయిత సంసక్తియోగ్యురాలా! దృగంతాంశుపేల! 48

వ. అంతఁ బాపస్ఫూర్తిమచ్ఛబ్దశ్రవణ ప్రత్యాగత సంజ్ఞాక, సీత యిట్లనె. 49

ఆ. అర్బుదములు బ్రదుకు మంత్యకాలంబున్న దంధతమసమున్న దచటి మేర
మూర్తిగొన్న శివుఁడు ముంగిలిబంటు కావచ్చు మూర్తిలేనివాఁడు కాఁడు. 50

గీ. రామచంద్రనికేను భార్య నతనికి నమ్రతను, రాముఁడు శివధనుర్విదారి
చటుల భార్గవ ముని సమజ్ఞా విరోధి ధర్మతీవ్రవిధా దేవతాశిరోధి. 51

గీ. అంత ఘోరాకృతియు సుంతసుంత లిప్తలిప్త గడచినకొలఁది హృత్క్లేశ మొదిగి
పరిచితి దృగింద్రి యోగ్రపు బరువు సడలి సీత మనసు సద్భావనా స్థితమగుచు

వ. ప్రసంగధారాజనిత ధైర్యావలంబయై. 53

క. అవు రామలక్ష్మణులతోడి విరోధము, రవి శశాంకు డిప్పలుగాఁ తా
శవిధిన్ బ్రోఁగించెదు తెల్వివంటి, దిదియేమి కామలీలయొ కానీ. 54

గీ. ఇంతదూరము వచ్చితివేల! యింటి చుట్టుగల నాల్గుసంద్రముల్ చుట్టఁబెట్టి
చంకఁబెట్టకపోయితే! జలజబంధు నిచయ జలజాత బంధుని నిర్వహింప. 55

గీ. అతని యాశుగమునకు లోకాంతరమ్ము లక్కలక్కట! తిరిగిన దిక్కు లేద
యాదరించున యెవఁడు దేశాంతరంబు నల్పమతి ధైర్యగతి సాగరాంతరంబు.

శా. నా ముద్దారు మఱంది యన్న వెనుకన్ నామీఁది కోపంబుతో
నామైఁ బోయెన వాని కోపమున కాహా! నీవు లక్ష్యంబుగా
నేమై పోయెదవో యెఱుంగను, గృపాహ్రీమూర్తి దాక్షాయణీ
స్వామిం గైవసమాచరించికొను దీక్షాపాటవం బొప్పదే. 57

చ. పది తలలం గుదించుకొని వచ్చిన దండితనంబు వమ్ముగాఁ
బది సగ మూహలం దొలఁచి వచ్చిన త్రోవనుబట్టి పోవ మం

చిది, యిది దొంగపాటుగను జేరిన చేరికలోనె నీ యెదం
గదియు నధైర్యపున్ స్ఫురణ గల్గెడు, నీయెద నిక్కమాడుచో. 58

ఉ. నద్దమతీ! పతివ్రత సనాతని, యాయమయందు దోషసం
బద్ధము పారదారికము వాంఛమెయిన్ సుకృతాచ్ఛమార్గసం
పద్ధతిగాఁ జరించితివి, వంటమొగంబయియుండె సర్వమున్
గ్రుద్ధపతివ్రతా ప్రథమకూటము జోలికిరాకు మూర్ఖవై. 59

క. ఈ పాటికి శ్రీరాముఁడు మోపెట్టిన వింటఁ దిరుగు మొగమైయుండున్
మా పర్ణశాల దేశ మ్మాపత్ క్షేత్రమ్ము విడువుమా యావఱకున్. 60

మ. అనినన్ రావణుఁడంత యింత వెడనవ్వై యేమి విశ్వాస మా
తనియం, దీదృశ మల్పమౌ పరిచితత్వం బందునం బ్రత్యయం
బున దాంపత్యపుఁ బ్రాఁతబంధ్లునడచున్ మోకుల్ తెగున్ శాయమే
కును బట్టాలుతొలంగు నియ్యది వియత్కాలంకషామార్గమౌ. 61

మ. కడకున్ సర్వజనుష్ఫలాభిముఖ రేఖావచ్ఛివానంద మొ
క్కఁడె, యాతక్కిన వెల్లఁగల్పన లహో! కామంబు తన్మార్గ, మె
వ్వఁడనిశ్చాయకమైన స్త్రీపురుష సంబంధంబు ధర్మంబుతోఁ
గెడఁ గూర్పందలపోసె నూరక మృషాకృత్యున్నమ ద్బుద్ధియై. 62

గీ. నాయధైర్యంబుమాటయందాఁకనాపు తిరుగుమొగమయిరాముఁడేతెంచునంటి
వందుఁగల నీదుధైర్య మేమందునింక నతని సామర్థ్యమున సంశయంబుకలిమి.

మ. ఖరునిన్ దూషణునిన్ దదీయచమువున్ గయ్యంబునం బేర్చి యొం
టరి ద్రుందించెన యన్న దద్భుతమటన్నన్ గాదనంగాని, యొం
టరులై యాదృగతీత కర్మకరణానంతోగ్ర శౌర్యుల్ వసుం
ధరయం దెందఱులేరొ, యాతఁ డొకఁడేనా! సృష్టి కాద్యంతముల్. 64

శా. దేవానాంప్రియులై చరించిరి దిశాధీశుల్ భుజాఖడ్గధా
రా విక్షేపముతోడి రావణుఁడు యాత్రాజైత్రలీలం జనన్
బ్రావృట్కాల పయోధరం బన దిశాపర్యంత మూఁగించి యా
హో పుట్టించె సమస్త దిగ్వలభులం దస్మత్కృియాశ్చర్యముల్. 65

శా. ఓహో! మూఁడవవానిఁ జూపుము, సమస్తోర్వీభరంబున్ ఫణా
వ్యూహంబందు నటోయిటో యొరగఁగా నూనంగనైనట్టి శే
షాహిందక్కఁగ, వింశతి ప్రభు భుజాహంకార సంభారరే
ఖాహేలాధృత శైవ పర్వత భుజాస్కంధున్ ననున్ దక్కఁగన్. 66

సీ. ఉన్న దేవతలు కా కొగి క్రొత్తవారు లే రున్న దేవతలలో నన్ను మించ
రా రాముఁడొక దేవతాంశ మ్మటందురే నసలుకు దిక్కులే దంశ కున్నె

యస్మత్పరాక్రమ మ్మఖిలదైవత సమాహార శక్తిస్ఫూర్తి కతిశయించుఁ
గాకున్నచో నాదువాఁకిటఁ బడియుందురా వాయువును సూర్యుఁ డగ్ని మొదలు
గీ. నాకు నాకే మహైశ్వర్యమై కనఁబడు మృతిమహాదంష్ట్ర కాలఁదన్నితిని నేను
కడఁగి నిత్యవసంతునిఁ గాంచి నన్నుఁ బొగిలిపోవు సంవత్సర పూరుషుండు.

ఉ. నా మొగమోటమిం బడిఁ బినాకి కుబేరుని మిత్రుఁజేకొనం
గా మది నెంచఁడో వనజగంధి! కుబేరుఁడు నేను జన్మచిం
తామతిఁ బిన్నతల్లి పెదతల్లుల బిడ్డల, మిట్టినాకు ది
క్సీమలఁ గాలఖండములఁ జేటని పుట్టదు వేలతాతనూ! 68

మత్తకోకిల

ఆదిమంతములైన వన్నియు నంతవంతము లందురే
యాదిమంతుఁడనయ్యు నేనుగ నంతవంతుఁడఁ గానుసూ
కాదు నాఁగ సమస్తకాలము కాలఁదన్నితి, నస్త్రశ
స్త్రాదిబాధలు నాశరీరమునందు వ్యర్థములై చనున్. 69

ఉ. తోరముగాఁగఁ జూడ సుఖదుఃఖము లున్నవి రెండె యింత సం
సారమునందు, దక్కిన వసహ్యావృథా పరిజల్పితంబు, లా
వీరుఁడునాకు బంధుతను వెక్కసవెట్టెను, నేను కామినీ
దూరగుఁజేసి యాతనికి దుఃఖము తెచ్చెదనే మృగేక్షణా! 70

చ. తొలుతటి నాళ్ళలన్ మనసుతోఁ బెనుదుఃఖము రాయిడించి యా
వల శమియించునప్పటికిఁ బట్టిన వేఱొక క్రొత్తతీపి త్రో
వల ననుభూతి నూతనము వచ్చున, యీగతి రెంట శత్రుతా
విరహము నీ సుఖం బనుభవించెద సృష్టిరహస్యవేత్తనై. 71

క. ఎచ్చటివాఁడో యొక్కఁడు పుచ్చెనని ధనూరహస్యముం దెలిసి యదిన్
విచ్చినవానికి భార్యవా? యచ్చటను బతివ్రతాత్వ మాశ్చర్యముగన్. 72

క. ఆ దేశ మా పరిస్థితి యా దిష్టియు నట్లు జరుగు టదియే వ్రతమై
వాదింతురు వ్యామోహా పాదితచిత్తులయి మాయపట్టిన మొదటన్. 73

క. ఒక రాముడు నాకేదో వికలస్థితిఁ గూర్చునంచు వేఁగుపడకు మిం
కొకటి వచించెద నాతని బికిరపు మానిసిని జంపివేయనుజూమ్మీ. 74

ఉ. నెలనాళ్ళుండుము వచ్చి మాపురమున స్నీవా మహాభోగ మిం
తలవాటైనను జ్ఞప్తియుండవు యయోధ్యాసంపదల్, కాననం
బుల సన్యాసికిఁ బెండ్లమై తిరుగుటో పూర్వంబెదో జన్మలో
వలి వృత్తంబుగఁ దోఁచు, నేత్రసుషమా పాఠీన పాటచ్చరీ! 75

ఉ. అంచితభోగలాలసవు నప్పుడు కోరెదవేని, దృక్కళా
వంచితపుష్ప బాణశరవైభవ! సౌఖ్యమునందు విన్ను వం
చించిన యీ రఘూత్తమునిచేతను నీ మును కోఁతులాటయీ
డించెద నీసుఖంబు వికటించిన మందగు కామరోగిచే. 76

శా. మాలంకాపురిఁ దీరకాననములన్ మందారపుష్పాసవ
వ్యాలోలాళి కుమారదంపతుల గీతారావ ముద్దీపనం
బై లజ్జావతులన్ మనోభవ మహోభావాభిముఖ్యంబుగా
బ్రాలింపించు శరద్వసంతముల సౌభాగ్యంబు సామాన్యమై. 77

సీ. కుందురుష్కార్ద్రితక్కోలాగురుద్రవ్య పరిలిప్తదేహలౌ ప్రౌఢసతుల
స్నానవాహినులలో సాగరసంగమ స్థల సహస్రములచేఁ జలితవాయు
శిశిర తరంగాగ్ర శీకర స్పర్శచే నుప్పుచెమ్మట పోయదోలతాంగి
యస్మత్పురీ విహారానేక సౌధవాతాయనస్థిత లతాతన్వులకును
గీ. సౌర సంతాన పంచక క్ష్మారుహముల యెదుకొమ్మలు కలిపి క్రొత్తంట్లుకట్టి
యొక వినూతన పారిజాతోర్వీరుహ విశేషమును దెచ్చినాము చూచెదవుగాని.78

గీ. ముని తపోరక్షగూర్చి కామనము ముని తపఃప్రహాణముంగూర్చి కోపంబు విన్నుఁ
గూర్చి కామమ్ముఁ గోపమ్ముకూడఁ బోని యేమిపతి! ప్రేమజీవితమేమి యిద్ది.

క. తన వెంట నీవు వచ్చితి వనమునకున్ నీదువెంటఁబడి వచ్చినచో
వనధిగత లంకకును నీ తన ప్రేమలయొక్క తారతమ్యము తెలియున్. 80

క. ఐపానవాలు తోఁపని నా పోయినత్రోవ తెలియునా యాతనికిన్
వాపోయిన వాపోకఁగ నేపుట్టం బట్టిపోవు నితని కథాళుల్. 81

మ. ఇదిగో చెప్పెద సాధుమార్గమున రావేనిన్ బలాత్కార సం
పద మద్దైత్యమతిప్రబంధకలనా పాండిత్యమున్ నీ వెఱిం
గెదు రమ్మన్న, ధరాతనూజ కురరీక్రుశ్రారవత్కంఠయై
యిదిగో రాముఁడు వచ్చెనాఁగు మని తా నేగెన్ గుటీరాంతమున్. 82

వ. అంత రావణుఁడు సీత వెంటనంటి యామె మూర్ధజాకర్షణంబున పర్ణశాలా
పురోదేశంబునకుఁ దేఁగా. 83

క. అయ్యయ్యో! సౌమిత్రీ! దయ్యమ్మున యెత్తికోలు తాఁకెను తుది నీ
దయ్యంబు నన్నుఁబట్టెను వెయ్యిం జెప్పితివి కర్మ వినవచ్చినదే. 84

వ. ఓహో రామచంద్ర! ఓహో రామచంద్ర! ఓహోహో! రామచంద్ర! అంత
దూరమునుండి నీ పిలుపు నాకు వినవచ్చె! నా పిలుపు నీకు విననగుటలేదా!
ఈ పదితలల పిశాచము నన్నుఁబట్టు కొన్నదయ్యా! 85

పద్య

ఎప్పుడో చేసిన కర్మం బిప్పుడు ఘటియిల్లుననుట మృషయగునో
యిప్పుడచేసిన కర్మం బిప్పుడ ఫలియించుననంగ ఋజువిదిగో. 86

వ. తనకులంబున జరుగు నగుబాటు మింట నెసఁగు సూర్యదేవునకుఁ గనిపించుట లేదా! అయన యీ మహారాక్షసుని నిలువెల్ల భస్మపటలముగా నేల చేయరాదు. ఆ దివాకరుని వేయికరము లీ నిశాచరుని యిరువది కరంబులకుఁ జాలవో! ఓ యమ్మ! పిన్నత్తా! పగ నాఁమీదఁబెట్టికొని యనుఁగుబిడ్డ మీదవలె నెఱపితివి! తల్లీ! కౌసల్యాదేవతా! నీ యాశీర్వాదముల ఫలితము లేమైనవి? 87

విపుల

ఈ దీర్ఘవేళఁ గౌసల్యాదేవత దీవనల బలంబు చెడెన్
గాదేని యసురయొక్కఁడు నాదౌ జడ ముట్టఁగలుగునా వీఁడై 88

వ. నోటికి వచ్చినట్లు మాటాడితిని. వెంటనే యింత కోటికి వచ్చినది. అయ్యయ్యో! నాకిందు సహాయపడువారే లేరా! సాహాయ్యమ్ము కలుగు వేళయే యైనచో ముల్లోక మొడ్డిగిలిన నెత్తువెట్టగల ధనుష్కోటిగల యన్నాదమ్ములు దూర దేశమం దుందురా! మన నోటివెంటవచ్చు కటువైన పలుకులే మనకు శాపములై తగులునపుడు వే రెవరో శపించుట యెందులకు? 89

చపల

అహహా! యాపదయనఁగా బహిర్గతము హృదయ వికృతభావంబే
ముహురావృత మోహము విధివిహారమనిపించు విశ్వసృజా! 90

వ. అమ్మయ్యో! వీనివంగడపుఁ గుదుళ్ళు కూలిపోను. తలవెంట్రుకలకుదుళ్ళు వీనిచే తిలోనికిఁ బెకలివచ్చునేమో! అయ్యో! మహాక్రతూపరిమోదరేఖా నిశ్చలస్థితుఁడైన నాతండ్రి జన్నంపు నాఁగలి కఱ్ఱు కూడ గీసికొనిపోని నా తలకట్టు వీని నఖంబుల వ్రచ్చునేమి!అయ్యయ్యో! ఆయన ఎంత రాముఁడైన నేమి! నేనెంత సీతనైననేమి! దైవము బలవత్తమమైనది కదా! మా మఱంది యన్నట్లు శ్రీరామచంద్రుండు దైవమును నియమింపఁ జూడఁడు కదా! అయ్యో! ఇది యే దుష్టవేళ! రక్షోఘ్నమైన యొక మంత్రమును స్ఫురింపదే! శ్రీరామచంద్రుం డొక్క గడ్డిపోచనైన యభిమంత్రించి యిచట నుంచిపోరాదా! 91

ముఖచపల

మొదలిచి దుర్నీతికళా ప్రాదంబు సీతాహరణము హారిణముగాఁ
గదలించినాఁడు దుర్విధి యిదియు నొకడె పథి రఘుపతి నెగువంగా. 92

వ. ఓహో! రామచంద్ర! ఇంతవఱకు సామీప్యమ్ము చేరరాకపోయితివే! అయ్యో!

నే నీ యావత్సాగరంబున నెన్ని నిలువుల లోఁతు దిఁగబడిపోయితిని! ఈ యిరువది డెక్కల వికారపు రక్షఃకుశీరము నన్నుఁ గత్తిరింపబోవుచున్నది. ఈ మహావనమధ్యంబున ధీవరశ్రేష్ఠుండ వయిన నీ కెన్నిధనువుల దూరమైపో తిని. ఓ మహాజనములారా! కౌసల్యా సుమిత్రలారా! నామీఁద మీకుఁగల ప్రేమల కింకఁదిలోదకములు వదలుకొనుడు. ఓ యమ్మ! ఋషిపత్ని! శాంతా దేవి! నీ ముద్దుమఱఁదలు నీ ధర్మవుచెలార్పు కఱదలు చెవులుదోరపెట్టుకొని విననోఁచుకొనలేదు. ఓ మహారాజ! అజసంతానమా! నీకులంబునసైన యింతటి యపనింద నెఱుఁగకుండ దాఁటిపోయితివి. నీవే యదృష్టవంతుఁడవు. ఒక యాఁడుదాని జీవితమున నిట్టి యయోగ్యమైన దుఃస్థితి వ్రాసియుండరాదు. ఇది జరిగినచో నేమి భవిష్యత్తో యెవరు చెప్పఁగలరు. 93

జఘనచపల

ఇది యెద్దియో యఖాతపుఁ బదమున నడుగున నడుగునఁ బడిపోతిన్
జెదరిన బ్రతుకునఁ జెత్తయుఁ జెదారమయి నేను చెడిపోతిన్. 94

వ. అంత మూర్ఛాగతయైన సీతాదేవి ప్రత్యాగతసంజ్ఞయౌ వేళకు ఖర యుగ్యంబ యిన రావణురథంబు మింటిమొగంబై యుండె. 95

**మంజరి**

దశకంఠు చేతులు ధరణిజా హస్తజలజాతముల పదిజతలై నగాజు
లందున నొక్కి యాయమ భద్రపరుప గాజులు చిట్లి తత్కరములు పెట్లి
నెత్రు కాఱుచు ధారణీసుత కెంతొ నొప్పైన సీతాతనూస్పర్శ దైత్య
కరతలంబునయందుఁగానట్టి స్థితికిఁ దల్లి సంతోషించెఁ దా మనస్సునను. 96

వ. అంత రావణు రథంబు గిరిగింతలుపెట్టి యుప్పరంబున కెగసి దక్షిణాభిము ఖంబుగా బయలువెడలిన జానకి. 97

ద్విపద

అవునమ్మ పర్ణశాలాధిదైవతమ! నివసన మ్మిచ్చి మన్నించినా వింత
నీకు నాకును ఋణానీకంబు తీఱె గాకుత్స్థ నైనను గాపాడుకొమ్మ
అయ్యయ్యొ నా తల్లి! యలికి ముగ్గులను నొయ్యారమునఁ దీర్చు నుత్సాహవేళ
మత్కరకంకణ మధు రవవ్యాజ సత్కారదేవతాస్వామినీ! సెలవు. 98

వ. ఇంక భవత్పరిమార్జనోపచార భాగ్యంబు లేని నన్ను మన్నించి తిరిగివచ్చి నాకై వెదకికొను నన్నదమ్ములకుఁ బ్రతిబింబీకరించుకొనిన మద్దురవస్థాదర్శనంబు సలిపి నన్ను ఁజివరిదాఁక బిడ్డవలెఁజూడుము. 99

త్రిపదలు

పరిణతచ్ఛాయాప్రపా శ్రేణికాభూత
తరుకిసాలయపత్రపుష్పతారుణ్య రేఖావదాత
చిరకీర్తి వనదేవతా! ప్రశీతలాకారసౌభాగ్య!
తరుణ ముగ్ధాంభోద తనుకాంతిపరివాహ
పరమమోహనమూర్తి వచ్చుఁ బరిచిత పరముండు స్వామి
ధరణిజాదర్శనాదర నితాంతాక్షికోణమగ్నుండు
వరుస తలల్ కల పొడు పెద్దపిశాచి
సరసిజబంధువంశాబ్ధి చంద్రమా! శ్రీరామ! నీదు
తరుణి దుఃఖార్ణవమగ్నఁ దాను దొంగిలె నంచుఁ జెప్పు. 100

వ. జనకజాస్వహస్తకృత నిత్యగోదావరీ జలపరిసేకసేవనావర్ధిత బాలతరుసంతానమా! తండ్రి వచ్చువేళకుఁ దెల్లపోయి దిగాలుపడి చూడకుఁడు. పదిపుత్తై లొక్కచోఁ గని పించెడు శ్మశానభూతుఁడెవ్వఁడో నన్ను బలాత్కారాపహరణముచేసె నని చెప్పఁడీ బిడ్డ లారా! 101

చతుష్పద

వనతరుకిసలయవాసీ! శుకపికజనితసమూహా! జనకుడు వచ్చున్
జననిఁ బదితలల జూల్మఁడు రక్కసి గొనిచనె నంచునుగూడి చెప్పఁడీ. 102

వితాళ చతుష్పద

హరిణశాబకములార భీతిన్పరముఁ దండ్రిఁ గని పాఱిపోకుం
డరయ మిమ్ముంవలె నసుర యేఁడో తిరుగ బిడ్డలను దెలియఁగ లేమొ. 103

కర్ణాటకచతుష్పద

ఓ వనీ దేవతలు నుర్విసుతతోడి సావాసమందైన చనవుచేనైన
నా విశ్వనాథుఁడు మదాయల్లకార్తిమై వెక్కిపోయినను న్యాదరువు కండు. 104

పంచపది

ప్రభువుం జెప్పుడు దక్షిణాపథముగా రక్షస్సు నన్గొంచు దు
ర్లభుఁడై పోయె నటంచు రాఘవ భుజాలంబోగ్ర కోదండసై
రిభ శుండాల సమగ్రకోటి దహనశ్రీదంష్ట్రికావచ్ఛర
ప్రభవం బుగ్ర ముషర్బుధంబును దిశాపర్యంతమున్ వేల్చి ధా
త్రిభరోత్పాటన మాచరించుఁ ద్రిజగద్బీహేతులుంటాకమై. 105

వ. అంతఁ దన బిడ్డను దన్నికొని మింటఁబోవు గృధ్రమ్ము గుర్తుపెట్టి కొని నేలమీఁద బరువెత్తు మహాభుజంగివోలెఁ గనిపించు గోదావరీనదిం గాంచి జానకి. 106

షట్పదులు

బిందుబింద్వంతర సందీపితసుకృతసందోహ విమల పాథోనిర్ఝర!
వందారు జనతాఘబృంద నికృంతనచ్ఛందోవతారాంబు గోదావరి!
బృందారకానేక సుందరీసీమంత సిందూరరంజితాంభోవాహిని!
సుందరమతి రఘునందనభక్త్యభినందిత సముదితాంభశ్ఛట!
ఇందవే నతులు భూనందనా ప్రార్థనానందాగ తార్ద్రాంబువీచీతట! 107

వ. తల్లీ! మేమిద్దఱమును గలసి నీయందు స్నానమాడ వత్తుమని రే పెద రుచూడకుము. ఆ పుణ్యవేళ రాక్షసగ్రస్తమయినదమ్మా! సాగరరాజగామిని! వృషోత్సర్జనవేళాకేతనీభూత స్తంభద్వయంబు వోలె రేపు ప్రొద్దున నన్నదమ్ములు స్నానార్థమ్ము వత్తురు. గుర్తుపట్టలేవేమొ! అన్నకన్నులలో జలముండును. తమ్ముని కనులలో నగ్నియుండును. నాపోయినది దక్షిణదిశయని చెప్పుమన రావణుం డయ్యో! యీమె కనులకు గంతలయినఁ గట్టితినికా ననుకొనె నంతసీత యొక దూరస్థ మహాతరుశేఖరమునఁ జూచుచుఁ బ్రాణములు లేచివ చ్చినట్లు మోదరేఖతోఁచిన రావణుండు తద్దిశాదృష్టి ప్రసారంబుగా. 108

గీ. బహుప్రజాపతి గర్భ సంభారుఁడగు హిరణ్య గర్భుఁడు పక్షశరణ్యుఁడగుచుఁ
బ్రళయ జలవృక్షశాఖిkోపరి విలీనుఁడై నయట్లు జటాయువు కానిపించె. 109

క. అయ్యయ్యో! తాతా! నీవెయ్యెడ కేగితివి మఱఁదియేమో లేఁడే .
యియ్యసుర నన్నుఁ గైకొని యియ్యాకాశమునుబట్టి యేగెడుఁ గంటే 110

గీ. అసురపట్టు విదల్చుకో నవనిజాత పెనఁగులాడుచు నిట్లనె విహగలోక
సార్వభౌముఁడు కనిపించెఁ జాలు విడువు మింక ప్రాణాలు నిలువవులే దురాత్మ.

శా. తాతా! నీవిట నిద్రనుంటి మఱియుం దా లక్ష్మణుండైన నా
చేతోదోషముచేత దవ్వు చనియెన్ శ్రీరామచంద్రుండహో
వాతాయ్యాకృతి పూను రక్కసుఁగొనం బంపింపఁగా బోయె, దు
ర్నీతిన్ వీడును నన్ను నొంటరిగ నుంటిం బందికొంపోయెడున్. 112

ఆ. అంత దిక్కులేని దనుకొంటి కాఁబోలు ముష్టి వదలు వదలు దుష్టదైత్య
యనిన రావణుండు నార్భటీహాస విహ్వల దశాస్యుఁ డగుచు నదలిచె సతి.

వ. అంత జటాయువు నిదానించి చూచి నీవా తల్లీ! యనుచు సముద్భూత పక్షచ్ఛదాకృతి గిరిరాజువలె లేచి రావణుని రథంబాపుమని యడ్డువచ్చి యిట్లనియె. 114

క. ఆ యమ యెవ్వరో యెఱుఁగుదువా! యోగీశ్వరి విదేహపతికూఁతురయా
యా యోగ్యతముఁడు రాముని కా యోషారత్న మూర్జితాత్మేశునకున్. 115

క. నా బిడ్డవంటివాఁడని నేఁ బలుకుట కాదు స్వామి నిజముగ రాముం
డాబద్ధ జటామండలుఁ డై బద్ధుఁడు తండ్రిమాట కడవికి వచ్చెన్. 116

మ. జలజాతేక్షణ గౌతమీ తటమునన్ స్నానార్థ మేతేరఁగా
వలయాకార ప్రదక్షిణంబుగ నదీవార్వేణి సౌదామనీ
కలిత స్తంభముగాఁగ లేచి మునుకల్ కల్పించి మూత్నాంబుజాం
జలియై కానుక లిచ్చిపోవు వినయస్కన్నాంబు మర్యాదయై. 117

ఆ. ఉభయసంధ్య లగ్నిహోత్రమ్ము వేల్చును మహిత నిష్ఠ నాగమములు క్రోల్చు
నిత్య సత్యవాది మత్యమరాచార్యు డఖిలహితుఁడు రాముఁ డాత్మశీలి. 118

ఉ. సీత సమస్తలోక పతిశీలలకుం దలమానికంబు, వి
జ్ఞాతము సృష్టి కొంచెముగ సాగిన యప్పటినుండి నాకు, నీ
సీతనువంటి స్త్రీ విమలసృష్టి యెఱుంగను, నేను చెప్పెదన్
సీతఁ బరిత్యజింపు మిది చెట్టసుమీ పని దానవేశ్వరా! 119

ఆ. సాధుమౌళి రామచంద్రుండు మిక్కిలి మంచివాఁడు స్వాదుమధురభాషి
యింద్రియ ప్రమాధి, హృదయసముద్భూత మోహభావనా చమూవిరోధి. 120

ఉ. తా నొడిగట్టు భూజము లుదారములున్ వినయార్ద్రిముల్ శిరః
స్థానము లిట్లె వంచుచు లతాంతములున్ జనకాత్మ జాతకున్
గానుకగాఁగ నింపిచను గమ్మని పయ్యెర, భూసుతాతనూ
గ్లాని నిమిత్తకంబగు విలంబన చేయదు స్వేదనిర్ధుతిన్. 121

క. నే నెఱిఁగిన విషయం బిది కానంగల షక్షివితతి కమ్మని కాంతుల్
మేనఁ బిసాళించెడు నమ్మానవశిశుఁ గాంచి చొక్కి మఱచి చరించున్. 122

ఉ. ఆ యమచేత నంటు తరువంతయుఁ బూవులు కాయలౌను జూ
యాయమ కాలుమోపు ధరయందున రత్నము లుద్భవిల్లుఁబో
ఆ యమ రామలగ్నసకలాత్మక యాయమ నిట్లు కొంచునుం
బోయి యవేమి త్రవ్వెదవో? పూర్వజనుః కృత కర్మబీజముల్. 123

వ. అనుచు మున్జని యాఁగుచు వెనుక నెగురుచున్న జటాయువుఁ దొలంచుచునే
రావణుండు రథంబుమందముగా సాగింప. 124

క. మన మందరమును గశ్యపముని సంతానంబు లోకమూర్ధన్యం బీ
మన ప్రథమసృష్టి తొలియుగమున ధర్మము మనమె తొలఁగిపోవుట మేలా! 125

చ. తపములుచేసి జన్మములు తార్చి కడింది మనుష్యలోక సౌ
ఖ్యపుఁ బెనుత్రోవలందుఁ జనఁగా నగుఁ, గాదని యూర్ధ్వలోక వా
దపుఁ జిరదేవతాత్మమయతం జనవచ్చున, చిన్మయాచ్ఛ దీ
పపు వెలుఁగై చిరంతనము భావము పొందను వచ్చు నిత్యుడై. 126

ఉ. అంతములేని యీ మనుగడై బహుపూర్వదినంబులందునం
జింతిత మెద్ది యెద్ది గడచెన్, బహు భావిదినాల నద్దియే!
కొంతకుఁ గొంతయేని విసుగుం జనియించద జీవితంబు, మ
న్వంతరముల్ మఱెన్నిఁటి దినంబుదినంబుగ వెళ్ళఁబుచ్చినన్! 127

చ. కనుగొన జంతుసృష్టియు నికామము చిత్రము, క్షుత్తునైజ, మా
రినదగు క్షుత్తుతోడఁ బ్రసరించున కామము, కామమున్ సమా
ప్తి నియతి తోఁచనట్టిది కపిత్వము కన్నను చంచలంబు, దీ
ని నెవఁడు తీసినాఁడొకో! యనేకపు త్రోవల బానిసీఁడుగా. 128

గీ. ఒక్కతలకేమొ పదితల, లొక్క రెండుచేతులకునేమొ యిరువది చేతులును,ప
దింత లిరువదియింతలు, నీ వివేక మీ బలము, జీవలక్షణ మిట్టులగునె! 129

చ. మనసును బుద్ధి యున్నయవి మానుగ రెండివి, మానసంబు కా
మనమున, బుద్ధి ధర్మమహిమంబునఁ బొల్చును, మానసంబు తె
చ్చును మఱి తేదు సౌఖ్యములు స్థూలములింద్రియగోచరంబు, లా
త్మనియతి బుద్ధి తెచ్చు మహితస్థితి కెక్కడిపోల్కి చెప్పుమీ! 130

ఉ. ఈవికృతంబు సృష్టి నొకయిచ్చట నీగతి నుండఁబోదు కా
మావిలచిత్తు లుండరన నట్టి లతాంగులునట్టి పూరుషుల్
వే వెడమృత్యులై యనుభవింతురుగాక, పతివ్రతా పరీ
భావము చేయనేల బలవంతముగా నఘమున్ ఘటించుచున్. 131

మ. ఒక దుర్వాదనచేయవచ్చు నకటా! యూర్జస్వలంబైన కా
మ కళాదివ్యసుఖోగ్రభావమున దాంపత్యంబు భర్తృవ్రతా
త్మక సిద్ధాంత నిబద్ధజీవిఁ గికురింపంజూచునంచున్, శరీ
రక సౌఖ్యంబె సమస్తజన్మపరమార్థ ప్రౌఢ సారంబు నాన్. 132

మ. అకటా! యింతగఁ జెప్పనేమిటికి! నీవా! పార్వతీనాథ భ
క్తి కళానమ్ర మనస్కుఁడౌదువును, ముక్తిప్రౌఢవాదోగ్ర దూ
షకులం జేరవు, పుణ్య పాపముల విశ్వాసంబు లేనట్టి వా
నికినిం జెప్పనయట్లు దీప్తమతికిన్ నీకున్ బరిజ్ఞాతకున్. 133

వ. అనిన రావణుండు వ్యంగ్యపరమార్థంబు చూడఁ జాలక పరిచిత పదార్థంబుల
నిరాదరుండగు పండితంమన్యునివలె పోసానమం డగుచు రథంబు తొలఁగింపం
జూడ. 134

మ. పరమార్థంబున కేమి లౌకికమె చెప్పంబూనుదున్, చాల ను
ద్ధురమౌచుం గొని తెచ్చుకో నయిన శత్రుత్వంబు పాటింపు ముం
దర, నవ్వైరి స్వరూపలక్షణములం దచ్చౌర్యతేజో మహో
భరముం దూఁచి మదింపుకట్టఁ జను నప్పా! నీతి పర్యాప్తికిన్. 135

ఉ. వేనినొగూర్చి యెక్కువగ విందుమ విన్న విశేషమంతయున్
వానినిఁజూడ నిక్కమగు పాటిగఁ దోఁపదు వాని మూర్తియున్
గాని, రఘూత్తముం డటుల గాఁ డసురేశ్వర! విన్నదంతయున్
వాని మహానుభావ విభవంబున లేశముగాఁగ దోఁచెడున్. 136

గీ. ఆతనికి బరాభవం బాచరింప దేవతలకైనఁ జాలదు దివిజగంగ
కలుషితంబును జేయఁగాఁ గడఁగినట్లు లప్రతిహతునితో నెందు కతనితోడ. 137

ఉ. ఆతనితోడి యుద్ధమునకై యెదురై నిలుచుండి వాని రూ
పాతి మనోజ్ఞతా సుషమలందున నాత్మ రమించుచుండ నీ
వాతని నమ్మునం బొడిచి యాత్మకు ద్రోహము చేసినట్లు నీ
చేతము తోఁచ వానిదెస చేసిన ద్రోహ మిదెట్టి కార్యమో. 138

ఉ. అతని నథర్వమంత్రమహితాఖిల తీవ్రతరాధిదేవతల్
ప్రతను మరుత్తరంగ లవ భాస్వర భాస్వర శుక్ల వర్ణసం
గత పరమాణు రూపములుగా భజియించును, వానినుండి యు
ద్గతమయి వాని రూపమునకంటె విభిన్నము కానియట్లుగన్. 139

ఆ. అతని నడక యొకటి యాశ్చర్యమనిపించు నడచినట్లు కానఁబడదు గాలి
నెగురుచున్న యట్లు లగున వృషోరస్కుఁ డుగ్రపరిభుజుఁడు నున్నతుండు. 140

చ. ఖరునిఁ దదీయసైన్యమును కత్తెరవెట్టుట కన్నుమూసి కన్
దెఱచుటలోనఁ జేయుట యతిస్థితికంబగు శక్తిగా మనోం
బురుహమునందుదోఁప దదిపోవఁగనీ, భృగురాముఁడంత వెన్
దిరిగి చనెన్‌గదా మఱి యదిన్ మన కింతయు నచ్చదా మదిన్. 141

శా. ఈ యాకాశము లీ సముద్రములు సాహిత్యప్రమాణానుకూ
లాయామంబులు కావు వాని పటుబాహాదీప్తి సంచారమం
దాయా యీ యెవరోవచించిన వృథాహంకారవాక్పౌత్యయం
బై యీ యంతటిదాఁకఁ జేసినది కట్టా! యెంత యజ్ఞానమో. 142

ఆ. పుడికి యగ్నిఁ దెచ్చి నడివేసఁగిని జూరుపాకలోనఁ బెట్టుకోకు కుమతి!
యంటుకొనకపోవ దాఱిపోవనుబోదు చిటిలివంశఘటలు పెటిలిపోవు. 143

వ. అనిన రావణుండు సభ్రూభంగసీత్కారము రథంబు తొలగించబోఁగా నరదంబు
ముక్కుతో వెనుకకు గదిమి. 144

ఆ. చాలుఁ! జాలదప్పు పొగనిచ్చితి నిన్నుఁ జాలు! నిలుము నిలుము పొగిరాకు
మాటలాడుచున్న మరియాద నెఱుఁగవు గౌరవంబు నీకుఁగాని తెలియు! 145

ఆ. ఎంత చేతకాని యెవ్వండు కాళ్సేతులాడినంతవఱకు నాత్మబంధు
గతవిపత్తి యింత కనులారఁ జూచుచు నుండియుండి యూరకుండఁ బోఁడు.

శా. నన్నెన్నన్, మఱిచేతఁగానితనమన్నన్, వేలుపుల్ రక్కసుల్
మిన్నున్ మన్నున నమ్మ, రున్నత గరున్నిర్హ్రాదసంఘుష్ట వా
రాన్నిధ్యుగ్రవియత్ప్రచండుని సమారబ్ధాహవోన్మాదినిన్
పిన్నయ్యన్ గరుడిన్ మరుద్గిరిశిఖా ఛిన్నున్ స్మరింపించెదన్. 147

ఆ. కడచిపోయె మున్నుగానె మీ తరములు పంక్తిరథులు మఱియుఁ బంక్తికంఠు
లీవు రామునకును రా వొక్కగోటికి నాదుగోట మిగిలినావ యేని. 148

ఉ. చంచుగరుత్ప్రమాథన నిషాదుని నిర్దయ నన్నుగాని యూ
హించకు మల్పభావమున, నేనును వింధ్యగిరీంద్రమున్ నిరో
ధించిన కుంభసంభవుని తీరవువాఁడను నీ శిరస్సు తూ
లించెద! తెక్కగాలి విదలించి, లయోగ్రవిచిత్రఝంఝగా. 149

శా. నీకంటెన్ మునుపైన రక్కసులఁ గంటిన్ వందలన్ వేల, నా
హో! కల్పాది మహోగ్రరాక్షససమూహం బింతకంటెన్ మహో
గ్రాకారుల్ భయదక్రియాజటిలులున్, కాలం దలల్ దన్నితిన్!
నైకో కీవొక లెక్కపోకుము! శిరోఘాతంబు గావించెదన్! 150

ఆ. చాప చెడిననైనఁ జదర కాకుండదు ముసలి వీఁడటంచు మోదపడకు
ఒక్కతన్ను తోడ నుప్పరం బెగసెదు పడిన చోటు తెలియఁబడదు మఱల 151

మ. అరె! యిందాఁకటినుండి చెప్పెదను నీ కావంత విన్పించదే!
ధరణీసర్వవిశాలదేశము ననంతంబైన కాలంబు, శౌ
ర్యరమారూఢుఁడగున్ సనాతనుఁడగున్ రా! బిడ్డ, మా మా పర
స్పరమైత్రీమహిమం బెఱుంగు నభిశంసన్ దంద్రికిన్ నాకునున్. 152

వ. ఇది నీతోఁ దేలిపోవుటయో సకలదానవ వంశ మహాటవీదావాగ్నిరేగుటయో నిర్ణ
యింపఁబడుగాక. 153

ఆ. అడుగు కదలనీయ నన్నఁగ దానవరాజు నేమి చేసెదనిన? నేమి యగునొ
చూతువనిన నసుర చేతికశాహతి ఖరయుగంబు వెన్నుగాఁడ నడచె. 154

వ. అపుడు బండిపో లానించి ఖగరాజు ముక్కునవెనుక కదిమినఁ గదలలేక మొగ్గ
తిల్లఁబడి బెగ్గటిల్లి ఖరయుగ్మంబు వెనుగాళ్ళ బండి క్రింది తట్టు తాచుటయు,

జటాయువు వామపక్షంబున ఫెడీలుమని రావణుని దక్షిణభాగమునఁ గొట్టు టయు, నొక్కసారి ఘటిల్లి యసుర దక్షిణ కుండలంబు నేలపడి భగభగమండె.

శా. ఏరా పక్షి! అదేమొ వాగికొని నీవే పోదు వన్నన్ గరు
ద్ధారాపాతము తాచినావని కశాదండంబు చే నిచ్చి క్రు
ద్ధారన్ సారథికిన్, రథంబున ధనుర్దండంబు చేఁబూని చ
క్షూ రాజీవములందు నిర్వదిమహోగ్నుల్ జ్వాలలై మండగన్. 156

క. అరలిప్తలోన రావణు నరదంబు వియత్పథంబునం దెగిరె, ధను
శ్శరములు పరగించెడు దవ్వరసి, దశాననుఁడు ముల్కులాటిఁట గొట్టెన్. 157

క. ముక్కుతోఁ జిమ్మి విదలించి తెక్కతుదల నమ్ములను జటాయువు దేవతారిపైకి బిట్టులంఘించి వానిదోర్బిదురములను మొక్కవోఁజీల్చి రక్తంబు నిక్కిపొడువ.

క. గ్రద్దవోలిక దానవురథము కాకి వోలె ఖగరాజు, నరదము పొడువ నితడు
నతనికిం దవ్వుబోవఁగా నరదమిట్లు నంబుధరవీధి జంక్రమణంబుసాగె. 159

సీ. పదులు నిర్వదులు ముప్పదులు బాణంబులు కెరలి రక్కసి పిడికిళ్ళ దూయుఁ
జంచు గరుచ్ఛీర్ణ శరనిరాకృతి మహోకృతి విహంగమరాజు క్రేళ్ళుదాఁటు
క్లిష్టసారథి చక్రకేతన ఖరము ముట్టిన పక్షిపతి పల్లటీలు కొట్టు
కుక్షిశిరోదేశ పక్షమూల విదారణంబుగా నసుర బాణతతి నెఱపు
గీ. నొక పరిభ్రాంతమగు చిత్రమో యనంగఁ గడఁగి మింటఁ జకచ్చకత్కాంతివలయ
వలయ పరివేగ గమన భాస్వరముగాఁగ నలరె రావణ పక్షిరాజాహవంబు. 160

మ. ఒక ఝంఝూపరివేగ వీచిహతిచే నుత్పాటితంబైన కిం
శుక వృక్షద్వయ ముగ్రవర్ణ కుసుమ స్తోమారుణాలాత చ
క్రక సంభ్రాంతిగ మింట జంట తిరుగంగానైన యట్లై విహం
గక రక్షోరథముల్ చలించెఁ గృత సంఘట్టంబు విశ్లిష్టమున్. 161

శా. రక్షోరాజ ధనుర్విముక్త పటునారాచంబు లంభోధరా
ధ్యక్షుల్ క్రమ్మినయట్లు క్రమ్ము ఖగలోకాధీశ్వరున్, మేఘసం
ఘ క్షోదంబుగ హేళి తోఁచుగతి నక్షయ్యాకృతిన్ బక్షిరా
ట్జక్షీణోగ్రబలుండు తద్రథముపై నంతంత లంఘించెడున్. 162

చ. ఇరువురి కంఠదేశముల నిర్వ్యరి దీర్ఘభుజాంతరంబులం
దిరువురి మూర్ధదేశముల నిందువ గింజలు స్వేదబిందువుల్
కరిపెనమందు నిర్వరియుఁ గాయములందున నుండి ధాత్రికిం
బరువడి జాఱుచుండెడి ప్రవాళ సరంబులు రక్తబిందువుల్. 163

చ. తనర వియత్ప్రచాలిత రథంబునఁ జక్కఁగఁ గూరుచుండుటే
తనకు నెఱుంగరానిదగు ధారణిజాతకు నందులోఁ ద్వరా
వినతి సమున్నతి ప్రకటవేగ విధూతము బండి దైత్యము
ష్టినిహిత హస్తయుగ్మము పటిష్ఠత క్లిష్టముగాఁగ సీతకున్. 164

చ. అసురుని యేయు నమ్ములకు నంతును బంతునులేక మాటికిన్
ముసురుచునుండఁ గోపమును బొంది విహంగమ లోకనాయకుం
డసిత పయోద ముగ్రపవనాహతిఁ దూలినయట్లు బండిపై
విసురున వచ్చి గూఁడచటుఁ బెట్టినపోలిక వ్రాలినిల్చుచున్. 165

చ. దనుజుని వింటికఱ్ఱపయిఁదా నిరు కాళ్ళు లమర్చి పట్టి ఫె
ళ్ళున విఱిచెన్ సురారిమెడలో మణిమౌక్తికహారమున్ పుటు
క్కునఁ బెనువేఁడివాఁడి ముకుఁగోస విదల్చుచుఁ ద్రుంచె ఱెక్కఁతా
చిన వగు తాపులన్ రథము చిందరవందర చేసెఁ దీవ్రతన్. 166

ఆ. బందిపోటు జరిగి పాడైన పేఁట నావిహగరాజు లేచి వెళ్ళువఱకుఁ
గానిపించె బండి దానవుం డింకొక్కవిల్లు పూని కోప విధురమూర్తి. 167

మ. విహగేంద్రున్ బహుబాణపాతములుగా వేధించె ఱెక్కాడకుం
డ, హతాల్లగ్నశరోగ్ర నైకముఖకోణం బొప్ప ముక్కాడకుం
డ, హ్రాతాకాశ చరేశ్వరప్రభముగా నారాచధారా సుదు
స్సహ కారావినిబద్ధుడై విహగపంచాస్యుండు తూఁగాడుచున్. 168

చ. అతిబలసాహసుం డగు జటాయువు బాణసమూహపంజరో
ద్గతుడయి శిష్టలగ్నములఁ గాలను దన్ని శరంబు లిన్ని, దూ
రత ఉపరిస్థితిన్ వదనరక్తము ముక్కును బొట్టక్రింద రా
చి తుడిచి, దవ్వుగాఁ జనెడు చెట్టసురం గని కోప మేఁచుడున్. 169

గీ. తీవ్రఝంఝానిలసమాహతి మునుతూఁగి వెన్నులవెదుళ్ళగొమ్ములువిప్పగాఁగ
నాకసం బావరించిన యట్లు గరుదుదారసంభార ఘోరవిస్ఫారమూర్తి. 170

ఆ. మఱల దానవేంద్రు నరదంబుపై దూఁకె మఱల ధనువు విఱిచె మఱల ముక్కు
తోడ నసురఱొమ్ము గాఁడించె, గరుదుగ్ర ఘాతపాతములను గలఁచె, మఱల.

క. పిచ్చుకయా! పెడఱెక్కలు పెచ్చని మెడవిఱువ, దవ్వు వెలయక ధనువున్
బుచ్చికొనునెట్లు? శరములు పుచ్చుట యె ట్లసుర పాలుపోవక యుండెన్. 172

చ. ఖగపతి లేచిపో నసుర, కార్ముక మింకొకఁ దూని వీని మె
త్తగఁబొడుతున్, మఱిన్ మఱియు ఁదా బయికిం జనుదెంచునంచు ని

మ్నగ గిరికొమ్ముననన్ దుముకు మాదిరి, ఘోరశిలీముఖోగ్రపా
త గురు గరుచ్ఛరీర వినిదారణముం బొనరించె, నుగ్రుడై. 173

వ. అంత దానవేశ్వరబాణాసార నిస్సారసమస్తదేహుండయి ధైర్యం బేది జటాయు వున్నవాఁడున్నట్లు లేవలేకయుండ రావణరథాసీన విశీర్ణవేశసీమంత, బాష్పదృశాంత, సీత కనిపించిన శంపావ త్కృ9ధారేఖుండయి ఖగరాజు శరీరములోని సర్వశక్తియుఁ ద్రవ్వికొని యాదికూర్మపృష్ఠ సంస్ఫురిత మందరగిరివడువున లేచి దనుజరథంబుపై దూఁకి దూఁకుచునే సారథి నెత్తిపై ముక్కుతో నదిమిన నది వానికపాల రంధ్రంబునుండి మూలాధారంబు దనుక దిగి వాఁడుకొరతవేసినట్లయ్యె. అ య్యుష్మదంష్ట్రికవోని చంచువున ఖరయుగ్మమ్ము ప్రళయవేళా తిగ్మరోచి రోచిశ్ఛటాదగ్ధ శుష్క వృక్షద్వయంబువోలె విశీర్ణ శరీరసంధిబంధం బయ్యె. బండిరోజా, లిరుసులు, పోలు, తడిక, కాడి, మోకు, ముక్కలుము క్కలయ్యె. అంత రావణుండు ధాత్రికి లంఘించి జానకీదేవి నంకారోపితం జేసి వియన్మార్గంబున నరుగుచుండ జటాయువలసట తీర్చుకొని వాని ననుస రించుచు నిట్లనియె. 174

క. ఈ వఱకుఁ జెప్పవచ్చున, యీవఱకుం జాలునంచు, నెక్కడి నియమం
బావిర్భూతమహో మోహోవిలచిత్తులకుఁ జెప్ప నగుఁ, దుదిదాఁకన్. 175

శా. అన్నం బింకనులేదు నీకు భువిపైఁ బ్రాణావసానంబుగా
మన్నావిప్పుడు కూయి వెట్టినను రాఁడొక్కండు తోడౌచు, నీ
సన్నా గ్నేయశిఖోగ్రు నన్ను విదళించంజాలవున్ నీవు, నీ
యన్నున్ వీడుమ! రామచంద్రగుణమర్యాదానుకూలంబుగన్. 176

ఉ. ఒక్కఁడు దుష్టకార్యముల నూరక చేయుచునుండి యెప్పుడో
యొక్కఁడు మంచిదౌ పని నెదో పొనరించిన లోకమెల్ల నా
ద్రొక్కడి చేతఁ బూర్వకృతమున్ గణియింపక మెచ్చుఁజుమ్ము నీ
విక్కృతిచేయు సత్కృతులకెల్లను సత్కృతి యిద్ది, రావణా! 177

క. నిన్నింతదాఁక దెచ్చితి, విన్నది యిపుడైన మాట వృథకాకుండన్
మన్నింపు మిప్పుడైనను, మన్ను తినెద వీవుగాని, మఱి వదినోళ్ళన్. 178

చ. ఒకనికి గార్హపత్యము మఱొక్కనికిం బ్రళయాగ్ని, సీత యా
యొకనికి రామచంద్రునకు నూర్జితశక్తికి గార్హపత్య, ము
ర్వికమల గంధభూతునకు విశ్రుతధర్మ మనుష్యభూత మూ
ర్తికి, జనితోహ సంచయపరిష్కృత వేదమహోర్ధ్వవీథికిన్. 179

శా. ప్రాణంబుల్ పదినోళ్ళులం దెఱచిపోవన్ మన్మహోచండతుం
డానన్ రాచిన నావులించెదవు, కంఠస్థంబులౌ ప్రాణమున్

బోసీ కూర్ద్వదశాంగుళోపరితలిన్ బుంలోకమూర్ధన్యము
క్తా నీలాకృతి రామచంద్రుని నెలంతన్ వీడిపో వీడిపో. 180

శా. ఈమై నీపునఁ దాట లేచినను నోరీ! మానినీ లోకచూ
డాముక్తామణి ధారుణీతనయ వ్రీడామూర్తి నిప్పించి పో
రా! మండూకకపోల! కొంచుఁజని యౌరా! లంకముట్టించు బ
ల్గామై తాఁ జెడినట్టికోఁతి వనమెల్లం బాడుగాఁ జేసెదే. 181

చ. పశువున కొక్క దెబ్బయును ప్రౌఢిగ మానిసికొక్కమాటయున్
బశువునకంటె దెబ్బలును వందలు మానిసికంటె మాటలున్
విశదము వేయి తింటివిని వింటివి, దైత్యుఁడు రెంటిపై మహా
తిశయ జడత్వమూల ప్రకృతిస్థిరుఁడన్న మహార్థ కల్పనన్. 182

ఉ. అగ్గిని జీరలో ముడిచి యక్కట దొంగిలఁ బోయినట్లుగన్
భగ్గునమండెదో శివశివా! నిను నార్పను రాదె చేటలన్
బుగ్గిని బోసియున్ జివరిబుగ్గిని జేటల నెత్తియైన నీ
యగ్గి శమింపదే యుగయుగాదిమ ధర్మమునందు ద్రోహమై. 183

ఉ. పోవకు నీవు నిక్కముగఁ బూరుషుఁ డౌదువయేని నిల్చు, నీ
తో వివదింప, ముక్కుకొనతో నెద చింపను, రమ్ము వెన్కకున్
శ్రీవిభుఁ డింతకున్ దిరిగి చేరఁగవచ్చును బర్ణశాలకున్
నీవు నతండుఁ బోరుఁ డెవనిన్ మఱి వేఁడు జయించు వాఁడుగా. 184

వ. ఇట్లు జటాయు వనుచున్న మాటలను మహాకాశము భూతప్రకృతియు నను
వదించుచుండె. 185

క. ఖగరాజు దానవేశ్వరు మొగదల చని మస్తదశకమున్ గంఠమ్మున్
సిగయు నగలఁ బొడిచెను చిక్కగ ముక్కుంగోట బొమిడికంబులు రాలన్. 186

క. పదునెనిమిది చేతులతోడ దానవుఁడు పక్షిరాజు డంబర మొదుగన్
విదలిచి యెడ పెడతావులఁ జదియింపుగఁ జఱచి దూరసంగతి త్రోచెన్. 187

క. వెలకిలఁగ బడిన ఖగము పొరలి లేచి సురారిపైకి రాకుండఁగ ద
వ్వుల నెగురుచు వచ్చుచు నిమ్ములఁ దారుచుఁ జీల్చుచున్ విమూఢునిఁ జేసెన్.

క. చేతులు పందిరి కట్టెనుదైతేయుఁడు పక్షిరాజు తన చంచుమహా
ఘాతంబుల దానవు నరచేతులు తూట్లుగను బొడిచెఁ జిఱుకండలురా. 189

ఆ. కడఁగి దానవేంద్రు కంఠప్రదేశంబుపట్టి విఱువ వీలుపడకయుండ
నట్టునిట్టువరుసలై యున్న శిరములు కోటకట్టినట్లు కూడియుండ. 190

ఆ. పక్షిరాజు పెద్దపటకారుతోఁ బట్టినట్లు దైత్యుభుజమునందుఁ బట్టి
ముక్కుతోడ బిట్టునొక్కి దానవు పదికరము లొక్కసారి కత్తిరించె. 191

ఆ. కత్తిరింప బడిన కరములు వెంటనే పుట్టలోననుండి బుస్సుమంచు
లేచివచ్చినట్టి లేలిహానము లలపడగలెత్తినట్లు వచ్చితోఁచె. 192

క. ఆశ్చర్యంపడి ఖగపతి నిశ్చలముగ నిలిచిపోయి నిజముగ నేమీ
యాశ్చర్యము! తల తునిగియు దుశ్చరితున కిట్లె మఱల దోచునె! యనఁగన్

మ. తన చేతుల్ తెగి వెంటనే మొలచినంతన్ బక్షిరా జద్ది చూ
చినయంతన్, తన యెద్దియో యొక యవిజ్ఞేయంబుగా నుండనౌ
నని తా నెంచు రహస్యముం దెలియఁగా నైనట్టి వానిన్, వధిం
పను తీవ్రంబుగ నిశ్చయించెను నిలింపద్వేషి నీత్యుగ్రుఁడై. 194

వ. ఏ రెండుచేతులు సీతాగ్రహణమున నిబద్ధములైనవో దానవుని యా రెండుచే
తులు ప్రధానబాహువులు. జటాయువు నంద బద్ధ సమాదర జానకి విడిపోదని
యెఱింగి జటాయువును మఱలరానిచ్చి చంద్రహాసంబు వెఱికి యతని దృఢం
బుగా గ్రహించియిట్లనియె. 195.

మ. నిను మన్నించితి నింతఁదాఁక యిదిగో! నీతెక్కలం గోసెదన్
నినుఁ బాదంబుల యందునన్నఱకెదనెన్ నీ చంచువుం ద్రుంచెదన్
నను నెవ్వాఁడుగ నెంచితో విపులనానా దేవతాలోక నా
శనహేతూద్భట ధూమకేతువ నుదంచద్రాక్షసాధీశుఁడన్. 196

చ. దశరథరాజు నీ చెలిమి ధారణిజాత యటన్న పేర్మి, యా
దశరథరాజు పుత్రుఁడనఁ దా నెసలారెడు నీదు కూర్మి, క
ర్కశము శితంబు నాదయిన ఖడ్గమువాదరఁ దూల్చివైతు, బా
లిశముగ నింతసేపు విదలించితి నన్ను గ్రహింబు వైఖరిన్. 197

శా. నీ సొమ్మింతయు దొంగిలించితినె, యా నీ చెప్పరాముండు తా
నై సర్వాపగలుం బయోధియును నొక్కంజం దరింపం గలా
డో సారాధికమైన తేజముగలాడో అట్లె రానిమ్ము సం
త్రాసం బేటికి నీకు నీనడుమ? వధ్యంబైన దుర్జాతికిన్. 198

ఉ. పాములు పక్షులున్ మొదటివారలు సృష్టికి మిమ్ముఁ బట్టి ప్ర
జ్ఞామితభావనంబడి ప్రజాపతి సంయుతకామమున్ వ్రతో
ద్దామము సృష్టి చేసె ననుదారత దీక్షితవాదమున్, సమ
జ్ఞామలినుం డవిజ్ఞుఁడు ప్రసక్తము కామము నేకలగ్నతన్. 199

గీ. అంతవాఁ డింత వాఁడని యతనిఁగూర్చి చెప్పఁగా జొచ్చితివికదా! సీతఁగూర్చి
యదిర! చెప్పవె యంత దింతదియటంచు నీ వెఱుంగవుకాబోలు నీడజంబ!

మ. మరి తా నెంతది కానిచోఁ ద్రిజగతీమత్తారిమూర్ధస్థలీ
చరణాంభోజుఁడు రావణుండు సుధతీసంతాన సంతాన భూ
మిరుహంబున్ జనకాత్మజాతఁ దనభూమిన్ గొంచుబోనెంచు! సా
దరరేఖావరమాద్భుతా చరితతాత్పర్యంబు దీపింపఁగన్. 201

శా. తాతా! పూరుషు రాముఁబట్టికొని సౌందర్యం బుపన్యాస వా
ణీ తౌర్యత్రికఘోష సల్పెదవు, తన్వీమౌళిమాణిక్య మీ.
సీతామోహనలోచనాంతసుషమా శ్రీ చిక్కణాంశూరు వీ
చీతారుణ్యము పుక్కిలింతలు గదా! శృంగారపర్యాప్తికిన్. 202

గీ. అకట! నన్నెదిరించి యాహవముచేయు మంచు నెవ్వండు చెప్పెను రా దురాత్మ!
నా రహస్యంబుతోడఁ బ్రాణములు నీవి గుప్తపఱచితి నెగురుటకూడ దింత. 203

వ. అనిన నేలపై యమయాతనంబడి పొరలుచున్న జటాయువుం దరిసి సీత.
యిట్లని దుఃఖించె. 204

క. ఓ కల్పాంతమహాజీవీ! కాకుత్స్థుని లతాంగి యీ దురవస్థా
వైకృతి కనులం గాంచను లే కిట్లైతివి విహంగలీలాబంధూ! 205

క. అయ్యయ్యో! శుభశకున మ్మియ్యశుభంపుఁ బరిణామ మేలా పొందెన్!
దయ్యమ్ము తలకు మించిన దియ్యాసురవేళ చెప్పనే చెప్పఁబడెన్. 206

క. ఆ చనిపోయిన దశరథుఁడే చనుదెంచెను విహంగమేశ్వరు మూర్తిన్
నాచూడక యాయనయును నాచూచుచు నీయనయును నాగుప్తిఁ జెడన్. 207

మ. పితృసత్యోక్తి రహస్యపాలన కళావేశాటవీసంచర
ద్యతివేషా! రఘువంశ భూష! భవదీయంబైన వాక్పాలనా
తతతైక్ష్ణ్యం బిటువంటిదైనది యయోధ్యన్ దండ్రి, కాంతార ప
ద్ధతి సాధూత్తముఁడౌచు దండ్రి తరువాతం దండ్రి యన్నట్టేఁడున్. 208

చ. ఎవఁడు సుఖంబు పడ్డటుల నిప్పుడు, సాధుజనాళిచిత్తమా
ర్దవగుణశీతమౌక్తికసరస్థితుఁడౌ భరతుండు, సర్వబాం
ధవజన శేఖరీకృత సుధాకలితార్ద్రమనస్కుఁడౌ జటా
యువు, వనవాస సర్వఫలితోద్గత దానవభావలగ్నులై. 209

మ. బహు మన్వంతరజీవి సాధుమతి యాపద్బాంధవుం డచ్ఛహృ
త్కుహరోర్జస్వల నిత్యశో విహరదాగూ జాగరూకుండునున్
విహగశ్రేష్ఠుఁ డసూత్కరంబు విడువన్ విశ్వం బశౌచాకృతి
ప్రహతంబైనది నిశ్చలంబుగ శుచాపర్యంత దీనస్థితిన్. 210

శా. ఈ వాయూర్ములు నీ తరుప్రతతి తానీ మిన్ను విశ్వంభరా
దేవీ మూర్తి మహోగ్నిభావము నవార్తింబొంది వైశ్చల్య రే
ఖా వైకల్యము పొందియున్న యవి నాకంటెన్ శుచాదీనమౌ
భావం బందినయట్లు నాదయిన యావద్దేతు కావద్గతిన్. 211

శా. నాయీ జాతక మాదిమాయ కువకంఠం బయ్యె సౌమిత్రియున్
శ్రేయోవాక్యవిశారదుండును దిరస్కృత్యాధి బాధంబడన్,
సాయంపడ్డ విహంగమేశ్వరుఁడు పంచత్వంబు ప్రాపింప, దు
ర్జ్ఞేయంబైన విధిప్రయస్తమగు మజ్జీవాంశమే చిత్రమై. 212

క. అన్నియుఁ జిత్రములేగా నున్నవి లేనిపసిఁడిల్టి యునికియుఁ జేతుల్
కన్నులిఱువదియుఁ బదితల లున్న పిశాచంబు నుండియుండుటయు కటా! 213

ఉ. అప్పటిదాఁకఁదా నధికుఁడైన జటాయువు తద్రహస్యమున్
ముప్పగ నంతలోఁ దెలిసిపోయిన నంతటి యల్పుఁడౌటయున్
విప్పగరాని చిత్రములు, విశ్వసనీయత దాఁటిపోయెడున్
గుప్పనకూరలై చెడి కకుప్పలు నీరవభీతముల్ కటా. 214

వ. అని దుఃఖించుచుండ రావణుండు దూరమున నిలుచుండి పాదము లెడముగాఁ బెట్టి యిర్వదిచేతులు వెనుకఁబెట్టి యిర్వది కన్నులతో సూచీముఖ నిశితములతో నామెవంకఁ జూచుచు దానవమాయ వ్యాపింపఁజేసిన. 215

మధ్యాక్కఱలు.

అలువంపు గాలులు గుమ్మలై చుమ్మలై యట్లె యతని
నిలుచున్న చోటునఁ బూర్వనిమిషమ్ము నిభృతముల్ కదలి
కలగుండుపడి సుంతదవ్వుగానైనఁ,గదలిక లేక
వెలసె నూర్ధ్వప్రసారములు వికృతదర్వీకరాభములు. 216

గాలియే యొక పెద్దవహ్నిగాఁ బంక్తిగళు నంటుకొన్న
నోలిమై జ్వాలలు క్రమి యూర్ధ్వము లుప్పరంబెగయు
పోలిక, దనుజేశు వస్త్రముల కొసల్ మూర్ధజంబులను
హేలాశిఖాకృతి దానవేశ్వరుం డెసఁగె భుగ్నముగ. 217

గీ. అట్లై దానవమాయ ధరాత్మజాత దెసను బనిచేయకుండిన దితిజరాజు
ననలశిఖ చల్లనై భగ్గుమనుచు మండి కోపశిఖ భూమిజాతఁ జేకొనఁదలంచి. 218

క. నాపాలఁబడితి వెచటికి వే పోదువొ చూతుననఁగ బృథ్వీసుతయున్
బ్రాపిత శోకాగ్నిశిఖా వ్యాపారముగాఁగ దిశలఁ బరువులు వెట్టెన్. 219

నిశా

కుములు నెదను దాగికోఁబోవగా జానకీదేవియున్
బ్రమసి బ్రమసి సీత రా రాఁ దరుల్ దూరదూరంబుగా
నమరినటులు చాటు నందింపకే రక్షపొందింపకే
యముని దనుజు గాంచి హాహా భయోద్విగ్నముల్ పొల్చినన్. 220

తోటకము.

తమ కాపదలైనను ధాత్రి వృథా భ్రమ, తోడనుబుట్టిన వారలహా!
తమ కాశ్రయ మిత్తురు దాతురటం చమితాశలు ఖూడవ యందఱకున్. 221

త్వరితగతి.

అడవి యడవి గిరగిర నకట తిరుగుంబో!
జడములయిన తరులకుఁ జలన మమరెంబో!
అడుగునిడ ధరనిలువ దమితభయనద్ధం
బుడిగెనొకో! స్థిరమయిన యునికి యఘ మేఁచన్. 222

పృథ్వి.

అరే! చలనమైన నొక్కక్రమ మంచుఁగన్పింపదే
బిరాన నిట నున్న దచ్చటికి వెళ్ళి యచ్చోటి దీ
ధరన్ మలఁగి లిప్త యాఁగని విధాన వ్యత్యస్తమై
చరించు నకటా చలించు నవశస్థితిన్ భుగ్నమై. 223

శిఖరిణి.

తలల్ క్రిందౌచున్ స్కంధములుపరిగా ధాత్రిజతతుల్
మెలంగం జూడంగా మునుపు కలదా మేదిని యెదో
చలించుం దీవ్రంబై విలయసమయాసన్నమరుదా
వలుల్ తాడింపం బట్టుకొను వెరవుం బట్టుబడకన్. 224

గీ. ఒక్క నిష్కుసుమంబు గ్రీష్మరుతాప శుష్కపత్రోగ్రకంటకస్ఫురితమైన
పెద్ద గేదఁగి పొదవోలె వెంటవచ్చు జెట్టసుర యెండు బాడిదచెట్టువోలె. 225

క. ఒక కోటగోడపై దృష్టికిఁ బెట్టిన వికృతమైన జేవురు దిశిబొ
మ్మ కదలి వెంటాడు పగిది వికారుఁడగు నసుర బొబ్బపెట్టుచు వచ్చున్. 226

క. పదిగొంతుల పొలదిండియు కదలించిన పెద్దకేకగాఁ జనుదెంచున్
జదలు గొనమైన సవ్వడి పది నెఱియలుకొట్టినట్లు పగిలింపఁబడన్. 227

ధరణిధరగతి.

చెదరినతలయు చినిగినవలువ చెలువము తఱగిన మొగమై
కదలిన నడుము కదిసిన యురము కలఁగిన తునిగిన సరమై

అదరిన పిఱుఁదు నలసినపదము నదవదలయిచను కనులై
బెదరి బెదరియు విరిసి విరిసియు వెడలకు వెడలకు మగువా! 228

గీ. అంత నీరవమై నిశ్చలానిలమయి బావురనుచున్న యాకాశపథమునందు
వాని కంఠస్వరంబు కుంభమ్ములోన నఱచినట్లు హతాచ్ఛీర్ణహతమునయ్యె. 229

వ. అంత సీతాదేవి శోష్లిల్లిపోయి రోజుచు నొక్క వృక్షంబుబోద వెనుక నిలచిన
రావణుఁడు రెండవదెసనుండి యామె చీరచెఱంగు నందుకొన సీత. 230

మ. మరియున్ లాగనుబడ్డ గోవుగతి రామా! యంచు నెల్గియుఁ ద
త్తరు శాఖాగ్రకులాయ దుఃఖితశకుంతం బుగ్రచంచువ్యథా
స్వరమై గ్రుడ్లను క్రుమ్మి క్రుమ్మికొనఁ దత్ప్రాణంబు రక్షఃకులే
శ్వరుపై ముద్దలుముద్దలై పడియె రక్షస్సీత్కృతిక్రూరమై. 231

వ. ఆ యెడముచూచి సీతాదేవి మరలఁ గొంతదవ్వు చని యొక వల్మీకముఁ జాటు
చేసికొని నిలుచుండ రావణుండు వెన్నంటి యామెఁ బట్టికొన. 232

గీ. దుష్టసర్పాస్యలగ్న దుర్దురశిశువలె గీచుమనె సీత, నాకు సంకేతభుజగి
యోర్తు లజ్జాశ్లథపరిభవోగ్ర శిరసు నొక శిలాస్థలి వేసి కొట్టికొని చచ్చె. 233

వ. అంత స్థితిహేతు భూతయైన వైష్ణవి పరాశక్తి పాంచజన్యముఖి సుదర్శన పాలిత
యిట్లనుకొనియె. 234

శ్రీరమణము.

ఇంత తమస్సాహిత్యము గల్గన్ శాంతము సత్త్వము సాగుట యున్నే
యింత తలంచిన నేనును గానే యింతుల కౌనె యొకింతలు చూడన్. 235

వ. మఱియు సనాతనులు త్రయీ దేవతలు కేవలభావస్థితలు విచారణా స్వరూప
లిట్లు విశేషించిరి. 236

మధ్యాక్కఱలు.

ఈ పురుషుండు నీ స్త్రీయు నిద్దరే యింతియుఁ బఱియు
నే పురుషుండు నే స్త్రీయు నెందుకో యేల కారాదు
ఆ పురుషుండు నా స్త్రీయు నా దేశ మాకాల మా వి
ధాపరిస్థితులును దద్విధానసంధ్యాజీవకళలు. 237

ఆ యుగధర్మానురూపమౌ మనఃప్రాణమార్గముల
లో యమితస్వభావగతిలోఁ బరలోకపు దృష్టి
యే యింతయో యుక్తముగఁ బితృగతమాతృగతరక్తంబు
చాయను గల గుణసమితి సల్లోకసంధానకముగ. 238

అన్యోన్యధర్మానుకూలమైన మహావిషయముల
విన్యాస విభవంబు లట్లు వెలసిన విధివిలాసములు
శూన్యభవమునందుఁ దుదకుఁ జొరఁబడు శుద్ధమాయా జ
ఘన్యస్థితిం బాయత్రోవ కలిగించు క్రమధర్మంబు. 239

దానవులు మానవులును దదస్పృగ్గతంబైన గుణము
చేనైన వర్ణభేదంబు చెవులు నక్షియు ముక్కు నొకటి
గా నున్న బుద్ధులు వేఱుగా నుండుఁ, గలసి నెత్తురులు
పూని తమోగుణవృద్ధిఁ బొలుచు జీవులు ప్రభవింత్రు. 240

అరయఁ దమోగుణ మద్ది యభివృద్ధి నందిన కొలఁది
ధరణిలోఁ దక్కువయగు ధర్మంబు, తద్గత బుద్ధి,
పరలోకములదైన స్వభావంబు పొడ్వడున, తదు
పరి నంధతమసావృతంబ బ్రధ్నాంశు పటలతప్తంబ. 241

అకట! యిష్టానిష్టములను నాత్మరక్తాపగానుగుణ
వికృతియే యద్దియు వికృతవీథుల వెలయునా యేని
యొక విధి కాలానుసరణ మొప్పన యుగ్రమాకృష్ట
చకితభావమ్మొ యంధతమసంబు తీక్ష్ణంబుగాఁ జేయు. 242

ఇంతకంటెను గ్రూరపాణిహింసయే యెంతయో మేలు
వంత నాప్రాణిమాత్ర మశుభపథంబు పట్టిచరించు
నింతలోకం బంధతమస మెనయఁగా నెసఁగింపఁబోదు
తంతన్యమానవృథాక్రుధాదూషితము ధాత్రి కాదు. 243

ఉత్తమలోకాళి ధర్మ మూహించి యుర్విలో బ్రదుకు
చిత్తమ్ము లేకున్న మనసుచెందిన స్థితి యేల జీవి
కెత్తిన జన్మ జంతువు మఱేల తానెక్కువకాదొ
యిత్తఱి నన్నట్లుగాఁగ నెసఁగిన నేమిలాభంబు. 244

కదలనిది సుఖము, పీచికలులేవు, కలయనుభూతి
యది యున్నదో లేదొ యనగ ననిపించునది, యతితనువు
కదలి గగ్గోలుపెట్టించి కాయమ్ము కలగుండు వెట్టి
యెద చీల్చి మనసును బ్రీల్చి యామేను నేర్చు దుఃఖమ్ము. 245

ఇది యధమాధమవృత్తి యిది యధమేంద్రియవృత్తి
హృదయమ్ము దీనికి లేద యిది తనూతృప్తికిఁ గాద
యిది తనూజనియందు దనకు నెలవారు నేత్రప్రతిబింబ
మది చూచునదికాద లేద యాత్మ లేదా తీర్చు నీడ. 246

ఏ పాపమును దీనితోడ నెనగాద యిది పాప మనఁగ
నోపద సృష్టిస్వభావ మొప్ప సదూహయే లేద
యే పశువున కున్న నియమ మిచ్చట నింతయు తోచ
దాపతితోగ్రకర్మేంద్రియాధీన హతసర్వబుద్ధి. 247

వెనుకముందైన కాలపు వివేకము వెలయదు, పైన
తనయున్న జగమ్ముల తెలివి తనరదు, తన దేహమునకు
నొనరంగనౌ సుఖ మెట్టిదో యింత యూహించఁబోదు
మనసుండియును లేని దౌచు మంటిలో గ్రుందు కీటకమొ! 248

స్త్రీబలాత్కారాపహరణకృతి నెట్టి జీవులో యే వ్య
థాబుద్ధులో యే యనూహ్యధర్మపథభ్రష్టులో క్రు
ధాబద్ధ నిత్యభావనులో ధారుణీతలము నిండుదురో
శ్రీబంధురమ్ము మర్యాద సిగ్గు దాక్షిణ్యమ్ము చచ్చి. 249

ఈ కామవాదుల కున్నదేదియో యెఱుఁగంగరాదె
యీ కాలమున నాతఁడుండె నిది మించి యేదియు లేద
యే కీటమో గాలికి నుదయించు లయించు నా క్రిమియుఁ
బైకిఁ బోవును జీవగమనపద్ధతి వాడందె యుండు. 250

కరచరణాద్యవయవనికాయము కల మేలితనువు
పొరసి యింద్రియములు మనసు బుద్ధియుఁ బొంది యీ లోక
మరయఁగ నిట్లేల సాగు! నాదియు నంత మేమనదు
మఱి తాను జంతువై యుండుమాత్రకు మనుజత్వ మేల? 251

బహుకాలములయందు మఱియు బహుదేశభాగంబులందు
విహరింతు రందకత్తియలు వీని తృప్తికి నౌదు రొక్కొ!
యహహ! మూర్ఖ చిరాయువా! మహోవని నఖిలప్రదేశ
విహరణపటువ! యూహించు వెరవు వివేకము లేదు. 252

ఇది మనుష్యక్రిమియగుట యిది పశువే నయమగుట
యిదియుఁ దానన్న భావమ్ము నెదలోన నెంచి విచార
పదమున నిలిపి మోక్షమ్ము పడసెడు పథమైన ధర్మ
సదనమ్ము తొలిమెట్టు కూలఁ జరణమ్ము సాఁచి తన్నుటయు. 253

విషమసీసము.

వాఁడు కాంతను బలవంతపెట్టి యపహరించునో
వాఁడు సృష్టిధర్మ మర్మపథము బాహిరించెఁ బో

మూఁడు గుణము లేవొ పొళ్ళు మొనసి జగము సాగినన్
వీఁడు మాత్ర మచ్చుతమమువెట్టు రూపు, సర్వధా
రణికితఁడు వెలుపల, యణువునుగాఁడు, ప
దార్థమైన దానియందు నాత్మ
వీసమైనను బ్రతిబింబించుఁ, జీఁకటి
మొదటిముద్ద, వెలుగు ముట్టుకోదు. 254

వ. అంత నొక విపరీతపుగాలి వీవనారంభించె. 255

ధరణి.

చలువల్ తరుగ్గై వరుసల్ విరుగ్గై వాలికల్ తూలికల్ బాడబాకృతులై
మలకులుగొని మఱియున్ విరియున్ గాలుల్ ప్రాచీదిక్ప్రాంతములై గుములై.

మనోహర.

గాలించి హసంతి సెగల్ సురియల్ కలుచల్ కలువుల్ మలకల్ మెలికల్
హాలాహల పశ్చిమ హట్ట మరుద్దళముల్ మలఁగెన్ పరిదర్పితముల్. 257

వేగవతి.

విచలత్ప్రచలద్వ్యసరద్ధారాచరితంబులు రాణువలొచున్
అచలాభములై యామ్యదిశన్ వీచెను గాలులు విప్లవకారుల్. 258

వరావతి.

శాతముల్ కుబేరరాడ్దిశామరుత్తతుల్ గతించి సౌఖ్యముల్ యమించి గంధరేఖల్
ప్రీతముల్ పినద్ధముల్ దరీతటస్థలద్గతంబులై చలించెఁ దప్పదారిశాఖల్. 259

వియోగిని.

ఉపరిన్ జలితోరువీచికా విపులాకాశ విభీషణానిలా
ప్రపరావము సాగఁగా భ్రమి స్థపుటస్థాన మెసంగె నచ్చటున్. 260

ధృతమధ్య.

దానవు నిల్చిన ధారణి క్రిందన్ గనలి మరుత్తు నికామ తరంగో
గ్రానతమై పరిఘాతన పాత మ్లాన మహోణువు మాదిరి నయ్యెన్. 261

భుజంగశిశురుతము.

తొలిదెస కలఁతయయ్యెన్ మలుదెస నలఁత యయ్యెన్
వెలిదెస మలఁతయయ్యెన్ నలుదెస విలయమయ్యెన్. 262

వ. అంత సమస్తమహాభూతప్రకృతియుఁ బ్రత్యగ్రచైతన్యాభిముఖియై వేయిచెవులుగా వేయి నోళ్ళుగా నంతర్నిహిత సర్వఋషిలోక దేవతా నిచయ నినీనాకృతియై తాఁకినఁ గందునట్లుండె. 263

అల్పాక్కఱ.

సకలర్షి సంఘముల్ జాజువాఱి యకట! చర్మాక్షుల కంతర్హితుల్
నికృతిశాణోల్లీఢ నిష్కాకృతుల్ ప్రకటభీహర్షముల్ బాదరింప. 264

ఆ. ఉరక నిలిచి కాలుచున్నాడు మొదలును తుదయలేక త్రేత తూలిపోవ
తరపి పెయ్యపోసి ధర్మదేవత కుంటుపడినయట్టి కాలివంటివాఁడు. 265

క. ఇదియితఁడు చేయునా మఱియిదియీతఁడుచేయఁడా మఱేమనుదిగులున్
వదలినది, యిట్లు జరుగున యది యను నిశ్చయము జరుగునంతకు భయమే.

చ. అతని యహంక్రియావిభవ మాతని యూహపథంబు తత్పురా
న్వితమగు కార్యపద్ధతియు నెక్కొను నాత్మపరిస్థితిన్ యథా
గతిఁ జరియించునంచు ననఁగా నటులే చరియించు టీ జగ
త్కృతియగు బ్రహ్మ తీర్చినగతిన్ వ్యభిచారములేని షక్షమై. 267

మ. ఇది వైచిత్ర్యము స్వస్వభావముగ నిట్లే జీవులుం బోదురో
యిది సర్వర్షి మతి ప్రభావ పరిణామేచ్ఛానురూపంబొ! వే
ఱుదెసం జావఁడు వీఁడు వేర్విధముగాఁ గ్రోధంబు దవ్వింత పొం
దదు కాకుత్స్థునకున్ గటా బడిశమై ధాత్రీజ యీవేఁటకున్. 268

శా. ఈ మాయామయసృష్టి దానవులకేనేమో సురల్ మౌనులున్
మేమీ లోకము నిట్లెపట్టుకొని నిర్మృష్టాఘ సంతానరే
ఖా మర్యాదకు దేవులాడెదము కాకన్ గాదయేనిం బ్రమా
సామానాధికరణ్యమై చనిన సృష్టంబేలగున్ లోకముల్. 269

అల్పాక్కఱ.

సకల దేవతలును జాజువాఱి యకట! చర్మాక్షుల కంతర్హితుల్
నికృతిశాణోల్లీఢనిష్కాకృతుల్ ప్రకటభీహర్షముల్ బాదరింప. 270

ఆ. త్రేత మొదలు చివర ధృతిఁ దనాయించెను మురికికాల్వయొడ్డు మోచినట్లు
అపగాఢమైన యాదిమాసురశక్తిపెద్ద త్రవ్వి లంక పెట్టినట్లు. 271

ఉ. ఛాందసుఁడంచుఁ జెప్పెదరు సారసగర్భునిఁగూర్చి వెల్గివా
ర్కొందఱు వాని లౌకికము కోటికి నెక్కినదేమి పంచె మా
యందున? మూఁడులోకములదైన ప్రభుత్వము మాదిపేరు, దై
నందిన నాకభోగపరిణామము సర్వము వారి యూరుగన్. 272

క. మనసునఁ దెలియదొ బ్రహ్మకు దనుజులదెసఁ బ్రేమ తనకుఁదనకే యెపుడున్
దన నాల్గునోళ్ళ వేదంబును సత్యము ధర్మ మొక్క మొగి ఘోషించున్. 273

మ. ఎపుడున్ వారిని రెచ్చిపోవు మతియందే నిల్చు వారేమొ ని
త్రపులై బ్రహ్మ సదానుకూలుఁడని తాత్పర్యంబు దీపింతు, ర
క్రప సంతానమునైన నొక్కఁడడిగా రానిచ్చునా పైకి, వా
రిపయిన్ మమ్మును బెట్టు మాపయిని వారింబెట్టు పర్యాయమై. 274

శా. అంతో యింతయొ మధ్య వీఁడొకఁడు బ్రహ్మోభంబుగా మాజె నీ
యింతన్ జానకిదేవిచే మడియుఁబో! యేదో ప్రమాణంబుగా
సంతోషింపరు దైత్యులీజగదధిష్ఠాతృత్వమే కావలెన్
సంతోషింతుము మేము దేవతల మస్మచ్ఛ్రీయముం గూర్చునా! 275

చ. మరియు నహో! యథేచ్ఛముగ మమ్మును వీడిన సర్వలోక సం
భరణము చేయునందనుక వచ్చినచోఁ దనగొప్ప యేమి! యా
సురమును సౌర మీద్వయము చొప్పడరా దధికత్వరేఖచే
నిరువురు బద్ధవైరులయి యింతయు నాఱని నిత్యవహ్నిగా. 276

శా. కాదయ్యా! తనుదాన సర్వజగతీ కాండాయమానప్రభా
ప్రాదుర్భావ సమర్థతం గనునొకో! పై నిద్దఱున్నారు తా
మాదామోదర ధూర్జటుల్! ముగురు తానై వారిలో శక్తిచేఁ
గాదే లోకముత్రిప్పి త్రిప్పి సృజనల్ గావించుటం జేసెడున్. 277

మ. విధి యాచిత్రవిచిత్ర కల్పనలు పుష్పించున్ సురారాతివి
శ్లథ మేధాకృతి దుస్స్వభావమున నజ్ఞత్వంబు నైచ్యంబుపై
నధమోహం బడిపోవుటే సహజమై యాదైత్యులున్ శాంతి తా
రథముల్ పొందరు, పొందనీ రితరులన్, బ్రాణానిలద్వేషులై. 278

గీ. ఏమిచిత్రమ్ము రాక్షససృష్టి! సాధు ఘటనముగ నైనఁ బల్కరించుటకుఁ గాదు
ఎవరినైననొ యెందుకో యెపుడు కోప మే మొగంబున, మాటలో ధూమరేఖ.

శా. ఏలోకంబుల మీఁదికిం జనరుమే మీ దేవతానీక మే
హేళిన్ లోఁకువయైతి మెంతదనుకన్ నాకంబుపైఁ జూపె, యు
త్తాలంబై చను దీప్రశక్తిఁ గను చింతంబోరు వైరాజముల్
హేలాతైజస లోకవాంఛ గన రల్పిష్టుల్ మతిక్రూరులున్. 280

గీ. స్త్రీలఁ జెఱపట్టుటన్నను చెంగలించు చక్కటా! దొంగచాటుగాఁ బ్రాణములను
తీయుటన్నను వారికిఁ దెచ్చికొన్న ప్రథమగుణములు తల్లి గర్భముననుండి.281

ఉ. అక్కట యూళ్ళపైనఁబడి యందిన స్త్రీలను దొంగిలించుచున్
చిక్కినయట్టి మానవులఁ జిత్రవధం బొనరించుచున్ మఱిన్
బెక్కున పిల్లపాప యను భేదములేక చరించుచుండు నీ
జక్కులమూక యౌ విధవజాతి హరించుటలేద యెన్నడున్. 282

ఉ. వారిప్రగల్భ వాక్యములు, వారిసమర్థత లోఁతుకాదు, త
త్కాత్రిరత పచ్చినెత్తురులు క్రోల్చుటయున్ వచియించు, భీకరా
కారము ఘోరకాయములు కాలికి బుద్ధిని జెప్ప టే సుధా
హారులలోన నే బుడతఁడైనను జాలు నెదిర్చి నిల్చినన్. 283

గీ. అయయొ! మకుటాయమానమైనట్టిగుణము
శీతమున్నది యొకఁడు సర్వాతిశాయి
మఱియును త్రిలోకి రాక్షస మయము చేయు
యత్నమున నీతి జాతియు హద్దు లేదు. 284

చ చటులత నిట్టియాయడవిజంతువులే నయమైన వీర లె
చ్చటొ యొకచోట నాగరుల చాడ్పున రాజ్యముపెట్టి సంధిదు
ర్ఘట కుటిలోగ్రబుద్ధిఁ బెఱరాజులతోఁ బొసగింపు తీర్చు చే
యుటయును లోనలోన నదియొక్కటి పాలనసేయకుంటయున్. 285

గీ. అ కుటిలనీతికిని లేద హద్దుపద్దునకట! కౌటిల్యము స్వభావమందులేని
యమర తతికి భాగస్వాములగుట వీరు విధి పొనర్చెడు వ్యూహ కల్పిత సమృద్ధి.

ప్రహరణకలిత.

కనుగొన గగనగ్రహణము కలిమిన్ దనుజుఁడు ధరణీ తనయయు విచల
ద్వన ఖగశిశు సంభరిత పద నఖోగ్ర నిబిడ గతి గృధ్రమువలె నెసఁగన్. 287

మాలిని.

ధరణీతనయవెంటన్ దామునేగంగ శాఖా
భర చలనము షక్షప్రౌఢి నుద్యుక్తమౌచున్
విరవిరగొని యంతన్ బృథ్వితో గ్రంధిమూల
స్ఫురణ నణఁగినంతన్ భూమిజాతాళియెగ్గె. 288

ఉత్సాహము.

నేలదుమ్ము శుష్కపత్రనిచయ మట్లె లేచి తా
మోలి ధాత్రితనయతోడ నూఁగి నుంతమేరగా
వ్రాలిపోయెఁ జచ్చిపోయి వచ్చు ప్రాణ మెంతయో
కాలముండుఁ దిరిగివచ్చు కదలికే విచిత్రమై. 289

మ. తనరక్షార్థముగా జటాయువున యత్నంబంతగా వ్యర్థమై
చనుటే దైవము బిట్టుచాలమి వచించన్ జానకీదేవి తూఁ
చిన నిశ్వాసముగా, సురారి గగనాక్షీణప్రచారంబు దూ
సినబాణంబుగ రివ్వటన్నసడి పేర్చెన్నా నధోవక్త్రయై. 290

క. ఈ యెత్తునుండి ధాత్రి మహీయఃపాతమ్మునంది మృతిగనుబుద్ధిం
బోయెదు నధైర్య మొప్పదు చేయువదులు దుష్టదైత్య! సీ! దుశ్శీలా! 291

ఉ. శూరుఁడవౌచు నన్నుఁగొనుచున్ జనుచున్ మదిరాక్షి నేరసా
పూర మనోహరాంగిఁ గొనిపోవుచునుంటి నటంచు నెంతువో
బోరన వట్టికట్టిఁ గొనిపోవుచునుంటివి రాముపహ్నిచ
క్రారములంటి పెద్ద కొఱకంచయి నీ కులమున్ రగిల్చెదున్. 292

చ. హరిణముగాఁగ బంపితివి యాదనుజాధము వాఁడు లేడిగాఁ
దరణికులున్ వెలార్చి వనితామణిఁ దెచ్చితి నంచునెంచి సం
బరపడుచుంటివేమొ, మతిబంధురుఁ డారఘురామమూర్తి యా
సురమగు నెల్ల పన్నుగడసొంపు లెఱుంగనివాఁడు కాఁడుసూ. 293

ఉ. నీకొకమాట చెప్పెదను నీవయి నన్నును దెచ్చినట్టి యా
ప్రాకృతకార్యపున్ఫలము రాఘవుఁ డొక్కని నిన్నెకాక యా
నీకులమంతయుం బిడుకనిప్పవు దాలిని బెట్టనౌటయే
కాక జటాయువొక్కఁ డధికంబుగ నిచ్చుట నష్టమయ్యెఁబో. 294

క. ఐనపాలు తోఁపని నీపట్టినదారి విహగనేత వచించున్
నీపట్టుతెలియు మఱికొనయూపిరి యున్నది జటాయు వుసురఱఁడింకన్.

చ. వెనుకకుఁ బోయి యా పతగవీరుని కాయముకూడఁ దెమ్మ యిం
కనుగల యంకభాగమునఁ గైకొనిపోదువుగాని నీపురం
బునకును, జూచిరెండుశవముల్ ప్రజమెచ్చును భార్యమెచ్చుఁ, గా
జను కులనాశవృక్షము వెసన్ ద్విదళంబుగ నంకురిచెనాన్. 296

చ. క్రమమున వెన్కకుందిరిగి కత్తివ్రణంబులు తోచనౌ విహం
గమపతిఁగూడఁ దీసికొని క్రమ్మఱు కొంచెము కాదయేని కొం
చెముగను నైన నీయనదచేతయుఁ గ్రమ్మిక గాంచు, నీయదృ
ష్టము రఘురామచంద్రుఁడు జటాయువు కూలినచోట రానిచో 297

ఉ. కానఁగ వర్ణసంకరముగల్గును ధారుణి జారుడైన రా
జైనను, వేనికి న్నిలువ దాస్తియటంచును జోరుఁడైన రా
జైనను, రెంటనుం బ్రభుడ వైన భవద్ధరణీతలంబునన్
బూని చరింపఁబోలు కలిపూరుషుఁ డింకెట నిల్వలేమిచే. 298

క. అయ్యన్న ననుసరింప నజయ్యంబగు మఱఁది మహిమ జగమెఱుఁగదు, తా
నయ్యన్న యాపఁ డాగఁడ యియ్యెడ, మీ బ్రదుకు లెల్ల నేమగునొ మఱిన్.

మ. ననుఁ గొంచుం జని కొన్నినాళ్ళుగడువన్, నాబుద్ధి నీపై మర
ల్చును కాలంబు స్వభావమంచనెదు, నీలోఁజూడు, సామాన్యము

న్నను దోడ్తో నపవాద మున్నయది, కాంతాలోకసామాన్య బు
ద్ధినినన్ జూడకు! నేను రాత్రిప్రతిమన్ ధీవంచితాకారకా! 300

గీ. పుడమిలోనగ్నికిన్ని నారిపోవు టున్న దేనగు మహాగ్ని యారిపోయెడిది గాదు
అగ్ని ద్రవ్యమ్ము నది విక్రియాసహితము నఖిలవస్తు మహామూలమైన దాత్మ.

గీ. ఇంతవాడను మఱియునేనంతవాఁడననెద విదిదేహబలమొ! నీ యాత్మబలమొ!
అల తపఃఫలమైనది యాత్మబలము తాఁ దపఃఫలదాత దెంతటి బలమ్ము! 302

చ. తగ రఘురామచంద్రుని నుదారతపః ఫలదాతఁగా మునుల్
పొగడిరి, తత్తపఃపరమమూర్తులు సత్యవచస్కు, లా ప్రభుల్
నిగమ మహార్థ మాకృతి గణించిన యట్లు వచింత్రు రామునిన్
సగుణముగాఁగ, నా ప్రభుని చాన హరింపఁగఁబోకు! దుర్మతీ. 303

చ. భయపడి చెప్పుచుంటి నని భావనచేయకు, నాకు నుండియున్
భయము, వచించునట్టిది యబద్ధముకాదు, యథార్థవాది వా
క్యయమున వానికొక్క ఫలసంగతి యున్కి, యథార్థతాగుణ
వ్యయము ఘటించ బోదు, ఫలమచ్చట సర్వజనీనమైతగున్. 304

వ. అప్పు డద్దనుజేశ్వరుని పురతోమార్గనిక్షిప్తముఖుని నేత్రంబుల వెలసిన భయలి
ప్సానిరాదరచ్ఛాయలు యందధోవక్త్రకు జానకికి దెలియని వయ్యె. 305

చ. గగనపుటంతయెత్తునను గాఁడిన చల్లని గాలిపిండు వా
డిగ, దనుజాంగకంబుల వడిన్ గషణోగ్రముగాఁగ దూసికో,
ఖగకులనేతచంచు నఖ ఖండనముల్ వ్రణముల్ చలన్మఖ
త్వగుపరిఁ జిచ్చుచూపిన విధంబున లోపల మండఁజొచ్చినన్. 306

శా. అట్లే చిన్గిన యుత్తరీయమున మై నాచ్ఛాదముం జేయుచున్
గట్లుం బుట్టల సీత దూఁకిచనబోఁగారాక, యయ్యెయెడల్
మెట్లున్ మెట్లుగఁ బైకిపోవఁగ, గడున్ మిన్నారికే చీలెఁ జ
ప్పట్లై చీఁకటి జంతువుల్ తొలఁగి పోవం బోవు వన్యాధ్వమై. 307

సీ. అంకస్థయగు సీత ప్రాణపంచకము లెక్కించక ధాత్రి లంఘించవచ్చు
ఒక జటాయువువంటి వికటచంచువెవండొ మించిపోకని యదలించవచ్చు
దనసాటి ఋషులైన దైత్యనాయకులైన నెదురైన మరియాద ప్రిదులవచ్చు
నాత్మసంయమన దీవ్యచ్ఛ్రీరి రాముండు తెలిసి వెన్బడి నరుదేరవచ్చు
గీ. లక్ష్మణుని దివ్యమంత్ర బలంబు దారినుచ్చులంబన్నవచ్చు మహోగ్రనీతి
యనుచులంకేశ్వరుఁడు గగనాంగణమున స్థపుటగమనంబునంజేసెఁ జంక్రమణము.

ఆ. దనుజు మనసులోన మనసు లేకుండుట తన వచించు మాటలను గలంగి
పైకి బింకమింత ప్రకటించి గుడుసులు లోనఁ బడుటతోఁచెఁ గాన సీత. 309

వ. తన భూషణంబులన్నియు నెమ్మదిగా డులిచి యొకనుడిగాలి రివ్వులో జీర కొంగు చింపి మూటగట్టి. 310

ఉ. ఒప్పగఁదా సజీవముగనున్న జటాయువు తాత చెప్పనే
చెప్పను లేదయే నతనిఁజేరిన సంగతి తెల్లమౌన యీ
చొప్పున వచ్చినన్ గుఱుతు చొప్పడగావలె వేఱయించుఁ దా
నువ్వరమందునుండి కనుచుండెను ధారుణి యోగ్యదేశమున్. 311

మ. అలదూరంబునఁ గొండ కన్పడియెఁ దానక్కొండపై నెవ్వరో
మెలఁగన్ గన్పడెఁ గొంతచేర నరుగన్ మృత్సార్ద్రకాషాయ వ
స్త్రులు ధీరాకృతి సౌమ్యమూర్తులును వక్షోబాహుదండాననో
జ్జ్వల రేఖావలితోర్ధ్వపుండ్రులు సమీపస్థాకృతుల్ వానరుల్. 312

గీ. ఐదుగురు తోఁచినారందు నధిపతి వలె నొక్కఁడు కిరీటకటకకేయూరభూషి
తుండు తక్కిన నల్వురు దూరమునకుఁ గనఁబడిరి కీశ ముఖ దిశాకరులుఁబోలె.

ఉ. వానరు లన్నిరాదరణ భావముమై దనుజేశ్వరుండు మి
న్నూని సమున్నతింజనక యూరక తొంటివలెన్ సమానరే
ఖా నిభృతంబుగాఁ జనిన క్ష్మాసుత మూటనుజార్చె మెల్లగా
దానవరాజు నేరని విధంబున వారలమధ్యమందునన్. 314

శా. ఆలోనొక్కరుఁ డుత్తరీయమున యందైవూనె నమ్మూట భూ
షాళీప్రస్తరపాత రావజనిత వ్యాపార జాగ్ర ద్వృశల్
వ్రాలంజూడక దానవేశ్వరుఁడు, సర్వస్ఫూర్తి భాసించి యేఁ
డో లీలావతినోర్తు దొంగిలుచుఁబోనున్నట్టి కార్యంబుగా. 315

వాతోర్మి.

అంతన్ దైత్యేశ్వరుఁ డాకాశగతిన్ గాంతారోదధ్వని కప్పంగ దిశల్
క్రాంతమ్మై దక్షిణగాఢోగ్ర కకుప్ప్రాంతమ్మై తేరఁగ బ్రాణమ్ములొగిన్. 316

ఖచరప్లుతములు.

కనక సారస సార సరేఖాగ్రస్థితపక్షిచయం బహో
యనినయట్టుల కట్టిన తెక్కల్ వ్యాయతచంచులు వాడఁగన్
గనిన మిన్నులకన్నులఁ బంపాకాండసరోజల మూఁగఁగా
దనుజనాయకుఁ డాయకఁగొంచున్ దాఁటిచనెన్ గగనాధ్వమున్. 317

కనిన చారణ సారణి వీణా క్రమ నినాదము తూలఁగన్
దనుజనాయక సాయకధారా సర్వసమగ్రత కల్గెఁబో

యనినమాటల బీటలువారన్ వ్యగ్రమహోగగనస్థలిన్
దనుజనాయకుఁ డాయకఁగొంచున్ దాఁటిచనెన్ గగనాధ్వమున్. 318

చనినసిద్ధులు విద్ధులు నేత్రచ్ఛాయల లోయలుకోయఁగన్
జనకకన్యక వన్యకరీషోషర్బుధపిండము పోలికం
గని నిలింపుల సంపద పండం గాలముమేలిమి నెంచఁగన్
దనుజనాయకుఁ డాయకఁగొంచున్ దాఁటిచనెన్ గగనాధ్వమున్. 319

వనధిజాంగల హింగుళ కాంతి వ్యాప్తమహోచ్ఛవి నేఁచగన్
వనకరీంద్ర కిరీంద్ర కిరీటావర్త మహోగ్నులు రేఁగఁగన్
ఘనకృపీట కపాట కరాళాఘట్టనమై జల మూఁగఁగన్
దనుజనాయకుఁ డాయకఁగొంచున్ దాఁటిచనెన్ గగనాధ్వమున్. 320

వనధిగర్భము నిర్భరవారిప్రాణి సమూహాతి తూలఁగన్
వనధిమౌళి నిచోళి నిరాసప్రక్రియ విక్రియ నొందఁగన్
వనధిపార్శ్వము కార్శ్యము నొందన్ భావిమహాప్రళయంబుగన్
దనుజనాయకుఁ డాయకఁగొంచున్ దాఁటిచనెన్ గగనాధ్వమున్. 321

కనుకనిం గని నింగిని రక్షఃకాంతుఁడు నింతగ ముంగలన్
దనమహాపురి తాఁబురివిప్పన్ దారెడు కేకి విధంబునన్
గని సమూహసమూహము లజ్జాకంధిని దాఁటినటుల్ చనన్
దనుజనాయకుఁ డాయకఁగొంచున్ దాఁటిచనెన్ గగనాధ్వమున్. 322

గీ. నింగిడొక్కలోఁగ్రుమ్మెడునెఱబురుజులు నింగిపార్శ్వముల్ తన్నుచునెగడుకోట
కని మహారాక్షసుఁడు మనఃకంజమంటు నింగిఁ దా నాక్రమించెనా నిశ్వసించె.

క. తన మేడమీఁద వ్రాలెను జనకజ నచ్చోట దింపి చటులస్వేదా
వనతిన్ గంఠబిలోద్వమ దనంత కహకహనినాద హాసోత్థితుఁడై. 324

వ. అమ్మేడమెట్లు దిగి యంతఃపుర పరిచారికాసహస్రంబు పిలిచి. 325

గీ. దండకారణ్యములఁ జాల దక్షిణమున మలక కోనలలోఁ బశ్చిమంపు గిరుల
గుహలఁ బవళులు నిద్రించి, ఘోరమైన క్షుధకు రేల్విహరించెడు క్రూరజాతి.

గీ. జంతువులు దంష్ట్రలన్ గోళ్ళఁజంపు, వీరు కత్తులంగూడఁజంపుటగాక, వేఱు
భేద మెఱుఁగరాని పిశాచ వికృతకుటిల మూర్తులయినట్టి జాతి, దుర్ముఖఁపుజాతి.

గీ. ముక్కు మొగము చేతులు కాళ్ళు దక్క వేఱ జంతువులకంటె భేదమొక్కింతలేక
ఘోర వర్షానిశాచంచలారసిత పయోద నీలాకృతులను గ్రార్యోదధులను. 328

వ. అందఱ నొక్కపెట్టఁ గొరడాలతో మోదించి యిట్లనియె. 329

చ. అడుగకయే సమాభిలాషితార్థములన్ సమకూర్పఁగా వలెన్
కడుఁ గనుసన్నలం దెఱుఁగఁగావలె నీ యమయెల్ల కోరికల్
పడఁతియెడన్ నిరాదరణభావము సూచనయైనఁ గల్గెనే
నొడళులు చీలిపోవునని యుర్విజఁ జూపుచు దీప్తనేత్రుఁడై. 330

సీ. రమణీయరత్న నీరాజనచ్ఛవులైన తమ్మి కన్నుల నెండ తవులరాదు
తరుణబాలేందు సుందరమైన నొసలిపై మబ్బురేకలనీడ మసలరాదు
విమల సంధ్యాసరోవీచికాభమ్మైన పెదవిపైఁ జలిగాలి కదలరాదు
మణిభంగవేది రమ్యకపోలములమీఁద వ్రూదుమారమ్ములు పోవరాదు
గీ. గంధలేపాదులెల్ల సౌగంధ్యమంటి మైతళుకు బీరువోవని వ్రూంత వలయు
నఖిలభూషణ సంతతి యమర వలయుఁ బర్వసన్నతి సన్నుతి పర్వునట్లు. 331

చ. అనుచును జెప్పి వారి కధికాదర మొప్పఁగ నిట్లుచెప్పె, నీ
యనితర దృశ్యమాన జగదాభరణాకృతి, వెండికొండ యె
త్తిన సమయంబునన్ గినుకతేరిన యెఱ్ఱని కెంపుకన్నులం
దనరినదేవి వచ్చె, సముదారత భక్తి భజింపఁగావలెన్. 332

క. ఆ సామికొఱకుఁ గుత్తుకకోసి యొసంగుదునె! తెలిసికో నాయనకుం
దా సీమంతిని! మన యావాసములో నెట్టి గౌరవము జరుగవలెన్! 333

వ. అంత జానకీదేవి భద్రపఱచినట్లే భావించి రామునిఁగూర్చి కట్టుదిట్టములు సేయ నెంచి యెనమండ్రురు మహాదైత్యులను పాముకాళ్ళు లెక్క పెట్టఁగలవారిని నిరూపిత కుటిల నీతులను బిలిపించి వారితో నిట్లనెను. 334

మ. అది విన్నారనుకొందు మీరు ఖరురాజ్యంబౌ జనస్థానమ
న్నది తా నిప్పుడులేదు, పెద్దయు శ్మశానంబయ్యెఁ, దత్రస్థదై
త్యదళంబుల్ హరియింపగాఁ బడియెఁ, గోదండాగ్రమందొక్కఁడు
ర్మదుఁడే మానవమాత్రుచేత జనకక్ష్మా శ్రీపరిభ్రష్టుచే. 335

శా. వాఁడేతెంచి వధించునన్న భయమై, బాలాంగనావృద్ధులే
జాడంబట్టక వాఁగులన్ మడిసిరిన్ క్ష్మాభృద్గుహావీధులం
గీఁడై చొచ్చినవారు చచ్చి, దనుజాకీర్ణంబు తద్ధాత్రియుం
బాడై బీడయి, మింట గ్రద్దలు చరింపంజొచ్చె మూన్నాళ్లుగా. 336

ఉ. వాఁడును వానితమ్ముఁడును, వాఁడు శివుండును నంది తమ్ముఁడున్
బోఁడిమి గల్గువారు, రణమూర్ధమునందుఁ బినాకభృత్తు, లే
జాడలనైన బట్టికొనిచంపనురా, దొకమోసగించియే
వాఁడితనంబు వారిదెస వ్యర్థము చేయఁగఁ జూడఁగావలెన్. 337

శా. బాహాబాహి పెనంగియున్ వెనుకగాఁబైదూఁకియుం జంపగా
నూహింజేయఁగరాద, వారయిన నోహో! య్యప్రమత్తుల్ సదా
దేహంబుల్ నిదురించువేళ నఱుకన్ ధీశాలి తమ్ముండు ని
ద్రాహారంబులు సేయఁ డాతఁడొక డాహా! ప్రాణశల్యంబుగా. 338

ఉ. అన్నను మాయపుచ్చుటకునైనను వీలగుపించుఁ, దమ్ము నే
తెన్నున నేమిచేయుటకుఁ దీరగుపించదు, తోడెలో పులో
మిన్నకనొచు నాతని సమీపధరాస్థలి నేగితేని, నీ
కన్నులు గుర్తుపట్టు, నడకం గుఱుతించు నతండు నుగ్రుఁడై. 339

మ. ఇది యేలా వచియించుచుంటినన, మీరేమైన మద్భక్తి నూ
ని వధంబుం బొనరింపఁబోయెదరుసుండీ! వారి, నేనే వధిం
పవలెన్ వారి వధింపనైనయెడ, నా పర్యంతమున్ గాద, మీ
రు వనీశైలగుహల్ చరించుచును వారుంబోవ వెన్నంటుచున్. 340

గీ. ఎద్ది యెప్పుడు చేయుదు రద్దియప్పు తిన్నగా నాకు వార్త లందించవలయు
ఎచటకేగెద రెచ్చోటనేమిచేయుదురు, సమస్తంబు నాకునందుట వలయును.

మ. పొరి నే రూపముపూని వారిదెసకుం బోవ ద్దదృశ్యాకృతుల్
తిరుగంగావలె వారికిన్ నికటధాత్రిన్, వార్ప్రమత్తాకృతి
స్ఫురణం దోచియు నుందురుజ్జ్వలితు లౌచున్ నిత్యజాగ్రత్స్థితిన్
పొరపాటింతయునైనఁబొందకుఁడు, మీ భూమీశువాక్యంబులన్. 342

ఉ. అందున నన్నగారికొక యాపద కల్గె, నతండు దుఃఖవా
ర్ధిం దన మేనెఱుంగక చరించుఁ, జరించియునట్లె స్పర్శపొం
కెం దరుణాహి తోఁకపయి నిల్చినయట్లు చనుం, బ్రమత్తతం
బొందకుఁ, డేనుకోరునది పూర్తిగ వారి ప్రవృత్తి యొక్కఁడే. 343

మ. సొరిదిం దెలికగాఁగఁ గుర్తిడగవచ్చున్ బెద్ద వాఁడంబుజో
దరరేఖామధుచిక్కణాపఘనుఁ, డా తమ్ముం డుషఃకాల సుం
దరబాలారుణకాంతిదేహుఁడు, భుజాత్తప్రాంశుకోదండులున్
గిరిజానాథ సమాన ధూర్జటులు, దోఃకేళీ విచిత్రాకృతుల్! 344

గీ. వీరలు విరోధులనుచును వెక్కసంపు భావమును నిలఁబెట్టుకోవలయు గాక!
మధురసౌమ్యాకృతులచేత మన మనస్సు నాహరింతురు, క్రౌర్యపర్యాప్తమతులు.

మ. మరియింకొక్కఁడు చేయవచ్చు, నతఁడున్ మత్తేభయానామహో
విరహాంభోనిధి మున్గుచుండెనని భావింతున్, సముద్దీపనో
ద్ధురతన్ బూలగుచున్, మొయిళ్ళుయి, నవర్తుశ్రీమహోవిష్కృతి
స్ఫురణాకారములన్ గలంచుఁడు మనక్షోదంబు మాదంబుగన్. 346

మ. ఒకఁడూహించెద, నాతఁ డా విరహబాధోష్మచ్ఛటన్ దాళఁజా
లక ప్రాణాత్యయమందునంచు, మఱి యేలా కాఁడు! సర్వంబునం
దకటా యంతటిగాఢశీలుఁ డతఁడట్లైనన్, సరే! మీరు లం
కకు రావచ్చును, వెంటనంటి చనుఁ డేకాలంబునన్ వారలన్. 347

వ. అనిన వారు పునఃపునః ప్రణామంబుల సెలవు కైకొనిపోఁగా. 348

క. సర్వంబును భద్రంబుగ నిర్వర్తించితి నటంచు, నిర్ణీతమనో
నిర్వాణుఁడు దశకంధరుఁడుర్వీసుతఁ జూచుకోర్కి నుఱ్ఱుట్లూఁగెన్. 349

ఉ. వధ్యశిలాధిరోహణభవంబగు వేళను బోలె, రాక్షసీ
మధ్యమునందు భూమిసుత మంజిటికన్నులయందు బాష్పధా
రాధ్యవసాయమూర్తివలె, నాపఁగరాని నట ద్రుమీ శుచో
దధ్యనుమజ్జన ప్రళయతాండవకేళిక నున్న యట్లుగాన్. 350

ఉ. ఆ కడచన్న యేం డ్లడవులందున నెందున నెంతొఘోరదం
ష్ట్రాకృతులన్ దితిప్రజ విరాధుని శూర్పణఖన్ వికారఘో
రాకృతులం గనుంగొనుట నాఁచె, నిదే మొదలైన, వారిరూ
క్షాకృతి చూచుచే యఱచి చావవలెన్ జలహృద్భిదంబుగన్. 351

గీ. అడవి నాల్గుమూల లంటుకొన్నది బిట్టు సురసురంచు వచ్చి చుట్టుకొనెడు
నడుమ బావియొడ్డునం గూరుచున్నది అట్లొయిట్లొ చావటన్న సీత. 352

గీ. ధనదృశల్ మ్లేచ్ఛభాషల దర్పమునకు వడి మృతప్రాయయగు దేవభాషవోలె
భ్రష్ట జిహ్వా లసంస్కృతస్వరలు ప్రాణదూషణలచేఁ బరివృతయైతోఁచు సీత. 353

గీ. హృద్విదారి క్షుదగ్ని కర్శితతనువులు వెలలి చంపఁగఁజను త్రయీవిద్యవోలె
విరహితాంతరుషర్బుధుల్ విద్ధమతులచేత నశియించు నను సేగి చెందుసీత.

గీ. లౌకికాధికారపాకధూర్తుల యందు ఋషినిరూఢమైన స్మృతివిధాన
జంతుబలసమృద్ధ చాలితాహంకారహతల నడుమ దీనయైన సీత. 355

క. ముట్టని యాహారంబుగనెట్టన గనుతుదలయందు నిలుచు నసువులన్
ముట్టిన విపత్సముద్రపు టట్టడుగున నూపిరాడ దనఁజను సీతన్. 356

క. ఒక పెద్దరక్కసుల యేలికఁచేఁ దానేమొ దొంగిలింపఁబడె, సుధీ
మకుటుఁడు రాఘవుఁడేమగు నకటా!యనునొకఁడె యూహయైచను,సీతన్. 357

క. పదితోడేళ్ళ సివంగులు కదుపుగఁ దన చుట్టు మూగఁగా, నడుమ భయా
స్పదలోచనగహ్వర, మృగసుదతివలెన్ ఱిచ్చవోయి చూచెడు సీతన్. 358

రుగ్మవతి.

ఆర్తి మహాంభోధ్యాకులఘోరావర్తవిభుగ్న వ్యాధుత నౌకా
నర్తన కేళినద్దను, నాపద్ధ్వార్తత రూపై తోఁచెడు, సీతన్. 359

మ. బలవంతంబుగఁ గొంచు బోయి కనిపింపంగోరె, స్వీయోజ్జ్వల
ల్లలితారామ సరో మణీ భవనమాలా దీర్ఘికా తోరణా
వలులన్, సౌరజగ్రదమావిజయ సంపత్కాంబులన్, జూడఁగ
న్నులకింపైనది, గుండెలోనివనటన్ దూరీకృతిం బుచ్చఁగాన్. 360

చ. తిరముగ భావనిష్ఠులును దేహనివిష్టులుగా ద్విధా రహిం
తురు జన మెల్ల, నిర్జర దనుప్రభవ ప్రకృతి ప్రవిష్టులై,
తరతమభావముల్ కలుగు దాన, ధరాత్మజ, రావణుండు, స్వ
త్వర సుర, దైత్య లక్షణ నితాంత మహోవధి భూతులై చనన్. 361

గీ. జనకజాత శరీరనిష్ఠం బొనర్ప కడఁక వ్యవసాయి యగుఁ బక్తికంధరుండు
రావణుని బోధ దేవభావాకృతునిగఁ జేఁతకుఁ గడంగు బూత ధాత్రీతనూజ 362

గీ. దైత్యధాత్రికి వచ్చిన ధరణిజాత దైత్యభావము కనునని దైత్యరాజు
దైత్యధారణి పెకలించి దైవగుణము తా సముద్భిన్న మగు నని ధరణిజాత.

గీ. ఆమెఖండించితినియైన నసురగుణము కాల్నిలువఁద్రొక్కఁగా బంక్తికంధరుండు
నఖిలమును నాశనము చేసియైనఁ గాని సౌరగుణము ప్రతిష్ఠింప జనకజాత.

వ. అంత బక్తికంధరుం డామెను రథంబుపైఁ గొనిపోయి కుసుమిత తరుజాల సంతతంబుల భ్రమరయుతంబుల సముద్రతీరజంబుల సాగర సుషీమ వీచీశేఖర సమాగత సమీరరేఖా మౌఖర మాకందతరు కిసలయఖాదన వాచాల పరభృతలోక బంధురంబులఁ వనంబుల ననేకంబులఁ జూపించి యందొక్కచో.

క. ఓహో! యని పిలిచినచో నోహో! యని బదులుపలుకు నున్నత తరు రా
డ్వ్యూహంబులు సాగర వీచీ హేలానిల విధూత శేఖరములుగాన్. 366

ఎ. ఇవియు వెదుళ్ళలో ననిలమేచిన యీలలో, కోకిలావధూ
నవమధుర స్వరంబులో, నినాదితసాగర సాధువీచికా
భవములో, నీలకంఠయువ పల్లవ గల్ల వలీక కేకలో
వివృత వియన్నటన్మధుర విస్ఫుటరావములైన తోటలన్. 367

వ. ఇవినీవి యనిచెప్పి, హంస కారండవచక్రవాక వివృతపక్ష నిహతాంబుశీకరమాలా శ్రీకరడోలా విహరత్కాంతిపుంజమ్ముల, సితపుండరీక నతకల్హార ధృతవేతప ప్లుత నానావర్ణరమా విజిత వసంత సంధ్యాశబలిత గగనకాంతాపయోధరంబుల,

తటస్పృశదల్ప తరంగమాలా ప్రసార హేలానుమీయమానాప్సరః కుచకలశ
విస్రస్త సిచయనిచయంబులఁ గాసారంబులఁ జూపించి యందొక్కచో. 368

క. అహో వుట్టగఁ గ్రోలిన నాహారించిన సుధాంబులై, శిశిరతరం
గాహత జంఘాకతటీ నీహారాంబువులు యామినీ శశిసుషమల్. 369

చ. సకి యెలముద్దరాలు మెయి చక్కిలిగింతలుగాఁగఁ దాఁకిన
ట్లొక తెలిడాలు క్రొమ్మొలక లూగిన లాడినరీతిఁ జూచిన
ట్లొక చిఱుసన్న గొంతుపిలు పూచిన సవ్వడి సాగినట్లు గా
జకితపయో జలేజ ఖగసంతతి ముగ్ధములైన చెర్వులన్. 370

వ. ఇవినీవియనిచెప్పి, యెంతెత్తుయున్నవో యని తలయెత్తిచూచువేళ దీర్ఘీకృత గళ
పురస్థ నవారుణనాడికా మధురహేలాజనకంబుల, చకచ్చకిత రత్నకాంతిచ్ఛటా
దగద్ధగిత నూత్న మాణిక్యఘటాదర్శనాసహమాన నిమీలయన్నేత్రంబుల, నంత
రాద్యోతితస్ఫటిక కుడ్య ప్రతిబింబితాత్మమూర్తి దర్శన మమతాఘటకంబుల,
నాసీనతావేళాధృతసిత చీనాంబరకాంతి వ్యాకృద్వైదూర్యవేదికా బహుళంబుల,
మణి భవనంబులఁ జూపించి, యందొక్కచో. 371

క. ఊహా సమతీత భోగ గ్రాహక సాధన సమగ్ర కమనీయంబుల్
మోహోపాదక గాఢ సమీహాసంతతి సకాలభృత సంభరముల్. 372

చ. తగ బహురూపముల్ కలితదర్పణసంతతి నైక కాలికం
బుగఁ గనిపింపఁజేసి, జగముల్ తనచొచ్చినలీలఁ, దానె బ్ర
హ్మగ, సకలార్థసంజనన మంజులమూర్తిగఁ దన్నె తాను జూ
డగ నొనరించు భోగనికటంబు లుదంచితసాధసంతతిన్. 373

వ. ఇవి నీవని చెప్పి, రమణీయ మరకత సోపాన పరంపరాప్రాప్త నవేంద్ర నీలకాంతి
మజ్జలాభిరామంబులును దటీగతరత్న పుత్త్రికా ప్రతిబింబ కల్పిత నాగకన్యకా
భ్రాంతిహేతుకంబులను కనకనీరేజ మధుబిందు సంగ్రహణవాంఛా సమవరోహ
దారోహ దనేక బంభరమాలికా పరిస్ఫురిత తజ్జలగత కాదంబినీ సమనువాంఛా
ప్రసారిత కటాక్షరమ్యంబులను నైన యనేకదీర్ఘికలం జూపించి యందొక్కచో.

క. వైహాయస నిర్ఝరిణీ మోహ వ్యాహార దుదారభోగవతీ క
న్యాహూతివక్త్రకూజ న్మోహనహంసీసమూహ ముగ్ధాంబువులన్. 375

చ. ప్రకటతటమ్ములం దిరుగు రాజమరాళము, లల్ల మెట్లపై
శుకములువోలె, నీళ్ళలను జొచ్చి మయూరములట్లు తోఁచి, యెం
చక వనరామణీయకము సర్వము చూపుచు, నాదిభోగము
స్తక హరినీలకాంతి విలసజ్జల మంజుల దీర్ఘికాతతిన్. 376

వ. ఇవి నీవని చెప్పి, రెండునిట్టమొయిళ్ళకు పరిలంబమానేంద్రచాపంబులువోనివి యొకమహోబలిష్ఠుని రెండు భుజమ్ములను విగాహనముచేసి వక్షముయొక్క మాన దండమువోని పుష్పమాలవోనివి, యింద్రనీలమయ స్తంభములును భిన్నవర్ణోపలకృతమాలికలును గలవి, మహాసౌధప్రవేశమార్గగత తోరణము లున్నతము లుదారములు జానకీ మహోపభోగోద్దిష్టసౌధ పురస్థితములను, వర్ణించి యిట్లనియె.

శా. ఈభోగంబు లివెల్ల నీయవియ తన్వీ! నేను నీ దాసుఁడన్
నాభాగ్యంబున కెల్ల రాజ్ఞివి, మహేంద్ర ప్రౌఢ వక్షఃకవా
టాభోగంబున గాల్లు పెట్టిన సుదీవ్యచ్చంద్రహాసంబునన్
సౌభాగ్యానత పాదనీరజ నఖచ్ఛాయా సనాథంబుగన్. 378

మ. అల స్వర్గంబును నేను దూల్చితినటం చన్నట్టిదీ నా భుజా
బలరేఖం దలవంపుమాట, యకటా! స్వర్గం బ దొక్కండె, బా
హుల యీయిర్వది కొక్కదానికొకఁడే నున్నన్ సముత్పాటనో
జ్జ్వల కేళీయుగపత్క్రియా పరిణతాశ్చర్యంబు దీపించెడున్. 379

మ. చెవులం జొచ్చి, మదీయ బాహువిభవశ్రీ దీపితాశ్చర్యముల్
చవులంజచ్చి, జగంబెస్వర్థను దలంచంబో, దసంజాత శా
త్రవ, మీ సర్వజగద్రమాభర ఖనిత్ర క్షుణ్ణభోగంబు, లీ
భవదీయారుణ పాదపల్లవ సమీపస్థంబులం గాంచవే! 380

గీ. మొదలు తుదలేని యైశ్వర్యమును మదీయమౌర! యుంచితి నీపాదనీరజముల
నమ్ము మున్నడిగించుకొన్నదియ కాని యడిగినది లేదు, నేను నీ యందుఁదక్క. 

ఉ. కాదొకవేళ నీదుపతి క్రమ్మరిపొందు నయోధ్య యం దయో
ధ్యాదయితత్వమా! త్రిభువనాధిపతిత్వమ! చూడు నావలెన్
చేదునుగానిమేసెదరా! చెట్టమతిన్ మఱిచూచుచున్ సమా
సాదితశర్కరా మధురసంబు స్వయంవరణమ్ము కల్గఁగా. 381

శా. ఆ సాకేతమె నీకుఁ గావలయునన్నట్లున్నచో, నింతలోఁ
జేసేతన్ గొని తెచ్చి నీదు పదరాజీవంబులం దుంచెదన్
నీ సౌభాగ్యము నా పరాక్రమము సందీప్తంబు, లన్యోనల
క్ష్మీసంధాయకముల్ జయించుత మహాశ్రేయోవిధానిర్వృతుల్. 382

చ. నిజముగఁజూడు రామతరుణీ! శివునిం గికురించినాడఁ గం
రజ నవరక్త వారి విలుఠత్తలమూర్ధములే యొసంగి, యం
బుజసదృశంబు నీ చరణ మోహనపీఠమునందు నాదు స
ర్వ జనిఫలంబు నర్పణము పట్టితి, ముట్టితి శ్రీ రహస్యమున్. 383

శా. లంకారాజ్యము నుంకువం గొనుము బాలా! పంక్తికంఠుండు నీ
లెంకై నాల్గుకెలంకులం గెలుపు నీ లీలాపదాంకంబుగన్
సుంకం బుంచెడు, సూర్యదీప్తి సరదచ్ఛేదార్ద్ర మీనాంక వ
ర్యంకాకార కపోలకాంతిపరివాహా! కామభూమీరుహా! 384

వ. అంత జానకీదేవి యొక గడ్డిపోచ నడ్డంబుగా నిడి యిట్లనియె. 385

మ. శివునిన్ మోసముచేసినాఁడ నని హృత్సీమన్ విడంబింతువా
శివకైవల్యముగాని పొందితివె? నీ చిత్తంబు దేహంబు నీ
భవమెల్లన్ దదధీనమై చనినచో బాగీ యహంకార కై
తవ మార్గంబిది భక్తి యౌనొకో! సముద్యత్కామ దుర్బుద్ధియో. 386

ఉ. తామసికంబు భక్తి ఫలితంబగు దుష్టము సత్వదార్ఢ్యరే
ఖామలమార్గభిన్న మయి యైహికలాభము సంఘటించు, నీ
కామముకూడ వృద్ధి యగుఁ, గామము దక్షిణదిఙ్ముఖంబు, నీ
యీ మను దక్షిణాదిశయు, నెల్ల యనర్థచయప్రవీణమై. 387

గీ. పరమ సత్త్వగుణాఢ్యుఁడు ప్రభువు రాఘవుండు, నీ తమఃప్రకృతిసంభూత మహిమ
లచట నిసుమంత పనిచేయ, వతనికరుణ నీకు సముపలభ్యముకాదు,నిక్కువముగ.

క. మా వర్ణశాలకడనే నీ పొగడుట నీకు నీవు నీ గుణగణముల్
తేపకుఁ, ప్రత్యాఖ్యానము నా పొనరించుటయుఁ గూడినది, యిట నేలా! 390

చ. మఱియును జంద్రహాసమున మాఁగిన చేతి బెడంగులావులున్
మెఱపులు నేల దాశరథిమేఁకొను చాపగుణోగ్రగర్జనన్
విఱుపులుపొందు, సర్వపృథివీస్థలిఁ బండును ధర్మసస్యముల్
చిఱుతుకలైన శౌర్యములు చేవలు చెప్పగ నేల! విప్రవన్. 391

క. నే వానికొంప కాల్చితి, నే వీనికులాంగనన్ హరించితి నివియా!
లావు వచియించుమాటలు, నీ విభవం బిట్లధర్మనియతిఁ జెడంగా. 392

ఉ. నా తనువెల్లఁగచ్చరము, నామనసెల్ల మహోఘదుష్టమున్
చేఁతలు ధర్మగల్లమును జీరిచి ప్రోవుల పెట్టినట్టి, వీ
రీతి వచించి యెవ్వఁడు దరిద్రుఁడు తా వలపించుఁ గాంతలన్
క్రోఁతులపిండు పట్టికొని గోళ్లుల చీల్చును వాలిబుద్ధులన్. 393

క. ఆమెఱకు పైని కాంతా సామాన్యముగాఁగఁ జూచు జ్వలదగ్ని శిఖన్
లోమనసునఁ దన యోగక్షేమంబు లెఱుఁగలేని చెడినయెడందన్. 394

చ. పలుకుటలోని యర్థమును, బల్కెడువారి హృదుగ్రతీక్ష్ణతల్
తెలియఁగజాలనొఁ దెలివితేటలుకల్గిన మద్యథార్థతన్

దెలియఁగఁజూడు, రాఘవునిదేవిని నగ్నికి జ్వాలవోలె, నా
వలితధనుస్సునందు గుణవల్లికవోలిక, సూర్యకాంతినా. 395

గీ. తలలు తెగి మొల్చునన్నట్టి తెలివిసాగ
కుండఁ జంపితి వా జటాయుఘవు, రఘూద్వ
హుండు తెలియుటతోనె నీ యుసురుగొనెడు
నీ వెఱుఁగ వాంతరాగ్నీధ్రునిన్ రఘుపతి. 396

వ. అనిన మాటవెంట రావణుఁడు మండిపడి. 397

గీ. ఇంతమందిని జూచితి నెచట నిట్టియాడుదానిని జూడలే దట్టులైన
నేను జెప్ప:మనుంటిఁ బన్నెండు నెలలు నీకు గడువిచ్చితిన యంతదాఁకఁ జూతు.

క. అలోపున మారితివా అలో మారెదవు మారవా! ఇంతింతల్
చీలికలుచేసి బ్రద్దలు తాలింపులు వెట్టి నమలెదన్ దంతములన్. 399

గీ. ముద్దు వచ్చినపుడు మొగిఁ జంకకెక్కఁ మన్నారు బిఱ్ఱుబిగిసినావు మఱియు
నెవ్వ డడ్డ మగునొ యేను జూతునుగదా! వాఁడెవండొ బిఱ్ఱుబోడిజోగి 400

వ. అని చుట్టునున్న పిశాచీశ్రేణితో. 401

చ. బిరుసుదనంబు చార కనిపించెడునట్లుగ ధాత్రి దీనినిన్
బరబరలాగికొంచుఁ జనిపట్టి యశోకవనానఁ బెట్టుఁ డే
మఱుపుననైన ప్రాణములు మాత్రము తీయకుఁ డింతకంటె దు
ర్భరమగు చావు మేలనెడి వైఖరి హింసను బెట్టుఁ డెంతయున్. 402

చ. తలబిరు సంతయున్ వదలి దారికి రావలె, నంతలోన మి
క్కిలి తల గడ్డముల్ వెరిగి గీయనిమట్టలు జీబు లొప్ప తా
ళ్ళులవలె నిట్టదయ్యములలోఁ దమ రిద్దఱునైన యన్నద
మ్ములు, జలరాశిదాఁటి మన ముంగమురారని జూడవత్తురే. 403

క. నిట్టలు కోఱల గ్రుడ్లుల బట్టవగలె పీడకలలు వచ్చినయట్టుల్
పుట్టించి భయము, జారెడునట్టులఁ జేయుఁడు ప్రచండమగు మార్గములన్.

వ. అని విధురమ్ముగా నడచిపోయి మఱలవెనుదిరిగి యందులో నాయికలం బిలిచి
రహస్యంబుగా నాల్గుపాయంబులతోఁ జెప్పిచూడుఁడు మఱియు బెదరఁగొట్టి
గుండెచెదరనీయకుఁడు. ఆమగఁడును మఱందియు వత్తురని యాశ. అది
యెన్నడును జరిగెడిది కాదని గట్టిగాఁ జెప్పుఁడని వెడలిపోయిన వా రక్కసి
పిండు సీత నశోకవనసీమం జేర్చిరి. 405

మ. తరుణస్నిగ్ధపయోదగర్భతనుతన్ దార్కొకిలల్, నామసుం
దరపూర్వాక్షర లోపసంస్ఫురణచేతం జిల్కలున్, దామొదల్

సరి వ్యత్యస్తముగా మరాళములు, ఫింఛవ్యక్త నేత్రాంచసం
భరమై కేకులు, నయ్యశోకమున రామత్వంబె దీపింపఁగా. 406

సీ. చివురాకువన్నె మెచ్చిన కోకిలల కన్ను లార్ద్రరాగచ్ఛవు లందగింప
పక్వబింబమ్ము సంబంధించు శుక[illegible]చ్చు వరుణకాంతిచ్ఛాయ లవధరింప
మెట్టతామరపూలు మెలచిన హంసరెక్కలు నెఱ్ఱడాలు కందళింప
గున్న తంగెడిపూల గుబురులో నిడు లేడి చెలువ ముట్టియ నెఱ్ఱసెరలు పుట్టఁ
గీ. బ్రళయ తాండవారంభ సంరంభ రుద్రమృదువదగ్లానిఁ గెంపులు ముదిరిపోవ
నొక యకాలసంధ్యారాగ ముద్భవిల్లె నయ్యశోకవనీ భూరుహాంతరముల. 407

క. తూరువుఁ బడమటి కొండల నౌరా! సంధ్యలు జనించు నన్యస్థలులన్
వారాశినడుమ బడబాస్ఫారాగ్నులె లంకలోన సంధ్యలు పొడుచున్. 408

ఖం డాం త ము

గీ. ఇయ్యదియు జటాయుఃఖండ మిందుమౌళి! సుందరపవిత్రభావభాసురము నూత్న
శిల్పిరమ్యంబు, ముక్త్యాలక్ష్మీతిధవునకు నీ కృపాదృష్టిచేఁ గీర్తి నిమచుఁగాక. 409

చ. తుదియుమొదల్ మఱిన్ నడుమతోఁచినద్రవ్యము దృశ్యతంజనున్
తుదియుమొదల్ మఱిన్ నడుమతోఁచనిద్రవ్యము దృక్స్వమైచనున్
విదితము దృక్కు దృశ్యమును భిన్నములేగతి దృక్కుదృశ్య మే
నిది యెఱుఁగంగరాని మతిహీనుఁడ, నిన్నును జూడనెంచెదన్. 410

శిఖరిణి.

అహార్యానేకాశీవిషగణ సమానాబ్ధిరుడవా
గహీనేళీ హాలాహలయమున గర్వాంధకగళా!
అహార్యేంద్ర ప్రేయోదుహితృ హితబాహావృతమనా
గహీంద్ర ప్రావారావనయన ప్రసన్నామృతగళా! 411



# శ బ రీ ఖం డ ము

క. శ్రీయజురధ్వ కిరాతా! శ్రేయో లాక్షణిక మూర్తి! శింజితయోగి
వ్యాయత రుండవిభూష! ద్వితీయా ప్రథమైకరూప! త్రిపురధ్వంసీ!

చ. వినఁబడు లక్ష్మణా యనుచు వెట్టినకేక గ్రజా యటంచు స
న్నని యెలుఁగై కరద్వయమునం దుదిమోడ్పుగ వ్రాలియున్న యా
దనుజకళేబరంబు గని తా రఘురాముఁడు వానిమోమునం
దున భయమున్ బ్రాదబ్జమునఁదోఁచిన భక్తియు రెండు చిత్రమై.

ఉ. వీఁడు తనంతరాఁ డితని వేఁడిట పంచెనొ? యేల వచ్చెనో?
వాఁడును దేనికై యితనిఁబంచెను? నాయెడ భక్తికల్గినన్
వీఁడిదియేల చేయుఁ? దనపెట్టిన కూఁతకుఁ జేయుసేఁతకున్
గూడికలేద యీ దనుజకోటుల ప్రేమలు కృత్రిమంబులై.

ఉ. ప్రేమకుఁబ్రేమ, వేరమికివేరమి, దేనికదే స్రవంతులై
యీ మనసందునం జెలఁగునే మఱి నామనసిట్లు పొందదే
ప్రేమకలట్టిచో నెటుల వేరమికల్గును? దూషితాత్ములై
నీమములేనివారల కనేకములై కను చిత్తవైఖరుల్.

శా. అంతర్వైరము బాహ్యసాధుతయు సాధ్యంబౌచుఁ గన్పించుఁబో
అంతర్మైత్రియు బాహ్యకర్కశత యెట్లై యిట్లు దీపించునో
పంతంబూనుచు వెన్క తీయక ననుం బట్టించె నీ కానలో
నింతా దవ్వుగ వీఁడు, వీనిహృదయంబే చిత్రమై తోఁచెడున్.

శా. నన్నుం దానిట తెచ్చె, లక్ష్మణుఁడు వెంటన్ వచ్చెఁ బిల్పుంబడిన్
మిన్నో దానవభీతి నీరవత క్రమ్మెన్, సీత యొక్కర్తుకై
యున్నం దానుగఁ బర్ణశాల, మఱి యేడో వచ్చి తాఁజంపునో
యన్నన్ నాయెడ భక్తికల్గి యితఁ డేలాచూపు నంగీకృతిన్.

చ. పొరి నవనీజ నెత్తికొనిపోవుటకా యిది! పోయెనేని యా
శరుఁ డొకఁ డెవ్వఁడో, యిచటఁ జచ్చెడు వీనికి లాభమేమి? యు
ద్ధురుఁడతఁ డెవ్వఁడో యతనితో నెదురాడనులేదు, వీఁడు తా
హరిణము గాఁగ వచ్చె జనకాత్మజ కన్నులకర్వు తీరఁగన్.

ఉ. నాకడ కేగుదెంచి రఘునాయక! యీ కథ యిద్దియన్న ని
ర్భీకముగాఁగ వీని కిట బెట్టెదమౌ మరణంబుగాక య
స్తోకమదుండు వానికె యసుప్రచయంబు తొలంగియుండునే
లేక, యితండు దొల్లిటియళీకము పూర్తిగ విస్మరింపఁడో?

ఉ. ఇందున వీనికైన ఫలమేమొ యెఱుంగఁగ రాద, వాఁడెవం
డందు ధరాత్మజాతకొఱకై చనుదెంచెడు వాఁడు? లక్ష్మణుం
డెందుకు జానకిన్ విడిచి యిచ్చటికిం జనుదెంచుఁ? గేక వి
న్నందగు, నింతదవ్వుచనునా! నిబిడాటవిలోనఁ గేకయున్. 9

చ. ఎఱిగియెఱింగి యా జనపదేశ్వరసైన్యములైనతీరు, నే
మొఱకు ధరాత్మజాతఁ గొనిపోవఁగవచ్చు నటంచు! స్వామి క్ర
మ్మఱి చను నూహతోఁ దిరుగుమార్గము చూచినయంత నెక్కగా
వఱడఱచెన్ పకాలుమని, వామవిలోచన మ్రుగ్గి పోవఁగన్. 10

మ. ఎవఁడో గుండియపైనఁ గొట్టినటులయ్యెన్ బారగాఁజూచి, రా
ఘవు దేహంబున రక్తకుల్యలకు వేగం బెక్కువయ్యెన్, జెమ
ర్చె పెసన్ ఫాలము, చాపదండముపయిం జేపట్టుశైథిల్యమున్
లవ మేపారెను, ఱిచ్చపాటొదవె పుల్లన్నేత్రపద్మంబులన్. 11

క. అరలిప్తలోన నిట్టై, యరలిప్త మహాప్రవాహమై, యూహ సము
ద్ధురమై ప్రవహించె, శిలో పరి సంస్థల దగ్రబిందు వల్గన చణమై. 12

శా. నిస్పందేహముగాఁగ నే దనుజు లేనీ జానకిం జంపిరో
భిస్సాపిండముగాఁగఁ జేసి తినిరో భీతాత్మయై యెంతగా
నిస్సారంపడెనో అహో! రఘుపతీ! నిన్నేల పంపించితిన్
లెస్సై పండినదిట్లు పంచు టని యే క్లేశంబునం బోయెనో. 13

మ. అకటా! దానవు కేక యింత పెనుదవ్వై పర్ణశాలావనీ
నికటక్ష్మా నెటుసాగె నన్నకెదియేనీ మూడెఁ, దోడౌచుఁ ద
ప్పక పొమ్మంచును లక్ష్మణున్ వని కదే పంపించె భూజాత, యా
ముకురాస్యన్ దినినారు పంచి దనుజుల్ ముక్కల్ తనూకృత్తముల్. 14

క. ఇయ్యాపద కలిగినయది, యియ్యాపద కలుగ లేద, యిఱు తెగలైనా
యియ్యెదయునికిని, గాదని యయ్యో! యీ వామనేత్ర మాఁగదొ యేమో?

ఉ .ఎన్నియునైన నట్లె ఘటియిల్లుట తప్పదటంచుఁ జెప్పఁగా
గన్నులఁ జూచిగాని యదికావుట నమ్మని యీ స్వభావమే
నన్నును గ్రమ్మె, నాదగు మనస్సున నిర్ణయమైన యర్థ మా
పన్నతనొందువేళ నిలువంబడ, దిష్టగతాభిముఖ్యమై. 16

చ. నిజముగ ధారుణీజ రజనీచరులే హరియించుటైనచో
నజుమనుమండు తాఁబ్రదుకునా! మెయిఁబ్రాణములంచు నుండునా!

యజుఁడును గాని యంతటి మహాపద ప్రాయునె నా నొసంట? నే
వృజినము నేను చేసితిని? పృథ్విజ రక్కసులుం గ్రసింపఁగన్. 17

చ. జనకునిమాటకై వనముసాగిన పున్నెముచేత నైన, నా
జనకజ కింతయాపద పొసంగకయుండగ వచ్చునేకదా
పొనరిచినట్టి యా మునితపోనిచయాంచిత రక్ష చేసి వ
చ్చిన సుకృతంబు జానకికి నేగి ఘటింపకయుండఁ జూచుతన్. 18

శా. తా మచ్చోటన భూమిజాతయు సుమిత్రాసూతి యా యిద్దఱున్
క్షేమంబొంది వసింతురేనియు మదక్షిస్పందనం బేటికిన్?
గ్రామంబందు నయోధ్య నాపద పొసంగం బోలునో? యీవనీ
సీమన్ ఘోరపునేల నేమమును సశ్రేయంబు గ్రామంబునన్. 19

ఉ. ఊహ విచిత్ర మైనయది, యుర్విసుతాధిక ప్రేమఁజేసి సం
దేహమునిందుఁబాపి, వెఱనేలను జొన్పునహో! యయోధ్యయం
దేహరి! యేరికేని సిలు గేఁచిన మాత్ర మదెట్లునైతు సీ
తాహరణంబుఁ గారణసమాపతితంబు నెడంద యొప్పకన్. 20

క. రక్షశ్శవమును గుర్తిడి కుక్షికి దొరకెనని యఱచె గోమాయువు వా
మాక్షిస్పందమ్ము శరీరక్షోభము చేతఁ గలుగు రహియించుటయున్ 21

ఆ. అని కుదుర్చుకొనిన నైనను గుండెలో దుడుకు తగ్గదాయెఁ, బుడమికాన్పు
నిజముగానె యామినీచర సంత్రాసమందినట్లు, భీతి యావరించు. 22

ఉ. కత్తిని వేయఁగా నలమొగంబున నెత్తురుచుక్క లేనటుల్
చిత్తమునంతయున్ నొసఁటఁ జేర్చుక, యార్చుకపోవు గుండెతో
నుత్తలపాటుతో రఘుకులోద్వహుఁ డెచ్చటఁ గానిపించునో
మొత్తము చూచుచయ్యటవి ముంగల లక్ష్మణుఁ డేగుదెంచుచున్. 23

క. ముప్పదియైదేడులుగా నప్పురుషోత్తమునిఁజూచు, నప్పటియార్తిన్
ముప్పునఁ గప్పఁగ నదివఱ కెప్పుడు చూడనివిధాన నెనఁగెడు స్వామిన్. 24

శా. అయ్యో! నిల్చుటలేదు గుండె నిను గన్నంతన్, ధరాజాత యెం
దయ్యెన్? దానవపాళి పంచికొని తిన్నారా! సుమిత్రాసుతా!
యి య్యేకాకితయేల? నిన్నుఁగన నీకింతైన దైత్యాళితోఁ
గయ్యంబైన తెలుంగు తోఁచదు, విభుగ్నభ్రూవిషాదచ్ఛటన్. 25

ఉ. కన్నులఁగందునా ధరణికన్యను! గ్రవ్యభుగుగ్ర సంక్షుధా
పన్న శరీర, మంజుల కృపారసపారసనేత్రసారసన్,

చిన్ని వెలుంగు క్రొన్నెల హసించిన నవ్వులవోని వెల్గులా
కన్నులతోడ నే గడపఁ గాలిడ నన్గను ప్రాణదేవతన్! 26

మ. మరియుం జానకిఁ గందునా! రసపయో మాహేయికా దృక్ఛవిన్
దరుణస్విన్న నవేందుఫాలసుషమన్ దారుణ్య లీలాధునిన్
హరినీలోపల కాంతివల్గదలకన్ హార్రిప్రమోదాకృతిన్
తరణి వ్యాయత వంశపావన తనూత్వ శ్రీ మహోరేఖికన్. 27

ఉ. అన్న! ధరిత్రి దేవితనయామణి మైథిలులాడుబిడ్డ, ప్రొ
ద్దు న్నెలవంగడంబున వధూమణిఁ, బంక్తిరథేశుకోడలిన్
మిన్నులవాక వెల్గగమి మేదిని డిగ్గిన నవ్వుప్రోవు, నా
యన్ను, సురారిమూఁక తినిరా! వని రాయిడివెట్టి చంపుచున్. 28

వ. అనిన యన్నగారితోఁ దమ్ముం డిట్లనియె 29

గీ. ఊర్మిళా జ్యేష్ఠసోదరి యుర్విజాత పర్ణశాలాంగణంబున భద్రమూర్తి
నే బయల్దేరు వేళను నిలిచియుండి నా పథముచూచు చల్లెయున్నది మహోర్ధి!

క. ఔరా! అట రాక్షస సంచారమ్మును లేదు, గూఢచారులు వారల్
వారెటు వత్తురొ తెలియద, యారయ ధరణీజ భద్రమై యపు డుండెన్. 31

గీ. అనిన శ్రీరామచంద్రుఁ డిట్లనియె నంత నయినమాత్రము పర్ణశాలాంతరమున
నొంటరిగ జానకిండింతురొక్కొ యిట్లు! భద్రమేయని యెట్లుచెప్పంగవచ్చు?

క. మరి నిర్హేతుకముగ నీ హరిణము పొడచూపెనంచు ననఁగా నగునా!
మరి నిర్హేతుకముగ నీ హరిణము నినుఁ బిలచెనంచు నననుం గలమా! 33

మ. అదిగో! యీభుజమింక నాఁగదటవే అన్నా! సుమిత్రాసుతా!
పదివేల్ రాజ్యసుఖంబులున్ జనకజా పాఠీననేత్రాంశుస
మ్మదవల్గద్భ్రమి లేశమైన నగునా! క్ష్మాదేవి యిచ్చోట ను
న్నది యిచ్చోటను లేదటంచుగలదా నా దేవి రక్షింపఁగన్. 34

గీ. ఈ రసానంతమూర్తికి నీరజాక్షి నాదు రతి నాదు నుత్సాహనవ్యకళిక
జానకియె లేని యీ పర్ణశాల చేరి యే ప్రళయభావ మందెద నెఱుఁగ లేను.

చ. ఇవి బహిరంతరంబులను నిచ్చట రెంట, బహిర్నిమిత్తముల్
తవిలి శుభంబు కీడ్వడనిదారిగఁ దోచెడు, నాంతరంబు ఉ
ద్భవమగు కీడు చెప్ప, నిది దైవముచాయ, బహిర్నిమిత్తమం
దవు నతిప్రశ్రయంబు మనుజాళికి, నిచ్చట స్రుక్కిపోయెదన్.

గీ. దీని కడవికి వెఱ్ఱియెత్తినదొ యేమొ! యశుభ తిర్యక్ప్రచార పర్యాప్తముగను
గదలుచున్నది వన్యమృగవ్రజంబు పిండ దూరాన వమన నిర్భిన్నదిశము. 37

గీ. మున్నడవియెల్ల నాశ్రమభూమి వోలె శాంతరసభావ పర్యవసాయి యగును
వెస స్ఫురించు భయానకరసము చేత నడవియెల్ల నీ నాటికి నడవియయ్యె. 38

ఉ. మున్నివి యెల్ల నీమృగసమూహము నిన్నును నన్నుఁగాంచియా
సన్న ధరిత్రి విశ్వసనసంచరణం బొనరించు, నేఁడు ని
న్నున్ననుగాంచి మంజిటికనుల్ పరివృత్త కనీనికాగ్రముల్
మిన్నొలయంగ, దవ్వయిన మేదిని నిల్చి వెడంబెడం జనున్. 39

ఉ. ఆ పినతల్లి నన్నడవి కంపిన యెల్ల ప్రయోజనంబు క
ట్టా! పనిలేని హైమహరిణాశకు దీని మృగవ్యపేలకున్
నీ పయనానికిన్ ఫలమునెక్కొను వేళయుఁ గాఁ దలంచెదన్
ధీపరిణామమే త్రిజగతీకృతి పుష్పితవృత్తి పొల్చెడున్. 40

చ. నిలువక పర్ణశాలధరణీస్థలి చేరెడునంతలోపలన్
నిలువదు గుండె, యజ్ఞ ధరణీస్థలికానుపు పర్ణశాలలో
పల సుఖముండునా! దనుజవర్గపుటూహలు పాముకాళ్ళు, వా
రలు పొనరించు కార్యము లరాళకరాళవుఁ బాముకోఱలున్. 41

క. ఏనెంత నిలుపుకొన్నను, నీ నా యశుభోహవాహినీచ్ఛా వేగం
బానదు ధైర్యపుఁ గట్టను బూని విభేదించుకొనుచుఁ బోయెడు వత్సా! 42

ఉ. నీ చనుదెంచు వేళ కవనీసుత భాసితనేత్ర పర్ణ శా
లాచరమాంగణంబున నిలంబడె నంటివ, యిప్డు కూడ నీ
నా చనుదేరువేళ లలనామణి యట్టులె నిల్చియుండునా!
వాచిన కన్నుదోయి తుది బాష్పములన్ విరియించుచుండునా! 43

క. నీ వీ నాతో నడవికి రావలెనన నన్ను గాని రక్షించుటకా!
యే వెలఁదుక నొక్కర్తుక నీవిలయాటవుల వదలనేరర యెవరున్. 44

చ. ఒక ధరణీజ భద్రముగ నుండినఁజాలును వింటికజ్జల
స్తకమున వందలైన పినతల్లుల యీదృగరణ్యదేశవా
సకములు నిస్తరించుటకుఁ జాలుదు, గంద్రపుఁగోనఁ బాకలో
నొకతెను డించివచ్చుటయు నున్నది ధీవిభవాభిశంసిగా. 45

క. నా గెలువరాని దనుజుఁడు నీ గెలువంజాలుటయును వెగడిన వెగడున్
బాగో యోగో యటవీ వాగుర జానకిని డించి వచ్చుట మేలే? 46

శా. నన్నున్ మించిన దైత్యుఁడంచు నొకఁడున్నన్ వాఁడు ముల్లోకపున్
మిన్నందుండినవాఁడు నిన్నిపుడు పంపెన్ భూమిజాతాసమా

సన్న్యాసద్విజరూపధారియు మదాజ్ఞం దాఁరమంతైన దాఁ
ట వ్నీవోపవు నాదుమాట నది పీటంబుచ్చె నీయందునన్. 47

వ. అనిన నాకంఠంబయిన దుఃఖమ్ము లక్ష్మణుని మొగంబు జేవురింపించిన శ్రీరా
మచంద్రుడు. 48

గీ. పట్టరానికోపంబు కీడ్వ్రజచె నిన్నుఁ బట్టరాని దుఃఖంబు పొల్పడెద విట్లు
కోపకారణ మున్నను కోవిఁదుఁడవు చెదరి యీరీతి ని న్నకోవిదునిఁజేసె. 49

వ. నా విని లక్ష్మణుం డిట్లనుచుండె. 50

సీ. దానిసంబంధింప నైనట్టివగు సర్వ విషయంబు లొక్కటి బీరువోక
దానికిఁ దూఁక మెంతైనదో యంతయుఁ గచ్చితంబుగ నుంత కగ్గనీక
ఏ విషయంబునం దేని యిష్టానిష్టములయందు నిట్టటు మొగ్గనీక
తత్కాల సముచితత్వం బెంతయో యంత యణువునయందు మర్యాద విడక
గీ. యొకపరిస్థితిపాలించుటకును స్వామి! కోర్కులునుకోపములును మాకునుసమృద్ధి
లక్ష్యమందున నిలువుబలంబులేదు హృదయమందున విధి ప్రతారించుచుండు.

క. బావురు మనుచున్నది యదిగో! వాకిలియంచు స్వామి గుబ్బిసలగుచున్
వే వాయుధూతమైన మహావృక్షమువోలెఁ గొమ్మయందల్లాడెన్. 53

ఆ. చూచుచున్న లేటిసోకుగా నాడుచు నున్న తీవ, వ్రాలు చున్నకొమ్మ
దౌలఁ జూచుచున్న దాశరథికిఁ దన కాంత యేమొ యన్నభ్రాంతి సేయు. 54

గీ. పర్ణశాల వెనుకఁ బరువెత్తుకుందెలు తెరవిధాన నెండపొరను దీయు
మనిసి కదలినట్లు కనిపించి రాఘవ మౌళి యచటఁజూచు మౌళి సాచు. 55

చ. ప్రభువు ధరాత్మజామతిని భద్రగజేంద్రములీలఁ బర్ణశా
లభువి నవేగుఁడై చన, నిలాభర మోర్వక దిగ్గజంబు లు
గ్రభయ వికంపి కుంభములుగా, వన మొప్పెను భూమికంపస
న్నిభముగ నప్రతర్క్యభయనిస్పృహ లొక్కటఁ గొట్టినట్లుగన్. 56

గీ. వెలి బయలునందు నాల్గుదిక్కులఁగనఁబడు నోలిఁగనిపించ దది పర్ణశాల వెనుక
బోయిచూచిన నటనుండు భూమిజాత పోయిచూచిన నటలేదు భూమిజాత.57

గీ. సాధుసంవీక్ష్యమగు బహిశ్శాలయందు నగ్నిగృహమున యందు మహానసమున
కానిపించదు, తూణీరకాండకార్ముకమ్ములకు వెనుక తట్టునఁ గానిపించు. 58

గీ. పర్ణశాల వెనుకఁ బ్రవహించు వాగు లోతట్టునందుఁ బోయి తాను జూచి
యెగువ దిగువఁ గన్ను లెగచి సీతాజాని కన్నులందు దుఃఖకాంతి నూని. 59

గీ. అన్నచూచినయెడఁ దమ్ముఁడరిగిచూచు ననుజుచూచినయెడనన్న యరిగిచూచు
అన్న దుఃఖాభిభూతుఁడు ననుజుఁడాత్మ దోష శంకావిభిన్న చేతోవహుండు. 60

వ. అంత బహిశ్శాలా వితర్దికానిషణ్ణుండు విషణ్ణుండు రామచంద్రుడు.

శా. అయ్యో! నాయన! యా ధరాసుత నయోధ్యాపత్తనిం డించిరా
నియ్యారణ్యపథంబులందుఁ దన కే నేమో మహారక్షణం
బొయ్యం జేయుదునంచు వచ్చినది, నేనో! దానవశ్రేణితోఁ
గయ్యంబాడుట పెట్టుకొంటి జనకక్ష్మాకన్యఁ జింతింపకన్. 61

చ. అతఁడెవఁడో సమస్తమునయం దధికారివలెన్ నటించు సం
తతమగు నొక్క ప్రజ్ఞ సముదాత్తత గల్గిన, దానిదైన యో
గ్యత కలచోట నయ్యది ప్రకాశముపొందున, సర్వదృష్టి హ
స్తతలమునందు బూనినవిధంబున నేటి కహంకరింపఁగాన్. 62

చ. ఒకనిముసంబునన్ వెలుతురుండిన, ముందఱ కొంతదవ్వు దృ
ష్టికలిగినం, గనంబడు ఘటించిన సృష్టి నిబంధనంబుగా
ఒకనిముసంబులో సకలముండదు కాలము, వెన్కముందు లా
యొకనిముసంబులో నొదుగ, వూరక మానిసి గర్వమందెడున్. 63

క. ఏమఱిలుటన నెఱఁగిన వాఁ డామహనీయుండు వేఁడు హరియించెను దా
భూమిసుతను నీతిజ్ఞ గ్రామణి నేవట్టి కార్ముకకళావిదుఁడన్. 64

చ. ఇరువదివేల దానవుల నెక్కటిపోరున నొంటివింటిపై
విఱిచితినే దిగుల్వడి విభీతిని నాదెస రారటన్న నా
యెఱుక యిదెల్ల పట్టి మతిహీనత, యూపిరియున్నవట్టు నే
డ్తెఱఁ బగతీర్చు జీవుఁడు, మృతిం బగముందఱ లెక్క పెట్టకన్. 65

మ. దురితాకారులు జానకిం దితిజు లంధోభూతగాఁ జేసి యుం
దుర యూపాటికిఁ, జెడ్డయూహ పెడకుంద్రోతున్ మఱిన్ జానకీ
హరణం బొక్కటియే ఘటిల్లెనని కట్టా! చెట్టగా నూహరా
నొరుగంజాలనిదైన యెట్టి దురవస్థోపేతయై పొల్చునో. 66

మ. అయయో జానకి గౌతమీజల విహారాయాత హంసీమృదు
ప్రియ గోదావరికైనఁ గాని చనెనో! వీక్షించిరావయ్య! ని
ర్దయులౌ దైత్యులు చంపిరం చెఱఁగియున్ దారాడు నాశావృథా
వ్యయ మేపారెడు పోయిచూడఁగదవే! యాత్రొక్కునుం దీరెడున్. 67

వ. అంత గోదావరీనివర్తితుఁడైన సౌమిత్రిం జూచి. 68

మ. అచ్చటఁ గూడలేదుగద! యద్దియుఁ దీరెను సంశయంబు, నా
వచ్చినరాక సర్వఫలవంతము పొల్చెదునంచు దుఃఖహో
సోచ్ఛలితాస్యుఁడౌచు బ్రభు వుల్లమునందున గుమ్మటిల్లినన్
హెచ్చెడుశోకమాపుకొని యిట్లనెఁ దాననుజుండు స్వామితోన్. 69

శా. అన్నా! యీ వనదేశ మంతయును బుణ్యారణ్య, మీ పర్వతా
సన్నక్షేత్రము కందరా వివిధ పుష్పశ్రేణి వల్లీ నికుం
జౌన్నత్యంబును, దర్శనోజ్జిగమిషా వ్యాపారయై తల్లియున్
జన్నట్లున్నది, పోయి చూడ జనకక్ష్మాజాత కన్పించెడున్. 70

క. అని స్వామి కనిష్ఠికc గై కొని రాముcడు లేచి సర్ది కోదండము మూcపున, బయలుదేరె లోచన వనజంబులు తుదలరేక వ్రాలుచునుండన్. 71

చ. ఒక లవలీకిసాలయశిఖోపరిc జేయిడి సీతయంచు, నిం
కొక తరుణామ్రశాఖ నడుమూని సకార్ముకలస్తకాగ్రహ
స్తకముగ భూమిజాత యని, సర్వమనోగత భూమిజాతుcడై
వికలమనస్కుcడౌచుc బనివెన్ రఘురాముcడు దారి వెంబడిన్. 72

మధ్యాక్కఱలు

ఓయమ్మరో! కదంబమా! నవోన్మిషితోరు నీరజదృ
శాయతాంశుకదంబక జనకాత్మజ యగపడెనమ్మ!
కాయని సంజయెండల చొకాటపు కర్ణికారసుమ!
నాయెద నీవంటిజోతి నాతి కన్పడెనమ్మ సీత. 73

లవలి! క్రొవ్వెన్నెలలోని లావణ్యలలితాంగ రాశి
యవనిజాత భవాదృశనయనాంచలహారిణి లేదా!
చివురునవ్వుల సన్నముళ్లు సెలవుల చివర లైనది, కు
రవకసూన! లతాంగి కానరాదె యీ ప్రాంతంబులందు. 74

ఈ యశోకముక్రింద వానరేశ్వరుం డెవ్వcడో యేదొ
పోయినవస్తువు వెదకుపోలికc బొంచియున్నాcడు
మాయురే! నా సీత యచట మదిరాక్షి మసలునో యేమొ
యోయి వానరరాజ! యచట నుర్విజ యున్నదా! చెపుమ. 75

అర్జునవృక్షమా! నీకు నగపడెనా! వేగcదెలుపు
మర్జునజేత్ర జేత నగు నస్మదీయాంగన సీత
నిర్జితసర్వోపమాన నిభృతాంగ నిర్మలమూర్తి
వర్జించి వనవాసి నన్ను వచ్చెనా! వనరాజి కడకు. 76

మ. చయమై కుల్యగ జాలువారిన యదృచ్ఛాప్త్రీనవాకారc దే
నియ సూర్యాంశువికీర్యమాణ సుషమాస్నిగ్ధంబు భూమీసుతో
దయభావంబునc జూచి రాఘవుcడు, నేత్రంబుల్ నిమేషోగ్ర వి
స్మయ మేపారి యథార్థతా కృతపరిజ్ఞానంబుచే దుఃఖమై. 77

శా. ఈ చెట్లన్నియుఁ దోడబుట్టువులు సుమ్మీ! సీతకున్, సీత కే
దో చెట్టె యివి చూచెనేనియును నాతోఁ జెప్పెడిన్, గౌతమీ
వీచీసంహతి, వాస్తరంగ కరుణావిస్తార దృక్స్రాధురే
ఖాచక్రాకృతి చూచియుండును ధరాకాంతామణిన్ లక్ష్మణా! 78

క. నడిపాయ కడ్డుకట్టెడు గడలికి మఱి తనికుఁగాని కాకుండఁగఁ జే
సెడు, నుపనదులజలము వేఱెడ తీసెడు, దైత్యభీతి హెచ్చిన నదియున్. 79

శా. అన్నాదమ్ములు వచ్చి సీత యెచటమ్మా! యన్న, నిష్క్రాజితా
సన్నానేక జలద్విజ స్తమిత పక్ష్మశ్రేణి మార్వ్యల్క కే
యున్నన్, రాముఁడు చూచి తా నెఱుఁగదీ యుల్లోల కల్లోలసం
వ స్నీరాకృతి యంచుఁ దా నడవులం బట్టెన్ విచిన్వానుఁడై. 80

మ. జలముల్ భూజములున్ శకుంతమృగముల్ సర్వంబు, నీమౌని మం
డల మధ్యంబున మాటకున్ బదులుకానన్ రామి యభ్రంబొకో!
జలసంపూరితలోచనాంతుని రఘుస్వామిన్ సమభ్యస్తమం
జుల మర్యాదుఁడు సర్వభద్రకృతి దక్షుం డౌచు సేవించుచున్. 81

క. సౌమిత్రి వేయికన్నుల భూమీతనుజాత సన్నపాదసూపుట రే
ఖామాత్రమైనఁ దోఁచుట పై మనసును నిల్పి కనుచుఁ బ్రభువై నడుచున్.

ఆ. అల్ప మసురమాయ, యధిక మ్మవనిజాత ఘనపతివ్రతాత్వ కలితమహిమ,
ఇట్టె యసుర మింటి కెగయఁడు పెనఁకువఁ గాలిగుర్తులయినఁ గలుగవలయు. 83

ఆ. మఱలఁ బర్ణశాల దరిసి శ్రీరాఘవుఁ డేఁగి మఱల నెల్ల యెడలు చూచి
యంతవరకు లీనమై యున్న దుఃఖంబు పొంగి పొరలఁగ రఘుపుంగవుండు. 84

వ. ఒక పెద్దసముద్రపుఁ గెరటము విరిగినట్లై యిట్లు దుఃఖించె. 85

క. ఇయ్యతివ యిట్టు లగునని యయ్యో! కలలోననైన ననుకొననైతిన్
చయ్యన నా దురదృష్టము వ్రయ్యలగు నటంచు నూహ రాలేనైతిన్. 86

ఉ. నా కరయుగ్మమం దధిగుణంబగు చాపము గల్గియుండు నం
దాఁక ధరాతనూజదెసఁ దారగనీ ననుకొంటి దైవమున్,
నా కరయుగ్మమం దవగుణంబుగఁ జాపము చేయఁగల్గు దు
ర్ధీకము దైవ మీచనిన తెన్ను గణింపఁగ లేకపోయితిన్. 87

శా. సీతా సీత! యిదేమి చేసితివె నా చిత్తంబు నాప్రాణమున్
నాతోఁ గొనకువచ్చి తన్న విపులానందంబు, నాజీవితం,
బీ తీరయ్యెద వంచు నామనసులో నెన్నండు నూహింపలే
దే! తారుణ్యగృహప్రఘాణ విలసద్దీపాంకురాస్యప్రభా! 88

గీ. నిముసనిముసమ్ము గాఁగ బండించిపోసినాఁడు రాముఁ డన్వాఁడు పుణ్యములపంట
అతఁడుపోసిన యట్టి పుణ్యములరాశి యింద్రజాలమువోలె నదృశ్యమయ్యె. 89

చ. తెగఁబడితిన్ వనోగ్రవసతిం బొనరింపఁగ నింతమట్టి పె
ళ్ళగ గణియింపగా గల యిలాతల మంతయు, మౌనిలోకపుం
బగ తలపైకి నెత్తికొని పాలనచేయఁగ, నామె యున్నదం
చగణిత మట్టిధైర్యగుణ మంతయు నాయది యిట్టులయ్యెనా! 90

శా. ఆ నిష్కల్మషమైన ప్రేమనిలయం బా సీతకుం భర్తనా!
యే నే యిట్లగు టంచు నైనయెడఁ దా నీపాటి కేమౌనొకో!
యా నిర్వ్యాజమనోహరప్రణయ యిట్లై కూడ జీవించియు
న్నానే! పోలికయేమి యాయమకును న్నా కీ రసాధ్వంబులన్. 91

చ. వనమునఁ గొంచువచ్చుటను వార్తను దా జనకక్షితీశుఁడున్
విని మఱియేమియెంచునొ! నివిష్టసుతాధికచిత్తుఁ డంచు నే
బనవెద, నిప్పు డీ యశనివార్తను దా విని నన్ను నేమిగా
యనుకొనునో కటా! **తలఁపనైనను** జాలఁగ నేరనయ్యెదన్. 92

క. తనకూఁతు హరించిన రాముని పాదము ధరణిపైనిమోపుట దోషం
బనల్లము చొచ్చునొ! రాముఁడు మునిఁగి నదీవేణి నడఁగిపోవునొ! కాకన్. 93

వ. అని యాయత్తపడుచున్న పరమేశ్వరునకుఁ గేల్మోగిచి సౌమిత్రి. 94

క. మీతో వచ్చితి నేనును మీతోఁ జనుదెంతుఁ గాని మేదినిసుత తా
నే తీరైనదొ తెలియక యీతీరుగ నాచరించు టేమనవలయున్! 95

గీ. ఇచట నెత్తురుబొట్టు లే దిచట నొక్క బొమిక లే, దామె నెత్తుక పోయినాఁడు
కానితినలేదు, మాయరక్కసుఁడువాఁడు నింతపదచిహ్నములు తోఁచనీనివాఁడు.

గీ. చంపి తినియెడివాఁడైనఁ జంపి యిచటె తినెడివాఁ డల్లవానిఁ గాదనె నెవండు!
నతఁడు నీతోడివగయు, నీవన్న భయముకల మహారాక్షసుండు కావలయు నొకఁడు.

వ. వానికొంపకు వాఁడే నిప్పు ముట్టించుకొన్నాఁడు. నీతోఁ బగపెట్టికొని బట్టకట్టి
నవాఁ డెవ్వఁడనిన శ్రీరామచంద్రుండు. 98

చ. పగ కలదేని తానెదురువచ్చి సమున్నతపౌరుషంబు చూ
పఁగఁ దగు, జేతకానియెడ వానికి దోడుగ వేనిఁదెచ్చికోఁ
దగు, నదికూడఁ గానియెడఁ దా దల వాంచిన నేమితప్పు కా,
దొగి మరణించినం ద్రిదివమున్నది యియ్యది యేమి కార్యమో! 99

చ. కృతయుగమాది నే కథల నెందును విన్పడ, దెవ్వఁడే ననూ
ర్జితముగ శత్రుభార్యను హరించుట సంగత వైరభావ ని

19

ర్గతి కయి, నేను నమ్ముటకుఁ గాని సమర్థుఁడ గాకపోయెదన్,
శా. క్షితిపయి నిట్టికార్యమును జేయుట యున్నదె! బుద్ధి చిత్రమై. 100

చ. జరుగుఁ బరంపరామతివశంబుగ లోకము, దేవతాంశ స
త్పురుషులు సత్క్రియాకుసుమముల్ వికసింతురు, దానవాంశ దు
ష్పురుషులు కంటకంబు లవిశుద్ధము లీదృశముల్ వెలార్తు, రు
క ద్ధురము భవిష్యమైన కలి దోఁచెడువేళల మార్గదర్శులై. 101

శా. వాఁడెవ్వాఁడొ మఱేదెసం జనియెనో వామాక్షి యేమయ్యెనో
శా జాడం జెప్పెదు వారు లేరడిగినన్ జంతు ప్రతానంబు నో
రాడంజాలదు మాటకున్ బదులు కట్టా! సీత యక్కన్నులన్
లేడుల్ నేర్చిన వప్పగించు, మృదువల్లీ మౌళి భిన్నాగ్రముల్. 102

సీ. మొదలిప్రాయఁపు టింటిముంగిట నిలుచున్న గోటుపోయెడు నట్టి లేటికాన!
ఓ ఒడయఁడు గీరిన యొడలిపై నునుచూపు మీటుచుండిన యట్టి లేటిపడుచ!
తొలిచూలు బరువుచేఁ తొలినాఁటివలె దూఁక లేక వెల్వెలబాఱు లేటిచాన!
తనబిడ్డ మేయ దవ్వున కేఁగగాఁజూచి విస్తుపోయెడు లేటి గేస్తురాఁల!
గీ. ప్రాప్తజంఘాకమైనట్టి పచ్చిగడ్డి మొగము చూడనియట్టి చమూరుచయమ!
అతఁడెవ్వడో రక్కసుఁ డవనిజాత నెత్తికొని యే దిశావీధి నేగినాఁడు? 103

గీ. అని యడిగినంత హరిణచయంబు లొక్క పెట్ట దక్షిణదిశఁ-బర్వువెట్టినంత,
జాటజూటికాసమతీత చాపకోటి, కదలె సౌమిత్రి తన కుడికాలు మీటి. 104

మధ్యాక్కఱ.

అడుగువేసినవైన కలద యట దక్షిణాశ తోడ్తోన
పుడమికానుపు కానఁబడునొ పొంగిన పొగులైన యంత
కడలు దగ్గర చేరునటవె కలఁగి తాఁ గాకుత్స్థమౌళి
కెడనున్న ప్రస్రవణాఖ్య గిరిచూచి, కెరలి యిట్లనియె. 105

ఓ కొండయెకిమీఁడ! నాదు నుగ్మలి నుర్విజ నొక్క
రాకాసి కొనిపోయె, హరిణరాజి. మార్గముచూపె నిద్ది,
నీ కొమ్ములం దూసి యసుర నెగసియుండెడిని, యా త్రోవ
నాకుఁ జెప్పుము పల్కరాని నంగితనంబు పోఁబోకు! 106

క. హరి మీ ఱెక్కలు తూల్చెను హరి మీనోళ్ళు పడఁగొట్టెఁ దభినయమౌన
స్ఫురణము నా దగ్గర కాదరరే! నను రామభద్రుఁడనుకొనుము గిరీ! 107

మ. మఱియోయీ! గిరిరాజ! మార్వలుకవా! మద్బాహుకోదండ ని
ర్భరవల్లీ ప్రవిముక్త బాణచయ ధారా దీర్ణ చూడున్ నినున్

దారకొన్నన్ నిముసానఁ జూర్ణముగ నేతుం జేయగా, భీకరా
సుర సాహస్రము లిప్తలో ధనుసునం జూర్ణించినాడం జుమీ! 108

శా. ఈ దారిం జనినట్టి, దా యసుర నీకేమోను కన్పించకే
పో దాసర్వము చెప్పితీరవలె, నే భూభృత్తునో భూమిభృ
త్తా! దౌర్భాగ్యము పట్టి యీ యడవులం దారాడెదం గాని కాం
తాదూరస్థుఁడనై, వచింపు మసురద్రాఘిష్ఠమార్గంబెదో! 109

గీ. చెవులతో విన్నస్థితిని జూచినదిగాఁగ గనులతో నేలపై c బెద్దకాలిగుర్తు
లరసిసౌమిత్రి స్వామి!యీయవనిధరుడు చెప్పినదిచూడు మీ కాలిచిన్నెలనిన.

క. చని చూచిన రామునకును గనులం దెలివెల్ల వచ్చెఁ, గడుకొని యూహిం
పనురానిచోట నాలంబనము ఘటిల్లిన వివేకమంథర రేఖన్. 111

మ. అవుఁ బాదంబుల శంఖచక్రములు చిహ్నంబుల్ విడంబించుఁ, దా
నెవఁడో యీతఁడు చక్రవర్తియయి యిట్లీ దుష్టకార్యంబు దా
నవుఁడే కావలెఁ జేయఁగా, నివియు నన్నా! లక్ష్మణా! చూడు మీ
సవిధంబందున జానకీ పదసరోజ స్నిగ్ధరేఖాంకముల్. 112

గీ. బుజమునందుండి దించినపోల్కిఁగాఁగ రామచంద్రుండు జానకీ రమ్యపాద
చిహ్నముల నుస్మరంచును చేతివ్రేళ్ళతో స్పృశించెను చిహ్నవనస్పతులను. 113

చ. పదమని సాగుచుండి రఘుబంధుడు సింధురయాన సీత యొ
ప్పిదముగ మేనికిన్ నగలుపెట్టిన పూవులు చూచి తీసి తా
నెదపయిఁ జేర్చికొంచుఁ బువు లేచిన జానకి యంగసౌష్ఠవా
స్పద మగు మూర్తికల్పన వశంవదచిత్తుఁడు సొమ్మసిల్లుచున్. 114

చ. క్షితిసతి రత్నగర్భ యని చెప్పట జానకి తల్లి యీటచే
జితనుపడున్, లతాంగి సుమసన్నతపర్వ సమార్ద్రబంభ రా
యిత మృదు కేశపాశ నయనేందిర, భూమిజ లేక ఝుంఝుచే
మతి చెడు తోటమాలివలె మానసమందున డిందిపోయెదన్. 115

మ. చెలువౌ నాయెదలోని దీపము హరించెన్ వీఁడెవండో! యఘా
విలచేతస్కుఁడు, వీనితోడి పగ కల్పింపంబడెన్, సద్గుణా
వలులౌ నా ఖరదూషణుల్ కృత పరాక్రాంతి ప్రధావంతు, లీ
యలుపంపున్ మతివాఁడు వీఁడెవఁడొ, కట్టా! శత్రుపై యేర్పడెన్. 116

క. తనయునికి నెఱుకపఱచక, తనపేరుం దెలియనీక, దా నపకారం
బును చేయువాఁడు చను వంచనఁబడి నిత్యాంధతమసజగముల యందున్. 117

వ. ఇదిగో! విఱిగిపోయిన తూణీరములు, తునిగిన ధనుస్సు, ముక్కలయిన రథము,
ఇవిగో! సీత నగలనుండి రాలిన కనకబిందువులు! 118

చ. పదపదమున్ జిరత్నమణిభాసుర కాంతుల పుష్పమాలికా
సదనము నాఁగ ముగ్గులిడుచావడి నాగనురంగభూమిమై
యిదివనమెల్ల నిచ్చట రణేందిర నృత్యము చేసినట్టు లు
న్నది, మొలనూలిపై డిరతనాలు ధరాస్థలి జాలువారగన్. 119

శా. ఈతూణీరము నీ ధను స్సెవనిదో! యెవ్వానితో నెవ్వఁడో
సీతాలాభనిమిత్త మాహవముచేసెన్, వాఁడువాఁడున్ సురా
రాతుల్ గావలె, ఛిన్నవస్తుతతి సౌరప్రోజ్జ్వలద్దీధితిన్
చేతస్తాపము కూర్చెడున్, గులవధూక్షేమేతరోహంబడిన్. 120

ఉ. ఎంచగరాని క్రోధమున నిద్దరుదైత్యులు పోరి గెల్పుపొం
దించినరీతి పంచుకొని తింటకు జానకి మట్టిముద్దయా!
వంచనచేసి తీసికొని వచ్చినదైత్యునిఁ బోరిలోన మ
ర్దించినవానికిన్ ఫలగతిం గలితాల్పప్రయత్న మేర్పడన్. 121

సీ. ముక్తామణి వికారమును దప్తచామీకరాలంకృతమ్ము బాణాసనంబు
కవచంబు బాలార్క కాంతిసంకాశంబు నల విదూరజ గుళికాంచితంబు
శతశలాకం బిది ఛత్రంబు దివ్యమాల్యోపశోభితము భగ్నోరుదండ
మురుపిశాచాననోద్ధురములు ఖరములు కాంచనోజ్జ్వలిత వక్షశ్ఛదములు
గీ. నాహవధ్వజంబు నగ్నిసందీప్తంబు బండిపోలు మేలి పైడికోల
శరచయంబు లాయసముఖంబులు మరాళపుచ్ఛ కాంచనములు పుంఖసమితి. 122

ఉ. జవ్వన నూఁగు ప్రగ్రహ కశాకృత ముష్టి నిబంధనంబుగా
నెవ్వఁడు వీఁడు సారథి! మహీతలమందునఁ ద్రెళ్ళె, బంగరున్
మువ్వలతోడి పాగ రణమూర్ధ విహార మహోచితంబుగాఁ
గ్రువ్విన పైడివర్మము నురోనిహితం బినకాంతిమంతమున్. 123

మధ్యాక్కఱ.

ఈ చామర గ్రాహిణులు మఱెవ్వరో! హేమభూషితులు
శ్రీ చాంద్రమసమైన వదనసీమలు చెలువారు వారు
నీ చక్ర మాకులు నడ్డ యిరుసును నీబండిపలక
క్రాఁచిన బంగారువ్రూఁత కాంత చక్రమ్ములతీరు. 124

ఉ. రాక్షసులో! పిశాచములో! రాజితభోగ విశాలురున్ మహా
ధ్యక్షులు చక్రవర్తి విదితాంచిత లక్షణవంతులున్ మహా

దక్షులునున్, వియచ్చరణదర్పులు, పోరిన యిద్దఱున్ సురా
ధ్యక్షపదాదిలోకముల యం దధికారులుకూడఁ గావలెన్. 125

చ. హరిహయుఁడుం బయోజభవుఁడాదిగ నిద్ది యెఱుంగకుండగా
జరిగెనె! సర్వదేవతలు సర్వజగంబులు సర్వభూతముల్
చిరముగ నంతయుం దెలిసి చేసినదే యిది, పెద్దకుమ్ముగా
జరిపినకుట్ర, యిప్పటికి సాగి బహిర్గతమయ్యె నిమ్ముగా. 126

శా. అన్నా లక్ష్మణ! నే నెవండ నని వీ రన్కొందురో! మిన్నునున్
మన్నేకంబుగఁ జేసి వారినిధులన్ క్ష్మాభృత్తులున్ వాహినుల్
మన్నారాచమహాగ్ని సంజనిత ధూమ్యాచ్ఛన్న రోదోంతరా
సన్నాంధ్యంబుగ సృష్టికిం జివర, విస్పష్టంబుగాఁ గూర్చెదన్. 127

శా. నా ధాత్రీజను దెచ్చి యీ నిముషమే నాకిచ్చిరా, యిత్తురో
హో! ధర్మేతరవృత్తి తీసికొని రారో, యీ దశాశావనీ
వ్యాధుండై యణుమాత్రభిన్నములుగా నస్మచ్ఛరాగ్నిచ్ఛటా
సాధారణ్యముగాఁ జేసెద. సమస్తంబైన యీ నిర్మితిన్. 128

క. సపిశాచరాక్షసంబు ససుపర్వవిద్యాధరంబు చూఁడించెద నీ
విపులాఖిల సృష్టి, ధనుఃకృపాణ వహ్ని ప్రతాపకీలాచ్ఛటలన్. 129

ఉ. సర్వజగద్భయంకరవిషచ్ఛట రేఁగిన మంత్రశక్తిచే
నిర్వృతిఁబాసి, జంతుతతి నేలను ద్రెళ్ళ విచేతనంబులై
గర్విత దేవదానవనికాయము కాయము లేది, వంచనా
ధూర్వహబుద్ధులం గతులు తోఁచక నాశము నందగావలెన్. 130

చ. రజనిచరాధినాథులును రాజులు సర్వపిశాచ నేతలున్
ప్రజలును దేవతల్ హరిహరప్రముఖాఖిల సృష్టిబుద్ధులున్
గజిబిజిగా, మహాప్రళయకారి పరాక్రమ బుద్ధినై జగత్
సృజన విధాతకర్మ యిదియెల్లను, నేఁడుపసంహరించెదన్. 131

శా. నే నున్నన్ మఱియున్న దీయఖిలమున్, నే లేనిచో లేదు, సీ
తానీహారనవాంశుబింబముఖి నాతత్త్వంబు, తా లేనిచో
నేనున్ లే నిఁక నేలయుండవలె యీ నిర్మాణసంపత్తి, నేఁ
డే నిర్మూలముచేతు దీని, భవకాండీరత్వముం జూపెదన్. 132

ఉ. ఎవ్వఁడు సీతనెత్తుకొని యేగినయాతఁడు వింతగాఁగ నా
క్రొవ్వినవాని నా యెదుటకుంగొని తేవలె సీత జాడవా
క్రువ్వవలెన్ సురాసురులకున్ బ్రదుకున్‌వలె గాదయేని యీ
క్రువ్వినసృష్టిముళ్ళు విడఁగొట్టెద, ముక్కలుముక్కలై చనన్. 133

శా. ఓహో! దైవత భోగిరాక్షసపిశాచోర్వీపతుల్ విందు! మ
ద్బాహోవర్తిత చాపముక్త విశిఖప్రారంభ సూర్యచ్ఛటా
నీహారంబుగ నారిపోకుఁడు! లయాగ్నిప్రోత ఘోరాస్త్రమం
త్రాహూతి న్నిమిసంబులో జగతి విధ్వస్తంబుఁగా జేసెదన్. 134

చ. కటితటి దోవతిన్ విఱిచికట్టి, జడన్ ముడివేసి, నిల్చి సం
ఘటితము నల్లెత్రాటికొన కార్ముకకోటికిఁ జేసి విస్ఫుర
న్నిటలమునందు రుద్రులు, కనీనికలందు లయాగ్ను లొప్పగాఁ
గటగటలాడు స్వామిఁగని, కంపనమందె సమస్తభూతముల్. 135

గీ. ఒకఁడు చేయఁబోవ నొక్కటియయ్యెనంచమరవితతి భీతి నణఁగిపోయి
నాగపతిని ప్రార్థనా వావదూకుని యందు నెల్ల ప్రత్యయంబు నిలిపి. 136

మ. తను చక్రాకృతియై సుమిత్ర తొలిసంతానంబు మోకాళ్ల ప్రా
ల్చి నతాంసుండును నమ్రశీర్షుఁ డగుచుం జేదోయి జోడించియి
ట్లనె, నిన్నాళ్లను లోకసౌఖ్యఘటనాహారి ప్రభాచంద్రికల్
చను నీకన్నులఁ జూడఁ గల్గుదురె! యీ సంవర్తవేళాగ్నులన్. 137

శా. అల్పుల్ నిత్యము చేతనైన దగు సంహారంబు కావింత్రు, సం
కల్పావేతమనఃప్రవృత్తులు జగత్కార్యప్రతిష్ఠాసమా
ధు, ల్పాండిత్యనిధుల్ భవాదృశులు చేతోనిర్ఘృణుల్ గారు, మీ
యల్పిష్ట భ్రుకుటీవిభుగ్నతయె పర్యాప్తంబు లోకార్తికిన్. 138

శా. ఇన్నాళ్ళున్ సుకుమార చంద్రికలు కాయింపించి నీ శాంతియున్
నిన్నె పొందిన దాంతియున్ క్షయముగా నేఁడీ మహాగ్నిచ్ఛటల్
కన్నుల్ కాసిన, సాధునిర్ణయము లోకంబెట్లు సేయుం గృపా
సన్న క్షేత్రములైన త్వాదృశులు రక్షాదీక్ష మన్నింపకన్. 139

క. ఒక్కని యపరాధంబునఁ జిక్కని యీసృష్టి నెల్ల శిక్షించుటయా!
అక్కట! భగ్నరథుఁడు వీఁ డెక్కడివాఁడో! యెఱుంగనే వలయుఁగదా! 140

ఉ. పొలుపుగ శాంతులై ప్రకృతిపొందినఁ దాదృశులైన యుత్తముల్
సలలిత పత్రపుష్పఫలసంతతి నమ్రములౌను భూజముల్,
పలపలకాయు వెన్నెలలు బాలశశాంకుఁడు, వాహినీజలం
బుల బహుసస్యగర్భములు మోయును ధారుణిదేవి, ప్రీతయై. 141

ఉ. రాజులు యుక్తదండులు, శరణ్యమవీవు సమస్తధాత్రికిన్,
శ్రీజనకాత్మజాహరణ కృత్యము సాధువటంచుఁ జెప్ప ను
ద్వేజితవృత్తు లా కడిమివేల్పులు, వాడెవడో యెదో వినష్టభా
వాజిరతస్థివాంసు నెటు లాపుదు! రాత్మనిధుల్ సురాధిపుల్. 142

మ. అనలంబందున సర్వనాశనము చేయ స్నీవు, నేనందు నుం
దును, కౌసల్యలు నందు రాజనకులున్, దోర్దోర్భవత్త్రిమభా
జనమౌ నాభరతుండు నుండును, భవత్సా-గ్రామికం బగ్నియిం
దున మండించు, మఱేందుఁజేయఁ దనుటెందున్ లేదు లోకేశ్వరా! 143

క. నేనుంటిని ఋషులుండిరి నానాపనపర్వతములు నానాజలధుల్
పూని వెదకుదము, ఘోరనదీనిష్యందములు గుహలు దీర్ఘముఖంబుల్. 144

చ. సకలపిశాచ దేవదనుజ ప్రవికీర్ణములైనవౌ జగ
న్నికరము నీవు నేను రమణీజగదాభరణంబు కోసమై
యొకస్థలమైన వీడక మహాంబుధి! చొత్తము చూత, మప్డు కా
నక, సురలామెఁ జూప రనినన్, మఱి యప్పుడుచేయు మీవనిన్. 145

ఉ. ఏ నిముసంబునందు మదినెంచిన నానిముసంబునందు, నీ
యానత చాపదండమున నార్వఁగఁ గల్గుదు భూతసంతతిన్,
జానకిదేవి యాదిశగ సాగినగుర్తులు కానిపించె, దీ
క్షానిధి దేవికిన్ భయముకల్గదు, కల్గిన గుర్తులేదిటన్. 146

వ. అని సౌమిత్రి శ్రీరామదేవుని పదసంవాహనంబు చేయుచు. 147

ఉ. నీ వఖిలజ్ఞుఁడౌదువు, మనీషి శిరోమణి వౌదువున్, జగ
ద్భావము నీకుఁ జెప్పగలవాఁ డెవఁడీ యఖిలంబు, భావ రే
ఖావధికంబుగా జరుగు, నాత్మమనస్సుల దూరసంస్థితిన్
తీవలుగాఁగ నల్లు జగతీ బహుమార్గము లిట్లె సాఁగెడున్. 148

చ. దశరథగర్భ పుష్పమధుధారవు, సర్వఋషిద్విరేఫక
ర్కశముఖలగ్న బిందువవు, క్ష్మాపరిరక్షణ హేతుకంబు త్వా
దృశుల జనుస్సు, ధర్మము భరింతురు దుఃఖముతోడ నుత్తముల్
విశదసమస్త సృష్టిని దపింపఁగ జేయఁగజాలి యుండియున్. 149

చ. కొలముగురుల్ వశిష్ఠులకుఁ గొడ్కులు పోయిరి వందమంది, వి
హ్వలమతిఁ జావఁగా దుమికినట్టి నదంబు శతద్రు వయ్యె, నం
సలమగు గాధిసూతి శరసంతతి శాంతమహస్కమయ్యెఁ, గ
న్నుల తొలిదీప్తిచే హతికి నూల్కొన డీ జగమందుఁ గోపియై. 150

చ. తన కధికార మున్నయది తా నొనరింప, నొనర్చికోను వ
చ్చును, బరిరక్షచేతు ననుచున్ నశియింపఁగఁ జేసికొందురా!
జనకజ సర్వదేశముల సర్వజగత్తులఁ జూత మింతకున్
మన కగుపించు గుర్తులివి క్ష్మాసుత జాడను దేల్చివేసినన్. 151

వ. శ్రీరామచంద్రుండు సౌమిత్రియొక్క భక్తిపరిచయ తర్కచమత్కార కార్యని
ర్వాహకత్వములకు లొంగియుఁ గోపమ్ము విడువక ధనుష్పాణియై. 152

క. మరి దారితీయు మనఁగా, సురారియు విహాయసమున సుళ్ళుగఁ దిరిగెన్
మరి గుర్తులు కనిపించగఁ దిరుగన్ వలె వెదుక యామ్యదిగ్దేశంబున్. 153

క. ఇదియెల్ల జనస్థానము నదీగిరిగుహాసమూహ నానాక్లేశా
స్పదమైన శిలాదేశము, వెదుకవలయు నంగుళంబు విడువక స్వామీ! 154

శా. నే నీ సర్వనదీగుహల్ తిరిగితిన్ నీకై మహాదేవికై
నానాపత్ర ఫలోపహారహరణానంతైక కార్యుండనై,
తా నెచ్చోటనొ దాఁచుటే కలిగినన్ ధాత్రీజ, నాయా రహ
స్యానేకస్థలముల్ మఱేనెఱుఁగలే నట్లుండవీ యెచ్చటన్. 155

వ. అని లక్ష్మణుం డాగ్నేయముఖంబుగా నడువ రాముండు పెడపెడగాఁ బోయె
దవు దక్షిణదిశ యిది యనిన సౌమిత్రి. 156

ఉ. పంచలుపట్టి పోవు నొక పాపము చేసినవాఁడు, నెవ్వఁడో
త్రెంచుక పోవకుండఁగ నెదిర్చిన వాని, నెదిర్చి కూఁడ ద
ప్పించుక పోవఁజూచు, నటు వెళ్ళెడి వేళల వాఁడునుం దలన్
వంచుక వీలుగా నెడమవైపున పోక స్వభావమై చనున్. 157

మ. అని దూరంబునఁ బర్వతోపమముగా, నాకారతః పక్షిగాఁ
గనిపింపన్ రఘుదేవు తమ్ముఁడు నెఱుంగన్ దీని నిచ్చోట నాన్
వనజాక్షుండు శరంబు దీసి తొడివెన్ బాణాసనంబందునన్
దనుజ క్రూర విచిత్ర శాంబరకళాదర్పంబుగా నెంచుచున్. 158

శా. ఓయీ! నాయన! నే జటాయువను బాబూ! యన్న దీర్ఘస్వరం
బా యాకాశపథంబునన్ విరిసె నాస్యానందృగ్దుఃఖరే
ఖాయత్తుల్ పరువెత్తి యిద్దఱును స్నేహాంబోధిఁ బక్షీంద్రుఁ బ్రా
ణాయామవ్యయు, ఛిన్నపక్షయుగునిం దర్శించి, రాత్మీయునిన్. 159

శా. తాతా! యీగతి నెట్లులైతివి జగత్తత్త్వజ్ఞ నిన్నెవ్వఁడీ
రీతిం జేసినవాఁడటం చడుగుచున్, దృక్తీక్ష్ణులై రిద్దఱున్
తాతా! రాఘవ! సీత రావణుఁడు దైత్యస్వామి కొంపోయెడున్
వీతాత్మున్ దనుజేంద్రుఁ దాఁకితినయా! విస్పష్టశౌర్యంబునన్. 160

చ. వెస దనుజాధమున్ కొఱంత వేసితి సారథి ముక్కునన్, రథా
ధ్యసనము డించితిన్, వినిహతాక్షకయుగ్యకకూబరంబుగా

ముసరితి తెక్కలన్ కడిఁది ముక్కునఁ దాల్చుచుఁ జీల్చుచున్, విసా
విసలయి దైత్యనాథుఁ డసివీరుఁడు నన్నిటుచేసె నాయనా! 161

చ. చెలువము వానిదెల్లయును జిందరవందరచేసి విడ్చితిన్,
దల మకుటంబు బాహుపురి దర్పితహారము లూడ్చి పెట్టితిన్,
చులుకఁగ నెంతచేసితినో! చూచియ యుందురుమీరు దారిలో
వల, నను నిట్లుచేసి చనెఁ బాలసుఁ డాసతి దొంగిలించుచున్. 162

శా. రామా! నీవెవరో వచించితినయా! రక్షస్సుకున్ నీ గుణ
గ్రామం బెంతఁగఁ జెప్పి యెక్కుదుసుమీ! గంధద్విపంబాతఁడు
ద్దామాభీల భవత్పరాక్రమ పరిధ్వస్తేందిరాప్రాణుఁడై
యేమౌనో మఱి వానికే తెలియులే యీ దుష్టమార్గంబునన్. 163

వ. అని సొమ్మసిల్లిన లక్ష్మణుండు పత్రపుటికల నీళ్ళు తెచ్చి నాల్కతడుపుచుండగా
శ్రీరామచంద్రుండు కన్నీరు జాలువార్చు చిట్లనుకొనియె. 164

చ. నలువుగ భాగ్య మన్నయెడ నాదియ, తండ్రి హరించిపోయెఁ గా
వలుఁ డెవఁడో హరించిచనె భార్యను, రాజ్యము పాసిపోయి యీ
వలఁబడినాఁడఁ దండ్రితరువాతను మాకును దండ్రియంతవాఁ
డలఘుఁడు పక్షిరాజు నిటులాయెను, దైవము నెత్తికోలుగా. 165

మ. దురదృష్టంబను వహ్నినాబ్రదుకులోఁతుల్ ముట్టె నాయీతనూ
భర మగ్నిచ్చటరేఁగె నాదయిన యేస్వర్యమ్ము దాహోభమై
గిరులున్ కానలు వాహినుల్ జలనిధుల్ కీడ్పాటుమైఁ బాఱునో!
ఛురికన్ దాఁకినమండిపోయెద మటంచున్ రామునింగాంచుచున్. 166

వ. మఱల జటాయువునకు స్మృతికల్గి నాల్కతడిపుట్టగాఁ బ్రభుఁడాతని తల తొడపైఁ
జేర్చుకొని. 167

శా. ఓపంగల్గుదువేని చెప్పఁగదవే యో తాత! ఆయేలోకో
నాపై నా పగ వానికిన్ దెలియగా, నాసీత మీ కోడ, లా
యాపద్వార్నిధి మున్గి యేమనియెఁ దా నారీతి జీవించియు
న్నే! పద్మాననఁ గాంచినన్ బ్రదుకున ట్లేమైనఁ గన్పించెనా? 168

చ. అనిన జటాయు వోయిశిశువా! జగతీతలమెల్ల నాశచే
మనును, నిరాశపొందుటకు మానినిభర్త యదేమి! వాఁడు నె
ట్టన వనరాసులం బుడిసిటంగొను, గొండలు నేలమట్టముం
బొనరుచు, సీతకుం భయముపుట్టదు ప్రాణములం ద్యజింపఁగా. 169

చ. మరి రఘురాముఁ డిట్లనియె, మామక మే యపరాధ మొప్పి దు
ష్కరణము చేయఁజొచ్చిన దసాధుని వానిని, వాని వృత్త మే
సరణిది? వాని బంధుజనసంపద యెట్టిది? వానినిల్చు ను
ర్వర యెటనున్న? దున్నకొనప్రాణము వీడకమున్న చెప్పవే! 170

వ. అనిన ఖగరాజు వాఁడు విశ్రవసునికొడుకు, సాక్షాత్తు వైశ్రవణుని భ్రాత, యను చుండగనే కాళ్ళు నిగుడ బిగిసి తల వాల్చిన. 171

గీ. ఇద్దఱగు సోదరులును గొంతెత్తి యేడ్చి రమితనిష్కల్మషపుగుండె యైనవాఁడు
నమితనిర్వ్యాజమగుప్రేమ యైనవాఁడుసర్వపూజ్యుఁడు మాతండ్రిసఖుఁడటంచు.

ఉ. ఏ వనదేవతల్ నినకులేశ్వరి మైథిలి యేడ్చుచుండఁగా
దీపలుచెట్లు నిశ్చలతఁ దేలగ నివ్వెఱవోయి నిల్చెనో!
“ వనదేవతల్ రఘుమహాన్వయరత్నము లిట్టు లేడ్వఁగా
దీవలఁజెట్ల పూవులు విదిర్చి ప్రశంసలు చేసె నూఁగుచున్. 173

వ. అంత శ్రీరామచంద్రుం డిట్లనియె. 174

క. అమరేశ్వరు పూర్వాసుర సమరంబులయందు దోడి సైనికులఁట! యు
త్తము డీయనయును మత్పిత మము బిడ్డలకంటె గూడ మన్నించెగదా! 175

చ. అడవికి బంపినాఁడనని యార్తి మునింగిన తండ్రి గుండెలో
విడిలి యసుప్రతానమును విడ్చె నిరాశత నిస్సహాయుఁడై,
యడవికి వచ్చినార మను నార్తి ఖగేంద్రుఁడు తాను ఱెక్కలన్
విడిలి యసుప్రతానమును విడ్చెను మాకు మహాసహాయుఁడై. 176

చ. ఇదియు విచిత్రమై చనెడు తృప్తి ఘటిల్లెడు నాకు, నాత్మలో
మదిరవిలోచనన్ సులభమార్గమునన్ గొనిపోవలేదు వాఁ
డు దితిజుఁ,డీ విహంగ విభుఁడున్ బది చెర్వుల నీరుతాపి దు
ర్మదునకుఁదెల్పెఁ దాత, రఘురామునితోఁ పగ యున్న నెట్టిదో! 177

ఉ. ఈ విహగేశ్వరుండు నతివృద్ధుఁ డుదారుఁడు కల్పజీవి నా
కై వధియింపగాఁ బడియె నక్కట! యాబుణ మెట్లు వీఁగుదున్
నావలనం బ్రమాదపడినాఁడవు తాత! నిజంబు రాముఁడున్
జీవములేనివాఁడు కృపచెందని చిత్తము కల్గువాఁడునున్. 178

శా. రాముం డీ వనసీమ నుండుటకునై రాఁడేని, పక్షీంద్రుఁ డె
న్నో మన్వంతరముల్ మఱిన్ బ్రతికియుండున్, గట్టుకొన్నాఁడహో
రాముం డీ యఘ మెల్ల, నెంత కలుష వ్రాతంబు కావింపకే
భూమీకన్యక యిట్టులైనదియె! నాపుణ్యంబె పుణ్యంబుగా. 179

గీ. మండి యీ రాముఁడేమి రాముండ సర్వ జీవలోకపు టసువులు చేఁదగలఁడు
చల్లపడియొక్క ప్రాణం బొసంగలేఁడు చిట్టచివరకు తాత పక్షికినినైన. 180

శా. సౌమిత్రీ! భరతుండె నిక్కువముగా సంతాన మా తండ్రికిన్,
రాముం డీఖగలోకనాథునకుఁ బుత్రస్థాన మీ తండ్రికిన్
నే మన్నించి పౌనర్తు సంతతజనుర్నిస్తార మంత్రాహుతి
గ్రామంబౌ క్రతు వౌర్ధ్వదైహిక ముదారస్ఫార మాధారమున్. 181

మ. అటవీచందనదారు ఖండములలో నగ్ని ప్రతిష్ఠాపితున్
బటువీర్యున్ బొనరించి శ్రీపరివహద్వాః పుణ్య గోదా పయో
ఘటితాస్థి ప్రచయున్ బొనర్చి నియమౌఘస్నానముల్ యాగముల్
పటుమంత్రంబులఁ జేసి రార్షవనిధావర్యాప్త రేఖంబుగన్. 182

శా. అశ్వత్థంబు పలాశమందునఁ బ్రియవ్యాహాతిగాఁ బక్షిరా
జశ్వశ్శ్రేయసభావ షేర్పడ నుదంచద్రోహిమాంసంబు దీ
ర్ఘ శ్వాసంబులుగాఁగ నుంచి యిడి సర్వప్రక్రియల్ చేసి నా
కాశ్వావిష్కృతుఁ జేసినారు వసురుద్రాదిత్య సర్వాకృతిన్. 183

శా. నిత్యాగ్నిధ్రునకున్ బొనర్చినటులన్ నిర్మించి శ్రాద్ధంబు, సౌ
మత్యశ్రీనిధి రామచంద్రుఁడు కృపామార్ద్వీకధారాధ్వరే
ఖాత్యంతీనుఁడు బద్ధవస్త్రకటి దధ్న్యాంభస్సునన్ దర్పణా
దిత్యాగంబులు సేసె దైవతమహోద్దిష్టంబులున్ స్తుత్యముల్. 184

వ. అంత శ్రీరామచంద్రుండు దర్భపాణియై యుదఙ్ముఖుండునై. 185

మధ్యాక్కఱ.

యజ్ఞశీలుని దైవగతికి నవిహతాగ్న్యాహితు గతికి
విజ్ఞాపరావర్తి గతికి వృథుపృథివీదాత గతికి
ప్రాజ్ఞలోకోత్తర! పక్షిరాజ! పోవయ్య! నేనై య
నుజ్ఞ యిచ్చితి దీప్తముల కనుత్తమ నుత లోకములకు . 186

క. అని పదులు దర్భవెంటనె చనియె జటాయువు సమస్తసల్లోకములన్
తనబిడ్డయైన రాముని వినుతించుచుఁ బద్మనాభవీర్యునిఁ బ్రభువున్. 187

ఉ. అరిన వస్త్రయుగ్మముల నారనిదుఃఖములన్ రఘూద్వహుల్
వారలు నచ్చటే చదికిలంబడి పక్షికులేంద్రు నచ్చితా
ధారణిఁ గాంచుచున్ నఖధుతంబుగ బాష్పములూఁటి గుండెలన్
దీరికలేకయున్ బయలుదేరిరి కేశవవాసవుల్ బలెన్. 188

చ. మిగిలిన వహ్ని కాననసమీర సమీరితమై మహోదవా
గ్నిగఁ జెలరేగకుండ నటు నిప్పటి గాఁగమ మన్నుగప్పి, యా
ఖగపతి వ్రాలినట్టి ధరఁ గాలిడకన్ బ్రియగౌరవంబునన్
దిగిచినగుండెలన్ బయలుదేరిరి కేశవాసవుల్ బలెన్. 189

చ. అనఘులు పశ్చిమాభిముఖులై మునుతమ్ముఁడు వెన్క రాముఁడున్
జనుచును గన్నుముందునను సర్వమనస్సును వెన్కఁగా నని
స్వనముఖపద్ములై గమనవైఖరి దుఃఖము చెప్ప, నీరు చిం
దిన కనుఱెప్పలన్ బయలుదేరిరి కేశవవాసవుల్ బలెన్. 190

ఉ. సాఁగినయంత పక్షిపతి సన్నగిలన్ ధరణీతనూజ యా
భోగముపొంద నూహలను, మోహనమూర్తులు పోయిరిద్దఱున్
వాఁగుల గుట్టలన్ బథము వాయుసరిస్పవ వేగయాన రే
ఖాగిళితావనిన్ దనుజగాహితదూరపథం బెఱుంగుచున్. 191

గీ. మఱల దక్షిణంబు తిరిగి యైక్ష్వాకులు ఘోర నిబిడవృక్ష గుల్మసమితి
వ్యాళసింహ సేవితాతిఘోరారణ్య పథమునందుఁ జనిరి ప్రభువులగుచు. 192

వ. తరువాత జనస్థానములనుండి మూఁడు క్రోశములు దాఁటి క్రౌంచారణ్యముం
బ్రవేశించిరి. 193

సీ. ఇది నిట్టమొయిలువోనిది పెద్దపొధ, లోన మెఱుపునా జానకి మెలఁగునేమొ!
ఇది శుకశారికాస్పదము మౌఖర, మిందు మధురాస్య వైదేహి మసలునేమొ!
ఇది నటద్రాజబర్హిస్థాన, మిటఁ దురాషాఢశ్మకచ సీత చనెనొ యేమొ!
ఇది మహాసితమహాహి వ్యాళ నిలయంబు నిట దేవి యహివేణి యెసగునేమొ!
గీ. ఇదియుఁ గదుపుతోడ నెలమికాంచెడు పరికాఁడు నిలయ మిచట క్ష్మాతనూజ
మ్మతహంసయాన మసలునొ! యని చూచి కొనిరి పుట్టపుట్ట గుట్టగుట్ట. 195

చ. అలయుచు, నంతలో వెదకు, చచ్చట నచ్చట విశ్రమించు, చ
వ్వల కనుచూపుమేర కనుపడ్డ యెదో చలనంబు సీతఁగాఁ
దలఁచుచుబోయి కాంచుచు, నితాంతవినిశ్వసనంబు పుచ్చుచున్,
దలఁ పఖిలంబు ధారుణీసుతామయమై చరియించు చిద్దఱున్. 196

శా. క్రౌంచారణ్యము దాఁటి యచ్చట మతంగ ప్రష్ఠకర్మంది పు
ణ్యాంచద్వృక్షచయాశ్రమస్థలి సమీపారణ్య దేశంబునన్
పంచారించిన ఋక్ష వానర భయవ్యాహార ఘూర్ణంఘితో
దంచద్వృక్షకశేఖరం బగు స్థలం బంతంత వీక్షించుచున్. 197

క. కని రచ్చో నొకపెద్దలోయ యహిరాడ్గంభీర లోకాధ్వమో
యన, విస్ఫారము చిమ్మచీఁకటుల పెల్లై, దాన లోతట్టు ము

ట్టిన కన్వెల్గులత్రోవఁ జీఁకటుఁలు తెట్టెల్ కట్ట, నంతంత ద
వ్వునఁ గన్పించె మహోగ్రరాక్షసి తటంబుల్ ఘూర్ణిలన్ మ్రోయుచున్. 198

సీ. తినుచున్న మృగమాంసమునఁ బెద్దపొట్టయంచులు పూడెనో లేదొ చూచికొనుచు
అడవియీఁగలబాధ పడలేక నెత్తురు చేతఁ జింపిరిచుట్టుఁజిమ్మికొనుచు
వెనుచీడపట్టిన మనుబీడుచర్మము గోడైన యొడలెల్లఁ గోకి కొనుచు
చెడుకోఱలమొదళ్ళఁజిక్కిన మాంసఖండములు వ్రేళ్లులఁదీసి నమలికొనుచు
గీ. దవ్వుదగ్గర కానట్టి స్థలమునందు రాఘవులఁ జూచి యాత్మ ప్రశ్రయముచేత
నుఱకయుండివారలుచూచుచున్నవేళఁగో!యనుచునార్చెఁ దటములుఘూర్ణిలంగ.

గీ. అంతపొట్టతోడ నాసురి చెంగున దూఁకివచ్చి మంచుతుమ్మిపూవు
సవురుమేని వాని, సౌమిత్రి కేల్గొని మొగములోన నవ్వు మొగము పెట్టి.200

చ. చకచకఁ బూర్వపశ్చిమదిశాస్పృశముల్ సెలవుల్ చనన్ వికా
విక నగి రాఘవానుజుని విచ్చినబాహులఁ గౌఁగలించి పొ
ట్టకును సుమిత్రసూనుని జటావలయంబులు తాఁకఁగాఁ గుదిం
చుక తన మేను, లక్ష్మణునిఁజూచి యస్నుజ్నవబిందు లూఁగఁగా. 201

గీ. నీవు నాకు నచ్చితివి, వనీచరాధములు కుదైత్యు లనిశ్చితమోహు, లల్ప
సత్వులు, వికారరూపు లసహ్యమయ్యె మనము క్రీడింతమే! తెలిమబ్బుతునుక?

వ. నా పే రయోముఖిర మ్మామా! 203

రుగ్మవతి.

భూమిధరోగ్రాంభోధర సంధ్యుద్దామ గుహోళిస్థాన విఘూర్ణ
త్క్షామ మహోగ్నిక్లాంతశరీరుల్గా, మన మౌటం గాంతము రారా! 204

చ. అది తమయిద్దఱిన్ దరిసి యార్చి భుజింపను జంపవచ్చు నం
చెదఁ దలఁచెన్, వధించుటయు నెట్లును తప్పదటంచు నెంచుచో
నది చనుదెంచి కౌఁగిటికి నాఁచిన, నేఁచినదొ జుగుప్సచే
విదలిచె, లక్ష్మణుండు నెద వెక్కసపాటున సీదరించుచున్. 205

చ. ఇదియొకజాతి! చరిపుటకు నింతయుఁ గొంకరు, కామమేమొ ప
ట్టదు, నియమంబు లేదు నకటా!యిది జీవుఁడు బాధపొందునం
చెదఁ దలపోయ రిట్లె జనియింతుర! యిట్టులె చత్తురట్టె! పూ
ర్వదశయు లేదుకావలె పరంబును, ఘోరమనఃప్రవృత్తియై. 206

క. విదలిచినయంత, దానవి పడిధనువులదవ్వుమేరఁ బడీ, లక్ష్మణు దో
రుదితమహాబలవిజ్ఞత నెద నచ్చెరు వగుచు, భీతి యొసలారంగన్. 207

ఉ. నెమ్మదివచ్చి తా నెదురునిల్చి వగర్చుచుఁ జంపుకొందువా!
నమ్మిన ప్రేమశాలినిని నన్నని గొఁగిఁట బూనఁబోవ, ఖ
డ్గమ్మునుదూసి లక్ష్మణుఁడు కాల్కడుపంగను జత్తువన్న, భా
రమ్మగుకోర్కి గ్రుడ్డిదయి రక్కసి లక్ష్మణుపైకి దూఁకినన్. 208

ఉ. కత్తి విచిత్రఖేలనముగాఁ బచరించిన, దైత్యురాలిదౌ
తత్తరపాటుచేఁ జెవులు తత్కుచయుగ్మము ముక్కుసూటిగా
గత్తెరవెట్టిన ట్లయినఁ గాన విఘూర్ణితఝుంఝు వోలికన్
గుత్తుకబంటిగా నఱచికొంచును దానవి దూసిపోయినన్. 209

వ. అంత శ్రీరామచంద్రుం డిట్లనియె. 210

క. అది బుద్ధిపూర్వకముగా, నిదియు ననూహితముగాగ, నిటులయ్యెను నా
పద యేదో కలుగుటకును మొద, లసురీకర్తనంబు ముక్కుఁ జెవులన్. 211

మ. అనినన్ లక్ష్మణుఁ డట్లనే యగు ప్రభూ! అస్మద్భుజాస్పందనం
బును ఘోషించెడు, నేదియేని భయమొప్పన్ నిష్ఠురస్వాన మేఁ
చిన యచ్చోటు తినాసచెట్టుపయిఁ గూసెన్ బక్షి, సజ్యంబుగా
ధను వాకృష్టము నుంచుకోవలయు, నధ్వప్రశ్రయాపాదిగా. 212

గీ. ఒకటి సీత యెచట నున్నదో తెలియమి, రెండు పక్షిరాజు మృతిని గనుట
మూఁడు రామచంద్రమూర్తి దుఃఖస్థితి, నాల్గు బుజము స్పందనంబు గాఁగ213

శ. సమ్మర్దక్షమబుద్ధి యెంతకలిమిన్ సౌమిత్రి భావమ్ము భా
రమ్మై సజ్యధనుష్కుఁ డౌచును వనీరాజిన్ దిశాలగ్న నే
త్రమ్ముల్ గాఁ జనుచుండి, యూరకయధైర్యంబై చనంగా, మహో
గ్రమ్మై భీషణ రావమొక్కఁడు దిశాక్రాంతిన్ విడంబింపఁగా. 214

చ. ఒకరికి వెన్కగాఁ జనుచు నొక్కరు, నిద్దఱు ప్రక్కప్రక్కగా
నొకరొక రంతలోనఁ జనుచున్నటులుండి, మఱింత యప్రయ
త్నకచలనంబుతోడి గమనంబుగఁ దోఁచి మహాసరిద్భ్రమీ
చకితపదార్థవిభ్రమిత చంక్రమణంబును బొందినట్లుగన్. 215

మ. జడిగా ముందెచటో ప్రపాతభరమై శైలాంచలంబందు దూఁ
కెడు శైవాలిని వేగమందుకొను నాకృష్టోగ్రధారాంబులన్
నడిపాయం బడిపోవుచున్నటుల, నన్నాదమ్ములంతన్ దనూ
జడులై యెక్కడికేని లాగబడుచుం జన్చున్నయట్లై పారిన్. 216

చ. కొనకొని కన్నులం బొడుచుకొంచును గన్నున కాననంత ద
వ్వునఁ బరిశీలనంబుగను బుట్టునో యంచు నిమిత్తబీజముం

గనుచును దవ్వు లాగఁబడఁగా, నిదమిత్థమటంచు నేర్వరిం
వనిదగు చిత్రమై చను, నమానుష మానుషరూపరూపమున్. 217

శ్యేని.

ప్రక్కబల్లయైన బర్వతంబునన్ జెక్కినట్టి దైన చిత్రమో యనన్
ముక్కు మోము నోరు పొట్ట లోపలన్ జిక్కి యున్న యొక్క చెట్టరూపమై.

మత్తాక్రీడ.

నానావన్యాఘోరాకార నత మృగపలల ఘనశకలములు దం
ష్ట్రానిష్పీడంబై పెల్చన్ గటకటలుగఁ బ్రచటుల రవములునుగాన్
దోనెంబోలెన్ విప్పారి కుక్షిc దుకతుకలగు ముఖదురిత వమదసృక్
గ్లానిం గంతారావాభీలఘటిత వనప్రళయ వికృత కృతాకృతిన్. 219

అగ్నిజ్వాలాసంకోశోగ్రమగు నొసలున వెలిపయిన కనుబొమల్
భుగ్నోద్యత్పక్ష్మధూతము కనులను నెఱపుచు నెఱరసనన్
నగ్నోగ్రవ్యాళీపుచ్ఛాగ్ర నమన ధునన నటన ఘటనమును గా
మగ్నాంహోరేఖారూపంబు మసలుదనుజు మసలిన పొడయునుగా. 220

భోగివిలసితము.

మోమొక పదిపాములావృతి క్లోమము విషభీగురుల్ తలల్
భీమరహితములై వెలింఘుర ట్టామిషగతి చుట్టచుట్టెనో! 221

ఉ. తాదృశమైన రూపము నుదారమతిం గనిరాఘవుల్ బళి!
యీ దనుజుండు చిత్రమగు నెంద్రికరూపముఁ దాల్చియున్నవాఁ
డాదివిధాత సృష్టి వికటాద్భుత మంచనుకొంచు నుండగా
నా దనుజుండు క్రోశఘటితాత్మకరంబుల నాకృషించుచున్. 222

గీ. హస్తకార్ముకఖడ్గులు నభ్యమిత్ర్యు లుగ్రహరిదశ్వతేజు లనూహ్యశౌర్యు
లన్నదమ్ములు వివశులై రసురచేత మహితతరశక్తి నాకృష్యమాణు లగుచు. 223

భూనుతము.

ఘాతకర్మమున గండరగండఁడు రాముం డాతతాయికృతి కచ్చెరువందఁడు ధీరుం
డూఁతలేకయనుజుండువయోల్పుఁడు మూర్ఛాభీతబుద్ధితనువెల్లనుబిమ్మిటిపోవన్.

శా. అన్నా! యుక్కిరి బిక్కిరైతి విలయవ్యాధూతపాథోనిధిన్
వన్నుంజూడుము! కాలుసేతు లిసుమంతం దీయఁగా లేవ, యీ
వ న్నాలోచన చేయకే విడిచిపో! నాగోరుభోగోగ్ర మా
పన్నుంబీ వికృతాసురాగ్రకరసంఛన్నత్వముం బొందకన్. 225

మానిని.

తాత జటాయువు చెప్పిన యాదెస దారిని తప్పక పోవలయున్
సీత జగత్పరిపూత శుచాహత శ్రీపతి వీ వరుదెంతు వటం
చాతతమైన ప్రతీక్షను నిల్పును ప్రాణసమూహము శౌర్యనిధీ!
వే తుజుగై చనవయ్య ప్రభూ! దనువీరుని చేతుల కందకయే. 226

విచికిలిత.

ప్రభువు వదినె యిరువు రడవిఁ బడిరి కలుచ యెచటొ వ
ల్లభత నడవి నెసఁగు నెదరులను తొలతు నని తలఁపన్
ప్రభువు కరుణ కలుగ్క దకట! సరగఁ బుడమితనయ దై
త్యభయగిళిత యయినతఱిని నకట! యిటుల జరిగెఁబో! 227

క. తప్పించుకపోవయ్యా! యప్పుడమితనూజ గొంచు నరిగి యయోధ్యన్
జప్పరముల విహరించుచు నప్పుడపుడు తమ్ము నెంచుమా! నీ దాసున్. 228

గజవిలసితము.

గ్రీవము మస్తకంబు కెడపిన గతి నెసఁగున్
గ్రావము ఱెక్కలొప్ప కరణి కరము లలరున్
రావము నేల వ్రీలు రమణ గగన మొరయున్
దావము పేర్చినట్లు దళముకొనెడు నెఱచుల్. 229

వ. అంత శ్రీరామచంద్రుండు మదిలో నిట్లు తలంచె. 230

క. ఎడతెరిపిలేద వనమునఁ దిడిమితిడిమ్ములును తిండిత్రిప్పలు లేకన్
పడఁతి కడ లేని యెడబాటెడిసిన యీ వేళ నిన్నియిన్నాపదలున్. 231

క. నేనేమొ ప్రేమచేతన్ బూనిన రిపుఘాతములకుఁ బోనీయమియున్
నే నున్నానని ధైర్యము తానై తనమీఁద నిలుచు ధైర్యం బురలెన్. 232

మ. తన బాహాబల మెట్టిదో, తన యుదాత్త ప్రౌఢదివ్యాస్త్రశా
సన మేపాటిదొ, దైవశక్తి నెదిరించంజాలు తా నెట్టిఁడో!
యనయంబున్ బెడఁదల్ ఘటిల్లుట కధైర్యం బందె, సీతావియో
గనతున్ నన్నునుజూచి యెక్కుడగు దుఃఖక్లిన్నమౌ గుండెతో. 233

వ. అంత శ్రీరామచంద్రుండు సౌమిత్రితో యిట్లనియె. 234

గీ. నేను రాజును నీవు మంత్రివిని, మంత్రి మంత్రబలమిట్లు నడలిన మహిపుఁడేమి
యగునొ!యెట్టిక్లేశంబునయం దునైన మహిపురక్షించునది మంత్రిమంత్రబలము.

వ. అంత ననూరుఁ డశిరోగ్రీవుఁడు క్రోశబాహుఁ డుదరముఖుఁ డేకాక్షుఁడు దనుజుఁ డిట్లనియె. 236

క. ఎవరయ్యా! మీరిద్దఱు నవరజుఁ డతఁడే వివేకి, యస్మన్ముఖమృ
త్యు వివరముం జొచ్చియు ధైర్యవచన మనువానికన్న ఁదా నీ కన్నన్. 237

క. సన్నని నడుములు, మిక్కిలి ప్రన్నని యురములును,తూచిపంచిన శోభా
సన్నావయయములును మధురాన్నంబులు మీరు మోహనాననరుచులై. 238

ఉ. కట్టినతూణులున్ సుదృఢకార్ముకముల్ వినిబద్ధవర్మముల్
పట్టిన ఖడ్గముల్ సురసభామహితాకృతు, లిట్టిమీరు నా
పట్టున కేగుదెంచితిరి, బ్రహ్మకునైనను క్రోసుదవ్వు నా
పట్టు వదల్చుకో ననువుపట్టదు, బెట్టిదమైన నా క్షుధన్. 239

చ. పని యదియేమి యిచ్చటికి వచ్చితి రథ్యముతప్పి, కాకులా
డని దయినట్టి కాఱడవి డాఁగురుమ్రుచ్చులు సొఁగవింక రా
జును మఱి మంత్రినిద్దఱును జంగపుముద్దలుగాఁగ నింత తీ
రని రుచి పుష్పబాణజహరాణములన్ మిము మ్రింగి తీర్చెదన్. 240

శా. రాముండున్ మొగమెండ, నాల్కతడియారన్ గన్పిభల్ డిందఁగా
సౌమిత్రిం గని యిట్లుగాఁ బలికెఁ గృచ్ఛ్రాత్కృచ్ఛ్రమీ మృత్యువు
ద్దామంబై చనుదెంచె, నాధరణిజాతం గాననే లేద, నీ
వేమో నాకును గుండె జాఱితివి నా యీ యెల్లధైర్యంబవై. 241

క. కాలము బలవంతము దోఃకేళీపరమేశ్వరులము కేవల మేమున్
బాలుఁడ వీవును చూడుము కాలవశుల మగుచు వాలుకాసేతువులై. 242

చ. అని తనలోనఁ దాను ప్రభువై కృతనిశ్చయుఁడౌచుఁ దమ్మునిం
గనుగొనుచున్న నగ్రజునిఁ గాంచుచు, లక్ష్మణుఁ డున్నయట్లుగా
గనుగొనలందు తైక్ష్ణ్యమునుగాఁ బెనువిప్పగఁ గత్తిమీఁది కేఁ
గిన యహిరాట్ఫణాసదృశకిష్కువుగా, నిలుచున్న యంతటన్. 243

శా. దైత్యుం దూర్జితపాణిబంధ సముపాత్తప్రౌఢకృష్టిన్ సమా
గత్యాధ్యానపరంపరా విముఖతా గౌరాస్యులై నిల్తు రే
లా! త్యక్తాసువు లేమిలాభము క్షుధాలాస్యోగ్రజిహ్వోరుచి
స్తుత్యాన్నంబుగఁ గందు! శీఘ్రమనియంచున్ లాగికోఁబోవఁగన్. 244

క. తామ్రాననుఁడై లక్ష్మణుఁడీ మ్రుక్కిడి మద్దిదుంగ యెవఁడగ్నిశిఖా
ధూమ్రాకృతి రఘురామునిఁ దా మ్రందించుటకు దనుజదైతేయారిన్. 245

చ. నలువుగఁ దాడియెత్తయిన నాఁటి విరాధుని మింటిలోపలన్
నిలచి భుజానికృంతనము నెట్టన చేసితి మిప్పు డక్కటా!
యిలపయి నిల్చియుండి యిది యేమధికంబగు? వీని దుష్టబా
హులు కుడి నీవు, నే నెడమయున్, యుగపత్క్రియఁ జీల్తముర్విపా! 246

క. తలలేదునఱుక, మొండెము పొల, యాయువుపట్టు తెలియఁబోలదు, కుక్షి
స్థలవదనము క్రుమ్మినచో విలవిల చేతులను జమరి వీఁగ ననువౌ. 247

మ. అను సౌమిత్రి వచోనిబంధనము విం చా బొమ్మరాకాసి, కో
పనుఁడై వ్రేలెడు లేవు నీవొకఁడు, మద్బాహాల్ విదారింతువే!
కనుమీ గీరుకపోవునేమొ నఱుకంగా జాలుదే! రమ్ము ర
మ్మని హస్తంబులఁబట్టి కుక్షిముఖసామీప్యంబునం జేర్చుచో. 248

గీ. అంగహీనుల మెయి వికలాంగముల బలమ్ము సైతమును నవికలమ్ములైన
యంగములయందుఁ జేరు దద్దస్తములును నంసచాలన దుర్ఘటమాంసలములు.

ఉ. చేతులుసూటిగా మొగము చెంతకు చేర్పనులేఁడు వాఁడు మో
చేతులపైని కండలను జేరిక కల్గదు నోటిదాఁక, ముం
జేతులు పొట్టి రాఘవులచేరిక తద్భుజమూలదేశ సం
ఘాతము వీలుగానయిన ఖడ్గమహాశనిపాతమై చనెన్. 250

గీ. వారు నఱికెదమనుటయు వానికనులు తెఱచియుంటయు నఱుకుటతెలిసెఁగాని
మఱువిలిప్తను గలిగిన మరణబాధ వఱకుఁ దత్పూర్వలిప్తదుర్భరము తెలియ.

మ. గిరిఱెక్కల్ దళనంబు చేసెనన నాకేశుండు సుల్వైనదే
పొర లీఁకల్ తనరారు మెత్తని యెడన్ మోపెట్టె వజ్రంబు వా
దర వాలేర్పడ వచ్చు దైత్యపతి హస్తప్రోహయుగ్మంబు ను
ద్ధుర గోత్రాచలగూఢగాఢ శిఖరస్థాలోపలాభంబులున్. 252

వ. మహోర్ఘుంర్ఘుకు సమూలంబునేలవ్రాలి నికృత్తశాఖమైన మహావృక్షంబువోని యయ్యసుర. 253

చ. తన తొలిబాధ కొంచెముగఁ దగ్గినయంతన, నేక నేత్రమం
దున నతిదీనభావమును దోఁపఁగ మీ రెవరయ్య! యంచనన్
వినుచు సుమిత్రబిడ్డ, రఘువీరుని రామునిఁ జూచుచుంటి వీ
వును మృతివేళ నల్లవిసెపూవు జగాజిగి కన్ను వెల్గులన్. 254

శా. నేఱాపట్టునఁ దండ్రి దౌపలుకు సందిగ్ధం బసందిగ్ధముం
గా జేయుం, బినతల్లి మాటయును వక్రంబున్ ఋజుత్వాప్తిగా

దేఱుం, ధర్మశరత్సరిద్విమలమూర్తిం బొల్చి, రాకాసులున్
దీఱున్ వధ్యశిలావితర్దిక నవాధేయుండు బ్రహ్మస్థితిన్. 255

మ. చెలువన్ దమ్ముని నన్నుఁగొంచిటకు వచ్చెన్ మ్రుచ్చుతానెవ్వఁడో
తెలియన్‌రాదు హరించె జానకిని శ్రీదేవిన్, దదన్వేషణా
ర్థుల మీ దక్షిణదిక్కుగాఁ జనుచు నీతో రాయిడింబొంది చే
తులకుం గల్పనచేసికొంటిమి పనిన్, దోణాము సా మట్లుగన్. 256

వ. అనిన నద్దనుజుం డిట్లనియె. 257

క. నా బాహువు లివి యేమీ! మీ బాహుబలం బిదేమి! మే లొకవ్రేటే
నా బాహుగాఢపర్వమహాబంధము వ్రయ్యలగుట యద్భుతముకదా! 258

ఉ. ఏ ననుకొంటి న్నో ప్రభువ! యీవరుదెంచితి వంచు లక్ష్మణుం
డీ నవబుద్ధి తర్కపటు వెట్లను దా నఱుకన్ భుజంబులన్
దీనిధి చెప్ప నంచును మతిం దలపోసితి, నట్లు చెప్పిన
ట్లైనది యీ యభీప్సితము స్వాగతి స్వాగతి! మీకు నో ప్రభుల్. 259

ఉ. రూపముచేఁ గబంధుఁడను, రూపముచేతనె పేరునయ్యె, నీ
రూపము చేతులార నతిరూక్షమతిం బొనరించుకొంటి, స్వా
మీ! వెనుపొంది మున్ జలజమిత్ర హిమాంశుల వంటిదైన నా
రూప మహో! కబంధమగు రూపముగాఁ బొనరించుకొంటినే! 260

ఉ. పక్ష్మములార్చి రామునిఁ గబంధుఁడు పుల్కనఁ జూచుచుండఁగా
లక్ష్మణుఁడోయి! మొండె మవులా గెటులైతివి? యందులోన నీ
సూక్ష్మతరోహవైఖరియు సొంపఱకుండఁగ నిల్చె, రాముఁడున్
లక్ష్మణుఁ డేమనన్ దెలియులా గెటులైనది తెల్పవే! యనన్. 261

వ. కబంధుం డిట్లనియె. 262

శా. నా కెన్నాళ్ళుగనో విచిత్రముగ నన్నా! లక్ష్మణా! పట్టఁగా
రా కొక్కండగు నూహ యుండెడిది, సర్వంబైన యీసృష్టి జం
త్వాకారంబులు ముద్రవేసినటులై యా మొండె మాపై శిర
స్సీకాళ్ళున్ కరముల్ మఱిట్టటుల నం, చెంతేని హాస్యంబుగా. 263

మధ్యాక్కఱ.

తలలోనఁ గన్నులున్ నోరు, తమిరెగాఁ దలయు మొండెమ్ము
కలుపఁగా నిట నింతమెడయుఁ, గాళులు కరము లట్టిట్టు,
తలఁపఁగా నిదియింతగు వికృతపుబొమ్మతన మెల్లఁ బంట
పొలములఁబెట్టిన దృష్టిబొమ్మలపోలికై తనరు. 264

కాలుసేతులును గాలికిని గదలాడఁగను గుడ్డసంచు
లో లక్ష్మణా! హాస్యమయిన యూహా సముద్భవం బయిన
నీలోభిమానవకోటి యెసలారు నెసకంబు చూప
వ్రాలి నే నిట్టిరూపాన వనములోపలఁ గనంబడుచు. 265

చ. కులములఁ గందమూలములకోసము దర్భలకోసమున్ వనా
వలిఁ దిరుగాడునట్టి ఋషిబాలకులన్ ఋషులన్ విభీతనే
త్రుల భయపెట్టు చియ్యటవిత్రోవల క్రేవల దగ్ధకోటరం
బొలయు నపత్రశాఖమగు నుర్విరుహంబున స్కంధమో యనన్. 266

గీ. స్థూలశిరుఁడన్న యొకఋషి చూచి నన్ను నిట్లె యయ్యెదవంచును నెగచి తిట్టె
అతనితలలావు సూక్ష్మశిరోభిమాని మఱియుననుఁజూచి యశిరోభిమానినన్ను.

క. కడు నతని యూహవెంబడిఁబడి బతిమాలితిని జాలిఁబడి, తిట్టునకున్
విడు పనియె, నరసురాకృతి బెడఁగగు రూపంబు చూచి, భీషణవనిలో. 268

ఉ. ఆయనచెప్పె శ్రీరఘుకులాన్వయదీపము రామచంద్రుఁడౌ
రా యరుదెంచు సౌమ్యసుభగాకృతి లక్ష్మణుతోడఁ దమ్ముతో
నాయన మంటలోనిడిన యప్పుడు నీదగు దుష్టదేహమున్,
నీ యమృతాంధసం బయిన నిశ్చితరూపము వచ్చునం చనెన్. 269

మ. అనినన్ లక్ష్మణుఁ డాతఁడన్నది సరే! యా నీ దురాకారవున్
మును గ్రౌర్యమ్మది నీకు లేదును మహమ్ముంబొంది యీ కానయం
దునఁ జన్నట్టి సమస్తజంతుతతిఁ జేతుల్సాచి భూమీ ధరా
గ్రనిపాతోగ్ర ఝరీభ్రమీచటుల వేగం బెట్లుగా వచ్చెనో! 270

శ. నీ యాకారము చూచినన్ సహజమై నీ విట్టు లైనట్లుగా
నే యంశంబునఁదోఁచ, వందదుకులై యుందందుఁ గ్రుమ్మంబడం
గా యూషాకృతివైతివం చని నగంగా మెల్ల సౌమిత్రి, య
ట్లేయైనాఁడఁ బురాతపోమహితుఁడై యే నింద్రియప్రాజితన్. 271

ఉ. దానవిధాత మిక్కిలి ముదంపడి నాకు జిరాయు విచ్చె మ
న్నానని యింత నా యొడలు నాకు నెఱుంగఁగ రాక యింద్రు వ
జ్రానకు నడ్డుగా మెడను జాచితి నాయన కోపమంది సం
లూనము మస్తమున్ గళములోనికిఁ ద్రోచె మొగంబు కుక్షిగా. 272

ఉ. సక్థి యుగంబు వెల్లురిమి, జానువు లడ్డముగా మలంచి, మై
సిక్థపు ముద్దగాఁ జమరి చెందిన తొల్లిటి రూపుగాఁగ, నా
సక్థులు జానువుల్ మడమసంధులు గుండగఁగొట్టె, మత్తపో
రిక్థముచేతఁ బ్రాణము హరింపఁడు బ్రహ్మవచోవిధేయుఁడై. 273

శా. అవురా! కాళ్ళును జేతులాడఁగఁ దనూయాత్రావిధుల్ దుర్ఘటం
బవు వక్త్రోదర మంటి యిట్లుతిని యిట్లెజీర్ణ మింతింతతీ
రవు క్షుద్దాహము లక్కటా! బ్రదుకు దీర్ఘంబయ్యెఁ బెన్నాళ్ళఁ జం
పవు, నాకన్నము త్రోవచెప్పి బ్రదికింపంజూడవే! నావుఁడున్. 274

మ. మరియుం గోఱలు, క్రోశదీర్ఘ కరయుగ్మం బీ సమాకర్షణో
ద్ధురమౌ శక్తియు నిచ్చి, నీవయిన చేతుల్ రాముఁడున్ లక్ష్మణుం
డురు బాహాసముదీర్ఘ లక్షణులు శాంతోగ్రుల్ జగన్నాథులున్
నరుకంగల్గిన నగ్నిసంస్కృతియు నంతంజేయ, శాపాంతమౌ. 275

క. అని చనియె, హరిహయుండునుమునులును నొకకట్టు మనుజమోహనమూర్తీ!
మునులనుకొంటిని మిమ్మును, నినకులులకు మునులవేస మేలనుకొంటిన్. 276

శా. పైఁగాఁ దొల్తటి చన్ననాళ్ళుల, దురాపంబైన మీ యాగతిన్
వ్రేఁగై చూచి నిరాశచెందితిఁ బ్రభుల్ విచ్చేయ, రింద్రుండు న
య్యోగీంద్రుండును కన్నునీర్తుడువ నా కుల్లేఖముం జేసి రం
చాగుబ్బైన ప్రతీక్షచేఁ గటికటాయైతిన్ క్షుధాయంత్రమై. 277

సీ. సింహంబు కావచ్చు జిఱ్ఱులాడుచు వచ్చు వనవరాహమ్ము కావచ్చు స్వామి
తృణమైనఁ గావచ్చుఁ దిందుకాశోకచంపకవృక్షవితతి కావచ్చు స్వామి
శ్యేనంబు కావచ్చుఁ జిరజీవి దాత్యూహబకకోకములును గావచ్చు స్వామి
ఖడ్గంబు కావచ్చుఁ గపి సృగాల లులాయ భాలూకములును కావచ్చు స్వామి
గీ. నాకుఁ బదిక్రోశములను మింటను ధరిత్రి భూతసంతాన మాకృష్టముగ నొనర్చి
యెవరొ చేతులు నఱుకఁగా నెదురుచూచి, చేతకాని మృగాళి భక్షించుచుంటి.

చ. చివరకు రామలక్ష్మణులె సీవిరికల్వలు మంచుతుంపురుల్
చివురులు ముగ్ధసంచర దుశీరసమీరకుమారమూర్తు లం
ధువు వెనులోఁతు త్రవ్వినను నూల్కొను కొబ్బరిపాలవంటి నీ
రవిసినయట్టి పెద్దజలలై చనుదెంచితి రీరు మీరలై. 279

చ. చిలిపితనంబుగాక యది చెట్టగు కార్యమె, మద్దిదుంగ కం
పిలుగతి నంతనింత భయపెట్టినఁ దిట్టుదురేమి యింతగా
కలుచ సురారి ధాత్రిసుతఁ గైకొని పోయిన దారి చెప్పఁగా
నులుకగు మీకు నన్నిచట నుంచిన వైఖరిగాక రాఘవా! 280

క. ఆయింత యగ్నికార్యము శ్రీయోగ్యవిశాలవక్ష! చేయవె నాకున్
మీయందున సాచివ్యము చేయఁగ నున్నయది యద్ది చేసెద స్వామీ! 281

వ. అనిన శ్రీరామచంద్రుం డిట్లనియె. 282

ఉ. రావణుడంట రక్కసి! ధరాసుత దొంగిలిపోయి వాఁడెవం
డో, వసియించు నాత డెచటో, యతగాని ప్రభుత్వ మెట్టిదో,
యా వయినంబు చెప్పి నను నాదుకొనం గదవయ్య! నిన్ను జే
జే వలె మ్రొక్కెదన్ మృదుసుషీమ దయారస వాక్సుధాఝరీ! 283

శా. నా కాశ్చర్యముగాగఁ దోచెడుఁ గబంధా! మిత్రమా! నీవలెన్
నాకారుల్ పదిమంది చచ్చిరి సుమీ! నాచేత, వారందరున్
నాకున్ మేలు వచించి, రట్టులనె యన్నా వింతగా మంచివాం
డ్రే కానంబడి యేల రాక్షసులుగా నిర్లైరో! చిత్రంబగున్. 284

ఉ. ఈ గతి దిక్కులేక చరియింతును నాయెదలోని దీపమా
హా! గురుభారమయ్యె హృదయంబున జానకి లేకపోయి, నా
చేగ నమస్త మయ్యతివ చేసిన ప్రేమబలంబు, సీత తా
నేగతి నేఁగెనో తెలుపవే! యిది నీకును నెంతపున్నెమో! 285

చ. అనినఁ గబంధుఁ డిట్లనియె, నగ్నిక్రియం బొనరింపు, నాకుఁజెం
దినదగు శాపపాపమున నిల్వదు చిక్కని యాత్మబోధ, వెం
పునఁ దగునై జమౌ తనువుపొందిన నా తొలినాఁటి తెల్వి వ
చ్చున, వచియంతు సర్వమును క్షోణిజ నీకు లభించు మార్గమున్. 286

మధ్యాక్కఱ.

అతనికిఁ దెలియనిదంచు నఖిలలోకాంతంబు లేద
యతఁడు సర్వజ్ఞశేఖరుఁడు నఖిలగుణాశ్రయుఁడతుఁడు
నతనికి నీకు సఖ్యంబు నయ్యెడునట్లు చెప్పెదను
చితి పేర్చి మఱియు నన్నందుఁ జేర్చి యీ చెడురూపు మాపు. 287

చ. అలఘుజగత్త్రియీ వృషలతాంత, మొకానొక లోకరక్షణా
కలితుఁడు మన్నవేళ సమకాలికుఁడై మనుటే యదృష్ట, మా
యలఘునితోడ సంగతియునై నెడ నెంత యదృష్టమో! మఱిన్
దలకు నతండునై కొఱవితార్చినఁ బున్నెము నేమి చెప్పనౌ! 288

చ. నానాకార్యపథంబులన్ బహుముఖీనంబైన యాలోచనా
నూనంబౌ ప్రతిభానిధానము సుధాంధోమూర్తి సౌమిత్రి, య
క్కానం దావభయంబు పుట్టనియటుల్గా, లోయలోతట్టు శ్వ
భ్రానన్ హస్తినికృత్త శుష్కవిటపవ్రాతంబు సంధింపఁగా. 289

క. మొండెము రక్కసి పొరలుచు గండి ముఖమునందుఁజేరి కాష్ఠాగ్రశయా
నుండయిన లక్ష్మణుండును మండించెను గాష్ఠవహ్నిమండల మొలయన్. 290

ఉ. కాన సమస్తజంతు పలఖాదనపీవర దేహమాంసమే
దో నివహద్వసానిబిడదుష్టము తైలవిమిశ్రితంబు నౌ
వాని శరీరయష్టిఁబడి వారిన బిందులు చుంయిచుంయిమం
చూనిన వహ్ని కాష్ఠపు రుచుల్ చిమిడించెను ప్రక్కప్రక్కలన్. 291

ఉ. నే నిదిగో! యటంచు గగనేచరుఁ డొక్కఁడు పిల్చె మింట, సం
ధ్యానిభృతాంశుముగ్ధ కనకాంచితభూషణ సంధి బంధుఁ డు
ద్యానలతాంతతాంతరుచిరాంగక కాంతిసమేతుఁ డార్జవా
స్థాని, కిరీటి, కుండలి, విదగ్ధ కబంధవిముక్తతేజమై. 292

క. అన్యోన్యసపర్యా మౌళిన్యస్తాంజలులు మనుజలేఖపతులు స
ఖ్యాన్యాయనేత్రసుషమా ధన్యాకృతు లగుచు సముదితప్రశ్రయులై. 293

వ. కబంధుం డిట్లనియె. 294

ఉ. స్థూలశిరస్త్రివిష్టపపతుల్ శపియించిన నాఁటనుండి లో
లోపల, రామనామజపలోలుపుఁడై వెలికేమొ రక్కసిన్
పోలిని లోన సిద్ధమతినై భవదీయసమస్తదివ్యగా
ధాలహరీపయోమిళ దుదన్వదపోపురుషుండనైతినే. 295

శా. ఉర్వీకన్యక రావణాపహృతయై యున్నాదిగా, నీకథా
సర్వస్వంబును దైత్యరాడ్వ్యథయు నీసఖ్యంబు సుగ్రీవుతో
సర్వంబున్ గనులాడు చిత్రకవిధాసంపన్నమై తోఁచు నే
యుర్వీనాథులకున్ షడంగములలో నుద్వేలమౌ సఖ్యమున్. 296

క. ఏకావస్థాగతులగు మీకును మీకును సమార్థ్రమేళనమగుఁ దా
నా కపిరాజును దార వినాకృతుఁ డవ్వాలిచేఁ దన సహోదరుచే. 297

ఉ. అతఁడు ఋష్యమూకగిరియందు వసించును, పంప కా కుభృ
త్తాతలిగట్టు, నల్గురు సహాయులు వానికి వానరుల్ సదా
ప్రీతుఁడు సత్యసంధుఁడును వీరుఁడు బుద్ధిమదగ్రగణ్యుఁడున్
చేతమునం దధర్మమును చెందఁడు శౌర్యపయోధి రాఘవా! 298

ఆ. వాలి నేల వీడఁ దోలె సుగ్రీవుని నతనిదైన క్షేత్ర మాక్రమించె
నినకులేంద్ర! పరుల కెంతటి యుపకార మాచరింతు మంత యగును మనకు.

ఉ. చాల కృతజ్ఞబుద్ధి కపిచంద్రముఁడాతఁడు రామచంద్రుఁడా!
పోలిఁ గృతార్థుఁడయ్యు నకృతార్థుఁడెయయ్యు నతండు నిచ్చలున్
మేలొనరించు, నాతఁడు సమీహిత జీవహితాత్మబుద్ధి య
య్యాలునుబోయి పోయియు నిజావని సర్వహితంబె చేసెడున్. 300

గీ. బుక్షరజసుని క్షేత్రమం దినునితేజు నిహితమై సర్వమహిమలు నెగడువాఁడు
నెన్న సుగ్రీవునకు విదితేతరంబు ముజ్జగంబుల నున్నట్లు పోల్పలేను. 301

చ. కపటములేని మైత్రి యొసకంబుగఁజేయున యగ్నిసాక్షిగాఁ
గృపణుఁడు సూర్యసూతి, నిను గేవల మాత్మగ నెంచు, నర్దెసల్
నిపుణులఁ బంపి ధాత్రిసుత నిర్చినచోటు నెఱింగితెచ్చు, న
గ్రపులకునెల్ల మించిన విశారదుఁ డెన్నియొ యన్ని మాయలన్. 302

గీ. అతనితోఁ జెల్మిచేయఁగా నంతదవ్వు నరుగవచ్చున, యెంతద వ్వతఁడుకోరు
ప్రథిత వానరజాతి కారాధ్యుఁడతఁడు కోపి వాలి ప్రజారంజకుండు గాఁడు.

వ. అని కబంధుండు పంపాతీరకాననవర్ణనా పురస్సరముగ శబరీనివసన మతంగాశ్ర
మయుక్తంబు సుగ్రీవగుహాపర్యంతంబు మార్గముపదేశించి ప్రయాణోన్ముఖుండై
రామచంద్రా! యన వారు కబంధా! యన నతని హంసప్రఖ్యంబు విమా
నంబు తెలితార యగువఱకు, వీరు తులసి మొక్కలగువరకుఁ జూచుచుండి
రంత రాముండు లక్ష్మణునితో నిట్లనియె. 304

మ. పదమూఁడేఁడులు నేను తేఁడననుచున్ భావంబు లేకుండగా
బ్రదుకన్, నేఁటికి నేను రాజననుచున్ భావంబు కల్పించె, నీ
త్రిదివౌకోమణి నీవు మంత్రివిని ధాత్రీశుండ నేనున్ సుహృ
త్పద మాతండగు నాలుగంగములునుం దత్ప్రాపణీయంబులౌ. 305

వ. అంత శ్రీరామలక్ష్మణులు కబంధోపదిష్ట మార్గంబున. 306

క. నిశయందుఁగాక రాముఁడు విశదంబుగఁ బట్టపగలె విచ్చేసెను బా
లిశమగు దైత్యుని దుష్కృతిఁ గృశతను బూల్చిచ్చి చూచె నిరుదెసల లతల్.

సీ. పడమటి దెసఁగాఁగ వ్యాపించి ముగ్ధ మోహనములు జంబూప్రియాళ పనస
తిందుక న్యగ్రోధ తిలక చూతాశ్వత్థ కర్ణికార ప్లక్ష కాకనాసి
నాగవృక్షాశోక నక్తమాల కదంబ కరవీర కాగ్నిముఖ్యక సురక్త
పారిభద్రానేక బహుపాదపంబుల వనరాజి వీక్షించి భ్రాతృయుగము
గీ. కొన్ని వృక్షములెక్కియుఁ గొన్నివిఱిచి పండినఫలవ్రజము లక్ష్మణుం డొసంగ
నాలుకకుఁ దీపి యనిపించి నలిననేత్రుఁడచ్చెరువుపొందె ధాత్రిసారాత్తబుద్ధి. 308

సీ. దానినిదాఁటి సంతానభూరుహములు నేలకు వచ్చెనా నెగడునదియు
నుత్తరకురు భూములోయన నొప్పారు నదియు, నెచ్చటిచెట్టు లంతనంత
ననుకొన్నఫలముల నందిచ్చునో, తేనెకాల్వలుగట్టునో కారు లాఱు
తమకు వశ్యమనంగఁ దనరునో, మేఘపర్వతసన్నిభంబులో వనము నట్టి

గీ. దానిఁ గనుగొని వివృతనేత్రములతోడఁ గొన్ని వృక్షములెక్కియుఁ గొన్నివిఱిచి
పండినఫలవ్రజము లక్ష్మణుం డొసంగ నీ రుచికి సీత లేదటం చెంచె స్వామి.

గీ. అట్లొకనగంబునుండి నగాంతరంబు నట్లొక వనంబునుండి వనాంతరంబు
చంక్రమణశీలులైన రాజద్వయంబు బడలుపడి చేరినారు పంపాసరస్సు 310

మధ్యాక్కఱ.

ఈవాయువుల యింతయింత హేలాత్వగింద్రియతర్ప
ణావేలమగు శక్తికలిమి యనుభవవ్యాపృతి లేద!
శ్రీవిస్ఫుటమ్మగు సంతరింపు స్ఫురించె జతుర్ధ
మౌ వైజయంతికవోని దది యెదో యద్భుతగుణము. 311

శా రాగాలాపన చేసినట్లులు స్వరప్రస్తారసంయోజన
ప్రాగల్భ్యంబుగఁ గూసెడున్ విహగరాడ్వారం బుదాత్తస్వరా
ళీ గంభీరమనోజ్ఞ మందరమృదు క్లిష్టస్వరంబుల్ లయా
భోగజ్ఞానము కల్గియున్న యటులన్ ఫుల్లశ్రవస్స్వాదులై. 312

సీ. ఎటుఁజూచినను నైన నట నీటిపడియలు తరురాజిగుల్మలతాసమృద్ధి
తరుగుల్మలతలమొదళ్ళలోఁ బడియల నిగిడి జాల్వారెడు నీటిచాళ్ళు
తరుగుల్మలతల చంద మ్మెండుపండాకు పొడలేని పచ్చనిపొలుపు మెలపు
నీటిచాళ్ళలలోన నెగయుచుండిన బాలశఫరీ తనూకాంతిచంక్రమణము

గీ. మృదురవంబుల తుమ్మెదకొదమపిండు తళుకు లీను సీతాకోకచిలుకపిండు
చెవులకుం గన్నులకు మింటిచేరునైన సీమ ప్రాణమ్ములకుఁగూడఁ జేరునయుగ.

చ. అనధికమౌ తరంగములు నా లఘువారియు నొడ్డునందు నే
చిన తరురాజియున్ ఖగవిశేషములుం గని, పంపయంచుఁ బే
ర్వని యిది చెర్వు పంప యను పేరిఁటిదంచు మదిం దలంప-న
య్యెన, మఱికాక వార్ధి యిదియేయని రాఘవులెంచియుండరే! 314

మ. సమశీతోష్ణసుఖంబు దేశము, సువర్ణంబీ తటాకం బగా
ధము నెంతైనను ద్రవ్వి రేగడ యధస్తాద్ధాత్రియచ్చోఁ దటా
కము లోతట్టుల చెమ్మక్రుమ్మి యవనీగర్భం బుదారామృతా
ర్ద్రముపై మెత్తనిదూదిపింజవలెఁ గాదా! సస్యమిట్లుండునే! 315

గీ. మనిసి క్రొత్తలేదు మనిసి చంపునటన్న భయములేద యచట పక్షిచయము
కైవిదిర్చి యందుకోవచ్చు నన్నట్టు లెగురుచుండి నంతయింతలోన. 316

ఉ. స్వామియెడంద దేవి యెడబాటున వ్రేఁగొకయింత తగ్గిన
ట్లై మదిలోన నాచెఱువునందము మెచ్చెడున్నట్లు, కన్నులం

గోమలభావరేఖ కనుగొంచును లక్ష్మణుఁ డుల్లలత్స్వప
ర్యామృదుయత్న గోపముగ నన్నఁబ్రసన్నునిగాఁ బొనర్చుచున్. 317

సీ. పంచదారకు మేనబావగారైన యానీరు దోసిలుల దొన్నియల నిచ్చి
మంచుగడ్డలువోని మత్స్యాళి బల్లెపుటలుగులఁ బడసి కాల్చుల నొసంగి
నేయి యొడ్చినయట్లు నెగడు పంపావిహంగమసాధుపక్వమాంసము లొసంగి
తఱి నగ్ని కార్యావసరముల మంత్రక్రియాయుక్తి తాను తోడై భజించి
గీ. సీతవలెనన్ననజట సరిచేసి, యుత్తరీయమును సర్ది, ధనువు చేరిచి బుజాన
పొడుచుకన్నులఁగను నన్నమొగము, మందహాసమునఁజూచెడినిసుమిత్రాసుతుండు.

గీ. ప్రథమపరిచితిదినములఁ బ్రతినిమేషజాత భర్తృవాయుస్పర్శసంగత పుల
కాంకితలు, మృదుభీతలు, నమృతలజ్జలైన హరిణులు నొద్దపైఁ గానఁబడుచు.

క. ఏనికగున్నలువోనివి కాన వరాహములు, పంపఁ గంజాత రజ
శ్శ్రీనిధికషాయజల లోభానతములు దవ్వు రేవులం దగపడుచున్. 320

వ. ఇట్లు శ్రీరామచంద్రుండు విషాదోత్సాహభరితుండై. 321

మ. అవి దారంబున గుంఫితంబులునుగా, వాలాటి పూదండయై
పువులో ముత్తెములో యనం దొడిమవంపుల్ కానరాకుండ ను
న్నవి, సౌమిత్రియుఁజూచి రాముఁడు కబంధప్రోక్తమౌ శ్రీమతం
గవిశేషోజ్జ్వలమౌ మహామహిమకుం గైమోడ్పు సంధించుచున్. 322

చ. అడవిఁ జరించు శిష్యజను లంగములన్ జెమరించి స్వేదముల్
పొడిమిన మిక్కిలిన్ బడలిపోదు రటంచు దయాతరంగముల్
పొడిచినయట్టి మౌని యవుఁబో యమృతోదధి యింతమిన్నులో
నడవిని వ్యాప్తమౌ మహిమ యయ్యది బ్రహ్మపదార్థకల్పమౌ.

క. ప్రాకటమునిమహిమము తను దాఁకిన యట్లొచుఁ బులకితాపఘనుండై
యా కాశ్యపి సర్వశ్రీ చేకోముని మహిమముద్ర చెందినయట్లై.

చ. తనవిరహానకున్ మునిశతారిమహత్తుకు సుంతభేదమై
నను గనిపించరాక రఘునాథుఁడు చిత్రముగాఁ జరించుచున్
మునియును తాను నిద్దఱును మోహితులై మునిరాజు శిష్యులం
దునఁ బరిరక్షణామతియు నూల్కొని తానుగ సీతయందునన్. 325

వ. మఱల శ్రీరామచంద్రుండు మునిశిష్యులవలె, దన జానకియు సుభద్రగా నెంచి.

గీ. పంప పడమటియెద్దునఁబట్టి చనుచు నన్నదమ్ములు శేఖరాయాతశిశిరి
తోరు పంపాసమీరసంభారమునకు నుత్తరీయముల్ కప్పికొంచూఁగినడచి.

శా. చెట్టచ్చోటిది యచ్చటంచు వచియించెం దాఁ గబంధుండు, నా
చెట్టచ్చోటను గుర్తుపెట్టుకొనుచున్ శ్రీరాఘవుల్ పుట్టలున్
గుట్టల్ చూచుచు నేఁగి పుష్పిత లతాకుంజప్రతానంబునౌ
పట్టున్ మంజుఫలానతామ్ర విటపివ్రాతంబునం దేఁగుచున్. 328

మ. ఎవరో వెన్కను రామయంచు బిలువన్ హీరాయితాక్షంబులన్
జివురుంజొంపము గాలికిన్ మలఁగెనా శ్రీరాముఁ డీక్షించి యా
యెవరింగానక నిల్చియుండ, ననుజుండేరాళమౌ నామ్రపుం
జివురుంగుత్తుల వెన్కఁజూపి హసనశ్రీగల్లభాగంబులన్. 329

మ. ఇది వేదంబులలోని మాటయనెఁ, దా నిక్ష్వాకురత్నంబు హ్రా
త్పదమందుం బ్రియతాత్ముఁడై, మఱి సుమిత్రాసూతి యద్దేవరా
డుదితంబై చనుత్రోవ తప్పము ప్రభూ! యున్నట్టి యమ్మోని పు
ణ్యదమౌ దేశము రాకముందఱి శబర్యారామమే కావలెన్. 330

క. అవు నంతలో నవానిల నివహము పంపాతరంగిణీతటహంసీ
నవగరుదాహతిపుష్టము వివృతతరంగమ్ము వీచె విస్ఫారముగన్. 331

మధ్యాక్కఱ.

మెడలోనఁ దులసిపేరొకటి, మెత్తని మేని విభూతి,
వడిఁ దియ్యవిల్లాని కుసుమబాణుండు బాణంబు చివర
సడలు రేకుల తమ్మిపూవు సంధించి, క్ష్మాసుతావిరహ
జడుమీఁద రామునిమీఁద జ్యావల్లి సారించి విడిచె. 332

వ. అంత శ్రీరామచంద్రుండు సౌమిత్రితో నిట్లనియె. 333

క. తెలితమ్మిపూవు బాణము వలెనయి నాయాత్మలోనఁ బడినట్లయ్యెన్
వలిమేని ప్రన్ననగు ముదుతల శబరినిఁ చూచుకోర్కి తారాడుమదిన్. 334

సీ. కడుపులో మెఱుపులు గలపరించిన నిట్ట మొయిలు వెల్గులువోని పూలుకొన్ని
బంగారమును రాగి పొళ్లుగాఁ గరఁగించువన్నెయై యున్నట్టి పండ్లుకొన్ని
కొన్నిపూవులు లేఁత జన్ని యావుపొదుగువలె గర్భమంథరోజ్జ్వల మధువులు
కొన్నిపండ్లు రసానుకూల వాంఛాపరీపాక ముగ్ధాకార వర్తులములు

గీ. విడివిడిగ మెట్టపళ్ళికఁబేర్చి శిరసుపైని నిడికొని మెల్లగా వచ్చె శబరి
తుట్టతుదదాఁక నెండిన చెట్టుకొమ్మ శేఖరంబున యందుఁ బుష్పించినట్లు.

గీ. శబరికనులయందు స్వామి తాఁ దన ప్రతిబింబ మరసి దారవిరహమూర్తి
విరహబాధయెల్ల విడిచెను, గంటి నీరార శబరికనులు తేరుకొనియె. 336

మ. తలపైఁ బూవులతట్ట దింపక ‘యయోధ్యావీథుల న్నిన్ను నా
వలెఁ గన్గొనగు వారలుందురె!’ యనం బ్రాణేశుఁ డువ్వెత్తున
వ్వల ‘నచ్చో వినువంటివారు కలరా! బూఁబళ్ళెకం దింపుకో
వలె’నన్నన్ జిఱునవ్వునన్, మఱచితిన్ స్వామీ! యటంచామెయున్. 337

గీ. పూలతట్ట దించి పూరివి వెలుఁగులు నివ్వి తేనె లేవి యెచట ననఁగ
పూలుచూచి స్వామిమునివ్రేళ్ళఁగైకొంచుఁ జరణయుగమునందుఁ జల్లుకొనియె.

శా. అయ్యో! స్వామియటంచుమున్ శబరి తానైదోసిళుల్ గాఁగఁబూ
లొయ్యన్ పాదములందుఁ జల్లి, కనులం దుల్లోలకల్లోలమై
ముయ్యేరున్ జిఱు రెండువాగులుగ నంభోజాక్ష! నీకోసమే
నయ్యా! తెచ్చితిఁ బండ్లటంచు, నతిరుచ్యంబుల్ ప్రదర్శించుచున్. 339

శా. ఆకాశంబు సముద్రమున్ వనము లాహో చూచినట్లుండె నీ
యాకారంబది, విస్మృతింబడితి నయ్యా! పూవులం జల్లఁగాన్
నా కింతప్పటినుండిగాఁగ మునిసంతానంబునందున్ సప
ర్యానిష్ఠామతి సాజ, మీదృశముగా నైతిన్ క్షమింపంగదే! 340

గీ. రాముఁడనియె, నట్టడవిలో రామరామ!నన్నునిలఁబెట్టి యివితినుమన్ననెట్లు!
కాళ్ళుకడిగికోవలయును,కనులుతుడిచికోనువలయు, స్నానముచేయఁగానువలయు.

శా. కా దీ పాటుననే భుజింపుమనినన్ గాదందువే, నే నమ
ర్యాదంజేయుట నీకు నేల యన, ఘర్మస్పృష్ట దృక్పక్ష్మయై
యీ దేశంబునఁ జెట్టు చెట్టు గృహమే యీనాకు, మీకేమొ స్వా
నాదుల్! నిత్యపవిత్రమూర్తికిని మర్యాదామహాంభోధికిన్. 342

గీ. చేతులునికికి బూలుతెచ్చితిని స్వామి చెట్లుకలవని పండ్లుతెచ్చితిని స్వామి
సతనువగుటను నేనువచ్చితిని స్వామి చిత్తముండుట నూహచేసితిని గాని.

సీ. నేఁ బూలు తేలేదు నేఁ బండ్లుతేలేదు లీలామనోజ! రాలేదు నేను
క్రొత్తగా నీవు మా కొండిక చోటికి రాలేదు బుద్ధిధారాప్రసన్న!
పరిచారికాస్వభావకు నాకు మరియాదచేయనక్కరలేదు చిత్తజన్మ!
అల యగస్త్యాదిమహర్షుల వనముల ఫలము లీ రుచికావు ప్రాణనాథ!
గీ. నాదు ప్రాణములను నీకు మీఁదుకట్టినాను నీవయి యిటు వచ్చినావు స్వామి!
మ్రొక్కు చెల్లింతు స్వీకరింపుము ప్రియాంగనా మహోయల్లకానలధూమదేహ!

వ. అనిన శ్రీరామచంద్రుండు ముసిముసి నవ్వుల నిట్లనియె. 345

గీ. క్షోణిసుత యందమును జూచిచూచి చుప్పనాక ననుఁజూచి కామించినది యనంగ
క్షోణితనయ సౌందర్యంబు చూడనట్టిదాన వీ నన్నుకోరుట తప్పులేదు. 346

శా. నీ యూడేమిటి! నీదుమేను భుజగీనిర్మోక మన్నట్లుగా
నా యూడేమిటి! నాశరీరమును సంతానద్రుశాఖాకృతిన్
బోయెంబో? ననుఁ జిత్తజన్మాఁ డనుచుం బొల్లంబడన్ బ్రాణనా
థా! యంచాడెదు, నాకు నీ యెడలఁ జిత్తం బట్లనే యున్నదిన్. 347

క. ఆ కాంతావిరహార్తుడ నాకును నీవిట్లు వలచినఁ విది భాగ్యం
బే! కష్టంబును నచ్చుమ్మై కష్టంబుగనె రాద యానందమతీ! 348

సీ. అంగీకరించిన నస్మదానీతముల్ పండ్లారగింపవే ప్రాణనాథ!
యన్నది శబరి, సృక్కాంతముల్ జరఠసంధ్యా బాలచంద్ర శృంగాగ్రములుగ
నవి నీవు తిని చూచి యతిరుచ్యము లటంచుతెలియక నే నెట్లు తినఁగలుగుదు
నన్నాఁడు స్వామి, నేత్రాంతముల్ పూర్ణిమాచంద్రికావల్లికిసాలములుగ
గీ. స్వామి! ప్రతివృక్షమందునఁ బ్రథమమందు నేను రుచిచూచియే తెచ్చినా ననంగ
శబరి, శ్రీరామచంద్రుఁడు నిబిడమందమృదు సుహాసుఁడు చూచె సౌమిత్రివంక.

ఉ. ఆ చిఱునవ్వులన్ శబరి యారసి యించుక సంచలించి స్వా
మీ! చెడుసేఁత చేసితినొ యే నన, కాదు మఱెట్లగున్ రుచిం
జూచుట యంచుస్వామి, మతిసుందరి! నేనొకఁడన్ భుజింపఁగాఁ
దోఁచదు నాకు, నీవు మనతో ననుజుండును దిందమా యనన్. 350

చ. ఒక యొక ముక్కగానయిన నూరకయేరుచిచూడఁ దిన్ననే
యొకపదియో మఱిం బఱకయో మఱి పాతికయో యగున్ ఫల
ప్రకరము, కుక్షినిండినది రామ! విరామములేదు ప్రాణనా
యక! యకటా శ్రమంపడితి వా ఫలముల్ తినవే! దయామతీ! 351

గీ. అంత రాముఁడు శబరివృత్తాంత మడుగు చొక్కాకఫలంబు కోయుచు, ముక్కలార
గించుచును జిత్రముగఁ బ్రసంగించుచును, ధరాత్మజాస్మృతి విస్మృతి నందినట్లు.

సీ. కాళ్ళు కండెలుకట్టఁ గానలోఁ దిరిగిన దిది మౌనిపరిచర్య కెసఁగు ఫలము
కుశలును దర్భలు కుసుమముల్ తెచ్చినదిది యగ్నిపరిచర్య కెసఁగు ఫలము
నారబట్టలు గాలి కారఁగా బట్టినదిది వర్షఋతుసేవ కెసఁగు ఫలము
పిడకలు నుముక కప్పి సుభద్రపఱచినదిది యగ్నిపరిరక్ష కెసఁగు ఫలము
గీ. ఇదియు దీర్ఘకాలపుశ్రద్ధ కెసఁగు ఫలము నిదియుఁ బతిగాఁగఁ గోరి నన్నే వరించి
నవప్రతీక్షాబ్ధివేలపై నయనవివృత తామరసములఁ జొచ్చినదాని ఫలము. 353

క. పతి యిట్లు చెప్పుచుండఁగఁ బతి చెప్పుచుఁ దినుచునుండ బంధురశబరీ
నతనేత్రాంభోజమ్ముల నతను విధాత్రులు ఫలించిరా! యన నుండెన్. 354

వ. అంత శ్రీరామచంద్రుఁడు సౌమిత్రిసమానీతజలంబుల నంగుళీప్రక్షాలనంబును నధరసమ్మార్జనంబును జేసి, శబరీరామచంద్రులు. 355

గీ. అవ్వ! నివ్వరివెన్నుల యట్లు ముగ్గుబుట్టవలెనయ్యె నీశిరంబును వనంగఁ
బ్రభువ!నీయాత్మవాఁకిట రంగవల్లినినుచుటకు నింతగాఁగఁబండినదటంచు.

గీ. అవ్వ! యెంతోతపించి నీ యాయువెల్ల నార్చి నీవిట్టు లెండియేకైతి వనఁగఁ
బ్రభువ!స్నేహంబుచేతనార్ద్రింబుచేసి యింత దివ్వెగావెలిఁగించవే!యటంచు.

గీ. అవ్వ! నీ కిట్లు తీవ్రవ్రతాభిషంగముననుఁ బ్రాణాలు గూళ్లుపట్టిన వనంగ
బ్రభువ! నీయింత తీవ్రదయాభిషంగముననుఁ బ్రాణమ్ము గూటఁజేరిన దటంచు.

మ. మఱి నీమాటలు నూహచేసినను సామాన్యార్థముల్ గావు, ని
ర్భరదివ్యార్థములై కనంబడెడు నవ్వా! యెవ్వరే నీవు! నీ
పరమోదారఫలానుభూతిని శ్రమల్ వాసెన్, మఱేనింక నె
వ్వరనం చాడెద వీవు, నాశ్వయుజసంబంధాంబుదాంతాలకా! 359

సీ. మునిమతంగుని తపోముద్రితంబైన దీయటవి రసార్ద్రఫలాభిషంగి
చెలఁగి యమ్మునికి నా చేసిన పరిచర్య పేర్మినొందినది నా పేరు శ్రమణి
చిత్రకూటము మీరు చేరినయప్పుడు గురుమూర్తి దివమున కరిగినాఁడు
మఘవసమానీత మాణిక్యకింకిణీరవచల ద్రమణీయ రథముమీఁద

గీ. మా వనానకు హీరేంద్రమణులు మీరలన్నదమ్ములు వత్తురం చాడి, మౌని
మీకు స్వాగతి నెఱపుట నాకు నప్పఁజెప్పి, తనవెంట రమ్మని చెప్పె మౌని.

మ. కర మేఁకారిన సేవయై ముని వియోగక్లేశ, మీ నీలసుం
దరమేఘాకృతి సేవఁ బాసితిని దాతా! సుందరాపాంగమం
థరవిద్యుజ్జ్వలదాభిరామతను! నా దైవం బగున్ మౌని, త
త్పరమంబై చను నాజ్ఞ చేసితి భవత్ప్రావృట్కృపావృష్టిచే. 361

మ. అల వేదంబులలోని మాట యొకఁడయ్యా! చెట్టునం జెట్టునం
జిలుకల్ నేర్చిన దమ్మహర్షి యుపదేశించెన్ సమస్తాటవీ
స్థలమం, దల్ల జపాక్షరోద్గతి పవిత్రస్వాదువౌ మూర్తియే
తెలియంజేసెను నిన్ను నా, కదియ యే తేరన్ భవన్మూర్తియై. 362

సీ. ఫలసుమిత్పుష్పసంభారంబు వేళకుఁదెచ్చి యందిచ్చెడు దిక్కులేక
విరిసిన గుడ్డ తామరతూఁటిదారాన నతుకువెట్టి యొసంగు నాశలేక
మొగుడుకన్నులఁ బొగపోయి యగ్నుల నూఁది వెలయించిపెట్టెడు వెనుకలేక
యింద్రరథంబుపై నేఁగిన యుత్తరాయణ మార్గదూరపర్యంతగామి

గీ. ఆ మహాస్వామి యచ్చట నటమటించునో! తదాజ్ఞావిలంబన మోర్వలేను
సిద్ధముగనున్న యగ్నిలోఁజేర్చి మేను చనియెదను,నన్ననుగ్రహించవె!కృపాళు.

ఆ. అలఁతి యలఁతి నవ్వు లారఁబోసినకంటి వెలుఁగు వెన్నెలలను బలికె స్వామి
నీకు మౌనిమీఁద, నీమీఁద నాకును, వలపుఁబొంతనములు పలువిధములు. 364

ఆ. శబరి యిట్టులనియె జలధికి గౌతమి మీఁద నెంతొ శబరిమీఁద నంతె
జలధిరాజు భర్త, శబరి లజ్జావతి గోదవెనుక దాఁగికొనియపొందు. 365

శా. రాముండిట్లనె, మౌని యవ్వెనుకనే రా! కాని, యమ్మౌనిసు
త్రాముంగూర్చి కబంధుఁడాడెను, మహత్త్వప్రౌఢవారాశి యం
చా మౌనీశ్వర మోహనాశ్రమదిదృక్షాధీనుఁడన్ మౌనిరా
జామేయాద్భుతముల్ విచిత్రములు పుణ్యంబుల్ కనంగోరెదన్. 366

గీ. అన శబరి దిక్కులంజూపి, యంబుజాక్ష! తన్మహాముని మహిమావదాతము లివి
యనిన, శ్రీరామచంద్రునేత్రాంశువులను నిండుజాబిల్లి పండువెన్నెలలుతోఁచె.

గీ. మఱిశబరి వృక్షములుచూపి, మనుకులేశ! మునితపశ్శ్లిష్టమహిమ సంభూతమాధు
రీనిగూఢగర్భములన, శ్రీప్రభుండు భుక్తఫలరుచి జిహ్వాలోఁబులకరించె.

వ. అంత సుంత వంగి నడుచుచుండియు రాఘవులకంటె నాయామదేహయు, నిత్య విభూతిలేపనమును వలీబహుళతయు చేత ధూసరవర్ణయు నిష్పత్రశుష్కవల్లికారజ్జు నిర్మిత బాహుదండభూషయు సీమంతప్రదేశమాత్రమృదుశిరోజయు సితపక్ష్మాంత కేశధవళిత దృష్టియుఁ బగుళ్ళుచూపిన స్ఫూలాధరనవానందహసితరేఖయు శబరి యిట్లనియె. 369

భద్రకము.

మౌని వేది యిది చూడవే! దీనఁ బుష్పతతి వాడవే
మౌని నాఁడు విడి యేగెనే సూనకాంతి యిటు సాగెనే. 370

జలోద్ధతగతి.

పయోధు లివి యేడు పాలితమునీంద్రయాగ పరిరక్షణార్థము సదా
వయశ్శ్లథశరీరు వాంఛనుబడిన్ ప్రయాతములు మౌనిరాజవసతిన్. 371

జలోద్ధతగతి.

పయోమిళనరమ్యవారిధి రయం బయో! పడియలయ్యె నాగదు ధుతిన్
ప్రయాతుడవు తత్సపర్యవిరతిన్ దయామతిని వీడి తాము చనవున్. 372

తరళ.

తరులకొమ్మల వల్కలంబులు తాను మౌని బిగించుచున్
పరముఁడా ముని దివ్యలోకమువట్టి యాగతిఁ బోవఁగా
తరులకొమ్మలు గాలితాఁకుల తాఁచియూఁగవు బిట్టుగా
పెరిమఁ గావులు వల్కలంబుల వీడ వింతయు వన్నియల్. 373

తరళ.

పరముఁ డా ముని నా హృదంతరభావనామయుఁడై చనన్
పరముఁ డీవును నా హృదంతరభావనామయుఁడై చనన్

పరముఁ డా మునివెంటఁ బోవఁగ భావమందున నెంచెదన్
పరముఁ డీవు నను(గహింపగఁ బండితిం (దిదివంబునన్. 374

విభూతి.

ఆయెడన్ మునీశ్వరుం డీయెడన్ రఘూత్తముం
డాయెడన్ రఘూత్తముం డీయెడన్ మునీం(దుఁడున్. 375

మ. అవు నీరాకయ మున్న మౌనిపతి యేలా యేఁగె, నేనేల నా
గవలెన్, నీకును స్వాగతి న్నెఱప వృక్షంబుల్ శుకంబుల్ మతం
గవనీపుణ్యము లున్న, వేయఘము సంకల్పంబుగా నుండి నీ
సవిశేషాకృతదర్శనంబున నపాస్తంబౌట, నాకెంచెనో! 376

ద్విపదలు.

రఘుకులాంబుధిచం(ద రాజీవనే(త! యఘవిదారణశీల యానందమూల!
నా(ప్రాణనాథ! సంధ్యాహాస న్మల్లికా(పసూ నానుషంగాపాంగ రంగ!
శంకృద్వినిశ్చలస్వాంతపయోధి నొంకార శేషపర్యంకంబునందు
నిద్దురకానట్టి నిద్దురపోవు పెద్దవు పిన్నవై పేర్చిన సామి! 377

(తిపద.

మౌనీం(దయోగసంపన్నిరూపితమూర్తి నానా(తయీశిఖావర్తి
దానితా(శితజనతార్తి! ఉపనిష దుదిత దివ్యోపాసనాసాధ్య
జపహోమశమదమారాధ్య కృపణాభియోగనేపథ్య. 378

చతుష్పద.

యజ్ఞాంత స్తత్వా! అమృతకళా! (ప్రజ్ఞాద్యాకారా! (ప్రమాదళా!
అజ్ఞేయాదినిధన! అచ్యుత! జ్ఞేయజ్ఞాతృజ్ఞానాయనభూతా! 379

వితాళచతుష్పద.

పూర్వజన్మసంభూతసంస్కా రార్వనీయమానాత్మలోకా!
పర్వభూతనిర్వాణరూపా! శర్వధాతృకేశవాతిసుఖా! 380

కర్ణాటచతుష్పద.

ఉషర్బుధధరానిలకృపీటవ్యోమానితరతనూభూమ!
వృషపుణ్యతపోదాననియమ (శీ యోగరూపాత్మసీమ!
దృషద్భూతాఘసంతాననిర్మిత లోకచయదుఃఖపుంఖ!
ఝషకేతనమహోర్చిరారూఢజంతు(పతారణారింఖ! 381

పంచపద : వితాన.

మహాసురప్రాణవ్యాళా!
విహాయసాపూర్ణారాళా!
రహోజపన్మౌనీంద్రాళీ!
గుహాప్రదీవ్యచ్ఛ్రీహాళీ!
విహారవహ్నూర్యత్కేళీ! 382

షట్పద.

మంజీరగుంజద్భ్రమన్మక్షి కామినీ మాంజిష్ఠ నేత్రాంతశోభానిధి!
సంజాతకింజల్క సంతానక లతాంత సంచరన్మధుకరీసాహచర్య! 383

వ. ఇట్లు శబర్యగ్నిప్రవేశంబుతో వృద్ధిపొందిన షట్పదీనినాదంబు రాఘవు లాకా
శంబున విమాననిస్వనంబుగాఁ జూచి. 384

గీ. భూమిమీఁదను భూతముల్ పుట్టి వృద్ధిపొందును, ద్యులోకమున వృద్ధిపొందిపుట్టు,
కానిపించుచే శబరియుఁ గానిపించె దివ్యమాల్యానులేపనాదినవమూర్తి. 385

గీ. ఒక యనిర్వచనీయమౌ నూహచేత ఆమెయే యీమెయనిపించు టంతెకాని
దేవతారూపమైన యీ దీధితికిని యోగినీరూప కామెకు నుద్దిలేదు. 386

మ. శ్రమణీసాధుజయాభినందనవినిస్స్వానంబు, లాకాశదూ
రములన్ విన్కలిదాఁటి చన్నపిదపన్, రాముండు పంపాసమీ
రములం దుస్సురటంచుఁ బోవఁగ, సుమిత్రాసూతి సేవానుయా
నములన్ సాధుమృదుప్రియోక్తులను నన్నం జేరి తానిట్లనెన్. 387

ఉ. ఈమునిరాజు నాశ్రమమహాస్థలి యింత విచిత్రమైచనెన్
శ్రీమతియైన యీశబరిసేవ మతిన్ మఱి చిత్రమైచనెన్
కోమలమల్లికా కుసుమకుట్మల చారుసువాసనానిల
గ్రామములన్ మతంగమునిరాజమహామహిమల్ స్ఫురించెడున్. 388

మ. అనినన్ రాముఁడు, నేను నట్టులనె చిత్తాంభోజమందెంచుచుం
టిన, యమ్మౌనికి నెంతప్రేమ, శబరిన్ నిల్పెంగదా యిందు, పో
యిన యీదారి సమస్తమున్ మనిసి జాడేలేక, మాటాడు ది
క్కను లే, కూరక నేను నీకు మఱి నాకున్ నీవెగా! లేనిచో. 389

శా. నన్నుంజూచిన నాకె చిత్రమగునన్నా! యామెతో హాస్యముల్
కన్నన్ సాధువులైన వృద్ధుల, మనఃకంజాత మట్లయ్యెడిన్
నన్నుంజూచినవారి కట్లెయగు, నైనంగాని, యీయోగినిం
గన్నానా! శబరిన్ బ్రమోదభరముం గన్నాను చిత్రంబుగన్. 390

ఉ. ఆసమయంబునందున ధరాత్మజసైతము విస్మృతింబడెన్
మాసరమైన మౌనిమహిమంబును నట్టులె యేడువార్ధులున్
భాసురసేవకై యిటకు వచ్చిన విచ్చటెయుండెఁ జూడ, ల
క్ష్మీ! సగరాత్మజాతుల విచిత్ర కథావళి గోచరింపఁగా. 391

చ. వడియలుగాఁగ నున్నయవి వార్ధులటంచనిపించెఁ జిత్రమే
ర్పడ, జగమందునం గలుగు వస్తువు లేస్థితి యందు నుండి, మే
ల్పడు విధినిర్మితంబగు స్వభావమునందు వికారమూన, వా
క్కుఁడిదియుఁజిత్ర, మంబునిధిఁగాంచము, మున్ గనినట్లుగుర్తిడన్. 392

గీ. ఇది మనుష్యసాధ్యంబుగానిది, పయోధు
లేడిటను బిత్రుతర్పణం బెట్లుపోసఁగు
మునిదయాహేతువున నది పొసఁగె మనకు
ప్రేమమెయి వారినిధులఁ బంపించలేదు. 393

గీ. ప్రాణములునాకుఁ దేలికపడియెనుంత ఋశ్యమూకాభిముఖమయి యెసఁగెమనసు
అల కబంధునిచే నంతయైన స్తోత్రపాత్రుఁడౌట సుగ్రీవుఁడే భావమెల్ల. 394

చ. అతనినిఁ జూచి నాముఖమె యుద్ధమునందునఁ గాంచినట్లగున్
మతి నతనిం దలంచినను మానసమంతయుఁ జల్లనయ్యెడున్
క్షితిజను బొందినట్లుగనె చిత్తమునందునఁ దృప్తికల్గెడున్
వ్రతనుమనోనుకూలమగు భావము సాగినయట్లు తోఁచెడున్. 395

వ. మఱేది యగ్గిరిమహత్త్వం బేమిచెప్పె నన లక్ష్మణుండు. 396

శా. కేళీతత్పరు లుందురంట! శిశునాగీనాగు లచ్చో శిశు
వ్యాళీక్రందనముల్ వినంబడెడు రాత్ర్యంతంబులన్ దైత్యదం
ష్ట్రాళీక్రూరఘరట్ట ఘట్టితులుగా నానర్తితద్రాగస్ప
ర్శాళీనిర్గత నీలరక్తరుచి సంధ్యాశోణిమచ్ఛిన్నమై. 397

శా. ఆరోహింపఁగఁజాలరంట గిరి దుష్టాచారు, లక్కొండపై
నేరైనం గలకన్నచో నిదురలో నెంతేధనం బబ్బిన
ట్లారన్ మేల్కొనికూడఁ గాంతురు ధనం బా స్వప్నదృష్టంబు, త
త్కూరానేకపపాదమర్దన భయార్తుల్ నిద్ర పోరచ్చటన్. 398

వ. శిలాపిహిత ద్వారంబయినది యక్కొండయొక్క ప్రాగ్దిశాగుహలో ఋక్షరజసుని కుమారుండయిన సుగ్రీవుండు నివసించు నని చెప్పెననిన, శ్రీరామచంద్రుండు.

క. తడిసిన విచార మెప్పుడు తడయుటయును జరిగినది, పదము! పోదము గు
వ్వెడు వెచ్చగాలి పంపాకుడుంగ కుటజప్రసూన కోలాహలమై. 400

వ. అనిన లక్ష్మణుం డిచ్చోఁ బెచ్చుగా వెచ్చనీటిగుండంబు లుండవలయు ననుచు బయలుదేరి పుణ్యయు నుదారజనసేవితయు నానాద్రుమలతాకీర్ణయు పానీయ వాహినియు సౌగంధికములైన పద్మములచేతఁ దామ్రయుఁ గుముదమండలము చేత నవదాతచ్ఛవియుఁ గువలయములచేత నీలవర్ణయునై రత్నకంబళమువలె నైన పంపాభిగమనంబుచేసి, యరవిందోత్పలవతియుఁ బద్మసౌగంధికాయు తయుఁబుష్పితామ్రవణోపేతయు బర్హిణోద్ఘుష్టనాదితయుఁ దిలకబీజపూరధవశుక్ల ద్రుమపుష్పితకరవీర పున్నాగ మాలతీ కుందగుల్మ భాండీర నిచులాశోకసప్తపర్ణ కేతకాది వృక్షములచేత భూషితయైన ప్రమదవలెనున్న దానియందు, మతంగ సరస్సునందు స్నానమాడి, పుష్పాఢ్యము సర్వతోవిపులద్రుమము కోయష్టిక శత పత్రకీరకార్జున కాది విహంగనాదితమైన మహావనముచూచి పంపాభిగమనంబుచేసి.

క. తనయొడలు తనకుఁ దెలియని ఘనమోదాంబునిధి మునుకగా నలసటలున్
వెనుకగఁ జని రగ్రజుఁడును ననుజుఁడు, పంపాంబుశీకరాహతతనులై. 402

వ. శ్రీరామచంద్రుండు పుష్పితోపవనోపేతను సాలచంపకశోభితను షట్పదౌఘసమా విష్టను స్ఫటికోపమ తోయాఢ్యశ్లక్ష్ణవాలుకాసంతతను అతులప్రభను శ్రీమతిని బద్మసౌగంధికానుషక్తను బంపను మఱలఁ జూచి తమ్మునితో నిట్లనియె.

గీ. ఈ తటాకంబు నొద్దుననే కదయ్య యున్నదని చెప్పె ఋశ్యమూకోన్నతగిరి
యందు సజ్జనరత్నంబు గృహి వసించు మిత్రలోక శిరోమణి మిత్రసూతి. 404

క. సీతావియోగసాగరమాతఁ డొకఁడు మనల సేతువై దాఁటించున్,
నాతో సధర్ముఁ డాతఁడు, ప్రీతి సధర్ములకు సహజవిస్మృతి పొందున్. 405

క. ఛందోదక్షిణబాహూ స్పందన మిది రెండు రెండుసార్లుగఁ గలుగున్
సందీపితమగు మైత్రియు నిందు ద్విధాభూత మగుచు నెసఁగెడునట్లె. 406

మ. అతి సూక్ష్మంబుగఁ జూడ రెండవది పెల్లైనట్లు కన్పించు, స
న్మతి సుగ్రీవుఁడుకాక, వేఱెవఁడొ సమ్యగ్జ్ఞాత! యీ స్పందన
ప్లుతి చిత్రమ్ముగ నున్న దేమిఫలమో, పుష్పద్రుశాఖాసమా
గతముల్ వాయుతరంగముల్ శిశిరముల్గా గుమ్ములై తాఁకెడున్. 407

ఖం డాం త ము

గీ. ఇది శబరిఖండ మయ్య యోగీంద్రసేవ్య! అల్ల ముక్త్యాలపతికి శ్రవ్యంబు శ్రావ్య
మైనదియు, వినుకోర్కి విన్నందుకొనిన విన్నచో నైనదే ముక్తివిభవ మనిన. 408

మ. అమృతోక్త్యంచితమున్ గథాకథనశిల్పానేకమార్గాభిరా
మము నిద్దాని నరణ్యకాండము ప్రభూ! మన్నింపవే! దైత్యరూ

పము పెంపొందినవేల్పులన్ మనుచుటప్పా! యెట్టిదో, మ్లేచ్ఛ భా
వము పెంపొందిన విప్రులన్ మనుచ టప్పా! యట్టిదే, ధూర్జటీ! 409

క. ఈ తినుటయు దిరుగుటయును బ్రీతింబడి వెఱ్ఱిమొఱ్ఱివిధములఁ జనుటల్
చేతోభరముగ నయ్యె నుమాతరుణీప్రాణనాథ! మన్నింపఁగదే! 410

మ. కవితారూపతపస్సుచేసెదను, శ్రీకంఠా! మనస్సంయమా
దివిధానంబులఁ జేతకానితన మైతిన్, మూర్తసంవిత్కళా
యువతీభోగ! హరింపఁజేయుటకు మారోద్దుంజుమీ, యింద్రియా
దివికారంబులు భావనావిమలవాక్తీర్థంబు లేపారఁగన్. 411

జలదము.

సంగతగాంగ వారిపరిష న్నటనాభంగురరంగభూత వినిబద్ధజటా!
అంగికకంపనాల్పనయనాంతకృపా ప్రాంగణధూతభక్తజనపాపఘటా! 412

హరనర్తనము.

తత్ప్రమాణకభూత ప్రత్న మహఃపేటీ! తమసఃపర
స్తాత్ప్రదీవ్యదనంత నిశ్చలితజ్యోతి స్సతనుచ్ఛవీ!
సత్ప్రమాత్ర ముదశ్రు తాశ్రయభాఃకోటీ! సదనీకృతో
ద్యత్ప్రదీపిత భావనాతరళాక్షిప్రోత్తమ సత్కవీ! 413

ఓం తత్సత్.



# SRIMAD RAMAYANA KALPAVRUKSHAMU

Jnanapith Award Book (Telugu) 6 Volumes

BALAKANDAMU 1st Volume

by VISWANADHA SATYANARAYANA



**1895 - 1976**


## VISWANADHA PUBLICATIONS

Viswanadha Puram

Maruthinagar - VIJAYAWADA-520 004.